శ్రీరస్తు.

శ్రీరామచంద్రాయనమః.

# మోక్షగుండ రామాయణము.

యక్షగానము.

సవరణాపూర్వ

శ్రీ తాళ్ళూరి నారాయణ సత్కవి విరచితము.

సప్లయర్సు:

రామా అండ్ కో.,

హెడ్డాఫీసు:-ఏలూరు, కృష్ణాజిల్లా.

బ్రాంచి:-తర్లపాడు, నెల్లూరుజిల్లా.

రామా ముద్రాక్షరశాలయందు ముద్రితము.

ఐదవకూర్పు.

1918.



అట్టబైండు వెల రు 1-[illegible] [illegible]బైండు వెల రు 2-4-0

పోస్టుఖర్చులు వేరు.

శ్రీ

# పీ ఠి క.

---

ఆర్యులారా !

పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచదుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ, సంభవామియుగేయుగే॥ అని భగవద్గీత. భగవల్లీలావతారంబు లనంతంబులు. అందిరువదియొకటి ముఖ్యంబులు. వానిలోఁ బది శ్రేష్ఠంబులు. వానియందు మూఁడు ప్రధానంబులు. ఆపైఁకినొకటి మేటి. అదియ రామావతారము. భరతఖండంబున నవతరించి, దుష్టనిగ్రహ శిష్టపరిపాలనంబుసేసి దీర్ఘకాలంబు భూతలంబున నివసించిన యవతారమూర్తి యీఘనుఁడుకాక మఱియొకరు లేరని నిస్సంశయముగఁ జెప్పవచ్చును. అమ్మహానీయుని చరిత్రము చిత్రంబుగఁ దొలుత వాల్మీకిమహర్షి విరచించె. పిమ్మట మహర్షులుగొందఱుఁ దమపేరులతో గీర్వాణభాషయందు రచించిరి. హిందూదేశమందలి వివిధభాషలలోను శ్రీరామాయణకథ వ్యాప్తమై, పారాయణార్హమై యున్నది. తెలుఁగు బాసలో ననేకు లనేకరూపములతో రచించియున్నారు. ప్రస్తుతముఁ బదునైదు వత్సరములక్రిందట బ్రహ్మశ్రీ తాళ్ళూరి నారాయణశర్మ గారిచే హరికథారూపంబుగ రచియింపఁబడి మంచి వాడుకలోనున్నది. సంగీతస్వారస్యములగు నపరూపకీర్తనలు, తోహరాలు, మంచిపద్యములు, దీనియందుఁ జేరియుండినకతమున నిది జనరంజకమై యలరారుచున్నది. ఇది బహుజనులకు జీవనాధారమైయున్నది. కవిత్వశైలి మిగుల రసవంతముగ నున్నది. కథాభాగములో సమయవిళంబమునుబట్టి విరామముల నేర్పఱచుకొనవచ్చును.

ఏలూరు,
16—5—15.

ఇట్లు సుధీవిధేయుఁడు,
ఈదర వేంకటరావు,
ప్రొప్రైటరు,
రామా అండ్ కో., ఏలూరు.

శ్రీ

అవిఘ్నమస్తు.

శ్రీ గురుభ్యోనమః.

# విన్నపము.

సీ. ఏపుణ్యమూర్తిని ♦ తో(?)ర్యపభోగముఁగాంచ
భవమొందెసీదరా ♦ న్వయమునందు
ఏపావనుఁడుకర్ణ ♦ గాపురంబానరింప
వైకుంఠనామక ♦ పత్తనంబు
ఏమంత్రికరణమై ♦ రామరాజ్యమునట్లు
గావించె జనహితై ♦ కప్రవృత్తి
ఏప్రబుద్ధుఁడు నైజ ♦ ధీప్రచారముఁదెల్ప
రచియించె సద్గ్రంథ ♦ రాజములను

తే॥ గీ॥ అట్టిరామయ్యనాముధ ♦ ర్మాభిరాము
సద్గుణస్తోము పండిత ♦ సార్వభౌము
కేశవారాధనప్రేము ♦ కీర్తికాము
నాత్మజుఁడు పట్టాభిరా ♦ మాహ్వయుండు.

చ. అతనికిగర్భమందు సుగు ♦ ణాన్వితులైన సుతుల్ జనించి రా
సుతులద్వితీయుఁడైనకుల ♦ సోముఁడు వేంకటరాయమంత్రి పం
డితజనమాన్యుఁడై ధృతిఁ ♦ గడించి హితప్రకరమ్ముఁగాంచి యో
గ్యతకలవాఁడటంచునుతి ♦ గాంచెను బంధుహితాప్తకోటిలోఁ.

సీ. కట్టుఁబుట్టముతోడ ♦ గ్రామంబువెల్వడి
హేలాపురముఁజేరె ♦ నేకతంబ
చేరినల్పూరిలోనఁ ♦ "జిఱుతయయ్యనుబుద్ధి
శాలియీతఁడఁ" టన్న ♦ సడినిఁగాంచెఁ

గాంచిబుద్ధిస్థైర్య ♦ కలనవిద్యను నేర్చి
తలలోనినాల్కఁగాఁ ♦ దనరిహితుల
సాయంబునను గ్రంథ ♦ శాలనిర్మించి
"రామాకంపెనీ" యన్న ♦ మహితనామ

తే॥ గీ॥ మొసఁగివిక్రియమునలాభ ♦ మొనరఁగూర్చి
పిదపఁదల్లిని దమ్ముల ♦ బిలిచివారి
నుచితరీతినిఁబోషించి ♦ యోర్మితోడఁ
బ్రబలగతినందె శ్రీరామ ♦ భక్తికతన.

క. శ్రీరాములు కులదైవము
గారామయమంత్రి మొదలు ♦ కయిఁగొల్పుటచే
వీరలపేరులలోపల
నారామపదంబుచేరి ♦ యలరుచునుండున్.

తే॥ గీ॥ అందుచేతనె తనపుస్త ♦ కాలయమున
కితఁడు "రామ" శబ్దముచేర్చి ♦ యిడెరెుఁబేరు
భక్తవత్సలుఁడారామ ♦ వరుఁడు నితని
కాయురారోగ్యధనవృద్ధి ♦ సేయఁగడఁగె.

ఉ. రామకృపార్జితంబయిన ♦ ద్రవ్యములోనొకకొంతయిచ్చె శ్రీ
రామునియాలయంబునకు ♦ రాముని పేరిటిముద్రణాలయం
బీమహితుండు పెట్టెఁ దన ♦ యిష్టమువచ్చిన యట్టులెల్ల ధ
ర్మామితకీర్తిసంపదల ♦ నర్మిలిమై గణియించుచుండఁగాన్.

క. ఈకథనంతయు వినఁగా
నాకొక సంకల్పమొదవె ♦ నావిరచితమౌ
శ్రీకరపదపద్యాత్మక
మౌకృతి రామాయణంబు ♦ నవ్వొత్తుటకున్.

తే. గీ. ఒకటితక్కువమైనువే ♦ లుకలివత్స
రములుగడువ విళంబి వ ♦ ర్షమునఁజైత్ర
మాసమున మోక్షగుండ రా ♦ మాయణమును
వ్రాసితిని రామునకు స ♦ మర్పణముగాఁగ.

తే. గీ. అట్టికథజనమంచి శే ♦ షాద్రిశర్మ
గారు శుద్ధంబుఁజేసె నా ♦ కోరికలర
నాదుశిష్యులు సద్దాన ♦ మోదమంది
కథకులై చెప్పసాగిరా ♦ గ్రంథమెల్ల.

తే. గీ. అట్టిపాత్రంబు నామిత్రు ♦ లాదరమున
తొలుతముద్రించి ప్రకటించి ♦ రెలమిఁదోడ
పాఠకోత్తములద్దాని ♦ పఠనఁజేసి
గుణము గ్రహియించిరవనిపైఁ ♦ గొంతవఱకు.

తే. గీ. వయసుమీరుటయును కార్య ♦ భరమునాకు
శక్తికిని మించియుండెను ♦ సరణియగుట
గ్రంథముద్రణమునకు నె ♦ క్కనిస్వతంత్ర
మఱచవలెనన్నబుద్ధి జ ♦ నించుకతన.

తే. గీ. రాక్షసాహ్వాయ వర్షచై ♦ త్రమ్మునాఁడు
గ్రంథమందలి సర్వాధి ♦ కారములను
రహిని నీదర వేంకట ♦ రాయమంత్రి
కిచ్చినాఁడను సమ్ముద ♦ మెచ్చఁగలిగి.

తే. గీ. ఆర్యజనసాయమును వర్త ♦ కాభిలాష
ముద్రణాలయమును జేతఁ ♦ బూనుకతన
గ్రంథజీవంబుఁ బొడిగింపఁ ♦ గలుగుశక్తి
ప్రబలుఁగావుత వేంకట ♦ రాయమంత్రికి.

తే. గీ. ఇట్టి పద్ధతికొప్పుకో ♦ నెంచినాడు
పాత్రమును స్వీకరించిన ♦ పూజ్యునకు ని
రంతరానంద సంపదా ♦ వాప్తినిచ్చి
రక్షసేయుత దయతోడ ♦ రాఘుపుంగు.

ఉ. శ్రీధరుఁడార్తరక్షుణుఁడ ♦ శేషజగస్థ్సితికారణుండు, ధా
రాధరనీలవర్ణుఁడు సు ♦ రస్తవనీయుఁడు, దానవారి, గం
గాధరసన్నుతుండు పటు ♦ కామిత సర్వపదార్థజాలముల్
ఈధరఁగూర్చుఁగాత మన ♦ యాదర వేంకట రాయమంత్రికిన్.

క. వేంకటశైలనివాసుఁడు
కింకరజన విహితకరుఁడు ♦ గీష్పతినుతుఁడున్
వేంకటరాయుం డీదర
వేంకట రాయునకు నిచ్చు ♦ విపులసుఖంబుల్.

మోతుగుండము.

10—5—1918.

ఇట్లు బుధవిధేయుఁడు,
తాళ్ళూరి నారాయణకవి,
ఏతద్గ్రంథకర్త.



vii

శ్రీ గురుభ్యోనమః.

# విషయసూచిక.

## బాలకాండము. 1—79 పేజి.



### కథారంభము.

అయోధ్యకాండము. 80—123 పేజి.

## అరణ్యకాండము. 124—156 పేజి.

## యుద్ధకాండము. 240—422 పేజి.

అగస్త్యుని యుపదేశంబున రాముండాదిత్యహృదయంబనుష్ఠించుట.
రావణుండుమూర్ఛిల్లి తెప్పిరిలి తిరిగి యుద్ధంబునకుపక్రమించుట.
ఛేదించినతలలు క్రమ్మఱ మొలచుటంగని రాముండాలోచించుట.
విభీషణుండు రావణునిమర్మంబు రామునకు నివేదించుట.
బ్రహ్మాస్త్రంబు వేయుమని మాతలి దెలుపుట.
బ్రహ్మాస్త్రప్రయోగంబున రావణుండు దెగుట.
విభీషణుండు దుఃఖించుట.
మండోదరి రణభూమింబడియున్న రావణుని జూచిదుఃఖించుట.
రామునిపనుపున విభీషణుండు రావణాదులకు త్తరక్రియలు సేయుట.
విభీషణపట్టాభిషేకము.
రామునియానతి శిరసావహించి హనుమంతుండు లంకకేగుట.
విభీషణుండు సీతను బల్లకియందుంచుకొని వచ్చి రామునకర్పించుట.
సీత యగ్నిప్రవేశించి నిజరూపంబు గైకొనివచ్చుట.
పుష్పకారూఢులై సర్వులతో రాముండయోధ్యకు వెడలుట.
భరద్వాజాశ్రమము సేరి మారుతిచేత దమరాక భరతునకుం దెలుపుట.
భరతాదులు రామునకెదురుగ నడచుట.
నందిగ్రామము సేరి భరతుండు రాజ్యంబన్నకర్పించుట.
సాకేతంబు ప్రవేశించుట.
సముద్రోదకంబు దెచ్చుటకు హనుమదాదులం బంపుట.
రామాదుల కలంకరించుట.
శ్రీరామపట్టాభిషేకమహోత్సవము.
ఇంద్రాదులు రామునిస్తుతించుట.
రాముండు కపులకు బహుమానంబులిచ్చుట.
ఏకాంతసేవ.
పానుపుసేవ.



శ్రీరామచంద్రగురు పరబ్రహ్మణే నమః. గ్రంథాలయము

అవిఘ్నమస్తు. శ్రీ ౦ క్రోలు.

# మోక్షగుండ రామాయణము—హరికథ.

## బాలకాండము.

శా. శ్రీమద్భూమిజ వామభాగమునఁ బ్రా ♦ చింగేసరీ పుత్రుఁడున్
సామోదంబునఁ బార్శ్వయుగ్మమున నా ♦ శత్రుఘ్నకైకాత్మజుల్
ప్రేమం బశ్చిమమందు లక్ష్మణుఁడు నా ♦ వేష్టింపఁ జెల్వొందు శ్రీ
రామబ్రహ్మ పదారవిందముల నా ♦ రాధింతు నశ్రాంతమున్.

మ. మఖముం గాచి విరాధముఖ్యరిపులన్ ♦ మర్దించి సుగ్రీవునిన్
సఖుఁగా నేలి దశాస్యుఁ ద్రుంచి యవనీ ♦ జం గూడి సాకేతమున్
సుఖియై చేరె స్వరాజ్యభోగములచే ♦ శోభిల్లు శ్రీరాముఁ
డఖిలాఘంబుల ద్రుంచి భక్తులకు ని ♦ త్యానందమున్ గూర్చుతన్.

రామస్తుతి, కీర్తనము, రాగము బేహాగ్, ఆదితాళము.

రామామహీజావరా! పరం, ధామా! సుగుణాకరా॥
రామా! త్రిలోకాభి, రామా! దనుజవి, రామా! విచుతసు, త్రామా! దశరథ ॥రా॥ సంగరశూర! వి, హంగతురంగ! ఘ, నాంగ! కలుష వి, భంగ! జనకజ ॥రా॥ ఖండేందువక్త్ర కో, దండ విఖండన! పండిత నుత! మోక్ష! గుండపురరఘు ॥రా॥ వారగుణఖని-వారణ! త్రిలోక-కారణ! తాళ్ళూరి-నారాయణార్చిత ॥రా॥

గురుస్తుతి, కీర్తన, మలయమారుతము, ఆటతాళము.

శ్రీగురుప్రభో చిదఖండరూపభో ॥శ్రీగు॥ బాగుగ నీపాద। భజనముచే భవ, సాగరముదాట-గాగల్గె ధన్యుడ ॥శ్రీగు॥ చక్షురగ్రమున సత్యరూపమున। మోక్షగుండమందు-సాక్షిగ నెలకొన్న। యక్షయతేజ నారాయణశర్మ హృ, ల్లక్షిత! పూర్ణ వి, లాస! వేంకటశివ ॥శ్రీగు॥

సరస్వతీస్తుతి, కీర్తన, ఆదితాళము. (రవికులతిలక-వలె)

ననుదయ। గనవే పరమేష్ఠిరాణి ॥నను॥ నను గ్రై, కొనవే, ఘన పా! వనివే ॥ననుదయ॥ ఆపదల్-మాపగన్-బాపముల్-వాపగన్-నీ

పాటివారలు। రూపింపగాలేరు। నీపదయుగళము, ప్రాపగు ॥ననుదయ॥ భావంబునన్ - సేవించెదన్, నావాక్కునన్, నీవెప్పుడున్, కవిగనిలిచి శు-భావహమగు వటు, గావింపు జగ, త్పావని ॥ననుదయ॥ మోక్ష గుండమం, దనయము నీపురంజిల్లి-యాక్షితినారాయణ కవినేలెడు తల్లీ! యక్షయ క, టాక్షమునన్। దీక్షమీఱి నీ, వీక్షింపుచు ॥ననుదయ॥

గణపతిస్తుతి, కీర్తన, శంకరాభరణము, రూపకతాళము.

శ్రీయుమాకుమారా! పాహి శ్రీ॥ డాయరా, దాయఘాళి। ద్రోయబాళి ॥శ్రీ॥ పాయక నీపదాబ్జములు।సదాగొలుతు ॥శ్రీయు॥ కాయేంద్రియపరిహారా! కాయజారిసుకుమారా! తోయజాతభవ వందిత! శ్రేయములిడరాదా! శ్రీయుత నారాయణ కవి-రాయ వినుత! మోక్షగుండ-నాయక! నిర్విఘ్నంబుగ। నాయభీష్ట మొన గూర్పుము ॥శ్రీయుమా॥

ఆ. వె. ప్రస్తుతమున నాకు ♦ వాసార్హమై యొప్పు
మోక్షగుండనామ ♦ పురమునందు
భవ్యరాఘవోత్స ♦ వమును విళంబ వ
త్సరమునందుఁ దనరు ♦ చైత్రమందు.

వ. యథావిధిగ నాచరింప సమకట్టి ప్రవాళగజిత నీల స్ఫటిక తేజో రాజితంబగు నొక్క దివ్యమందిరంబున నష్టదళవిరాజిత భద్ర పీఠంబుపయి భరతశత్రుఘ్న లక్ష్మణ సీతాసమేతంబుగఁ గోటి సూర్య ప్రభాభాసమానుండయి వేంచేసియున్న శ్రీరామచంద్ర మహా ప్రభు వుగారి కొలువు సేయంగోరి సర్వేంద్రియవ్యాపారంబులతోఁ గలియు కుండ మనంబును మారుతముతో జతపఱచి పంపఁగ నవి రెండేకీ భవించి పెద్ద మార్గంబులు రెండింటిని విడిచి నడిమి సన్న బాటను జని తన్మందిరంబుపకుఁ గల ద్వారపాలకుల నాశ్రయించి మొదటి వానికి నాఱునూఱులు, రెండవవానికి నాఱువేలు, మూఁడవవానికి నాఱువేలు, నాలవవానికి నాఱువేలు, నైదవవాని కొకవేయి, యాఱవవానికొక్క వేయి, కడపటివాని కొక్కవేయిగ నీప్రకారవము లంచమిచ్చి వచ్చుచుఁ బోవుచుండుటకు నిరాతంకముగా స్వాతంత్ర మేర్పఱచుకొని చేరియర్ఘ్య పాద్య స్నానంబులు గంగాదినదీజలంబులుగ షట్కమలంబులు పూజా

దివ్యాంబుగా, సూర్యచంద్రులే హారతులుగ, నిజానందంబే నైవేద్యంబుగ, భావించి యాత్మారాముని సేవించుచుఁ దన్మయుండై యున్న సమయంబున.

ఉ. తంబురుఁ గాలిగజ్జెలును ♦ దాళమృదంగముఖాతిభవ్య నా
దంబులు పొల్పుమీఱ హరి ♦ దాసచయంబు గురుదెంచి నృత్తగీ
తంబులరామమూర్తి చరి ♦ తంబును బాడుచు నుత్సవంబు సాం
తంబగు నంతదాఁక భజ ♦ నంబులొనర్చిరి సంతసంబునన్.

వ. ఇట్టిసత్కాలక్షేపంబు సర్వజననేత్ర శ్రోత్ర మానసానందకరంబుగనున్న కాలంబున.

సీ. శ్రీరమణీయవే ♦ మూరిసదన్వయ క్షీరాంబునిధిపూర్ణ ♦ శీతకరుఁడు
మహనీయసత్సభా ♦ మండలరంజిత సంగీతవిద్యావి ♦ శారదుండు
దేవమహీదేవ ♦ దేశిక సజ్జనావలయెడ సద్భక్తి ♦ నిలుపువాఁడు
పాపార్యవర్యుండు♦పరగ శేషాంబికయందుగన్నట్టి వె♦య్యాపుగొడుకు

గీ. సుబ్బయార్యునికూరిమి ♦ సోదరుండు
నలరునరసింహశర్మకు ♦ నగ్రజుండు
శ్రేష్ఠశుభరామనామైక ♦ చింతనుండు
యజ్ఞనారాయణుండను స ♦ త్యవ్రతుండు.

వ. ఉత్సవారంభదివస సాయంతనంబునఁ బూజాసమయంబునకు వచ్చియందువేంచేసియున్న సాకారరామమూర్తిని వీక్షించి.

కీర్తన, ఏకతాళము, దిలలగాహ.

కలిగనాకు శ్రీరాఘవునిగొలువ ॥గలి॥ ఘల్లుఘల్లున జిరు, గజ్జెల మొఱయ।నలినాక్షునికడ।నాట్యము జేయ॥గలి॥ తాళమృదంగపి, టీలుతంబురులు।బాళిని మ్రోయ।భజనఁజేయ ॥గలి॥ భూమిజయుతుండై । పొదలెడురాముని। వేమఱుఁగన్నుల। వీక్షింపఁగను॥గలి॥ అక్షరుఁడయినా, రాయణనేలెడు। మోక్షగుండపతి। మ్రోలనిలువ॥గలిగ॥

వ. ఇట్లత్యానందంబునొందుచు హరిదాసబృందంబులం గలిసి భజనమొనర్చి యవభృతానంతరము మదాశికంబున నిలిచి న్రమభావంబున.

సీ. శ్రీవత్ససాఖ్యరా♦జితగోత్రభవుఁడ వార్వేలకులాంబుధి♦ద్విజవిభుఁడవు
తాళ్లూరికృష్ణప్ర♦ధానిజ్ఞానాంబయందాదరంబునఁగన్న♦యాత్మజుఁడవు
ఘనమైలవరపు వేం♦కటశివాచార్య కృపాలబ్ధవిజ్ఞాన♦భాసితుఁడవు
మూర్తిత్రయాతీత♦ముఖ్యసచ్చిత్సుఖమయవస్తుతత్త్వవి♦మర్శకుఁడవు
గీ. కేవలాఖండమోక్ష ల♦క్ష్మీయుతుఁడవు
భక్తిశ్రీరామచంద్రోత్స♦వ వ్రతుఁడవు
సరసపదపద్యనిర్మాణ♦శక్తిమతివి
హతపురాతకర్మనారాయ♦ణాఖ్యశర్మ.

అని సంబోధనచేసి యిట్లనియె.

క. రామాయణంబు హరికథ
గా మీరు రచించియింపు♦ కార్యమునకు
నేమమున నేఁబఠించెద
భూమిని నాకొదవు భుక్తి♦ ముక్తులు రెండున్.

వ. ఈమహోపకారంబుఁ గట్టుకొండని ప్రార్థించిన సమ్మతించి వారిని సమర్యాదగాఁ బంపి పిమ్మట నొక్కనాఁడు నామనంబున.

సీ. ఛందోవిచారంబు♦ సలుపఁగానైతిని వ్యాకరణంబునే♦ర్వాఁగ లేదు
కావ్యంబులనుమాటఁ♦గలలోనెరుంగను నైఘంటికంబుల♦నంగవినను
నవరసాలంకార♦నైపుణి లేదయ్యె భరతశాస్త్రంబు చొ♦ప్పరయ లేదు
రాగతాళములమా♦ర్గము గోచరముగాదు స్వరవిభేదంబుల♦జాడ లెఱుఁగ
గీ. నిమహాకావ్యరత్నమింకే♦విధమున
హరికథనొనర్తుశక్తి లే♦దనక నేను
సమ్మతించితి నిదియెట్లు♦ చక్కఁబడును!
యెందు శరణంబు లేదు రా♦ముఁడు దక్క.

వ. అని యోజించి రాముని బ్రార్థించు యారాత్రి నిద్రించు సమయంబున నాపాలి ప్రత్యక్ష దైవంబగు శ్రీరామమూర్తి మదీయ కారణాచార్యులగు వేంకట శివార్యవర్య రూపంబున స్వప్నంబునఁ గనఁబడి దయారసం బొలుక యిట్లనియె.

తే. గీ. వత్స! వాల్మీకిముఖ ముని♦వరులు నీశర
నరులు మును సంస్కృతాది నా♦నావిధ స్వ

భాషలను శక్తికొలదియు భక్తిచేత
నెన్ని నీతులనో! రచియించ లేదె.

క. అందఱిలో నీ వొకఁడవు
సందేహము నీ కిఁకేల సద్గురు కరుణా
నందంబున రామాయణ
ముం దగ హరికథ రచింపు ముదముదలిర్పన్.

ఉ. చొక్కపుహేమ మెవ్వరెటు సొమ్ములు సేసిన వన్నెవచ్చిన
ట్లొక్కవ రామభక్తికథ నెవ్వరు సెప్పిన నొప్పిదంబగున్
జక్కఁగఁ దత్కథారచన సాగముగా నొవేర్చి భక్తితో
గ్రక్కున మోక్షగుండపుర రాముని కర్పణ సేయు పుత్రకా!

వ. దీనికి మోక్షగుండ రామాయణమను నామంబొసంగుము. నీకు మేలయ్యెడు మని సెలవిచ్చినారు. కనుమొఱంగిన నేను మేలు కాంచి శ్రీమద్వేమూరి యజ్ఞనారాయణాఖ్య హరిదాస ప్రోత్సాహంబున కనుగుణంబుగ సద్గురు కటాక్షంబు గలిగెఁగదా! యింకలోపం బేమి యని యానందించి యిట్లనుకొంటి.

ఉ. ఈయవనిం గవీశ్వరుల నేకులు నేర్పరులుండియుండ రా
మాయణమున్ రచింప నను మన్ననఁ బ్రేరణచేసె యజ్ఞనా
రాయణపాటి మిత్రులు ధరన్ గలరే! యిక నాదుభాగ్య మెం
తో యధికంబటంచు ధృతితోఁ దలపోసి యనంతరంబునన్.

వ. ఒక్క శుభదినంబున నుపక్రమించి యిష్టదేవతా సద్గురు సత్కవీశ్వరులఁ బ్రార్థించి.

షష్ఠ్యంతములు, కీర్తన, ఆటతాళము. (తెలియఁగదవే)

1. రామునకుజితభృగు-రామునకు జగదభి-రామునకు దాసవవి।
రామునకు మోక్షగుండ ॥రా॥

2. ధీరునకు నిగమ సం-చారునకు రణరంగ। శూరునకు శరధిగం।
భీరునకు మోక్షగుండ ॥రా॥

3. ఖండశశిమౌళి ఘనో-ద్దండ కోదండహర। ఖండీకృత బాహు
బలా। ఖండనకు మోక్షగుండ ॥రా॥

సాంఘిక [redacted] కథ మొదలు
మన శిష్యాత్రాణంము.



4. దివ్యునకు సుజన సం । భావ్యునకు మరుత్సుత-సేవ్యునకు మాని
మం । తవ్యునకు మోక్షగుండ ॥ రా॥

5. ప్రీతునకు భువన వి । ఖ్యాతునకు రవివంశ । జాతునకు సీతా స ।
మేతునకు మోక్షగుండ ॥ రా॥

6. నారాయణశర్మ హృద్వి । హారునకు ననంత వ । దారునకు భక్త
మం । దారునకు మోక్షగుండ ॥ రా॥

వ. సమర్పితంబుగా నానేర్చుకొలంది నొనర్పంబూనిన శ్రీ
మోక్షగుండ రామాయణ హరికథా విధానం బెట్టులనిన.

క. శ్రీమత్కైలాసాచల
ధామంబుననున్న చంద్ర ♦ ధరునిం గని త
ద్వామార్థశరీరిణి యగు
హైమవతీ రమణి మ్రొక్కి ♦ యడిగెం బ్రియమునన్.

క. మంత్రములలోన నుత్తమ
మంత్రంబన నెద్ది దాని ♦ మహిమంబును ద
న్మంత్రార్థ దైవమును ద
న్మంత్రానుష్ఠాన విధము ♦ మమతిం దెలుపవే.

వ. అని మహావినయంబునం బ్రార్థించిన నానంద భరితాంతః
కరణుండయి కాంతామణీ! ఋష్యాదులకు నగోచరంబగు గూఢవిచా
రంబు నన్నడిగితివిమైన నీయందలి దయచేత నద్దానిని వచించెదవినుము.

శివునికీర్తనము-ఏకతాళము.

రామమంత్రము, కదు రమ్యమంత్రము । భూమిలోన లేదదాని,
బోలుమంత్రము ॥ మంచిమంత్రము। విబుధు, లెంచుమంత్రము, మించి
జన్మవార్ధిని దా, టించుమంత్రము॥ రా॥ నిత్యమంత్రము। విమల సత్య
మంత్రము। ప్రత్యగభిన్నాత్మతానై । పరగుమంత్రము॥ రా॥ దీక్షమంత్ర
ము। కదు। దివ్యమంత్రము। మోక్షగుండమంచు వెలయు। ముఖ్యమంత్ర
ము॥ రా॥ పరమమంత్రము, ఇదే, చరమమంత్రము, ఘనునారాయణ
మనోజ్ఞ। స్ఫురితమంత్రము॥ రా॥

గీ. రమణి! వినుమిది శ్రీరామ ♦ రామరామ
యనుచు బ్రహ్మాదిబిబుధులు ♦ మనములందు
గని రమింపుచు నుండిన ♦ కారణమున
రాముఁడను పేరువచ్చెం బ ♦ రాత్పరునకు.

వ. కాబట్టి యమ్మంత్రరాజంబు నీవనుష్ఠింపం దగినది. దీనియ నుసంధానంబునం బునరావృత్తిరహిత శాశ్వత బ్రహ్మానందపదవి ననుభవింపనచ్చునట్టి రామమూర్తికిని నాకును భేదంబులేదనుమీ యని యమ్మంత్రం బుపదేశించిన నానందించి యోహరమేశ్వరా! రాముండు పరమాత్ముండయినను మాయతోఁగలసి కొన్ని యవతారంబులెత్తినట్లు పురాణవచనంబుగల దందువలన నతనికేమి ప్రయోజనంబు సెలవిమ్ము మహాత్మా! యనివేడిన నానందించి శంకరుండిట్లనియె.

క. ప్రకృతి విలక్షణుఁడగు నా
త్మకు సృష్ట్యాదులు వికల్పి ♦ తంబులు లేమా!
యొకటిని నాటక యాతఁడు
సకలంబును జేయుచుండు ♦ సర్వాధికుఁడై.

వ. ఇట్లుగావున జగత్సృష్టిస్థితిలయ కారణకర్తయైన పరమాత్మ దుష్టనిగ్రహ శిష్టపరిపాలనంబు కొఱకును ధర్మసంస్థాపనంబు కొఱకును బ్రతియుగమునందు మాయాసహితుండై యనంతావతారంబు లెత్తుచుండునందొక్కటియగు రామావతారచరిత్రము లోకత్రయ పవిత్రంబై శ్రోత్రానందకరంబయి యలరారునది దెలిపెద సావధానచిత్తవగుము.

పల్లవి, తోహర. రామ రామయనవే! శ్రీ! రామాయణకథవినవే! రామారఘుకుల, రామా! సీతారామా! రామా! యనవే! రామామణిరో రమ్యంబగు శ్రీరామాయణ కథవినవే! రామా॥

వ. ఓపార్వతీ! యీప్రపంచంబున నార్యావర్తంబునం గోసల దేశంబున మాంధాతృనగర దిలీపేక్ష్వాకుప్రభృతులు మొదలగు సూర్యవంశ రాజులకు ముఖ్యపట్టణమయి యయోధ్యయను నొక్కనగరంబు వెలయు అదినవరత్న స్థాపితమయిన దివ్యభవనంబుల చేతను, విశాలములయిన రాజవీధులచేతను, రమ్యంబులగు విపణిమార్గంబుల చేతను, నగాధనులగునగడ్తలచేతను, మోదప్రదంబులగు శశికాంతవేదులచేతను, బచ్చల

తోరణములచేతను, ముత్యాలముగ్గులచేతను, దనరారి వర్ణాశ్రమాచార నియతులయిన చాతుర్వర్ణములవారికి నివాసయోగ్యంబయి యలకాపురంబునకన్న మిన్నయై వన్నెగన్న యన్నగరంబున.

తోహర. దశరథుండను నొక ।ధరణీనాథుండు తరణికుల సంభవుండు। దశ దిశలందును। విశదంబుగందగ। యశముగాంచంగా నెగడు ॥రామా॥

వ. మున్నూటయేబదిమూడి భార్యలలో ముఖ్యలయిన కౌసల్య, కైక, సుమిత్రలను ముగ్గురు భార్యలతోడంగూడ సమస్తసుఖంబు లనుభవింపుచుం బెద్దకాలంబు రాజ్యంబు జేయుచు డి తనకు సంతానంబు లేని కొరంతచే జింతించి సుమంత్రుండను నెనమండ్రు మంత్రులను రావించి సభచేయించి వసిష్ఠాదిమునులను బిలిపించి పూజించి ముకుళిత హస్తుండయి దశరథుండిట్లనియె.

దశ-కీర్తన, ఆదితాళము.

మునులారా ! నామొరవినరే । మోక్షమార్గహితులారా ! ధారుణి బుత్రులు। లేరికం నాకు నే। తీరునం గోరిక। తీరునో సూరి వరు ॥లారా॥ సంతతిలేకను। సద్గతిలేదంట। యెంతనివాతవ। చింతు సేవింతు బుధు ॥లారా॥ మోక్షగుండకమ। లాక్షుని కృపాకటాక్షము గలుగునె। యక్షయముగ ॥బుధులారా॥

వ. "అపుత్రస్యగతిర్నాస్తి" సుతులు లేని వారికి గతులు లేవని శ్రుతిస్మృతులు వలుకుచున్నవి. పెక్కుకాలంబయ్యె నొక్క తనయుండయినం గలుగండు. కాబట్టి సంతానంబుగలుగు తెఱంగెఱింగింపుండు.

సంధి తోహర.

అని యిటు దశరథుం। డాడిన పలుకులు। విని మునులు మోదమున। దనరంగ సూతుండు। దానువిన్నదం। తయును బలికె వేగమున ॥రామా॥

సూతు, కీర్తన, కమాచ్, ఆది.

విను ధరణీనాయకా। వినుధర, సురుచిరతనుజశ్రీ। సుమసాయక విను ॥ధర॥ ఎలమింబుత్రకా। మేష్టి జేసినను। వెలయగం దనయులు।

గలుగుమరిల విను ॥ధర॥ అవని మోక్షము । డాధపు కృపచే । వివిధ సుఖంబుల । వీగఁగలవు విను ॥ధర॥

వ. ఓ దశరథ మహారాజా! పూర్వంబున నంగమహీపాలుం డగు రోమపాదుండను రాజు తన రాజ్యంబున ననావృష్టి దోషం బాపాదించి జనక్షోభము గలిగిన నది నివారించుటకును ప్రాజ్ఞులవలన వర్షహోమాదిక్రియలు చేయించియు వానలు లేకున్నం జింతించుచుండఁగా నప్పుడు కొందఱు పెద్దలు విభాండకమునితనయుండు ఋశ్యశృంగుడను నతఁడు జన్మించినది మొదలు తపస్సంపన్నుఁడయి యున్నవాఁ డమ్మహాసీయుండున్న దేశంబున దుర్భిక్షభయంబులు దొలఁగుఁగాన నతని నిందు రప్పింపుడని పలుకఁగ విని రోమపాదుండు చాతుర్యనిపుణలగు గణికాంగనలఁ బిలిపించి యమ్మునిఁ దపోవిఘ్నంబు సలిపి తోడ్కొని తెండని పంచిన మంచిదని.

కీర్తన, రూపకతాళము, రామిల్ నలుగుంనిత.

వారల్ చనిరి మోదమున । నొ, యారముమీరఁగ ॥వారల్॥ సారెకుఋశ్యశృంగుఁగ । ధీరుఁగ వలపింపఁగ । గోరి తదాశ్రమవనికిని । జేరఁగ ॥వారల్॥ మాటల్ చెఱకు రసమువలెఁగ । మాధుర్యము గారఁగ । మాటికి సయ్యాటలతోఁ । బాటలు వాడుచు గను । గోములఁ దగ చిఱునగవుల । తోడఁగ ॥వారల్॥ మానిఁగ మకపించి ధరా । జానిపురముఁ జేర్పఁగ । బూని సదా మోక్షపు । శ్రీనానుసిహడములను । ధ్యానించెడు ముకవయ్యాని । గానఁగ ॥వారల్॥

సీ. విరహిణీమృగములఁ♦ వేటాడఁగ మకించిమరుఁడు నైచినపుష్ప♦శరములనఁగ
గడువేడ్కతోఁ బాల♦కడలి జన్మించి జగతికివచ్చు నచ్చరలనఁగ
ధారాధరవినిర్గ♦తంబులై దెసలకుబఱ తెంచు క్రొమ్మెఱుఁగు♦ మెఱుపులనఁగ
శృంగారరసములఁ♦ జేరి క్రీడింపఁగఁగడఁగివచ్చు సురరాజ♦కన్యలనఁగ

గీ. నింపుమైనను మది సంశ♦యించకపుడు
మించుబోణులు మిగులఁ గా♦ మించి నంతి
సించి మునియాశ్రమముఁ బ్రవే♦శించి యతని
గాంచి వలపించికొని పోవ♦ నెంచి రంత.

ఉ. వీనులవిందుఁ గొల్పఁదగు ♦ వీణల మీటుచు నాట్యయుక్తిమై
గానము సేయుచున్ మఱియుఁ ♦ గాంతలు స్తుతియు భీతిలేక య
మ్మౌనిని దాఁకుచున్ గడఁగి ♦ మాటలు నీటు చెలంగఁబల్కుచున్
బూని విచిత్రమార్గముల ♦ మోహితుఁజేయఁగఁ గొల్చిరాతనిన్.

వ. ఇట్లు కొన్ని దినంబులతని నాశ్రయించి తమ స్వాభావిక చేష్టల గనబఱచుచుండిన నతండు పూర్ణసమాధిని జాలించి.

తోహరం. కన్నులువిచ్చి య । ఖండతేజములఁ । గనఁబడు వారలఁ గాంచి । ఎన్నఁడు జూడని । యీ పరరూపము । లేమిటివౌ యని యెంచి ॥రామ॥

వ. స్త్రీపురుష భేదాభేదంబు లెఱుఁగని యతండు వారలఁ దనవంటి ఋషులనుగా భావించి యిట్లనియె.

ఋశ్య, కీర్తన, ఏకతాళము, కినలిపసి-వలె.

ప్రమదమమరగ । మిముఁజూడగలిగెను । తనయాశ్రమము లెంత। దవ్వొందు దెల్పుఁడంత। సముచిత। సమభాష। ణములాడగఁ। గల్గెను॥ ప్రమ॥ మాకుగొమ్ములుండు । మఱితలనుండు । మీకు రొమ్మునరెండు। మేలైనకొమ్ములుండె। మాకంటె। మహనీయు। లేకవాతలఁపను॥బ్రమ॥ మీరెన్నడిటకు । రాదివరకు । సారెకుమోక్షగుండ। శౌరిసత్కృప తోడ । జేరిన । కారణము। జెప్పఁగఁ। దగును ॥ప్రమదమ॥

ఉ. అక్షయమైన తళ్కులహ ♦ హా దెసలన్ వెలిగించుచున్న రు
ద్రాక్షలు కంఠమందు వెలయన్ ధరియించిరి యార్యులార! యీ
వృక్షము లెచ్చటన్ గలవి ♦ యెట్లు లభించెను మీకుఁదెల్ప నే
నాక్షణమేది తెచ్చుకొని ♦ హారముగూర్చి ధరింతుఁ గుత్తుకన్.

క. పరిమళము గల్గు భస్మము
ధరియించితి రంగములను ♦ దగ నిది నీనులన్
దొరికినదో! చేసినదో!
కరము గురుతుఁ దెలుపరయ్య ♦ కవివరులారా.

గీ. హంసదండంబు లెచ్చట ♦ నలవడె నివి
చేతనుబట్టిన నాదంబు ♦ చేయుచుండు

నిట్టి చిత్రాసనంబు లే ♦ తట్టు కలవొ!
మా వనంబున దొరకవు ♦ మహానులార.

వ. ఇట్లు వారియందు బద్ధానురాగుండై తపస్సమాధిం జాలించి వారింగలసి యిచ్ఛావిహారంబుగాఁ జరుపుచు గ్రామంబు బుచ్చుచుండ నొక్కనాఁడు వారాంగన లిట్లనిరి.



క. మా యునికిపట్లు సేరఁగఁ
బోయెదమో మహానివర్య! ♦ పోఁగాగ నెన్నా
ళ్ళాయె నటువచ్చి యికఁ సెల
వీయుము మాకన్న నాతఁ ♦ డింతులకనియెన్.

ఋషి, కీర్తన, ఏకతాళము, హంసధ్వని, రవికులవలె.

విడువగ। దగునా! మహాసీయులారా! తగునా। వగఁ ద్రో। యగఁ మే। లగునా ॥విడువ॥ ఈడుగన్ । జోడుగన్ । దోడుగన్ । గూడియున్ । వేడుకఁ జోడుత। విహరించియు విడ। నాడగఁ దలఁచుట। పాడియె॥ విడువఁగ దగునా॥ నేవచ్చెదన్ । మీ వెంబడిన్। వేవేలుగన్। భావింపగన్ । బావనులార! కృ। పావహులైకొని। బ్రోఁపుడునమ్మితిఁ। గాప్రన ॥విడువగ దగునా॥ ఒంటిన్ । ఈ వనమున నే। నుంటిన్ । మిము వేడుకగాఁగంటిన్ । గలసి మెలసి యిం। మంటిన్ ॥ఇఁక నను॥ విడువఁగ దగునా॥ మోహగుండ విభుదలచుచు మీ యాశ్రమముల్। వీక్షింపఁగ మాకిచ్చవొడమె నిదిమేలు! ఈక్షితి మిన్నొడబాయన్ - ఈ క్షణమున రానీయుడు ॥విడువఁగ దగునా॥

వ. అని యిట్లు వెంబడించిన వారకాంతలు దమ యిష్టార్థంబు సిద్ధించెనని సంతసింపుచు నాఘనుని యంగదేశంబునకుం జేర్చిరంత నా దేశంబున వర్షంబు గురిసె కాలంబు సుభిక్షంబయ్యె. అంతనారాజు తన సుతయగు శాంతను ఋశ్యశృంగునకిచ్చి పెండ్లిచేసిన నతఁడు గృహస్థుండయి యారాజు నింట భార్యాయుక్తంబుగనున్న వాఁడమ్మునిని దోడి తెచ్చి ముందశ్వమేధ యాగంబుసేసి పిమ్మటఁ బుత్రకామేష్టి సేసిన సుకుమారులైన నలుగురు కుమారులను బడసెదవు. నిశ్చయమ్ము. సత్కుమారునివలన నీవార్త మునునే వినియున్నవాఁడఁ గానఁ జెప్పితి. నాప్రకార మాచరింపుము.

తోహర. అనిసూతుఁడు తె, ల్పిన దశరథుఁడప్పు, హర్షాంబుధిలోఁ బొదలి, చనియె రోమపా । దుని నగరమునకు, మునినిఁ బిలుచుటకుఁ గదలి ॥రా॥ శాంతతోడ ఋష్యశృంగునిదా, సాకేతమునకుఁ దెచ్చెన్, సంతానమునకు, జన్నము జేయించఁగఁగఁగ వినుతియొనర్చెన్॥ రా॥ అతని సమ్మతిని, నశ్వమేధమున । కిపుడు ప్రయత్నము చేసెన్, అతివేగ వసిష్ఠాది మునులఁ జ, య్యన ఋత్విక్కులఁ జేసెన్ ॥రామ॥

కీర్తన, జంఝూటి, రూపకము.

అశ్వమేధమఖము సేసె, నవనిపాలుఁడు, శాశ్వతముగఁ గీర్తివెలయ, సత్యశీలుఁడు ॥అశ్వ॥ గురులువసిష్ఠాదిమౌని, వరులుజెల్వుగ । సరగ వేద మంత్రములను, జదివి వేల్వఁగ॥నశ్వ॥ స్పష్టముగ సర్వజనులు, దుష్టినొందఁగ। నిష్టమయినభోజనంబు, లిచ్చిపొందుగ ॥నశ్వ॥ కోరినట్లు ధనచయంబు, గోట్లకొలఁదిని । ధారుణీసురాదులకును । దాన మొసఁగుచు॥ అశ్వ॥ ఈక్షితినారాయణ కవిరక్షకుండగు, మోక్షగుండ ప్రభుని, కటాక్షమొందుచు॥నశ్వ॥

సంధితోహర. ఇటుజన్నము సే, యించిపుత్రకా, మేష్టియొనర్పింపఁగను, దిటముగ యాగహ, విస్సులుపొందిన, దేవతలందఱుఁ గను॥రామ॥

వ. సత్యలోకంబునకరిగి బ్రహ్మకుఁ బ్రణమిల్లి తండ్రీ! మీరిచ్చిన వరగర్వవశమున రావణాసురుండు విజృంభించి సాధువులకు బాధచేయుచున్నవాఁడు. వానిధాటికి లోకంబులు తేరువచెడి చీకాకు పడియున్నవి. కావున నతని పొంగడంగు తెఱంగెఱింగింపవే! యనివేడినఁ దక్షణంబున.

సంధతోహర. వనజభవుఁడు దే, వతలనుదోడ్కొని, వైకుంఠమునకుఁ జేరి, యనువుగ నారాయణమూర్తికి వం, దనములొసఁగి పదిగోరి॥రా॥

బ్రహ్మకీర్తన, ఆదితాళము, హరిచరణాస్మరణా, నటై.

పరమపురుషహరి! పాహిజనార్దన! సరసిజలోచన! సురవినుతా! శరణార్థులమముఁ, జల్లనిచూపుల, నరసి బ్రోవవే! నాతదురితా॥పరమ॥ ఈవఖిలమునకు, నేతవుదాతవు, నీవెఱుఁగనివి, లేవుచూడు! దేవమునుల బా, ధింపుచురావణుఁ, డీవిశ్వమును జ, యించినాఁడు ॥పరమ॥ దుర

మునునాతిని। దునిమిమాబాధలు, సరగునబాపుము, శశివదనా! ధరను నారాయణదాసవినుత! కరి,వరద! మోక్షుగూడ, పురసదనా॥పరమ॥

వ. శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! మహానుభావా! విశ్రవసుబ్రహ్మకుమారుఁడగు రావణబ్రహ్మరాక్షయాఁడు వినసించి లోక కంటకులగు పెక్కండ్రురక్కసులఁ గూర్చుకొని శీఘ్రరంబుగ లోకంబులఁ బీడింపుచున్నాఁడు దేవతలు తనుయుక్తిపట్టుల నిలుపుటకు వేరు లేదు. కాఁబట్టి పుత్రులకొఱకయి యశ్వమేధయాగంబొనర్చి శుచియై యున్న దశరథునిభార్యలయిన కౌసల్య, కైక, సుమిత్రలయాఁదు మీరు నాలుగురూపంబుల నవతరించి దశకంఠుని రూపుమాపి మమ్మురక్షింపవే !

సంధితోహర. అనివేఁడిన బ్రహ్మకాలపలుకులు, వినిహరిదయ తోఁగనియెక్, జను। డికమీాయి, ప్రానుసారముగ, సలిపెద సేనసయని యెక్॥రామ॥ అంతట సురలకు, నజుడు తెలపెమీా, యంశంబుల వానరుల, వింతమీాఱఁగల్పించితోషుపడు, డొతయుద్రుంచునసురుల॥రామ॥

సంధి. వ. అనివిరించి యొంచి వినరించిన మంచిదని దేవతలు స్వస్థానంబులకుఁజని తమతమయంశంబుల సబ్బదిరెను వెల్వాలవనచరులఁ బుట్టించిరి. వార లతిబలశౌర్యధైర్య సాహసంబులు మెఱయ గొందఱింద్రి నందనుండగువాలిని గొందఱు సూర్యతనయుఁడగు సుగ్రీవుని గొందఱు వాయుసుతుండగు హనుమంతుని గొందఱు వహ్నిశాంభవుండగు నీలుని నిట్లొక్కొక్క మొనగాండ్రడసి గొంతకొంత బలగము చేరి కొలుచుచు దుర్గమంబులగు విపినమార్గంబుల సంచరింపుచుండిరిక్కడ నయోధ్యయందు.

కీర్తన, ఆటతాళము.

ఒకదివ్యపురుషుఁ డుదయించెనంతఁ। బ్రకటహోమాగ్నిలో, పలనుండివింత॥యొక॥ హరినీలనీలాంగుఁ। డరుణతేజుండు, నరుణాంబరుండు సాహసవిక్రముండు॥యొక॥ పాయసపాత్రను, బాంశితలమునఁ, బాయక ధరించి పరమహర్షమున ॥యొక॥ గురుతరముగమోక్షు, గూడశ్రీహరిని, స్థిరభక్తితో నుతి, సేయుచున్నతి॥యొక॥

ఆ. వె. తననుజూచియదృశ్య ♦ తంబాసుచున్నులేచి
వినుతుండైన విభుని ♦ వెలయంగాంచి
భూమినాథయజ్ఞ ♦ పురుషుండ సుతులనీ
యంగవచ్చితిని బ్రి ♦ యంబుమీరా.

యజ్ఞపురుషుని శోహా.

అనుపగపీపర, మాన్నమ్మును నీ, య గనలకుంబాచిమ్ము, ఇన కులవర ! నీ-యిష్టార్థంబును. ఇంకనుబొందెదవు సుమ్మీ రా॥

వ. అనియిట్లు యజ్ఞపురుషుండు పాయసమహిమంబుసెప్పితత్పాత్రనుదశరథునకిచ్చి యదృశ్యుండయిన ధరణివిభుండక్కలశంబులోని పరమాన్నంబును కౌసల్యకుసగము, కైకకుసగమునిచ్చిన వారిద్దఱుం దమయంశంబులో సగము సుమిత్రకునిచ్చిన నంతటవారందఱుచ్చుకొనిరి పిమ్మట భూవిభుండు ఋశ్యశృంగాదిఋత్విక్కులస్వదేశంబులకు వీడ్కొలిపి తానుగాంతాయుతంబుగ స్వకీయసౌధంబుఁజేరి సుఖలీల నుండె. అప్పాయసమహిమ వలనం గౌసల్యాదికాంతలు గర్భవతులయిరంత.

ఉ. మన్ను రుచించెనెన్నడలు ♦ మందములై తగె మోముదమ్ములున్
గన్నులుందెల్లవారెంబొసం ♦ గళ నలుపెక్కెను జూచుకంబులున్
అన్నమసహ్యమయ్యె బహు ♦ శాభరణాంబరసంపత్క్రియ భారమ
య్యె వెన్నెల లాతకాంతకును ♦ హెచ్చెంగం గాంతల కబ్బురంబుగన్.

వ. ఇట్లు క్రమక్రమంబునం బన్నెండు నెలలు నిండిన.

శ్రీరామాది పుత్రజననము.

కీర్తన, కమాను, రూపకము.

పునర్వసుదయమాయెనపుడు, మిత్రకుల ప, విత్రుడింకను, ధాత్రీ పతి-చిత్రమొందఁ ॥బు॥ చైత్ర శుద్ధ నవమి పగలు, సౌమ్యవాసరాదితి న, క్షత్ర కటకలగ్నయుత ప, విత్రంబగు వేళను శుభ, గాత్రియైన, కౌసల్యకు ॥బు॥ ప్రాకటముగఁ బుష్యతారఁ, బదిరెండవ లగ్నమందు, కేయకరాజ పుత్రియైన, శ్రీకరకు చ, జత మంగళ, కోకకు నా, కైకకు నొక ॥పు॥ పాత్రంబగు కటకంబున, ఫణితారను గ్రహములు నతి, మైత్రిమెలంగంగను శత, పత్రాయతన, నేత్రకు శుభ, గాత్రకు సు,

మిత్రకు బహు ॥పుత్రో॥ రక్షకుఁడగు తార్క్ష్యారి నా, రాయణ కవి
నేలుచుండు, మోక్షగుండనిలయ కృపా, వీక్షణమునఁ, నా క్షణమున,
నక్షయ శుభ, లక్షణులగు ॥పుత్రోదయ॥

క. తనయులుగలిగిన దశరథుఁ
డనుపమసంతోషపులకితాంగుండగుచున్
దనరవసిష్ఠునిబిలిపిం
చిననాతండరుగుదెంచి చిత్తంబలరన్.

సంధితోహార. నామకరణపు, స్వాహావాచనము, లాముని వర్యుఁ డొనర్చెన్-రామభరతల, క్ష్మణశత్రుఘ్నసు నాములపుడేర్ప అచెన్ ॥రామ॥

వ. ఇట్లు వశిష్ఠమహర్షి స్వస్తివాచనమైనపిదప భార్యాత్రయ శిశుచతుష్కయుతంబుగా దశరథుని పీఠంబులపయి నాసీనుఁజేసి సభాసదులసమక్షంబునఁ గౌసల్యాసుతునకు రాముఁడనియుఁ గైకేయీకొడుకునకు భరతుఁడనియు సుమిత్రానందనులకు లక్ష్మణశత్రుఘ్నులనియుఁ బేరులుపెట్టి రాజువలన బహుమతులువడసి చనియె. అంత సంకల్పసిద్ధియైనందునకు భూకాంతుండు సంతసించుచుఁ గాంతలఁగూడి సుఖంబుండె. పిమ్మట శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నులు తల్లులవలనను దాదులవలనను సాఁకఁబడుచు బాలసూర్యులవలె దినదిన ప్రవర్ధమానులయి చిన్న వయస్సునందే! యాటలాడ నాసక్తులై.

కీర్తన, ఏకతాళము, ఈశరాసన బుబాయి-వల.

వార లాటలాడి రీతు, వారిఁ గూడుచున్, కోడి-చిరి చేయుచున్
బాహుచుండ పౌరుషంబులున్, సారెసు నెగడన్, బౌరులు నడిగెన్॥
వారలాట॥ నెవ్వన్, నవ్వన్, జవ్వకున్, గవ్వచున్, సవ్వడిగనిన్ ।
బువ్వల చెండున్-రువ్వుచు మెండున్ ॥వారలాట॥ డాగి-మూగి, లోగ
కన్, వాగకన్, యోగిరంబులున్, బాగుగఁ దినకన్, వేగమెచనకన్॥
వారలాట॥ దీక్షన్, రక్షన్, దక్షులై, తలఁగకన్, మోక్షపురపతి,
యక్షయ కరుణా, వీక్షణ గలుగన్ ॥వారలాట॥

వ. ఈలీల బాలక్రీడాలోలురై కాలంబు పుచ్చుచున్న సమయంబున.

సంధి-శౌహార. కైక దాసి యొక్క తె మందర వేళాకోళంబని యెంచి, చేకొని చేతులంజెండుదట్టుటయు, శ్రీరాముండు గోపించి॥ కట్టె దీసికొని కొట్టినంత నొక-కాలు విరిగి నత్తుము శి, యట్టె మదిని జిర-కొట్టుచు, గొణుగుచు, నవతలజనె నత్తరిని ॥రామ॥

క. ఈలీల బాలురాటల
పాలయి క్రీడించుచుండఁ ♦ బరికించి మహా
పాలుండు వసిష్ఠమౌనిని
మేలుగఁ బిలిపించి పలికె ♦ మృదువాక్సరణిన్.

దశ, కీర్తన, దర్బారు, అటతాళము-రమ్మని పిల-వలె.

మ్రొక్కెదనార్య, మునికులవర్యా, అక్కట శాలకు, లాటల మరిగిరి ॥మ్రొక్కెద॥ చదువులు సాములు, చదివించి వీరల, ముదమున నీతి కో, విదులను జేయవే ॥మ్రొక్కెద॥ మోక్షగుండాధిపు సాక్షిగ బిడ్డల, నక్షయ విద్యా, దక్షుల జేయవె ॥మ్రొక్కెద॥

క. బాలురను బుద్ధికౌశల
శీలుర గావింపుఁడని ♦ వసిష్ఠునితో భూ
పాలుండు వలుకఁగ విద్యా
శాలకుఁ గొనిపోయి చెప్పెఁ ♦ జదువులు సాముల్.

వ. ఇట్లు ధశరధుని నియోగంబున రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల విద్యాశాలకుఁ గొనిపోయి వసిష్ఠమహాముని స్వల్పకాలంబుననే చౌషష్ఠి విద్యాపారంగతులఁజేసి తోడితెచ్చి యొప్పగించిన భూపాపాలుండు సంతసించి వారివలననే యుపనయనంబులు సేవించి వివాహంబునకు యత్నింపుచున్న సమయంబున.

సంధి-శౌహార. దండకమండల, ధారుడగుచు మోదంబున గాధేయుండు, కుండలశయనుని - గొనియాడుచు గ్ర, క్కున నను వచ్చె నిగు ॥రామ॥

కీర్తన, ఆటతాళము.

రామ కృపాకర! రఘుకుల శేఖర! స్వామినిశాచర, సంహార! శ్రీకర! ॥రామ॥ పటురఘుమకూర్మ, కిటినరసింహా, వటురూపక భృగు, వంశజ రాఘవ! ॥రామ॥ సాక్షి స్వరూపక! మోక్షగుండ పురా, ధ్యక్ష! నారాయణ దాసనుతా! జయ ॥రామ॥

తో॥ వచ్చిన మునివరు, వార్త తెలిసి భూ, వల్లభు డెదురుగ నరిగి, చెచ్చెరందోడ్కొని, వచ్చి సుఖాసన, మిచ్చి పలికె దానరిగి॥ రామ॥ ఏమి పనికి మీరిటకు వచ్చితిరో, యెఱిగింపుము దయతోను, స్వామి నేను-నిశ్చయముగ నా పని-సలిపెద నిపుడన నవెను ॥రామ॥

విశ్వా, కీర్తన, నాదనామక్రియ-చాపుతాళము.

ఓహో రాజా! నా మనవి విను ॥మోహో॥ ఆహాహా నే నొక్క యాగము జేయను। బాహు మారీచులు। బహు విఘ్నములు సేతు॥ రోహో॥ భూమిపయి వారిని, బాలించుటకు మన-రామ లక్ష్మణు లను, బ్రేమతో బంపించు ॥మోహో॥ అక్షయముగను నా, రాయణ కవినేలు, మోక్షగుండేశుడు, రక్షించు మిమ్ము నో ॥హోహో॥

వ. నేను యాగంబు సలుప సమకట్టిన ద్రిలోక కంటకుండగు దశకంఠునిచే ననుజ్ఞాతులై మారీచ సుబాహువులు వచ్చి విఘ్నంబులు చేయుచున్నవారు. కావున వారిని జంపి జన్నంబు పరిసమాప్తినొందింప నీ కుమారులలో రామ లక్ష్మణుల నావెంట బంపుమని విశ్వామిత్రుం డడిగిన దశరథుండు.

దశరథుని కీర్తన, దర్బారు, రూపకము.

వీరి నంపజాల మౌని। వీరి నీకు। వెనువెంటను। జనుపఁ జనుపం చును। క్రూరరాక్షసులతో బోరగ। నేరరు నాకు, మారులు సుకు, మారులు గద ॥వీరి॥ తల్లుల నెడ, బాయలేరు, విల్లమ్ములు పట్టనేరుగ, రల్ల యుద్ధభూములలో, నుల్లంబుల, నల్లన భీ, తిల్లరె యిక ॥వీరినంప॥ మోక్షగుండపుర నివాసు, సాక్షిగ వినుడీను యజ్ఞ, దీక్షబూనుడేను వచ్చి, యా క్షణమున, రాక్షసులను, శిక్షింతును ॥వీరినంప॥

సం॥ తో॥ దశరథు, డీలాగు వలెం, దన తోం బలికిన-తాత్పర్యము నాలించి, విశదంబుగనా, విశ్వామిత్రుం డు ప్రీసకయనినూఁగోపించి। రా।

విశ్వా, కీర్తన, బేహాగ్, ఏకతాళము.

బలే, బాగునీమాటమహారాజా! బలే॥ బాగా యెగా-యోగా శాబాస్ బలే॥ బాగు॥ నేఁగావించెద। నీపనులనుచినను। వేగముతో। వాగితివి, మేలుశబాస్ బలే॥ బా॥ భానువంశజులు। పలుకరబద్ధము। నీనాముం గానంబడె। మేలుశబాస్ బలే॥ బా॥ మోక్షగుండవిభు। సాక్షిగసభలో, నీక్షణమే! యేమంటి-మేలుశబాస్ బలే॥ బా॥

సం॥ తో॥ విశ్వామిత్రుఁడు, వీరావేశము-వల్లివిరియంబలుకఁగను, విశ్వంభరపతి వెరచుచుగురునకు వినతుండగుచు నిట్లనెను॥ రా॥

దశ, కీర్తన, ఆదితాళము.

వినవే! మునివర! వినవే-తెలిపెద, వినవే! నామొర, వినవే! కడువడి॥ విన॥ వినువసిష్ఠవర-మునిచంద్రమ! మొర॥ వినవే॥ రామలక్ష్మణుల। వేమఖరక్షణ। కైమునిబిల్వఁగఁ। గదిలివచ్చెనిది॥ విన॥ తాపసవరుని వృథాగనుబంపినఁ, గోపముతోడను, శాపమువెట్టును॥ విన॥ లేక లేకకల్గిరి, వీరలునా, కీకాలమునకు, నెటులంపుదును॥ విన॥ మోక్షగుండకమ, లేక్షణుకృపగాఁ, దీక్షగనాసం, దియముఁబాపవే॥ విన॥

క. అనితనముగ నాలోచిం
చినభూపతి వాక్యములను జిత్తంబలరన్,
వినయమువసిష్ఠమునిపతి
యనుపమమృదు వాక్యసరణి నపుడిట్లనియెన్.

వసిష్ఠునికీర్తన, హిం, కాఫీ, ఆటతాళం.

రామునంపినభయ। మేమో! తెల్పుభూమీపాల! ॥రా॥ రాముఁడన సామాన్యుఁడె। శ్రీమహావిష్ణువగు॥ రాము॥ ఉరగపతిలక్ష్మణుఁడు। దర సుదర్శనములు। భరతశత్రుఘ్నులల। పరాశక్తిమెసీత॥ రాము॥ రాక్షసులశిక్షింపఁగ। నీక్షితినారాయణాఖ్య। రక్షకుఁడు మోక్షగుండా। ధ్యక్షుడయికలిగనీకు॥ రాము॥

వ. ఈగాధేయునకు మొదటనేమికోరిన నది యిచ్చెదనని చెప్పి యిప్పుడు బొంకవచ్చునా! సూర్యవంశరాజులు సత్యవంతులని యెన్నికఁగన్నకీర్తి యేలపోనాడెదవు! రామలక్ష్మణులకు రాక్షసులవలనఁ గీడుమూడునను సంశయమును మానుము. దీనివలన నీకుదప్పక మేలు

కలుగును కాఁబట్టి నీకుమారులను యజ్ఞసంరక్షణకొరకు గాధిపుత్రుని వెంటఁబంపుము.

సంధితోహర. అనివసిష్ఠుఁడు, ట్లనుటవలన నెమ్మనమున నానందించి, జననాథుఁడు రా, ముని సౌమిత్రిని, దనచెంతకు రావించి ॥రా॥

దశ, కీర్తన-అటతాళం.

నాయనయీముని, నాయకు వెంబడి- నీయనుజునిఁగూడి । పోయి రావొయి ॥నా॥ ఈయనయజ్ఞము, చేయఁగదానవు, లామెడఁగొనసాగ, నీయరటాదాన ॥నా॥ యాగవిఘాతకు । లగుమారీచాదుల । వేగమెత్రింపుము । సాగునామీఁద ॥నా॥ ఈక్షితిలోపల, మోక్షగుండేశ్వరుఁ । డక్షయశుభముల । నాక్షణమిచ్చును ॥నాయన॥

ఉ. మాటికిబుద్ధిదెల్పెదఁ, గు ♦ మారకులార పరస్థలంబునన్
దాటలపాటలన్ దిరిగి ♦ యారడినొందక యాగమేచు నా
తాటకలోనుగాఁగలుగు ♦ దస్యుసమూహము మించినొంచి యి
మ్మేటికిఁబ్రీతిఁ జేయుఁడట ♦ మీఁద యశంబలరారుమీకిలన్.

వ. అని కుమారులకు బోధించి విశ్వామిత్రమునినిగాంచి దశరథుండు కరకమలంబులు ముకుళించి.

దశ - కీర్తన-అటతాళము-హిం, శోషి.

తల్లిదండ్రులచాటువారలు, తాపసోత్తమ! వీరలు । మెల్లననుగొని పోయివేగమె । యిల్లుసేర్పుఁడుమీరలు ॥తల్లి॥ ఆకటికిదప్పికినిసొకక్షణ, మైననోర్వఁగఁజాలరు । మీకృపారసమెట్లుజూపెదో । మీకుదాసులు బాలురు ॥తల్లి॥ మోక్షగుండపురీశుకృపచే । ముదముతో నేతెంతురు । ఆక్షణంబున వచ్చిసుఖసం, రక్షణముగావింతురు ॥తల్లి॥

సంధితోహర. అనిగాధేయున-కప్పగించితన, తనయులనటుదీవించి, చనుడనిపంపి, చిననరుదెంచిరి-మునివెంబడిమోదించి ॥రామ॥

వ. ఇట్లు శ్రీరామలక్ష్మణులు మునివల్లభునితోఁగూడి యారాత్రికి నర్ధయోజనము నడిచి సరయూనదీ తీరమునకుఁజేరి మహాశ్రమ నొందుచున్నఁ గరుణించి విశ్వామిత్రుండు దాను మున్ను బ్రహ్మవలనఁ దపోమహిమచే నార్జించిన బలాతిబలములను దివ్యమంత్రముల నుపదే

శించిన నామంత్రయుగ ప్రభావమ్మునచే రాజపుత్రులు క్షుత్పిపాసలు మొదలగు బాధలనొందక దృఢగాత్రులయిరి. అంతనారాత్రి యక్కడ నివసించి మరుదినము ప్రయాణమైపోవుచు నాచెంగటనొక మహాధ్వని విని యిదియేమి యని రాముఁడడిగిన మునీంద్రుఁడిట్లనియె.

విశ్వా, కీర్తన, బ్యాండుస్వరము, ఆదితాళము.

రామరామవినుమది। రాజితగంగానది। యీమహానదినిము। క్కనిశునితలనుండి। ప్రేమభగీరథుఁ, డీమహికినితెచ్చె॥రామరామ॥ పట్టుగానయోధ్యను। జుట్టివచ్చియిచటను। దిట్టముగానీన। దీసంగమంబగు। నట్టు। లగానము। హాధ్వనిగలైను॥రామ॥ అక్షయఫలమిచ్చును। నఘములఁ బోకార్చును। మోక్షగుండపురా। ధ్యక్షునారాయణ। రక్షమీపదముల- రహింసిబుట్టెమున్ను॥రామ॥

వ. ఇట్లు గంగానదీప్రభావంబు గాధేయునివలనవిని యానందించుచు నాస్థానంబువదలి యంగాశ్రమము మొదలగు ప్రదేశములు చూచుచుఁ బోవుచున్నయెడ.

సంధితోహర॥ కన్నులసిప్పలు। కణములురులది। క్కగలుమదినిబెదరఁగను। దన్నుగెలుచువారు। ధర లేరనుచును। దాటకవచ్చెనుదగను॥ రా॥

వ. అప్పుడు శ్రీరాముండు లక్ష్మణునిఁజూచి.

రాముఁడు, కీర్తన, ఆదితాళము, భజియింప వేమనసః—వలె.

కనుఁగొంటివా! లక్ష్మణ! కనుగొంటివా! దనుజవచ్చెడితీరుఁ॥ గనుగొం॥ మిడిగుడ్లు కోఱలుదెఱచి। మిన్నువగులఁగఁ। బెడ బొబ్బలిడుచు బుడమియదరఁగ॥గను॥ మోక్షగుండవిభుననున్ను, ముట్టడించిన। నడిచెఁ రాక్షసిపోవఁగగలదే। ప్రాణముతోడ॥గనుగొంటివా॥

వ. అని తెలుపుచుండ.

సంధితోహర. అంతటరాక్షసు। రాలుపైకిఁదా। గంతులువైచుచురాగ। మంతనమునదాని। మర్దింపుండని। మాసివర్యుఁడనెవేగ॥రామ॥ మంచిదనుచు నొక-మహితశరము సం। ధించిరాముఁడటు వ్రేయ। మించియురముభే। దించిప్రాణముల। ధించినదిపడిపోయె॥రా॥

క. తాటకమడిసిన రాముని
గాటముగాఁ గౌఁగిలించి ♦ గాధిసుతుండ

మ్మేటికి సమంత్రకంబుగ
సూటిగశస్త్రాస్త్రములను • సొంపుగనిచ్చెన్.

వ. ఇట్లొసంగి ప్రియంబున నారాజసుతులం దనయాగస్థానంబగు వామనాశ్రమభూమికిం గొనిపోయినరాముండు.

రామునికీర్తన, బేగడరాగము, ఏకతాళము.

మఖము జేయుండు, మహానితిలకమిూరు ॥మఖము॥ అఖిల ఋషులం గూడి, యమితమోదమున॥మఖము॥ అసురవీరులునే, డదిచెరుపంగను, గుసుమశరారిని, గూడిరావిహన॥మఖము॥ భూమునిమోక్షగుండ । పురమున వెలసిన, స్వామి కృపచేత, సన్మునిచంద్రమ॥మఖము॥

వ. ఇట్లు చెప్పిన.

ఉ. అంతటగాధిసూనుండు మ • హాముదమొందుచు రామునాజ్ఞచే
నెంతయుదీక్షంబూని సము • నీశ్వరుండై మఖమాచరింపంగా
మంత్రములుచ్చరించుచును • మానులు హోమముచేయుచుండ భూ
కాంతసుతుల్ ప్రియంబునను • గాచుచునుండిరి పంచరాత్రముల్.

సంధితోహర. వరమారీచసు, బాహులంగడపట। వచ్చిమాయలకుజొచ్చి, ఘోరమల మూత్రం, బులు హోమాగ్నులం గురిపించగగడు హెచ్చి ॥రా॥ రాముఁడొక్కశర - రాజమువైచిన । నామారీచుండవడిగ, దామసించి త-త్తరపడివైచెను । నామహాబ్ధిలో బడగ ॥రా॥ పదపడిమరియొక।బాణమువైవసు, బాహుఁడుసిలిగెనంత, ముదమున శ్రీరా, ముని దీవింపుచు। మునులు పొగడిరాచేత ॥రామ॥

మునులకీర్తనము, యదుకులకాంభోజి-ఆదితాళము.

శ్రీరామరామరామ। సునా। శ్రీరాదివినుతనామా! సారె, కుసీ, మాయ, దాటనేరముభక్తకామ ॥శ్రీరామ॥ నీకంటెనొండేమియు। లేక। నిండియున్నావనియు। ప్రాక, టముగ, శ్రుతులు, పలుకు, లోకేశనిక్క మదియు ॥శ్రీరామ॥ యాగముగాచినావు। తాటకాదులగూల్చినావు। రాగ, రహిత, యోగు, లకు బాగుగా వించినావు ॥శ్రీరామ॥ సాక్షిస్వరూపుడవు। శ్రీమోక్షగుండేశుడవు సాధూ, న్నారా, యణ, కవిని-రక్షింతు వెపుడునీవు ॥శ్రీరామ॥

వ. అని కొనియాడి మునులిట్లని యాలోచించిరి.

తోహర॥ జనకునిశంకర। చాపమునారి। చినవర రాజసుతు నకు। దనకూతురు సీత, తనునిచ్చెదనే। ననిచాటించెను నటకు ॥రా॥ మన రాముని గొని-చనినశుభంబగు- ననిమునులాలోచించి, జనకరికులజా- తునిరామునిగను। గొనిపలికిరిమోదించి ॥ రా॥

మునుల కీర్తన-కమాస్-ఆదితాళము.

పోదమురా! రాఘవ ॥పో॥ సముచితసంభా, షణములతో। బోదము, అనిమిషాదులకు-నలవిగాని యొక-ధనువుగలదు జన, కునిపు రిలో। మనముదానిగను-గొనివత్తము ॥పోదమురా॥ నయముగదా ఖ్యారి। నారాయణకవి। ప్రియమునగొలువంగ। దయగనుచు। రయ మున మోటుగుండ-రమణ! రామ॥ పోదమురా॥

క. అని రామలక్ష్మణులం దో
డ్కొని గంగాతీరమునకుఁ ♦ గూరిమి బోడా
జను నెడ నిర్జన మగునొక
వనమగపడఁ గాంచిమౌని ♦ వరునకునపమెక్.

రామునికీర్తన, కమాస్, ఆదితాళము.

ఈవనమెవరిది। సుధీవర! తెల్పు ॥మీ॥ ఈవనము-పావనము- గేవలము, బావులు, దీపులు, తోపులుగలిగిన ॥ ఈవన॥ శ్రీకరమై- శేఖ రమై-ప్రాకటమై। కేసుల మూకల కేకలుగలిగిన ॥దీవన॥ జనులెవరు। గనబడరు। మునుపిచట। మునులుండినతా-వనిశోభ-చెనుమది ॥దీవన॥ మోటుగుండాధ్యక్షుకృపా। వీక్షణచే। లక్షణ వృక్షము లక్షయముగ గల ॥దీవన॥

సంధితోహర- రాముండిటువలె-రయమునవావి- శ్వామిత్రునితో నడుగ, స్వామి తెలిపెదను జక్కగవినుమీ-స్థలవిశేషమునువేగ ॥రా॥

విశ్వామిత్రుని కీర్తన, ఆదితాళము.

గౌతమవనమిది- కనుగొనురాఘవ! యాతనిభార్యయ-హల్య యగు, నాతరుణినిబురు-హూతుండు గలియంగ। బీతినిగాంచంగా-

మాతురుఁడై ॥గౌ॥ కుక్కుటరూపుఁడై కోడి కేకలిడుచుఁ । గొక్కొరో
కోయని కూయగను । జక్కగ నమ్ముని స్నానార్థము జననిక్కడరతుల
సుఖియింపఁగను ॥గౌత॥ కాలము గాదని క్రమ్మర వచ్చియుఁ । జాలవారి
చే, ష్టలకలిగి యాలి గనిశిల యగుమనియా । వేళను మాసి శ,
పింపఁగను ॥గౌత॥ రక్షింపుము శాప । మోక్షము దెలుపుము । కిటువద్ద
నగ । గరుణతోను । మోక్షగుండు రాముని పాదము సోక । నాతుణమే
తీరు । నటియెను ॥గౌతమ॥

వ. ఇట్లు శాపవిమోచన కాలంబు చెప్పి గౌతముండు హిమవం
తంబునకుఁ జనియె నది మొదలీవనంబు నిర్జనమైయున్నది. రామా !
పరంధామా !

తో॥ కాంప్రననో రా, ఘువయీరాతిని । గావింపుము వనితగను ।
నావుడు రాముఁడు, నవ్వుచు నట్టుల నె! కావించెద సరియనెను ॥రామ॥
రాముండా మా, ర్గంబున నేగియు । నాతిమీద బదమిడఁగనె । గోమలియై
గ్రక్కున లేచి శ్రీ, రాముని బాగడఁగ దొడఁగనె ॥రామ॥

అహల్య కీర్తన, ఆదితాళము, తొంగిమొట్టు-వలె.

వందనమో రఘువర్య మాందరధైర్య! సుందర పాదార, వింద
యుగ్మమునకు ॥వంద॥ నా పాపమున శిలా । రూపము నొందిన ।
శాపము బాపిన సు పాదపద్మములకు ॥వంద॥ భువనత్రయంబుల బ్రవి
మలముగ జేయు । దివిషత్సునాసాని । భవమైన పదములకు ॥వంద॥
మూడడుగులు భక్తి, తోడ నిచ్చిన బలి, మాడు పైనుంచిన। మంగళ
పాదములకు ॥వంద॥ భాసుర మోక్షగుండ । వాస నారాయణ। దాస
మనోజ్ఞ స , స్థాపిత పాదములకు ॥వంద॥

తోహర॥ అని యిట్లు వందన మాచరించి రాముని వీడ్కొని
యా కాంత । పని వినియెను దన భర్త చెంతకును నినకులోదయుం
డంత ॥రా॥

వ. గంగానది వచ్చె యన్నదిని దాటుటకు నావ యెక్కబోవు
రామునకు నావికుం డిట్లనియె.

ఆ. వె. రామ! తను పదాబ్జ ♦ రజము సోకఁగనె
కొండ మును గదాయ ♦ కాంత యాయ్యె

నా వదాన్యమయము ♦ నాతిగాచు మునే!
యెటుల బ్రతుకువాఁడ ♦ నినకులేశ!

వ. కావునఁ దను పదంబులు గడిగి, కొనక నావ యెక్కవల దన్న నవ్వి యటులనే! కానిమ్మనిచు గణాధారుంపు గంగానదీజలంబులచే రామపాదద్వయము ప్రక్షాళనంబుఁ జేసి వస్త్రంబుచేఁ దుడిచి యారోహింపఁజేసి నది దాటించిన పిదప.

తో॥ హర తాపసవర్యుఁడు - దామనుసరరఁ మిథిలాపురి కేగఁగ నేరిగి । పార్థివుఁడు జనక ధరాపాలుఁడు దా । బహుగున నెదురుగ నరిగి॥ రామ॥
తోడుకొనిపోయి సభాస్థానంబునకుఁ జేర్చి రత్నసింహాసనాసీనులం జేసి.

క. రంగుగ గౌశికునకు సా
ష్టాంగ నమస్కార మొసఁగి ♦ యర్పించి యనం
గాంగులగు రామ లక్ష్మణు
లగని సంతోషమునఁ జె ♦ లఁగుచుఁ బలికెన్.

జనకుని కీర్తన, సురట రాగము-ఆదితాళము.

మునీంద్ర! వీరెవరో! తెలుపుము ॥మునీం॥ మనోజ సుందర మాగళరూపులు ॥మునీం॥ మేఘసమాన సుధీరులు నతిసుకు, మారులు నెవరి కుమారులో । వీరిటు రాగను గారణమేమో! ॥మునీం॥ వేడి వెలుగు తేజోవలుగులనలెనే! జోడుగూడి మీ - తోడంతను । వేడుక తోడుత-నేడు వచ్చిరి ॥మును॥ మోక్షగుండ పుర । మున వెలసి జగ-ద్రక్షణ చేయు ప, రాత్పరుని । దీక్షమీఱ విను, తింపుచు దెలుపుము॥ మునీంద్రా॥

వ. ఉల్లంబులు రంజిల్ల విల్లమ్ములు గరపల్లవమ్ముల నల్లనల్లన ధరియించి మెల్లమెల్లన వచ్చిన యీమారసమాకారులు సుకుమారులెవరి కుమారులో! దెలుపవే! మహానుభావా! తపఃప్రభావా!

తో॥ అని యిటువలె వే, డిన యాజనకుని - వినయ వాక్యములాలించి । విను మని బాలుర, వృత్తాంతము ముని, విభుడు తెలిపె మోదించి ॥రామ॥

విశ్వా-కీర్తన, ఝంఝూటి-అటతాళము.

మహా, రాజ! దశరథ తనయులాదిన, రాజకుల ఘనులు। దిన రాజకుల ఘనులు। శ్రీరామ లక్ష్మణులు ॥మహా॥ చను, దెంచి మారీచుని సుబాహుఁ జ, యించి యాగమ్ము। జయించి యాగమ్ము। సా, గించిరి దినమ్ము ॥మహారాజ॥ శిల, రూపమైన యహల్య శాపము। బాపిరి వీరు। వెత। బాపిరి వీరు। కృపఁ జూపగనినాఁగ ॥మహా॥ మీ, యింటగల హరచాపమును గను, గొంటకై కోరి, కను-గొంటకై కోరి। నా, వెంట వచ్చిరి ॥మహా॥ శ్రీమోక్షగుండధ్యక్షుఁ గృప నట, లాక్షు విలుసూపి-నట, లాక్షు విలుసూపి। వ, రీక్షగను జూపి ॥మహా॥

చ. మునివిభుఁ డిట్టులాడఁగ బ్ర ♦ మోదముతో జనకావనీశుఁ డం
పిన పదివేలమంది భట ♦ వీరులు దోర్బలవంతులేగి య
మ్మనసిజవైరి విల్లుగల ♦ మందసవిడిచి తెచ్చి తత్సభ
న్ఘనముగ నిల్పఁగాంచి నృప ♦ కాంతుఁడు కౌశికుఁ గాంచి యుల్లసన్.

జన-కీర్తన, రూపకతాళము-కాఫిరాగము.

విన్నపమయ్యా మన్నింపుము మౌనివర్య ॥విన్నప॥ మున్ను భూమిదున్నఁగ నొక-కన్నియ వే, గమునదొరకె ॥విన్నప॥ కూతుఁగఁ గొంటి ఖ్యాతిగ నేసాకుచుంటి। చేతమలర సీతయనుచు। ప్రీతిగ నేబిలచుచుంటి॥ విన్న॥ అక్షయపదవిలసాక్షాన్నారాయణకివి, కక్షయ। యీక్షితి నిడి రక్షించెడి-మోక్షగుండ విభుసాక్షిగ ॥విన్నప॥

వ. ఇట్లుగారాబంబునఁ బెంచుచుండ నబ్బాలికారత్నంబు శుక్లపక్ష చంద్రబింబముంబోలె దినదిన ప్రవర్ధమానయై యలరార.

గీ. పటికనార్చిన కనకంబు ♦ పగిది మృగమ
దంబుఁ గూర్చిన దివ్యచం ♦ దనము భాతి
సానబెట్టిన వజ్రంబు ♦ చందమునను
యౌవనస్ఫూర్తి వహించుచు ♦ యలరెసీత.

వ. ఇట్లు జవ్వనంబు నిండారి యున్నతఱి.

జన-తో॥ మాళవఘూర్జర-మగధ నిషధపాం, చాలసింధుకాశ్మీర। చోళవంగ నేపాళముఖ్యదే-శాధిపనృపులు నేతేర ॥నా॥

నేను బెండ్లి - సేతు బ్రియమున ॥సీత॥ ఈ క్షితినారాయణాఖ్య - రక్షకుం డగు । మోక్షగుండవగర విభుని - సాక్షిగ నను ॥ఈ॥

వ. అని జనకమహారాజు సెప్పుచుండ సీతాదికాంత లంతఃపురంబుననుండియాలించి సోరణగండ్లనుండి శ్రీరాముని వీక్షించి సీతకుజూపుచుం జెలులిట్లనిరి.

క. రాకొమరు లసీకులనేం
డీకార్ముకమెత్తవచ్చి ♦ యుండగ కనరో
యో కోమలి! వారెన్నగ
నీకమసియగుం బోల ♦ రిది నిజముసుమీ.

ఉ. ఆ నగు మోము సుందరము ♦ నాకరపల్లవకోమలాంబు నా
జానువులంటు బాహువుల ♦ చందము నాకనుగోయుయాదిమూర్
మానిని కాంచుమా! త్రిదివ ♦ మర్త్యరసాతలలోక వాసులం
దీనవమోహనాంగునకు ♦ నీడగువారొకరైన లేరహా!

చెలికీర్తనము, శహానరాగము, రూపకతాళము.

నీకు దగిన మగడు గదవే! నీలవేణిరో! శ్రీకొమరుని యాకారముం జేకొనినా - డో కోమలి ॥నీకుదగిన॥ మున్ను నోచినట్టినోము, లన్ని చేకూరె నీవు ॥మున్ను॥ కన్నారగంగన్నావటె - వన్నెలచే జిన్నెలచే ॥నీకు॥ పుండరీకనయన మోక్ష - గుండవిభుండగు ॥ పుండ ॥ దండిగంగో । దండంబును ఖండించును - ఖండితముగ ॥నీకుదగిన॥

వ. అనిపలికిన సిగ్గువడి జానకీదేవియనిపలుం జవిచెలికత్తియలు విననుండఁ దనమనంబున.

క. మాతండ్రి విల్లువిఱిచిన
యాతనికిని నన్నునిచ్చు ♦ నంచు పలె శపథం
బీతఁడును జేసె యుండెను
సీతను చేకొనొ కదో! కాదో! మోసం సేయంగగలఁడా.

తే. ఇదివఱకుం గొందఱురుదెంచి ♦ యెత్తలేక
పాఱిపోయిరి వారిపగిది ♦ బాలునితఁ

డేగునో! లేకమోపెట్టి యెలమి నన్ను
గొనునో! నాపాప్తమెటులౌను ♦ కో! తలంప.

సీత-కీర్తనము, ఆరభిరాగము, ఆదితాళము.

మరుదకోపు! మాపురూపు! మరునితూపు! మాపుజూపు!!మరుని!! కరిగతులకునోపు। నడకలు। గమలారికిదాపు। వదనము। సరసిజముల పసగరములువాపు। గురులళితతులను। బరువడిలేపు॥మరుని॥ కంబుడంబు, గలకంఠంబు! నంబరంబు ఆమధ్యంబు! భంబులజెలువాంబు॥ గెలుగున! ఖంబుల పొంకంబు, మోక్షపు, రంబులో ననా। రాయణకవికి వ! రంబులిచ్చు! శ్రీ, రమణునిసుతుడగు॥మరు॥

వ. ఇట్లుసీతాదేవి రాముసౌందర్యా బుపలక్షించి వర్ణించుచుం దాద్రి నుద్దేశించి మనంబున.

తే. కమఠ పృష్ఠకఠోరమీ ♦ కార్ముకంబు
వనిత సుకుమారమూర్తి యీ ♦ యర్కకులుడు
దీనినెక్కు-పెనటు విధి ♦ యించుటకట
తాత మీరానిపణమతి ♦ దారుణంబు. వ. అంత.

క. ఈవార్తం జెప్పిపంపక
యేవేగులవలనం దెలిసి ♦ యెలమిని సీతా
దేవినిగొనమిధిలకుందా
రావణుడరుదెంచి జనక ♦ రాజునకనియెన్.

రావణుని కీర్తనము, జంఝూటి, ఆదితాళము. వాసంతికా——వలె.

నీకన్యకామణినీరా జనక ॥నీకన్య॥ నాకన్నునుజగ। దేకవీరులీలోకమునునుగలరే। యొకలోపములేదిక ॥నీకన్య॥ కులగోత్రంబులు! గుణమునురూపము! బలిమియు గలిమియును। గలవరునకుందగు ॥నీకన్య॥ మోక్షగుండపతి! ముద్దుకొమునిక। టాక్షముబొందితిని। వినురాక్షసవిభుండను॥నీకన్యకా॥

అనిపలికిన రావణాసురుని గాంచి.

జన. తోహ. శంకరునిశరా, సనముగలదమా, సదనంబుననది దాల్చి! కొంకక నీవును-గుణముసారించినం। గూతునిత్తునన లేచి॥రామ॥

వీను తన్నుకొను, చుంటఁగాంచి యూరక, కూర్చేల ॥తేరై॥ త్రాణ లేను వాస్తవముగ నీతని । ప్రాణంబులు గాపాడువారు ॥తేరై రే॥ మోక్షగుండపతిసాక్షి జీవసంరక్షణచేయ నుపేక్షయేల ॥తేరై రే॥

వ. అని యిట్లు రావణుని విషయమై సమూహ హాస్యంబులు గనుపట్ట జనకుండాడిన వాక్యంబులు విని.

క. అక్కడపడియున్న చాపముఁ
జక్కఁగఁ దొలఁగించి పోయెను ♦ శక్తి నృపులె
వ్వొక్కరికిని లేదయ్యెను
గ్రక్కున రాముండు కాంచె ♦ గాధి తనూజున్.

అప్పుడు శ్రీరామభద్రుని యభీష్టం బెఱింగి విశ్వామిత్రుండు.

విశ్వా-కీర్తన, బేహాగ్-ఆదితాళము.

ఇఁక-లెమ్మా! శ్రీరామా! లేచి రమ్మా! నీవిమ్మహాధనువు చే, కొమ్మా, ॥ఇక లెమ్మా॥ లెమ్మా । రమ్మా కొమ్మా । కోదండ ॥మిక లెమ్మా॥ అది, వరాహమై మున్ను నీవు గోర । పసుం । ధరయెత్తిన మేటివపురా। అరపు-వెరపు- మరపు-లేకను ॥ఇక లెమ్మా॥ ఈ, కార్య మొంతది రఘురామా! జన, వర్యులుజూడ గుణధామా! శౌర్య-ధైర్య-స్థైర్య-ధుర్యుఁడ ॥ఇక లెమ్మా॥ తరికొండ వీపున నెత్తలేవా । మోక్ష-గుండేశ! యెక్కుపెట్టరాదా; నిండియుండు-కొండు-వ టిది॥ లేలెమ్మా॥

అనియిట్లు గాధేయుం డుత్సాహంబు గల్పించిన రాముండు కట్టాయితుండై.

క. కోదండపాణితనవర
కోదండము లక్ష్మణులకుఁ ♦ గొమ్మనియిడి త
త్కోదండ మెత్తమునిపతి
కై దండయొసగ నడిచెఁ ♦ గను చిత్రముగా ॥

ఇట్లు చని దశవదనుని యెదపయి బాదలు నసురాసుర గరుడోరగాదుల కసాధ్యంబగు ముక్కంటివింటిని రాముండు వామకరంబున సులభంబుగ నెత్తినం దద్ధ్వారంబు దొలంగుటచే నాల్గన బోరలి లేచి రావణుండు బోడితలతోఁ దిరిగిచూడక పోవుచు॥

వ. అక్షీణబలదక్షులగు రాక్షసులను శిక్షించి మునియాగరక్షణ మొనరింపఁ దక్షిణమున రామలక్ష్మణులేగిరి. మొక్కలంపురక్కసులచే జిక్కువడిరో! యెక్కడనున్నారో! యెక్కరివలననైనఁ దెలియదక్కటా!

తోహా॥ అసితనయులురా, నాకిఁక వగచెదను। నాదశరథ విభు జేరి। జనకునిమంత్రులు-వినతులగుచు పత్రికనొసఁగిరి ॥రాను॥

మంత్రుల కీర్తనము—ఆదితాళము.

రాజాదశరథ - రాజమహారాజ! అజనందనునాప్త మంత్రులమూ॥ రాజా॥ నీముద్దుతనయులు-రామలక్ష్మణులు। సామోదమునమౌని సవనముగాచినారు॥ రా॥ ప్రాపుగనహల్య। శాపముబాపి మిథిలాపురి జేరిశివు, చాపమువిరిచినారు॥ రా॥ తనపుత్రిసీతను-దాశరథకివ్వ, జనకుం డుతలంచెను, మ్మంపెను మిమ్ముఁబిలువ॥ రా॥ పత్రికఁబూత మోదముగొండ-పతి నిడలించుచు। సకుటుంబపరివార సహితముగరండి॥ రా॥

సం, తోహా. అనిజనకుఁడు పం, పినవస్తువులను-నర్పించిన దశరథుడు। మనమునమలరుచు-మంత్రులనార్యుల-గనిపలికెను దానపుడు॥ రా॥

దశ-కీర్తనము, ఆదితాళము, రామమంత్రము.

మీరువింటిరా।సభ। వారుగంటిరా! మీరు జనకరాజమంత్రి-వీరవరులట॥ మీ॥ గాధిపుత్రునిఁ। గూడికరముమైత్రిని। నాదుసుతులు మిథిలలోను-న్నారట సుఖులై ॥మీ॥ లక్షణాఢ్యుఁడై। సర్వసాక్షి రూపుఁడై। మోదముగొండ దేవుడుగ, టాకుమువించెను॥మీ॥

తోహా. ఇలసురాసురుల। కలవిగానిహరు। విల్లువిరిచెను రాముఁడు, చెలఁగి యాతనికి। సీతనిచ్చిపెండ్లి। సేయఁదలచె జనకుఁడు॥ రా॥ మమ్ము రమ్మనుచు-మంత్రులబంపెను। నెమ్మదినునమోదరము। సమ్మోదంబునఁ జనుదము ప్రయాణ, మ్ములు సేయుడుసిరము॥ రా॥

వ. అనిచెప్పి జనకునిమంత్రులకు బహుమతులిచ్చి పట్టణమలంకరించి బంధువులకు శుభలేకలంపి వసిష్ఠాదిమునులును భరతశత్రుఘ్నులును దక్కిన పరిజనులును రాజబంధువులును దోడరాఁ గదలి కరిరథతురంగంబులమీద సమస్తవస్తు సంభారంబులుసాగించుకొని ప్రయాణంబై నాలుగు దినములకు మిథిలాపురికిఁ జేరిన నవ్వార్తవిని జనకుండెదు

రేగి వసిష్ఠాదిమునులకు నమస్కరించి దశరథుని కుశలంబడిగి బాంధవుల సన్మానించి తోడితెచ్చి విడిదికిఁ జేర్చె ననియె.

జన, కీర్తనము, ఆదితాళము। తంగంపెట్టు-పలె.

సాకేతరాజ। నీకుమారునకు। నాకూతునిచ్చెదను। బూనితి। మీకువార్తనంపితి ॥సాకేత॥ ఈవసిష్ఠాదులు। నేనెంచుటచేత। మా వంశము గేహము॥ జన్మము। పావనమాయెగదా ॥సాకేత॥ భూపాల పెండ్లికి। రేపేమూహూర్తము। రూపించియున్నారుగా। విబుధులు। లోపములులేవుగా ॥సాకేత॥ ధారుణిదాళ్యూరి। నారాయణాఖ్యా, ధారుడె। మోక్షగుండ। ధాముడు। శ్రీరాముడానిజము ॥సాకేత॥

క. జనకుడుపలికినవాక్యము
లనువిని దశరథుఁడుగడుఁ జెలఁగుచు దన స
న్మనమున సంతోషించుచు
వినయముతో సభ్యులెల్ల వినఁగాననియెన్.

దశ, కీర్తన, బేహగ్, ఆటతాళము.

మిథిలాధినాథా! విను। నాదుపలుకులు ॥మి॥ నృపవినినాకుఁ, బ్రియమగునీసరి। వియ్యమెన్నటికిని జిక్కదు। నాదుపల్కులు ॥మి॥ కూర్మిసుమిత్రా, కొడుకు లక్ష్మణున। కూర్మిళాదేవినీయుము। నాదు పల్కులు ॥మి॥ అరుదగ నీసో, దరునికుమార్తెల। భరతశత్రుఘ్నుల కీయుము। నాదుపల్కులు ॥మి॥ అక్షయశుభము, లీక్షితినిచ్చు। మోక్షగుండేశుడు మనకును। నాదుపల్కులు ॥మి॥ అనిన.

తోహ॥ మాచిదిమీాస, మ్మతమే! మాాస, మ్మతమని జనకుడు వలుక। నంచితముగ సభ-యాడునున్న వా, రనిరి తథాస్తనికి డక॥రామ॥

వ. అంత జనకుండునని పురాలంకారము మొదలుగాగల వివాహయత్నములోనుండె. అప్పుడు విశ్వామిత్రుండు రామలక్ష్మణులఁ దోడ్కొని దశరథునిబసకువచ్చిన నమ్మహీపతి యెదురుగఁజని పూజించి తోడితెచ్చి కనకపీఠంబుపైఁ గూర్చుండఁజేసిన దీవించి మౌని యిట్లనియె.

విశ్వా-కీర్తనము, రూపకము.

మంగళమగు। మంగళమగు। మంగళమగురాజా! పొంగుచు నీయిష్టార్థము। బొందెదవినతేజ! ॥మంగళ॥ నీకొడుకులు-నాకార్యము

నెరవేర్చిరిరాజా ! యేకొఱతలులేకుండిరి-నాకడమహారాజా ! మంగళ॥ కొడుకులగై, కొని శుభములు- పడయుముమహారాజా ! కనుపడిమోక్షుగుండేశుని కరుణను మహారాజా ॥మంగళ॥

సం - శోహ. అనితెలిపెపుత్రజ్జే-దనతనయులు మ్రొ, క్కిన ముదమునదీవించి । ఘనముగకౌఁగిటఁ, దనిపి దశరథుం, డనియెను మహానినిగాంచి ॥రామ॥

దశ, కీర్తనము, ఆదితాళము, శంకరాభరణము.

తాపసేంద్ర ! దయారసము-కోపమీరుచూడఁగ । నాపుత్రుల కెన్నటికి-లోపములుండవుగా ॥తాప॥ మీసేవచేయుటచేత-మేటిగుణములందును । భాసురముగబ్రబలెదురై । పరగెదవీరెందును ॥తాప॥ దీక్ష నారాయణకవిని । రక్షింపుచుండెను । మోక్షగుండవిభునకును । మ్రొక్కి-కొలుచుచుండెను ॥తాప॥

వ. ఇట్లు ప్రశంసింపుచున్న తఱి శతానందుండు దశరథమహారాజుగారి దర్శనార్థమైవచ్చిన వారికిఁదగిన మర్యాదసలిపి పీఠంబొసంగి కూరుచుండఁజేసి పూజించి ప్రస్తావవశంబున దశరథుండిట్లనియడిగె.

క. జనకునకుఁ బురోహితుఁడవు
ఘనుఁడవహల్యాత్మజుఁడవు ♦ గావునసర్వం
బును వేద్యంబగు నీకును
వినిపింపఁగఁదగును సీత ♦ వృత్తాంతంబున్.

వ. ఈసీత జనకక్షమాపతి యౌరస పుత్రికయా ! లేక దత్త పుత్రికయా ! యటులయిన నామెనుగనిన తలిదండ్రులెవరు వివరింపవే మునివరా ! యని వేడిన శతానందుండు.

శతా-కీర్తనము, త్రిశ్రజాతి.

విన్నవించెద। వినుమునులలర॥విన్న॥ నన్నుదలుపుమని-యన్న జనక సుతపూర్వచరిత ॥విన్న॥ మునుపద్మాక్షుఁడను, జనపాలుడొక్కరుడైనలేకదనరాజ్య । మేలుచునుండెను ॥విన్న॥ తనయగలక్ష్మిని, గని సాకగాఁగోరి । ఘనమైనతపమును-గావించెనారాజు ॥విన్న॥ [illegible]

ప్రత్యక్షమై । యారాజవర్యుని । కామితమొసంగి-గ్రక్కున-నంబలికెను ॥ విన్న॥ నేనస్వతంత్రను, గానమోక్షగుండ । శ్రీనాథువేషము । భూనాథయని మొఱగె ॥విన్న॥

వ. ఆతనాభూకాంతుండు శ్రీకాంతుని బహుకాలం బారాధించిన నతండు ప్రత్యక్షంబయి.

విష్ణు-తోహార. ఏమికోరితప-నిపుడొసంగెద । విస్తారమువివరింపు । భూమీపాలక ! ప్రేమనిత్తునిఁక-బొసంగెదఁ దపముఁ జాలింపు ॥ రామ॥

అని నుడివిన సద్భక్తి పూర్వకంబుగా మ్రొక్కి- పద్మామాత్యుఁడు.

పద్మా-కీర్తనము, ఏకతాళము, కంజలోచనా - వలె.

ఓన్నమోనారాయణాయ-యోగివిధేయ ! సన్నుతింప నెంత, వాఁడ-సజ్జనధ్యేయ ॥ఓన్నమో॥ కన్నియగలక్ష్మినే-గాంచిసాకంగ । నున్నది కోరికయొకు । లొసగవేవేగ ॥యో॥ సంతోసింతు మోక్షగుండ। స్వామి ! యీవయ్య । యింతకంటె నొంపుకాంక్ష-యేమిలేదయ్య ॥ యోన్నమో॥

అని యడిగిన సంతుష్టుండై.

సం॥ తో॥ శ్రీతరుణీపతి-క్షితివిభునకునొక । మాతులుంగఫల మిచ్చి । యాతరుణంబున-నాత్థానుం-డైవఫలముగొని తెచ్చి ॥రామా॥ కాంచినదందొక కాంచనాంగియగు-కన్నియయుండిన నలరి । పెంచుచు నుండెను బ్రీతిపద్మయని । పేరిడిపిలచుచుమీరి ॥రామా॥

వ. గారాబంబునఁ బెంచుచు నంకతలంబున నుంచి కూర్చుండఁ బెట్టుకొని ముద్దాడుచు నుండఁగాఁ గొంత కాలంబునకు బాల్యంబు గడచిన నెమ్మనంబున.

పద్మా-కీర్తనము, కన్నడ-అటతాళము.

కన్యకీడగు। కాంతుడెవ్వాడో యీ॥క॥ ధన్యుడైనట్టిరా । జన్యుఁడెందున్నాడో ॥క॥ రూపవయోగుణాలాపలక్షణముల । లోపములు లేక లోకములోన ॥కన్యకీ॥ సురులలో పలవిద్యాధరులలో నెన్నగ నరులలో

మరియుఖే। చరులలోఁగాంచిన ॥క॥ మోహకుగుణప్రభు । వక్షయకృపాక। టాక్షముచేనిచ్చి। నన్నేనాసెయ్యొంపు ॥కన్య॥

వ. అని యోచించి యనంతరంబ స్వయంవరంబు చాటించినప్పుడు.

చ. నరులునుఖేచరుల్ సురలు ♦ నాగులు యక్షులు సిద్ధచారణుల్
గరుడులు రావణాద్యసుర ♦ కాంతులుమానులు చార్యుల్గిరుల్
దరుస్సులు కామరూపములు దాల్చి మహావిభవంబుతో స్వయం
వరమును జూచుకోరికను ♦ వచ్చిరి తన్నగరంబుఁ జేరఁగన్.

వ. ఇట్లు వచ్చిన వారందఱువిన.

తే. రహినినాకాశ నిలన ♦ ర్ణంబుకీతి
నెవనితనుకాంతి వెలయునో! ♦ యవనినతని
కీసుభాగింపనిచ్చి నే ♦ నిపుడు పెండ్లి
చేయఁబూనితి ననిపల్కె ♦ క్షితివిభుండు.

పద్మాక్షుని వాక్యంబునకందఱు కుపితులై యిట్లనుకొనిరి.

రాజులకీర్తనము, కన్నడ, రూపకము.

బలుమోసకాంతుఁగాదె॥ యీతడుబలు॥ కిడు, నాసకొల్పి మనలను రా-జేసియిటుల భా, షించెను॥ బలుమోస॥ ఈ, కిన్నెరకన్నెదనము యే, కన్నులాదుగనము।చే, కొన్నవానిభాగ్య! మది యెన్నదలవిగా,కుండును॥బలుమో॥ ఆచందమైనరూపు । మన, యందు నెవరఁకోదప్పు। భువియందుమోహనగుండ, విభునందనునుడఁ-గాఁజెల్లును॥ బలుమో॥

వ॥ స్వయంవరమని పిలిపించి వంచించి యెంతనులేని యెుద్దును బన్నియున్నవాఁడీన్న రాధముని కడినంబునవధించుచి యీకన్నియను గైకొందమని యోచి యందఱును యుద్ధాభిముఖులైన నెఱింగి పద్మాక్షుండు.

శోహార॥ వారలనల్లను - వాడిశరంబుల - నైచుచుబోరాడగను। శూరులుగాకను - సురలు మానవులు-సుక్కియవలఁజనగాను॥ రా॥

పద్మాక్షుండు విజృంభించి తఱుముచుండిన సహింపక దానవులు మాత్రము వెనుదీయక పోరాడి.

మత్తకోకిల.

అక్షయంబుగ బాణముల్ గొని ♦ యాతనిర్వ వడిన్వైచి రూ
క్షేక్షణాబులఁ జూచుచుర్ దగ ♦ నేపుఁ హూపినసుప్రేక్ష్కప
ద్మాక్షుఁడాహవభూమిఁగూలిన ♦ నందటుర్ జెలిఁగైకొనర్
ఆక్షణంబున రాఁగదాఁచెను ♦ నామెదేహము వహ్నిలోన్.

వ. ఇట్లగ్నియందుదాఁగి కనబడకుండినసాకన్నియను వెదకి వేసరి యాపురంబాతయుఁగాల్చి శ్మశానతుల్యంబుఁజే యందఱు యథేచ్ఛాజనిరి. లక్ష్మీకామతత్పరండై పద్మాక్షుండిట్టి దశననుభవించె.

క. వరియింపరు లక్ష్మిని ధీ
వరులెన్నఁడు నెమ్మనమున ♦ భయశోకంబుల్
మరణముఁ జిత్తచలనమును
సిరిఁబొందినవారికెపుడుఁ ♦ జేకురుననుచుర్.

వ. అంత నతనిపత్నులు వేయిమంది సహగమనంబొనర్చిరి. పిమ్మట బహుకాలంబునకు దశకంఠుండు విమానారూఢుండై దిగ్విజయార్థంబరుగు వాఁడామార్గంబునవచ్చిన.

శ్లో॥ అనలకుండబాహ్యప్రదేశమున । నాతిమ్మ చరింపగను। గనిసారణుడా, కన్యనుదశకం । ఠునకటుజూపఁగఁగనెను ॥రా॥

ఇట్లు గాంచి యతఁడు మోహంబుచే విమానంబు గ్రిందికి బఱపుచు.

రావ-కీర్తనము, అటతాళము-పూర్వకళ్యాణి.

ఉండుండవె ! యో చెలి ! ॥యుం॥ దాడిమగండప్రభ, లుండద యనిండారగ ॥నుం॥ లోకులనేకులు । నీకొరకైకద ! యీకడ జీకాకుగ । దాకి మునుపేకూలిరి ॥యుండు॥ అప్పుండదప్పిన । నిప్పుడుద ప్పునె । యొప్పులకుప్పముద మొప్పననుమెప్పుజేయు ॥నుం॥ రాక్షస రాజును । రావణునాముఁడ । సిక్షితిమోతుగుండా - ధ్యక్షువరసాక్షి యగు ॥నుం॥

వ. అని పలుకుచు డాయంజనిన యామెతిరిగి యగ్నిగుండంబునం బ్రవేశించినఁ గోపించి.

రా॥ శోహార॥ బహుమందినిమును। బాధించెనుదా। దహానుని లోపలఁజేరి। యహహా! యిప్పుడు నటులనె జేసెను। నతివకడు చమత్కారి॥ రామ॥

అయిన నీరహస్యంబుఁ దెలిసితిగదా! యిఁకను సాధించెదనని యెంచి.

సీ. అంతటరావణుం ♦ డాయగ్నిగుండంబు చల్లార్చి చూచిన ♦ సరగనందు
బంచరత్నంబులే ♦ ర్పడఁగనుపట్టిన నవిపెట్టెలోఁ దాఁచి ♦ యదివిమాన
మునయుంచుకొనిపుర ♦ మునకేగుదెంచి తత్స్ఫటిక దేవమం ♦ దిరమునందు
నునిచియారాత్రిమం ♦ దోదరికిని నవె భామినినేరత్న ♦ పంచకంబు

తే. నీకునై తెచ్చి దేవమం ♦ దిరమునందు
బెట్టినానన నామెయా ♦ పెట్టెకడకుఁ
జేరియెత్తంగఁజాలక ♦ సిగ్గునొంది
భర్తతోఁదెల్ప నవ్భుత ♦ పడుచు నతఁడు.

వ. ఆమందిరంబునకుఁ జని.

సం-త్రో॥ కదిలించిననది - కదలకయుండినఁ - గడురోషముపెన గొన్న। యెదమెచ్చుచుసిరు-వదికరములతో నెత్తినలేవకయున్న॥రా॥

వ. అతండు మహాపరాక్రమంబునలాగి మూఁతదీసిన నందుఁ గోటిసూర్యప్రభావిరాజమానయై కన్నుల మిరుమిట్లు గొలుపుచున్న కన్నియయున్నఁ గన్నులారఁగని మందోదరి.

మందో-కీర్తనము, బిలహరి-రూపకము, ఘూరసా-వలె.

ఏమియీవిధము। నామనంబు-లోసంశయమగు॥ నేమి॥ స్వామి రత్నము। లేమి లేవిట। యీమెయెవ్వారగు॥నేమి॥ మేలుమేలగు। బాలికామణి। నేలదెచ్చితి। వేళనెచ్చట। లీలగన్పడె। జాలదెల్పుము। జాలమేటికి॥ యేల॥ కూరిమిమోక్ష-గుండ్రశ్రీహరి। నారిగాబోలు। వేరువారింత। భారమాయనే! తేరిచూడఁగ। నేరరెవ్వారును॥యేలయీ॥

వ. అని యడిగిన రావణుండు పద్మాక్షభూపాల కులసంభూత యగు నీమెకొఱకుఁ బూర్వంబు తాముపడిన పాట్లన్నియు నగ్నికుండం

బునఁ దాఁగిన నామెనుదాఁ దెచ్చినవిధంబును దెలిపిన విని మందోదరి యదరిపడి.

మం-తో॥ స్వకులధ్వంసము, నకునీమెనులం, కనుఁదెచ్చితివగు నేఁడు। అకటా ఇదిబా, లికయనియెంచకు। మాదిశక్తియగుజాను॥ రా॥ నీవంశంబును, నీగు జేయునిక-గాచ్రననిటునిల్పకుము। రావణవన ములలోవిడిపించిన బోప్రనచట సత్యమ్ము॥రా॥

మం-కీర్తనము, హిం, కాఫిరాగము-రూపకతాళము- ననుమారు-వలె.

మను, మాట తెలుపవలను వినుము, మానవాశనా! పేటిక యాదీమెనుంచి-పేర్మిశోడను। నొక, చోటభూమి త్రవ్వియందు, నూ టదగును॥మను॥ వరగృహస్తుడయ్యువిషయ-వాంఛదవ్రలక। ధర। బరగురాజయోగియింట - బెనుగుముందిక॥మను॥ సర్వమునుమోక్ష గుండ, స్వామిమయముగ। గను। నిర్విచారు గీములంచు-నిలుచునిం పుగ॥మను మా॥

వ. ఎంతమాత్రమీ సమయమందిచ్చట నుంచనలదని నెంకి నక్కాంశించిన భయకంపితగాత్రుండయి రావణుండు.

తో॥ మందసయందా-సుందరినుంచివి-మానముపయినుంచుకొని। యొండైననుధర। యాందుబూడ్చిరం-డిప్పుడెయని చెప్పవిని॥రా॥

వ. రాక్షసభటులు సిద్ధపడుచూడ నప్పుడు సర్వ్వాలువిన నాకన్య యిట్లనియె.

సీ. ఈసారిలంకకు♦నేతెంచి రావణుఁ బుత్రమిత్రులతోడ♦ బొలియఁగూల్తు
మూడవసారినేతెర్పునవచ్చి పౌండ్రకు శతకంఠ రావణు♦సంహరింతు
నాల్గవసారిమానకవచ్చిమూలకాసురుఁడనుఘటకర్ణ♦సుతునిఁగూల్తు
నని చెప్పనాలించి♦యసురులెల్లనుమృతప్రాయులైరంతట♦రావణుండు

గీ. భయము నొందియు నదిలో♦పల నడంచి
దీని నిప్పుడె పట్టిన♦ధీతు ననుచు
ఖడ్గము ధరించి పైకి శీ♦ఘ్రమునఁ బోవ
నడ్డమైనిల్చి మయ కన్య♦యనియె నిట్లు.

మందో-కీర్తన, ఆదితాళము, నీతితో-వలె.

చాలు నీకింత మూర్ఖ-మేల గలిగె రావణా! ॥చాలు॥ బాలికా మణినిచూప, బోలునె! యోరావణా ॥చాలు॥ ఎన్నఁడో! వచ్చియుచున్న- నిన్ను గ్రుంతుననుచు। నన్నమాటలకు నులికి-యబల గ్రుంతు ననుచు। నున్నవాడ వెంతవెఱ్ఱి-యుక్తిదోచె బెనుచు ॥చాలునీ॥ ముందువచ్చె మరణ మిపుడె యొంటకుఁ గోరెదవు। మాదబుద్ధి పెంపుజేసి-మాచి త్రోవగానవు। పొందుగా శ్రీమోక్షగుండు। మాదిరిని నెఱుగవు॥ చాలునీ॥

వ. నీకు మృత్యుప్రాయమై యవతరించినది నిజమైన నిప్పుడే చంపిన నేమి చేయఁగలవు. కాలాంతరమందలి గతియోచించిత మింత టింతో నీ యింతిని బరిత్యజింపుమని యన్న విని మిన్నకుండెనంత రాక్షసభటులు.

మ. మానిని యున్న పేటికి వి ♦ మానమునందిడి సత్వరన్న భో
యానము శీఘ్రగ మించి మిథి ♦ లాధిపు దేశమునందు నొక్కచో
దానిని బాతిపెట్టి చని ♦ దానవనేతకు విన్నవింపఁగాఁ
దానలరారుచుండెఁ గ్రమ ♦ తన్ చిరకాలము దాటినంతటన్.

క. ఒక సూర్యగ్రహణమునాఁ
డ కుటిలమతింతో విదేహుఁ ♦ డాభూమిని దా
నొక విప్రోత్తమునకు సా
ర్థకముగ దానంబుసేయఁ ♦ దద్విజుఁడంతన్.

వ. బహుకాలంబు పరిశీలించి యొక్క చక్కని ముహూర్తంబునాఁడు దున్నమని యొక్క శూద్రుని నియమించిన నతండు.

సం॥తోహర॥ నాగలిచే దున్నగను హలాగ్రము-నాటి మాద నములేవ। వేగమె శూద్రుడు-విప్రుని చెంతకు-నేగి మ్రొక్కి భూదేవ! ఎంచగ నీవు వ, చించిన లగ్నము, సూచిదియగు నేమిలిన। మించి ధనము గను, పించె నీది కొను-మనుచు నొసగ మోదమున ॥రామ॥

వ. ఆపెట్టె నెత్తించుకొని జనకమహారాజు సభకుఁ జేరబోయి ద్విజుండు.

విప్ర-జనక, సంవాదము, కీర్తనము, ఆదితాళము.

వి-భూమిపాలవరా! ప్రేమను నా మనవిని వినదగు ॥భూ॥
రా-భూమిదేవవరా! ధీమతి యిక చెలువొందు నది ॥భూ॥
వి-తాము సంగిన భూమి నన్నుగ। నేము కాని। యిది నీకు కటలవదా॥భూ॥
రా-ఏమియున్నను। నేమి కర్తలు। స్వామి తామే, సంశయమేటికి॥భూ॥
వి-క్షోణియేకద! దానమిచ్చితివి। యీ నిధాన। మిందునుండితివే ॥భూ॥
రా-దానమిచ్చిన ధరణినుండి। దాని నేను। దగ గొందునె ॥భూ॥
వి-ఈక్షితికి రా, జేంద్రుఁడవే! యీ। ధ్యక్షుఁడౌను। రాణీటికినివిను ॥భూ॥
రా-మోతుగుండా, ధ్యక్షుని పద। సాక్షిగను। సర్వము తమదే ॥భూ॥

వ. అని విప్రరాజన్యులు వివాదపడుచుండ సభవారిట్లనిరి.

తో॥హర॥ వలదువలదు సం-వాదమేటికి। వాకిలిదీసియు గనిన।
నెలమి బెట్టెనో, నేమియున్నదో! తెలియుదమాదర మునిన ॥రా॥

వ. మంచిదని భటులచేత మూతఁదీయింప నంత మేఘవినిర్గత విద్యుల్లతికయుంబోలె బాలికామణి వెడలి వచ్చిన నాశ్చర్యకలితులై సభాసదులిట్లనిరి.

క. తన తండ్రియైన సాగరు
గనవచ్చిన లక్ష్మిబోలెఁ ♦ గన్యామణి చ
య్యనఁ దమ గేహముఁచేరెను
మనుపందగుఁ గూతుఁగాగ ♦ మనుజాధీశా.

వ. అని పలికిన సభ్యుల పలుకుల కలరి యిలాపతి యందు కియ్యకొనియె. ద్విజుండును బాలామణిని జనకభూపాలున కర్పించి నిజగృహంబునకు జనియెనంత.

సం॥తో॥ ఆడిరి గుములై-యచ్చర-బోటులు-పాడిరి గంధర్వులును। కూడి దేవతలు-గుసుమవర్షములు, గురిపించిరి యచ్చటను॥ రామ॥

వ. మాతులుంగఫల సముద్భూత గావున మాతులుంగి యని యునగ్నికుండంబున వసించినది గావున నగ్నిగర్భయనియు, రత్నాంతరవాసి యగుట వలన రత్నావతి యనియు, ధరణినుండి వచ్చుటచే

ధరణిజ యనియు, జనకునిచేఁ బెంపఁబడుటచే జానకి యనియు, సీతాగ్రమునకు దగులుకొని వెడలుటచే సీత యనియుఁ, బద్మాక్షునృపాలకుల జాత యగుటచేఁ బద్మయనియు, ననంత సార్థక నామంబులచే నామెను జనులు పిలుచుచుండ జనకుండు సుశీలయను భార్యం గూడి గారాబంబున సాకుచుండ.

క. బాలక్రీడ లొనర్చుచు
శూలిశరాసనము నెత్తి ♦ చులకగ నెత్తన్
బాలిక బలమును గని భూ
పాలుడు విస్మయము నొంది ♦ భావముం గొనన్.

వ. ఈ కోదండం బెత్తుట కసాధ్యంబగు నీమె మనుష్యరూపంబున నవతరించిన పరాశక్తియై యుండవచ్చునహాహా! నా పాత్రింబు మంచిది యీహర శరాసనంబెత్తి యెక్కువెట్టిన వానికి గాని యీమెను బెట్టబట్ట నర్హుండు కాడని యెంచి యది యొక శపథంబుఁ బూని యుండె,

శతా-కీర్తనము, కల్యాణిరాగము, ఆదితాళము, మనవినివలె.

దశరథభూమీ రమణా! మహాప్రభో దశరథ యశము రంజిలగ-నామె యస్నుషయై । యలరారెను నీకు । మహాప్రభో ॥దశ॥ ఘనుడు రాముడా । కాశ నీలనిభ, తనుడు విరిచె విల్లు । మహాప్రభో ॥దశ॥ పద్మాక్షు ధరా-పాలుని సంకల్పము నేటికిదీరె ॥మహాప్ర॥దశ॥ నలుగురు కోడండ్రను గైకొంటివి-వెలశె భవత్కులము ॥మహా॥దశ॥ భవదగ్ర సుతుండవని మోక్షపుర । ధరుండగు రాముండు ॥మహాప్ర॥దశ॥

శతా॥తో॥ తమరడిగిన సీ-తా వృత్తాంతము దాపక దెలిపితి నేను । విమలచిత్తమున-వింటిరి పెండిలి-సమయమయ్యె బోయెదను॥ రామ॥

వ. మీరు వివాహమందిరమునకు దయచేయుండని చెప్పి శతానందుండు వోయె. నిక్కడ జనకుండు వివాహమునకు సమస్తము సిద్ధముసేయించి వధూవరులను గైసేయుండని యాజ్ఞాపించినఁ గాంతలందని రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను. సీతా. యూర్మిళ. మాండవి శ్రుతకీర్తులను, వేదవేదు నలంకరింపఁ బ్రయత్నించి.

మధురగతి రగడ. పల్లవి॥ సీతారాములను । గై । చేసిరి వేడుకను.
పెండ్లికుమారుల, బ్రియమున గొందఱు । పెండ్లికూతులను, బ్రేమను గొందఱు ముత్తయిదువులటు-ముదమునఁ బిల్వఁగ । జిత్తరు చవికెకుఁ-చేరిరి చెల్వఁగ । బీటలమీఁదను, బెంపుగ నుంచియుఁ । బాటలు బాడుచుఁ, బరువముగాంచియు సంపెఁగనూనెను, సరగున బూయుచు, సొంపుగనలుగుల, శోభిలఁజేయుచు నలువ్రందఁగస్నానము గావించిరి। చెలువుగఁదడి యా, ర్చిరి మోదించిరి వన్నెగలుగు దు, వ్వలు వల గట్టిరి । కన్నులసొగసుగఁ-గాటుకఁబెట్టిరి ముద్దులమోముల-ముదితలు గూర్మిని । దిద్దిరికస్తురి, తిలకముఁబేర్మిని బరిమళగంధము - బాగుగబూసిరి । పసుపడి వరధూ, పంబులు వేసిరి । సురుచిరసుమముల- సొంపుఘటించిరి । వరకంచుకముల, వారకమించిరి । నవరత్నాభర, ణంబులు దాల్చిరి । నవనీరజస మనయనలు గొల్చిరి॥ మకరికలప్పుడు-మమతను వ్రాసిరి । ప్రకటితముగఁద, ప్పకగైసేసిరి । అంతట జనకుండం, దఱుఁ జూడను । సంతోషంబున, సభ్యులతోడను । మంగళకరహిత-మహిత నాదములు । పొంగుచు మ్రోయఁగఁ, బోలఁతి ముత్తములు । సేసలుచల్లఁగఁ- జెలఁగుమంత్రములను । వాసిమీఱఁగను -వరపూజనమును। వారకచేసి వి, వాహమందిరము । వారలఁదోడ్కొనివచ్చి సుందరము మీఱఁగఁజేర్చియ, మేయువిభవముగఁ । దీరుగలగ్నముఁ - దెలిసి విభవముగ॥





# సీతాకళ్యాణఘట్టము.

కీర్తనము, కళ్యాణి, అటతాళము.

కళ్యాణమొనరించె । కన్యకామణులకు । కళ్యాణరాగసం । కలితుడై నృపుడు । బాల్యమునురూపంబు దేజమును । సుగుణమునుగలకౌసల్యాతనయుడె । పాత్రుడనుచును । యెంచి, మించి, సాకల్యముగ రామునకు సీతను । గరుణంతోడను ధార వ్రాసి ॥కళ్యాణ॥

ఊర్మిళాకన్యను । నుల్లముంగోపల । నర్మిలింతోడుంత । నాలక్ష్మణునకు మూర్మితోమాండవిని భరతునకు । శ్రుతకీర్తినెంతో । పేర్మితో శత్రుఘ్నధీరునకు । మెచ్చి, యిచ్చి, కడు । నిర్మలుండగు జనకభూపతి । నిండువేడ్కతో ధార వ్రాసి ॥కళ్యాణ॥

ధరనునారాయణ-దాససన్నుతుడైన । వరమోక్షుగుండని । వాసుచ్యుతుడు । సరగదమ్ములుందానుబ్రీతిగను । సీతాదికాంతల । కరుతిమంగళసూత్రములుదగను । గట్టి, పట్టి, స-త్వరితముగిందలబ్రాలు వ్రాయగ । వరుసగాజనులెల్ల నరయగ ॥గళ్యాణ॥

సంధతోహర॥ బంధువులందరు-బరమానందము-వ్రుందిగబంచాహములు॥విందులొనర్చుచు॥ వేడుకతోంగా, వించెను । కళ్యాణములు॥ రా॥

తటుకునవిప్రో-త్తములకుంగోరిన యటులనిచ్చె బహుమతులు । నటుపిమ్మటంగ న్యాపగులకుందా । నరణమిచ్చిసత్కృతులు ॥రా॥

గావించినవారు గదలి యయోధ్యకుం । బోవ నిన్నిమిత్తమున। దోవమధ్యమున దుర్నిమిత్తములుం । దోచిననృపతిభయమున ॥రా॥

వ॥ వడవడవడంకుచు వసిష్ఠమహామునిం జేరి ప్రాంజలిబద్ధుండయి యిట్లనియె.

దళ, కీర్తనము, ఆదితాళము, హం, కాపి, శ్రీపతిమెంతటి.

ఈవిపరీతము । లేలదోచెను । సామి! ॥యీ॥ భావికకార్యములు। వడసెయుత్సాహమున । బోవనుత్పాతము । లావహిల్లెనుగటా! ॥యీ॥

గాలియత్యందముగ । బాళిపీవగబూనె । ఘూళిసూర్యనికాంతి-గలగమ్మెనుగటా॥యీ॥ ధరణినిమోక్షగుండ । వరకృపరాదాయె । గరితురగాదులకు । వెరపుగలిగెఁగటా॥ యీవిపరీతము॥

వ॥ అని యడలున నడిగిన దశరథునకు వశిష్ఠముని యిట్లనియె.

వశి, తోహర.

అదరకుముంసుమ । హాభయమొక్కటి । యావరించెత్వరలోను। అదితొలగునునా । పిదపనయోధ్యకు-నరుగవచ్చుమేలగును ॥రా॥

వ॥ అని చెప్పునంతలో.

సీ. తండ్రిమహాజ్ఞను♦దలమోచితనతల్లికంఠంబుఁ ద్రుంచె మేనేపుచుట్టాలి
పితృవిరోధిని గార్తవీర్యార్జునుని బట్టిప్రాణముల్ దీసె నే♦బల్లిదుండు
ఇరువదియొకమాఱు♦దిరిగినిర్బాహుజముగఁ జేసెనుర్వి♦సుగుణశాలి
కశ్యపునకునిచ్చిఁ కాశ్యపియనునామమొసఁగెసద్ధరకునేఁ డసమశూరు

గీ. డట్టి వీరవరుండు మ♦హాబలుండు
పరశురాముండు దివ్యచా♦పంబు కేలఁ
గ్రాల శ్రీరామచంద్ర భూ♦పాలవరుని
మోల నిలిచె జగజ్జాల♦ములువడంక.

వ. ఇట్లు కట్టెదుటనిలిచిన పరశురాముని గని శ్రీరాముండు గరంబులుముకుళించి నమస్కరించిన నతండిట్లనియె.

పర, తోహర॥ మ్రొక్కిన విడుతునె, మునురాజన్యుల-బెక్కండ్రను గూల్చితిని । జక్కితివికనని । సేయుమునిన్నును । జక్కాడెద నేధృతిని ॥రా॥

వ. అనిన నవ్వుచు శ్రీరాముండిట్లనియె.

రాముని మత్తకోకిల.

ధారుణీతలమెల్లఁ గశ్యప♦తాపసేంద్రునకిచ్చి వి
స్తారశాంతుఁడవై తపంబును♦ సల్పుచుండుటచే నమ
స్కారమర్పడఁవంచు జేసితి♦ గాని నీకుభయంబునన్
జేరిమ్రొక్కినవాఁడఁగాను హ♦ళాపనేటికి భూసురా.

వ. అనిన రోషించి పరశురాము డిట్లనియె.

పర, కీర్తనము, రూపకతాళము, కన్నడరాగము.

ఆహా నేతాపసుండ, నాకు నేసుమా! శ్రీరామ! యాహా॥ ఆహా వంమునసహస్రి, బాహార్జున ముఖ్యనృపుల, మోహరించి చంపినట్టి, సాహసుండు నేనుగాక ॥యాహా॥ రాముండనగ నేల, రాజిల్లగనీవింకొక రాముడవని వచ్చినావు, రాజపునినుబోకత్తురా ॥యాహా॥ ముల్లోకవిభుడు శివుడు, మోక్షగుండ నేతనాకు । విల్లుసిద్య గరిపెనతని విల్లుద్రుంచి తటమోర్తునే ॥యాహా॥

వ. అందునకు శ్రీమద్రామభద్రుం డిట్లనుచున్నాఁడు.

రా, కీర్తనము, హిందూస్థానికాపి, ఆదితాళము,

నెమ్మదిగా వినుభార్గవా ॥నె॥ ఇమ్మహినాభుజాసత్వ మిట్టిదనికానవు ॥నెమ్మ॥ నేనువినోదముగ లాగ, గానె విఱిగె నాకర్ణాంత, మూని తీయునంతకలదె, యుగ్రనికోదండము ॥ నెమ్మదిగా ॥ గోవులవిప్రుల జంప, గోరరక్కవంశజులు, నీవెగ్గులెన్నియాడిన, నీకెచెల్లె నిన్నుంప॥ నెమ॥ సదయుఁడా మోక్షగుండేను, సాక్షినాకుతుకయిది, యదియెనీ గొడ్డలి యుచిత, మైనరీతి జేయుము ॥నెమ్మదిగా॥

వ. అనువాక్యంబులకు నత్యంత కుపితస్వాంతుండయి జామదగ్ని యిట్లనియె.

గీ. నీవు క్షత్రియుఁడవు ♦ నేను విప్రుఁడనను
గర్వమున్నదే యులఁ ♦ గాంచఁబోకు
నాపరాక్రమంబు ♦ నా భుజాశక్తియు
నీకుఁజూపువాఁడ ♦ నిశ్చయముగ. వ. అనిపలికి.

పర-కీర్తనము, ఆదితాళము, పోపొమ్ము.

పోనివ్వఁబోనివ్వ రాఘువ! నిన్ను ॥బోని॥ పూనికతో నిన్నుబట్టి, పొంగడంగ జేయకనే ॥బోని॥ సారహీనమైనవిల్లు, బూరిపుడకరీతి విఱిచి, వీరుఁడనుచువిఱ్ఱ, వీగుచునే సెంచెదవు । వైరులకుగాలమున, వచ్చునునావిల్లుసూడు ॥బోని॥ భీమబలుడవయిన నెక్కు, వెట్టుదీనితే కయున్న శ్రీమోక్షగుండ శ్రీరఘు. రాముడని యెన్న నిన్ను, నాముందర నీసామర్థ్య, మేమి పనికివచ్చునింక ॥బోని॥

వ. జనకునియింటనీవు విఱిచినవిల్లును నేధరించినవిల్లును విశ్వకర్మ యేకాలమందు నిర్మించియున్నాఁ డందొక్కటి త్రిపురాసుర హారణ కాలంబునందు హరునకు సురులచే నియ్యఁబడియె. దానిచేఁ ద్రిపుర సంహరణంబొనర్చి తనశక్తిని ఈశ్వరుఁడు నైగడుకొనుచున్న విష్ణుఁడు శరాకృతిచే సహాయపడ శివుఁడు జయించెను. దేవతలాడిరది ప్రమధులవల్లవిని శివుఁడుకోపించి హరిని యుద్ధంబునకు రమ్మన రెండవ కాండాసనంబు హరికినిచ్చి దేవతలు పురికొలుప హరిహరులకుఁ బోరు ఘోరంబయ్యె. నప్పుడు హరికరనిర్ముక్తశరంబు దాఁకుటచే హరునివిల్లునెచ్చి పేళ్ళెత్తిన శివునిబలంబులోపడియె. నదిగని దేవేంద్రాదిసు లుభయులను ప్రార్థించి యుద్ధంబుమాన్పిరి. శంకరుఁడు తనధనస్సు దేవరాతున కిచ్చుటచే నది జనకునింటనిలిచె. విష్ణువు తనకోదండంబు రుచికునకు నిచ్చిననతండు జమదగ్ని కొసంగె. అతఁడు నాకొసంగె. మొదటఁగ్రైటభారి వ్రేటునకు నోటువడి పేళ్ళెత్తి పేటికయందు మూటియున్న భూతపతి చాపంబుగాదు. పెటక్కునవిఱువను. నాచేతనున్నది వైష్ణవచాపంబు. దీనిబలంబు నీవెఱుంగవు. మంచిది దీనినెత్తి గుణము సారించిన నీవు మొనగాఁడనని యొంచెద లేనిచో నసదవని తలంచెద నిన్ను వధించెద ననిన,

సం-తొ॥ ఇవ్విధముననత, డెదిరిపలుకరాముఁ డవ్విలుదాజేకొనెను। నవ్వుచునొకబా, ణముసంధించి-మ నంబున నలరుచున నెను॥రామ॥

రాముని-కీర్తనము, ఆదితాళము-పోషామ్మ.

మంచిది మంచిది భార్గవా ! బహు ॥మంచిది॥ మించిదీనసీపాదములు । ద్రుంచి త్రుళ్ళడంచెదను ॥మంచిది॥ సాహొద్విప్రుఁడని నిన్ను జంపనైతిలేకపోతె। దీక్షతో రాజులపగ, దీర్పకనే విడిపింతునా! వెగాతుగుండా ధ్యక్షుడని వీక్షింపలేవైతివీవు ।మంచిది మంచిది॥

వ. ఈలీలఁ గాలాంతకునిబోలె బలాబలంబులు దెలియక పేలుచు మోల నిలువఁబడియున్న పరశురాముని కేల నున్నవిల్లుగొని యల్లెత్రాడు పెల్లునలాగి భల్లంబొక్కటి తొడిగి కాళ్ళు డుల్లనేయుదు ననిన.

తో॥ పర్వినదయనిటు, పలికినరాముని, పలుకులువిని భార్గవుడు॥ పూర్వజ్ఞానము, ఘెడమియభవుడని, పొగడదొడగె దానపుడు ॥రామ॥

పరశు, కీర్తనము, కమాసు, రూపకము.

రామ! మేఘశ్యామ! బ్రోవవే! సకలంలోకాభిరామ! రామా! రణభీమా!ఘననామా! పరంధామా! రఘు॥ రామా! అజుడవవ్యయుడవు పరుడవు, నానందమయుడ, వాదిమూలకారణుండవు, నిజమాయాగుణ యుతముగ, సృజియింతువు, ప్రజలనురఘు॥ రామా॥ సగసహితులయి నవారలు! నినుగాంచలేరు, సగరహేతులైన నీరులు! రంగుగదమమనము లలో, నగనియానందింతురు ॥రామ॥ మోక్షుగుండపురవిహారకా! నా రాయణకవి, రక్షక! షడ్భానదూరకా! మోక్షప్రదదేహాకల, వీక్షిం తువు, సాక్షివగుచు॥రామా॥

పర-తో॥ ఆదియందునే హరివిరూర్చితప, మాచరింపగానతను, నాదరమునబ్రి, త్యక్షంబయియుం, లనుచుబలికెం దానపుడు॥ రా॥

మచ్చిదాశమున, మహినిగలిసినీ, విచ్చలుహైహాయనృపుల।
మెచ్చకందుర్పించియ, మేయశమాబుచు, మెరయదాల్పుమేనవల ॥రా॥

రాముడనగదశ, రథకౌసల్యల, కీమహింలోనుదయించి।
నీమముంశోడుత, నీకుదర్శనము, నేనొసగునుదయయించి॥రా॥

అనిపలికినయా, హరివేసినై, యవతరించితనివేశి।
చనియెమహేంద్రాద్రి, చలమునకాతని, సెలవుపొంది కొనియాశి ॥రా॥

వ. ఇట్లు పలికి పరశురాముండు చనినపిదప రాముండు భయ భ్రాంతచిత్తుండైయున్న దశరథునకు నమస్కరించినం గౌగలించుకొని దీవించి యిట్లనియె.

దశ-కీర్తన, పున్నాగవరాళి-ఏకతాళము.

నాపుత్రరత్నమా! నాపెన్నిధానమా! ముద్దులయ్యా! ॥నాపుత్ర॥
నానోముఫలమా! నాపాలిభాగ్యమా! చిన్నితండ్రి! ॥నాపుత్ర॥
నినువేగగంటిని, నేగీర్తిగొంటిని, లోపమేమి ॥నాపుత్ర॥
వరమోక్షగుండ, పురమేలుపుండ, రీకనయన! ॥నాపుత్ర॥

సం-తో॥ అనియిటుపలుకుచు, నందఱుగూడుచు, నప్పుడయో ధ్యకుఁజేరి। ఘనముగబౌరులు, గని ముద మొందఁగ, జనిరి గేహముల కలరి ॥రామ॥

వ. తదనంతరంబున భానుమంతుండుఁ గోసలుండు లోనుగాగల వారెనమండ్రు శ్రీరాముని మేనమామలు దమతమ స్వదేశంబులు పాలింపుచు రాముని పాణిగ్రహణ మహోత్సవమునకు రావలసినదనిదశ రథుండు శుభలేఖలంపగా వారివారి మనంబులలో వారువారిట్లనుకొనిరి.

తో॥ రామార్పణముగ, రయమునగాంచిన, నాముద్దులబిడ్డలను। బ్రేమమీఱగవ, రింపకసీతను, బెండ్లియగుటయొగ్గిలను ॥రా॥

వ. అయిన దీని విచారింపవలసినదని పత్నివారును యోచించి భూ, నీళా, విమల, జ్ఞాన, క్రియ, యోగాదినామంబులచే నలరారు తమకూఁతుండ్రి నూటయిరువది యెనిమిదిమందిని దోడ్కొని యయో ధ్యకు వచ్చి దశరథాదులరాక గాచియుండి వారు గృహప్రవేశమునకు వచ్చుసమయమున.

క. తనయాయుతముగ రాముని
గనవచ్చిన మేనమామ ♦ గారికిఁ బ్రియువం
దనములొనరించి యుచితా
సనములఁ గూర్చుండఁజేయ ♦ సంతోషమునన్.

వ. ఆసీనులయి యిట్లనుచున్నారు.

మేనమా, కళ్యాణిరాగము, రూపకతాళము.

శ్రీకరముగభానువంశ, శేఖర! వినుమా! యీకన్యలఁగైకొనివరి యింపుఁము భరియింపుమునీవు॥శ్రీకరముగ॥

నీకర్పితముగను, గం, టిమికావునదగను, రాకొమరులకింకొకరికి రాదివ్వగ సత్యంబుగ॥శ్రీకరముగ॥

రక్షోవరహరణా! నా, రాయణకవి శరణా! మోక్షగుండపుర వల్లభ, మోహించిరి ముదితలుసినను॥శ్రీకరముగ॥

తోహ॥ వీరికోరికలు, దీరిచిప్రోచుము, వీరికిభర్తవు నీవు। వీరు భార్యలిక వెలయగనీమను, వేరుగజూడకబ్రోవు॥రా॥

వ. అని పలికిన మేనమామల వాక్యంబులకు విశ్వసించి తండ్రి యుండిన సభకుజని నమస్కరించి రాముం డిట్లనుచున్నాడు.

రాము, కీర్తనము, రూపకతాళము.

జనకనామనవి, వినుము మేనమామ, లెనమండుగురువీరె, యే తెంచినారు ఘనముగ దాముగన్న। కన్యలనూటయిరువ, దెనిమిదిమందిఁ వెనుకఁ గొనుచుఁ, గైకొనుమనుచుఁ॥జనక॥

ఆముద్దుబిడ్డల, రామార్పణముగ, దాముగన్నారట, తలగిపోరట। ఆమోహనాంగుల, నన్యులకీరట, యామాటలకుఁ దలపఁ ఏమని యొందుఁ ముందుఁ॥జనకనామనవి॥

ధరనుమోక్షుగుండ, ధాముపసాక్షినఁ, వరియించికన్యలు, వచ్చి రినేను, పరిణయమగుమనో! తిరిగిపొమ్మందునో! పరమోపాయం బొందుఁ సరగఁ దెలపఁ వలయుఁ ॥జనకనామనవి॥

వ. అని రామచంద్రుండడిగినఁ దండ్రియిట్లనియె.

గీ. అగ్నిసాక్షిగ మొదటఁ బెం ♦ డ్లాడినట్టి
సీతనెమ్మదియొప్పినఁ ♦ జెట్టబట్టు
లేనిచో మానియుండుము ♦ మేనమామ
బిడ్డలైనను ధర్మంబు ♦ విడువఁదగునె.

వ. అని వచించిన తండ్రివాక్యంబులకలరి రాముండు సీతా దేవియున్న చెంతకభిముఖుండయి నయోక్తుల నిట్లనియె.

రాముని, కీర్తనము, ఆదితాళము, కనలిపని.

కలికీ! చిలుకల, కొలికి! యాలింపవే! పిలువక మేనమామల, బిడ్డలునను ప్రేమ, దలచిరి, కలిసిరి, వలచిరి। గదవే।

ననుబెండ్లియాడ, గనువేడ్కతోట; జనకులపనుపున, జనుదెం చిరటుగాన। నినుగాంచి, వినిపించి, తెలిమంచి, తెలుపవే।కలికి॥

మునుమున్ను స్వష్టి, మునగనియక్షీష్ట మునుపెల్పుతరసాక్షి, మో క్షుగుండేనుసాక్షి, మనమున, ననుమాన, మునుబూన, వలదే।కలికి॥

వ. ఇట్లు తనభర్త యడిగినందుకు డెందంబున సందియంబు నొందక యానందంబున ముఖారవిందంబు వికసింప వసుంధరానందన దశరథ నందనున కిట్లనియె.

సీతకీర్తనము, కన్నడ, ఆటతాళము.

వల్లభ! మీరునా, వంటివారే! కద! మొల్లవనకన, వశ్యముగైకొను॥వల్లభ॥జననము మొదలుగ। నినుబతిగాగను, మనమునగోరిరట మగువలపాపము ॥వల్లభమీరు।

ఇందరుఁగనుగొన, నీయిందువదనల, నందరిబెండ్లియాడు, మగ్ని సాక్షిగమనో॥వల్లభ॥

మోక్షగుండాధిప ! ముదముననన్ను మీ। బక్షపాతములేక, బాలింపునాప్రాణ॥వల్లభ॥

క. భూమిజ పలికినపలుకులు
కామోదము నొందియటుల ♦ నానసభ్యుల
వేమఱుఁ బొగడఁగనంతట
రాముఁడుతాబెండ్లియాడె ♦ రమణులనెల్లన్.

వ. ఇట్లు నూటయిరువదియొనిమిదిమంది కన్యకలను నొక్కల గ్నంబున వామదేవ, వసిష్ఠాముమునుల సమక్షంబునఁ పాణిగ్రహణంబు సలిపి సీతతోఁగూడ నూటయిరువది తొమ్మిదిమంది భార్యలతోఁగలసి యేకపత్నీవ్రతుఁడను ప్రతీతితో రాముండు వెలసెనంత.

సం॥శో॥ అగ్రిభార్యయగు। నవనిజయుంజలు। లందరువెంబడి రాగ। స్వగృహమునకును-జననితల్లులకును-సరిగునమ్రొక్కిరివేగ॥రామ॥

సం-వ. వారా నందంబునొంది వారినిలేవఁదీసి యాలింగించి యాశీర్వదించిరంత.

సం-క. శ్రీరాముడయోధ్యను సీ
తారామ యుతంబుగా ము ♦ దంబుననిత్య
శ్రీరంజిల వైభోగము
లారూఢిని బొందుచుండె ♦ నతివేడుకతోన్. (పునొంద

సీ. కననెల్లెడలనల్ల ♦ గనునల్లకొనినమబ్బులుపల్లిపెనలెల్లఁ ♦ దెలు జలజాకరితటా ♦ కములువాకలెడలేకజలపూర్ణనొదిము ♦ చ్చటగదోప ఘనపంకములుడొంకి ♦ లనునికనకళంకగతిజంతుతతికిక్ సంకటమువాయ జనులెంతయును సంత ♦ సమునొంద ఫలవంతమ్ముగ సంతటను స
స్య ♦ ములు నెలంగ

గీ. నవనిజయకాంక్షతోరాజు ♦ లలరుచుండ
ధవళకిరణములను సుధా ♦ ధాముఁడొప్ప
నరులు దైవోత్సవముల య ♦ త్నములు సేయఁ
బొడమె శరదాగమంబు సం ♦ పూర్ణముగను.

సం-న. అట్టిసమయంబున దీపావళ్యుత్సవంబు నెరవేర్పనుద్యమించి మిథిలాపురిం జనకచక్రవర్తి తనమంత్రులఁగాంచి.

జన-తో॥ రాముఁడు మొదలగు-జామాతృల సీ, తాముఖులగు దుహితలను । భామాయుతముగ । బరువఁడిదశరథ । భూమీశునిపి మంత్రిలను ॥రామ॥

వ. దీపావళిపండుగకు మననగరంబునకుఁ బిలచుకొని రావలయునని చెప్పిన వారుఁగదిలి యయోధ్యకుఁ గొన్నిదినంబులకుఁ జేరి దశరథునిచే సన్మానింపఁబడి.

మంత్రులకీర్తన, ఆదితాళము, పోవెపాన్న.

ధారుణీశ! చిత్తగింపుమా। జనకుంపంపెను ॥ధారు॥ మీ-రాక-గోరెఁ మారాజేంద్రుఁడు॥ధారు॥ దారలుఁ గోడండ్రు।దనయులుఁ జెలికాండ్రు । బొరులుబాదుగులు । విహారురాదగు॥ధారు॥ మోహుపురపతికృపను మిథిలకుదగఁ బోప్రదము ప్రయాణంబగుటకు ॥ధారు॥

సం-వ. ఇట్లు జనకుని సచివులు దెలిపిన దశరథక్ష్మాపతి యానందభరితుండయి భటులను గనుఁగొని.

దశ-సీ. దీపావళికిమిథి ♦ లాపురికినిమమ్ము రమ్మనిజనక ధ♦ రావిభుండు
పుత్త్రెంచెగానమ♦ త్పుత్రులు స్నుషలుమతాత, లు హితులుబ్ర ♦ ధానులంగ
బంధువులాశ్రితుల్ ♦పౌరులుమరిజానపదులునుజతురంగ♦ బలమువారు
దగబ్రయాణంబులై ♦ తరలిరానలెననిచాటించుడంతట♦సకలవాద్య

గీ. నృత్తగీతములలరార ♦ నేడువార
కామినులు వందిమాగధ ♦ గణములెల్ల
సిద్ధముగనుండునట్లాజ్ఞ ♦ సేయుడఖిల
యానములలంకరింపుడు ♦ హర్షముననుం.

సం-వ. తదాజ్ఞాప్రకారము సర్వము సిద్ధమగుట నూతెంచి.

కీర్తన, కాంభోజి, రూపకము, శ్రవణాన్విత.

మిధిలాపురమున కేగెను-మిత్రకులుండు, రథముమీఁద నెక్కి-యధికవిభవములరారఁగ॥మిధిలా॥ రామాదికుమారులెల్ల-సామాజముల బ్రేమమీఁఱనెక్కి-। ప్రియమునదన వెనుకనడువ ॥మిధిలా॥ మెల్లనసీతాది స్నుష-లెల్లవెంబడి।బల్లకీలలోన। నుల్లములలర గరాగను॥మిధిలా॥ కౌసల్యాదులుబౌరులు, డాసినడువ । వాసిమోకుగుండ, వాసునిసన్నుతి సేయుచు మిధిలాపుర॥

సం-వ. ఇటుల జటుల విభవంబున శుభంబున బయలుదేరి కొన్ని దినంబులకు మిధిలఁ బ్రవేసించినఁ దద్వార్తవిని.

చ. ఘనుఁడువిదేహరాజెదురు ♦ గా జనియాదటఁగౌరవించి పా
యనియనురక్తిఁ బౌరులు ర ♦ యంబున సేసలుజల్లవారకా
మినులు నటింపఁగాయకులు ♦ మేలుగఁ బాడసువాద్యఘోషముల్
దనరఁగ స్వీయధామము ము ♦ దంబునఁ జేర్చెఁ బ్రసన్నచిత్తుఁడై.

వ. పిమ్మట వారిసి మృష్టాన్నపానంబుల సంతుష్టి నొందించి దీపావళి దివసంబున.

తో॥ కూతుండ్రకు జా, మాతల కిమిత-ఖ్యాతిని దలలంటించి। ప్రీతిగనలుగులు-బెట్టించిశుభ-స్నాతుల నటగావించి ॥రా॥ అతులాంబర ది, వ్యాభరణాలం । కృతులగునటు జేయించి । చతురంగంబుల సద్దాసీ దా, సచయంబులనర్పించి ॥రామ॥

సం-వ. దశరథుని దత్కాంతలను దక్కినబాంధవులను బలువిధసత్కారంబుల సన్మానించి దీపావళుత్సవంబు సేయించిన నానందభరితులై దశరథాదులు.

క. జనకుని వీడ్కొనితమపురి
మునకరుగఁగ మార్గమధ్య ♦ మునరామునితో
సనిమొనరింపఁగగోందఱు
జనపాలురు వచ్చిరసద్వ ♦ శంబునుబలిమిన్.

సం-వ. హరధనుర్భంగం బొనరించి సీతనుగైకొనిన వైరంబు కారణంబుగ శ్రీరామునితోఁ బోరజయించువారై చుట్టుముట్టినన్నృపుల ను బరికించి దశరథుండు కంపితగాత్రుండై మంత్రులనవలోకించి.

దశ-కీర్తన, ఆదితాళము, ఆహోబాలా,

ఈరాజులనేకులెంతో-శూరులక్కట।వీరితోడఁ బోరొనర్ప-నేరనొక్కఁడ॥నీ॥ పరిణయమైపఁజనుచునపుడు।పరశురాముఁడు।వరగనడ్డపడఁగభంగ।పరచెరాముఁడు ॥ఈ॥ ఇపుడువీరలేతెంచిరి-యీసుతోడను। అపజయము నపయశము-నందనాయెను ॥నీ॥ మోక్షగుణాఢ్యుఁడునిక-టాక్షమున్నను । యీక్షితిజయింపవచ్చు । నేమిసేతును ॥నీ॥

సం-వ. ఇట్లు చింతింపుచున్న దశరథుని డగ్గఱి రాముఁడు వినయోక్తులతో.

రా-శో॥ క్షణమాత్రములో - సమయఁజేతునీ-జనపాలురయుద్ధమున । నణుమాత్రమునీ, వాలోచింపక-యనుమతియిమ్మనియనిన ॥రా॥

దశ-తో॥ బాలుఁడవీవు న్నృ, పాలురనేకులు, నాలములోఁబోరాడ । జాలవునేజని-చంపెదనుఁడుము-సైన్యముఁబ్రోచుచునీడ ॥రా॥

వ. నేనోప లేనియపు డడ్డపడుమన రాముఁడు.

రాము-కీర్తన, ఆదితాళము, ఔరఘుది.

తండ్రి! కను। పట్టుగవైరుల। ముట్టెదవిలఁబడి। గొట్టెదమట్టెదను వారినీ।తట్టునిలువనీయను।కాలువర । పట్టణమునుజేరును । ఈ వాహిను లఁగ। వెలకులను।నేమరకు॥పట్టుగ॥ మోక్షపుకీను। సాక్షిగను దీక్షగను। దెలిపెదను ॥పట్టుగ॥

వ. తండ్రికిఁ బ్రణతుఁడాయ యనుజ్ఞవడసి శస్త్రాస్త్రపూరితంబైయున్న తండ్రియరదంబెక్కి లక్ష్మణయుతంబుగఁ గదిలినఁగని.

సం. కం. భరతుఁడు శత్రుఘ్నుండును । బరువడిఁబడివేలరాజభటులను వెంటఁగ । శరకోదండంబులుగగొని । నరపాలుగతోడ బోరనడిచిరిబలిమిఁగ.

సం. వ. ఇట్లు శత్రురాజుల కభిముఖంబుగ నడిచి దిగ్గజంబులు బ్రమ్మగ ధనుష్టంకారంబొనర్చినఁ బగతురును వెనుదీయక యెదిరించి.

రాజుల-కీర్తన, ఆదితాళము, రామనీదయ.

నేడుమమ్మెదిరించిపోరుమ। శ్రీరామచూతము॥నేడు॥ చూడుజనకునీ।వీడునందల్ల। నాడుద్విజరాజ । చూడు, ధనువుఁద్రుంచి। యీడురా

శ్రీ వేమన గ్రంథాలయము

జులకెల్లసిగ్గొన। గూడఁబెండ్లి, యాడి సీతఁ। గోరుకొని। చనితివపుడు॥ నేను॥ దానవమాకవ। మానవమాయెను। గానవాలము, లోన। గరకులైన బాణ జాలము-మేనవైతుము। మానసములోననభి-మానసం, యుతుఁడవైన ॥నేను॥ అండమైమెమోక్ష-గుండదేవుఁడ। ఖండపగుదయ। నిండఁ। గనుచు నుండ। ఖండశశిధర। చండకోదండ। ఖాడనో, ష్వాడ సమ, ర్ధుఁడవై। యలరితపుడు॥నేను॥

వ. అని తృణప్రాయంబుగాఁబలికిన రామునిసైన్యంబులుమూగి,

భటుల-ఉ. బుద్ధివిహీనులార! బల ♦ ముందలపోయక రామమూర్తితో। యుద్ధముసేయవచ్చితి ర ♦ యోశలభంబులు వహ్నిసేరినట్లుద్దతి మేముసిద్ధముగ ♦ నుండఁగరాఘవుఁడేల మిమ్మిఁటే। యుద్ధరఁగూలజేతుఁరిపు ♦ డింటనుగెల్చియు రచ్చకేగుఁడీ.

సం-వ పరశుకుంత భిండివాలాది సాధనంబులు వచ్చుచున్నవి. వీనిఁదప్పించుకొని పొండనివైచి భటులార్భటించిన నవిలక్ష్యంబుసేయక యక్షయరూక్షేక్షణంబుల వీక్షించి యక్షమాధ్యక్షులు.

భుజంగప్రయాతము. ధనుర్జ్యానినాదంబు ♦ దగ్రంబుగాఁజే। సి నారాచముల్ పూన్చి ♦ చేబల్మివేయ। గ నాబంటులంగూడఁ ♦ గా లేకదూరం। బునన్నిల్చిరామీద ♦ భూమీశులెల్లన్.

వ. సింహనాదంబులుసేయుచు రామునికనిముఖులైన భరత శతృఘ్న లక్ష్మణులడ్డగించి.

భరతాదుల. సీ- తాటకాదులనిరా ♦ ఘాటంబుగాఁదోలియాగంబుఁగాచిన ♦ యదియెటెంగి। పాషాణరూపమై ♦ పడినయహల్యకు శాపంబువాపిన ♦ జాడయెటెఁగి। మీకసాధ్యంబయిన♦శ్రీకంఠ చాపంబు వేమెత్తివిరచిన ♦ విధమెటెంగి। పుడమినరాజక ♦ ముగనొనర్చినభృగు రామునిగెల్చినపరా ♦ క్రమమెటెంగి। రామునెదిరింపవచ్చితి ♦ రా! యిదేమి। యెదుటిబలమును స్వబలము ♦ నెఱుగలేని। మందమతులైన మిమ్మునే ♦ మందుమింతు। మమ్ముగెలచిన తదనంత ♦ రమ్ముపొందు.

వ. మాబాణంబులు రాకముందు ప్రాణంబులు గాపాడుకొనుఁడని మిక్కిలి యుక్కుగల పెక్కమ్ము లెక్కపెట్టి చక్కలురాలినట్లు గ్రిక్కున నక్కల దిక్కులక్షించివైచిన వారలిగి.

తో. బహువిధశరములు, వగపితతుణము । భరతునిమూర్ఛిలఁజేసి। సహజన్ముల ల, క్ష్మణశత్రుఘ్నుల-సరకుఁగొనక వెనుదాసి॥ రామ॥ అమితబాణవ, ర్షములముంప వా, రంతయోర్వఁగాలేక। విముఖులైనఁ గని విక్రమమునరఘు-వీరు జేరెపెనుదాక॥ రామ॥

రాము-కీర్తన, ఆదితాళము సవేసన.

బలాబలంబులు-దలంపకిటునను। గలాచవచ్చెదరా! రణకౌశలాబుఁజూపెదరా! ॥బలా॥ గజంబులాది-గ్గజంబులును గె, ల్వఁజాలు నేవినుమీ! దీని-నిజంబుగను గొనుడీ ॥బలా॥ సంతతమునుమీ-పరాక్రమంబుల-తెఅంగటిగియుంటి।మిథిలా, పురంబులోఁగంటి ॥బలా॥ ప్రగల్భములుప, ల్కఁగానేల మో, క్షుగూడపతియాన।నిలువఁగ! దగుఁ రణములో న॥బలా॥

వ. వర్షాధారలంబోలి వెడలెను మద్బాణపరంపరల కోర్చినఁజాలునని పలికి కౌసల్యాది కాంతలు స్నుషాసహితంబుగఁ దనయుద్ధనైపుణ్యంబు జాలరంధ్రంబుల నుపలక్షింపుచుండ దశరథుండచ్చేరువంద.

శా. వాయవ్యాస్త్రము పింటనెక్కిడిక పుర్ ♦ వైళంబుంగ లాగితా
బ్రేయర్ వార్థితటంబునర్ బడగవా ♦ రిక్ గొందఱర్ ద్రోసెనా
చాయల్నిచ్చిన వారిగర్వమునుగర్ ♦ సమ్మోహనాస్త్రంబుపై
డాయం జేయవితాకులైపడిరి చేష్టల్ దక్కి భూనాయకుల్.

వ. రాముండు ప్రియజనకుఁ జేరి నమస్కరించి సోదరుల యవస్థనుగురించి విచారించ జొచ్చునంతలో కైక.

ఆ. యుద్ధభూమియందు ♦ మోహమయముగఁబడి । మూర్ఛము
నిఁగి యున్న ♦ ముద్దుకొమరు । శిరముస్వాంకతలము ♦ నేర్చియున్యంత
దుః । ఖాబ్ధి లోనఁగూలి ♦ యడలుచుండె.

కైక-కీర్తన, రూపకము, ముఖారి, హంసప్రాణనాయక.

నాకూర్మినందనా! ననునిటు దేరిచూడరా। కైకనేరమేమిచేసె । నీకరణిని శోకాబ్ధిని-వేగూల్చిర భూకాంతులు॥నాకూ॥ పలువురు రణశూరులుండి। కలననునిమములఁ బనుచో। దలగింపఁగఁ-దలపరైరె॥నాకూ॥ మనుకులమున జనియించిన । నినుబగతురు-సెవికెక్కుచో । జనకుండును గనుచుండెను॥నాకూ॥ జగతిని శ్రీమోహనుడు। నగరేశుఁడు, దగ నడ్డపడఁగఁ జాలక-వగద్రోసెను॥నాకూ॥

వ. ఇట్లు దుఃఖింప దశరథ కౌసల్యాదులు సేద యూరార్పుచుండ నంతట రాముండు లక్ష్మణుం జూచి.

రా-మ. అనుజా! ముద్గలమౌని యాశ్రమము దా ♦ పైయుం మునిచ్చోటికా। యనదివ్యౌషధ వల్లికల్ వెదచెనీ ♦ వ దేగినాయాజ్ఞం దె! ల్పినసంజీవని నిచ్చుదానివలనన్ ♦ లేచుం దగన్ గైకజుం । డను మానింపక పొమ్ము కార్యవిఫలం ♦ బౌజాగుగాపించినన్.

వ. రథారోహణ బుసేసి పొమ్మనం దక్షిణంబు లక్ష్మణుండును తదాజ్ఞ శిరసావహించి ముద్గలాశ్రమంబు ప్రవేశించి తదీయ శిష్యులంగని.

సంవాదసీసము.

లక్ష్మ-వటులార యో మన్న ♦ వారుమీరు గురువులు.
వటులు-ఒనరసమాధియం ♦ దున్న వారు.
లక్ష్మ-మాకార్యములు దీర్చు ♦ మాన్యులిందెవ్వరు
వటు-కార్యంబులెవ్వి చ ♦ క్కంగం దెలుపుడు.
లక్ష్మ-సంజీవకరణికై ♦ చనుదెంచినారము.
వటు-అదిమీకొసంగ సా ♦ ధ్యంబు గాదు.
లక్ష్మ-రామాజ్ఞలక్ష్మణ ♦ నాముండవచ్చితి.
వటు-యెవరైననేమిమే ♦ మియ్యమిపుడు.

గీ. లక్ష్మ-ఎప్పుడదిమాకుదొరకునో ♦ చెప్పరయ్య!
వటు-ముద్గలార్యుని నడిగికొం ♦ పోగదయ్య!
లక్ష్మ-తడవుజరిదినం గార్యంబు ♦ సెడునుగాదె!
వటు-యందరికినిచ్చుటకుగురు ♦ నాజ్ఞలేదు.

వ. అంతట నిష్ఫలుండై వేగంబున రాముని కడకరిగి.

మత్తకోకిల. మౌనివర్యుండు నిర్వికల్పస ♦ మాధినుండెను శిష్యులెం । తేనినన్ను నిరాకరించిరి ♦ దేశికాజ్ఞకుబద్ధులై। నేనిదానముసేయ కార్యము ♦ నిష్ఫలంబగునంచునా। నైనమున్ దెలుపంగవచ్చితి♦భావి కార్యముదెల్పవే.

వ. రాము- తడవుజరిగిన భరతునకపాయంబు వాటిల్లు.

లక్ష్మ- దేవరవారి యాజ్ఞననుసరించి చేయుటకు సిద్ధముగా నున్నాను.

రా-బ్రహ్మచారుల ధిక్కరించి శూపధలతలఁ దేనోఫునువా !

ల-ఋషివర్యునకలుక వ్రేడమిన మనకుముప్పుగలుగునని భయము

రా-ఈకార్య మనుకూలమయ్యెనపిదప వారికోపశాంతికిఁ గాం

కుఁడ నేనుఁటిఁగదా!

ల-చిత్తము వెళ్ళుచున్నాను.

చ. చటులజవాబునొనరిగి ♦ సయ్యమిలేవక యుంటఁగాంచి

యం । తటఁబరికించిశూపధ ♦ లతల్గొనసజ్ఞము వచ్చినట్టియ। వ్వాఁ

లనిరాకరించిబల ♦ వాతిముగానవి సగ్రహించి పి । మ్మటరధయానుఁడై

చని గ్ర ♦ మంబున సర్పణచేసె బ్రమొక్కినన్.

వ. రాముండు పరమానందభరితుండయి యమ్మందు ప్రయో

గించినఁ దత్ప్రభావంబున భరతుండు సుపునిబోలి మేల్కని తలిదం

డ్రులకు రామునకుఁ బ్రణమిల్లిన దీవనలిచ్చిరి. కైక పరమసంతోషిత

స్వాంతయయ్యె. నక్కడ బ్రహ్మచారులు హాహాకారంబులు సేయుచు

గురువునుడగ్గఱి.

వటుల-కీర్తన, కన్నడ-ఆటతాళము-చూడవేల.

మాసినాధా! మాయానుబోధ। మానవే! తప, మూనవే!బోధ॥

మా॥ భూనాధుఁడెవ్వఁడో! కాసనేడే తెంచి। తానౌషధవల్లి। త్రవ్వికొని

పోయె॥మా॥ మేమెంత చెప్పిన। దామసమునఁజూచి। స్వామీ! బెదరించి।

చనియెనేమందుము॥మా॥ మోహముఁడేసుక। సాక్షముఁగొన్నమీ। య

క్షయతపోశ । క్తిక్షీణమాయెను॥మాసి॥

వ. తాముశాంతంబునొనున్న తపోబలంబు నిరర్థకంబుగాదె.

సం-వ. అనిపలువిధంబులఁ బలవింపుచున్న బాలకులవాక్యంబు

లాలించి కన్నులువిచ్చిచూచి.

ముని-ఉ. బాలకులార! హేమిబుధి పాపములట్లు విషణ్ణచిత్తులై

యేలవిచార మొందెద ♦ రధీశుఁడు లేని భయాళిబోలియే । జోలికిబోకస

త్వరముఁ ♦ జూచెదమూవుఁ గొంటఁతయేమియా। బాలగతిప్రకార మెట్టు

గనదగు సర్వముఁ జెప్పసేయుదన్.

వటుల-వ. మీరుపితత్సమాధనున్నతఁడీ యొక్క భూపాలుడు వచ్చి దివ్యౌషధలతలు మమ్ము తిరస్కరించి తస్కరించి కొనిపోయెను. మేమశక్తులమై మిన్నకుంటిమి. అదివిని మునీంద్రుండు.

ముని-సీ. ఏకాలమందైన ♦ భూకాంతులిటువలె ఋషులకునెగ్గా చ♦ రించినారె! ఏజోలికిసబోము ♦ రాజాధములఁజేరి యన్నవస్త్రంబుల♦ నడుగఁబోము। అడవులలోఁబడి ♦ యాకలములదిని యు మేముమృగము ల ♦ చందమునను। నిరపరాధులమమా ♦ నిలయంబులనువచ్చి కొదమ సింగంబును ♦ గదిసినట్లు। రేపుచుండుదారిది విప ♦ రీతమనక। తపముసా త్వికవృత్తివ్య ♦ ర్థంబుగాదె। మూలనుండినవారిని ♦ ముంగిళులకు। దీ యనాయమె! యీభూమి ♦ నాయకులకు.

ముని-వ. వానినామధేయం బెఱుగుదురా!

వటు-వ. ఇదివర కెఱుంగము. లక్ష్మణుండని వచించె.

ముని-వ. క్రోధతామ్రాక్షుండై ఎక్కడిలక్ష్మణుఁడు. మనవన మెక్కడ! నతండెందుండువాఁడు. అక్రమప్రవేశమేలచేసె. మదీయకో పానలజ్వాలలు ప్రజ్వరిల్లిననతఁడు భరింపఁగలడే!

వటు-రాముని సోదరుండనని మాతోఁబలికె. రాముడెవ్వడో!

ముని-ఏమీ! రామునిసోదరుఁడా! (అని యోచించి దివ్యదృష్టిచేఁగని)

ముని-చ. దశరథరాజనందనుఁడు♦ దారయశోనిధి రామనామఁడా। కుశకతనూజుండౌ మిథిల ♦ కుఁజని తత్పురమందునున్నయా। పశు పతివిల్లువిరిచి సుల ♦ భంబుగసీతను గొన్నయట్లనే । విశదముగాఁగ వింటిమును ♦ వీరవరుండతఁడే ! యితండఁగుఁజా.

వ. అయిన మనమతనిఁ దర్శించి రాఁదగును. అప శాంతంబు వహించి ప్రయాణంబగుచుండ నిక్కడ దశరథుండు విషాదంబున సతీ సుతాదుల నవలోకించి.

దశ-కీర్తన, ఆనందభైరవి-రూపకము, ఓమహాత్మా.

ఏమిసేతు నేయుపాయము । నాకేకీతోచ। దే॥

ఆమునిముని నాజ్ఞగొనక। ఔషధములు దెచ్చిరకట! తామసించి శాపమిడక । సామాన్యముగా । గనునే ॥యేమి॥

మానులవిశ్వాసమునకు । భూనాథులుపాత్రులగుదు । రీనాడిది

దవ్వాయెను। నీనేరంబెట్లువాయు॥నేము॥మోక్షుగుండవిభుభక్తులు। కీక్షితినపకారంబును। దీక్షనుజేయంగదగునె! యాక్షేపించరే! లోకు॥లేమి॥

దశ-వ. ఇదిగాక యతనియనుమతంబు వడయక తెచ్చితి. అఘనుండు సమాధిచాలించక ముందే! పోయి క్షమాపణ వేఁడుకొనియెద నని యందరితోఁ గలిసి మునియాశ్రమంబున కరిగిననెతోగి యతం డెదుర్కొని.

ముని-కం. క్షితినాథసతీసుతభటు। హితయుతముగ వచ్చినారు ♦ హృత్తోషముస్వా। గతమొసఁగెద నీదినమున। నతిథులుగాఁడగను మాము ♦ హాశ్రమమందున్.

వ. ఇదిమదీయసంకల్పంబని యశప్రకరకుసుమ సమన్విత వృక్షలతా సముదయంబులపొంత నాసీనులగుటకు వసతులుగల్పించిన వసించి దశరథుండు విన్నదనంబున.

దశ-భవత్పాదారవిందంబుల కనేకవందనంబులు మునీంద్రా!
ము-సర్వదా దిగ్విజయోస్తు. పుత్రపౌత్రాదభివృద్ధిరస్తు.

సంవాదసీసము.

ద-అపకారమొనరించి ♦ రయ్యా! నానాదను
లలుగక కృపఁజూడ ♦ వలయునేఁడు
ము-అపకారమేమి చే ♦ యఁగలేదు భూనాథ!
యుపకారమే చేసెయుం ♦ డెరిపు
ద-ఔషధలతలు మీా ♦ యాజ్ఞఁగైకొనక స్వ
తంత్రించి తెచ్చుట ♦ తప్పుగాదె!
ము-రాముండు సుగుణాభి ♦ రాముండు సర్వలో
కస్వతంత్రుండగుఁ ♦ గాదెభూప
తే. ద-తమకునాగ్రహ మొదవెనో! ♦ తగనెఱింగి
శాంతమొదింపవచ్చితి ♦ సంయమీాంద్ర!
ము-మనుజరూపముదాల్చిన ♦ మాధవుండు
రాముఁడాతని మాకోప ♦ మేమిచేయు.

సం-వ. అంతఁ గౌసల్యాదికాంతలు సీతాదిస్నుషలు, రామాదికుమారులు వేశ్వాఅసుమతీముద్గలులకుఁ బ్రణామంబులాచరించి వా॥

దీవనలొంది పిమ్మట వారి యాశీర్భ్యా బాగీకరించి యాదిన మందుండిరి. యప్పుడు.

దశ-క. మునివర్య! నొక్క విషయము । వినఁగోరితిమిమ్మునుండి ♦ విశ్రాంతిమొయిన్ । అనవుఁడు తులసీఖాడు । బునకునుగొని పోయివివరి ♦ ముగనడుగుమనన్.

దశ-తో. తమరెఱుఁగనివిష, యములుండవు నా । కొమరుండైన రామునకు । గ్రమమున రాఁగల - కాలశుభాశుభ గతు లెఱిఁగింపుఁడు నాకు ॥రామ॥

సం-వ. ముద్గలుండానందకందళిత హృదయారవిందుండయి.

ము-కీర్తన, హిం, కాఫి-ఆది, ప్రమొక్కెదన్.

చెప్పెదస్వినుభూధవా! ఇప్పుడు చేసిన ప్రశ్నకొప్పఁ బ్రత్యుత్తరము ॥చెప్పెదన్॥ శ్రీరాముఁడనఁగ నాది-నారాయణుఁ డుద్భవించె । ధారుణీశ! నీపుణ్య । కారణమున నీకు॥జెప్పె॥ నష్టమైనధర్మమును । సృష్టిపైఁ గ్రమ్మర నిలుపు । దుష్టులను శిక్షించుచు । శిష్టులను రక్షించుచు॥జె॥ శ్రీమానినియాంశమైన । సీతనుజాయఁగఁగొని । భూమిని శ్రీమోక్షగుండ । ధాముఁడై రంజిల్లును ॥జెప్పెద॥

ముద్గలుని-సీ. కొలఁది కాలంబునకునఁ బ్రదివి కేగ గలవు బృందా శాపకారణమున । రాముఁడు దండకా ♦ రణ్యంబునకు నేగి యవల నయోధ్యకు ♦ నరుగుదెంచి । రాజ్యంబు గైకొని ♦ పూజ్యంబుగా నేలు లీలబదునొకండు ♦ వేలయేండ్లు । కొడుకులిద్దఱుమనుఁ ♦ కోడండ్రునను ల్వురు మనుమ లిర్వది నాల్గు ♦ మూది మనుమ । రాంపృపండ్రెండు గురు ప్రపౌ ♦ త్రాళియగణి । తంబుగా నిట్లు సూర్యవం ♦ శంబు వెంచి । దీప్తలేడింటేదాను సా ♦ ధించి యేలఁ । గలఁడు నయగ్రసుతుఁడొక ♦ కాలమందు.

వ. ఇదియసీకొఱకు భావికాలవర్తమానమిచిన.

దశ-తో. వృందయనఁగ నెవ-రెందుండుమునునా । సుందరి విభుఁడె వ్వాఁడు । మునిశాపమా,యిందిరాపతికి నెందుకొసఁగె నదినేడు॥రా॥

వ. ఆకథావిధానంబు కరుణారసపరిపూరిత హృదయుండనై యెఱిఁగింపుఁడన ముద్గలుండు.

ము-పాట, రూపకము, జనకా.

వినుముభూమిపాల ! మునుపురంకసుని । ఘనకోపవహ్ని । వన ధినిబడిన । జనియించెనంతంగ । జలంధరాసురుం, డనంగా వరుణుండ తనిం । అనురాగమునం బెనిచెం ॥విను॥ జాలంధరమును । పోలు గల్పించి । చాలంగనందు-లీలవసుంచి । కాలనేమిగన్న । కన్యను బృం దయం । బాలం సద్గుణజాలం । ఆలింగాంగద్గైకొనె ॥విను॥ దండి వీరుండనం । దనరి వేలుపుల । దండించి ॥ ల । దర్పముదూల । నూడ తాపులేక । బెండువడిమోక్షు । గుండనగిరవిభుని । యండజేరి తెల్పిరి ॥విను॥

వ. ఇటువలెం దనశరణుసొచ్చినదేవతల నాదరించివివరించిజనకుండు.

విష్ణు-క౦. పురహరుండుదక్క నెరులె । వ్వరువాని జయింప లేరు ♦ వాస్తవమూశ౦। కరునారాధించుండా । తలిగిననేందోసుపసుదు♦ దైత్యుండుమడియుం.      వ. అంతదేవతలు.

దేవి- లావణి- శివప్రార్థన.

పురవైరీ! పురవైరీ! పురవైరీ! పురవైరీ! విధృత! వనజారి! విను తఘనసూరి నిచయ! కరివైరీ । కరివైరియానవర! శౌరి! మత్త । హర! భూరిభయద । నరకారీ! నరకారివినుత । పద-వారిజాత! స్మరవైరి! హర । గరుడారి! గరుడారితల్ప । శరధారి ! విమతపరిహారీ! లోక ! హితకారీ॥ 1॥ శ్రీమోక్షగుండ ధామాక్షుదామ । ప్రతిపక్షుద్విరదహర్య క్షా । హర్యక్షవక్త్రబుక్షౌకుశూర । ఘనరాక్షసప్రకరశిక్షా । కరశి క్షోపరిపరిరక్షిత । రావణ! యక్షరాజ సురక్షా! సురక్షితమువినుత ! దక్షాధ్వరసర్వక్షయ । దివ్యకటాక్ష॥ 2॥

వ॥ ఇక్కరణిం బెక్కుగతుల నగ్గించిన ముక్కంటిదేవతల దిక్కు వీక్షించి ప్రసన్నుండయిన మ్రొక్కులొసంగి.

దేవతల-ఉ. దేవజలంధరాసురుండు దీర్ఘబలంబున మమ్మెదిర్చి మా। తాపులు దానుగైకొనియెం ♦ దాళంగజాలము వాని ధాటికిం। యేవెరవికవానిసమయించి దయామృతలమ్ముం బ్రోవంగా। నీవసమ ర్థుండౌదువన ♦ నింబరులోపరు చంద్రశేఖరా॥

దే-వ. మాకుశరణ్యుండవుగావే! యనిప్రార్థించిన వారికభయంబిచ్చి వానియుద్వేగం బడంపనిశ్చయించి.

సం-తో. శూలముఁగైకొని। జాలంధరునిలఁ। గూలుపఁజనుచుండఁగను। వేలుపులనుదా! వెదకుచునెదురుగ। వేగవచ్చెనాతఁడును॥ రా॥

సం-వ. ఇట్లిరువురొకచోఁదారసిల్లి పోరొనర్చుచుండి రప్పుడు.

సం-క. శీతాద్రిజాతప్రేరణ। చేతరమానేత దనుజు♦చేతమునందత్యాతురమొందుచు వృందా। పాతివ్రత్యంబు సెరుప ♦ బరువడినరిగెన్.

సం-వ: జాలంధర పురోద్యానవనంబున నొక శిష్యునితోఁ బ్రవేశించి యొకచోనాశీనుండై తపంబు సేయుచుండె.

తే. వృంద నిజభర్తపాదార ♦ విందములను। సెందమునఁగొల్చి యొకనిశి ♦ యందుఁదనదు। మందిరంబునఁబూపాన్పు♦నందునిదుర। జెందికలఁగని లేచి లోఁ ♦ గుందికంది

వృంద-పాట-ఆవి, వలచి చటికి.

కలగనినానే! చెలియ! వినుము తెలిపెద ॥గల॥ చెలువుఁడునానె దలకంటుకొని, వలునఁదాలుపకను। యున్నటులను ॥గల॥ ముండియై మహీషముఁను నెక్కినిశిని। దండధరుని దిశకుఁ। దరలినటుల ॥గల॥ మోక్షగుండేశుని। యక్షయకారుణ్య। వీక్షణకలదో! లేదో! తెలియరాదు ॥కల॥

వృంద-సీ. పలువేలుపులడీలు ♦ పడఁజాలుగాఁదోలు నలకాలుపసవ్రీలు♦నటులఁజేయు। దగఁబాసి దెసడాసి ♦ తనవాసిఁ గనఁజేయు మఱియక్షవరుశిక్ష ♦ పఱచి పసుపు। సిరిబిడ్డగనబడ్డఁ జెఱుగడ్డమునులాగు బలుమారు జడదారు ♦ లలయఁదూరు। బహుమాలిఁ వనమాలిఁ ♦ గనిగేలిసేయును గురిమీఱ హరుబోరఁ♦ గోరుచుండు। వెంతదెల్పిన వినడిసు♦మంతమైన। నిపుడుద్రిపురారిపై కేగ ♦ విపులుఁడగుచు। యుద్ధమగుచున్నదచట న ♦ మోమయముగఁ। జెడ్డకలగంటి నేనేమిసేయుదాన.

వ. ఈసంతాపంబు కొంతయుపశాంతించుటకు వనాంతరంబున విహరింతమని పలికి తెల్లవారిన పిదప నిరువురు చెలికత్తియలతోఁ గలిసి యుద్యానంబు సేరి విహరింపుచు ప్రాణ నాథుని దలంచి వగపు గలుగ.

బృంద-కీర్తన-హిం-తోడి, రూపకము- వరధాత్రీతనయా.

తరుణీ! నావిభుండు। తానురాక-తడసినాండు॥తరు॥ పురహరుండో
బోరుసలుప। దరమగునకొ-తనబోటికి॥తరు॥ అశుభ సూచకములుదోం
చె। నాయెనేఁడు-నాకిక। విశదంబుగ క్షేమవార్త। వినుపించెడువారులే
రు॥తరు॥ ధరణిని శ్రీమోహనుండు। ధాముడైనశ్రీహరి। హరులజేయు
లనుచును। బలుమఱుదెలిపిన వినదాయెను ॥తరుణి॥

వ. ఇట్లు విలపించుచున్న.

చెలుల-క. కలకేమి! కనులుమూసినఁ। బహువిధములఁ దోచు
చుండుఁ ♦ బ్రతిదినమునునా। ఫలమనుభవించితిమె! యీ। కలకును
భయపడఁగవలెనె ♦ కంజదళాక్షీ.

బృంద-వ. నామనంబునకు మిగుల దిగులును భయమును గలు
గుచున్నదమ్మా!

చెలి-వ. నేనుండ భయమేల తల్లీ!

బృంద-వ. ప్రళయకాలాభీల జగత్కల్లోల ఘూర్ణయమేఘగర్జనం
బునుంబోలిన ధ్వనియొక్కటి వినంబడుచున్నదిగదే!

చెలి-వ. ఇంతలో నీకెంత చిత్తచాంచల్యము గలిగినదమ్మా.

బృంద-వ. నాకు చిత్తచలనముగాదు. నీకు బధిరత్వము వచ్చి
నది. (ఆమె కొంచెమాలోచించి.)

చెలి-వ. నీమాటనిశ్చయమగున నిజగుహాంతరమునుండి సింగం
బుమాతంగంబుపై లంఘించు గర్జనయని తోఁచెడిని.

బృంద-వ. సింగమగున మనమాడువారముగదా!

చెలి-వ. శీఘ్రంబున నడుమము తలంగుదము.

సం-ఉ. కొండలుమారుమ్రోయ దివి ♦ కుంభిను లట్టిటు నల్ల
లాడ మా॥ తాటకుండు దోర్విదప్ప విల ♦ యాబనిలోకులు దల్ల
డిల్లనా। దాడకిలార్భటింపుచు వి♦తాడపురాక్షసయుగ్మమప్పుడు। ద్దండ
ముగాఁ బయింబడినఁ ♦ దద్దయు భీతిమునింగి రంగనల్.

సం-వ. భీషణదంష్ట్రాకరాళ నయనంబులతో వెనుకొనినరాక్ష
సులంగని భయవిహ్వలులై పరుగువారును నా చెంగట తపంబుసే
యుచున్న మునిపుంగవునింజేరి యాలింగనంబుఁ జేసికొని.

వృంద-కీర్తన, జంఝూటి, ఆటతాళము, కామిస్తానుకా.

మునివర! నను బ్రోవవె। కరుణాగనవె। నినుగని। ఘనుఁడని। మనమునఁ దెలిసితి॥ మునివర॥ వెనుకొని దనుజులు। ననుదరుమంగ భయ। వనధి నిమునిగితి। ఘనముగ నొకాగతి॥ మునివర॥ మహాదాపద। నొంది। వగఁ। జెందివన। మాడుఁ జేరి। యుాదమన। నందకుదో। శిందొకకీ। డొందనా య్యము॥ తాపసేంద్ర। మోటుగుండ॥ శ్రీపతిని బోలియిపు। డీపాపులకో పాగ్నిని। రూపార్చుము। కాపాడుము॥ మునివర॥ (ఇంతలో)

తో. పటుభయంకరా, ర్భటులతోఁ డన। చ్చటికి రక్కసులు రాగా నటుగని। తటుకున। నమ్ముని। హుమ్మన। నవ్వాలకేగిరి వేగా॥ రామా

వ. అమ్మహాముని ప్రభావంబునకు నాశ్చర్యంబు నొంది సా ష్టాంగ నమస్కారంబొనర్చి వృందాదేవి.

వృంద-సీ. భవదీయహుంకర ♦ పటురవస్ఫూర్తిఁ జే మత్ప్రతిప క్షులు ♦ మాయమైరి। మీదయారసమునా ♦ మీదవర్షింపంగ సకల భయాగ్నులు ♦ సమసిపోయె। మీరెటుంగని దెద్ది ♦ మేదినిలో లేదు మ హానియులరు మీరు ♦ మానితిలక। యడిగెద మిమ్మొక ♦ యంశంబుదా నియదార్థంబును చెల్పఁగా ♦ నగును దేవ! నానుమగఁడు జలంధర ♦ నా మదనుజుఁ। డభవు నెదిరించి యపసల్ప ♦ నరిగినాఁడు। బహుదినంబులుజ రిగెని ♦ ప్పటికి రాఁడు। వార్తఁ దెలియకయాగతిం బనగుచాన.

వృంద-వ. నాయభీష్టంబు దీర్పుఁడని ప్రార్థింప మునిసత్తముం డూర్ధ్వదృష్టితో నవలోకింప రెండుకోఁతులు వియన్మండలమునుండి క్రింది కివచ్చిన నమస్కరించి మౌనికనుసన్నతోఁ దెలిపిన.

క. గగనమున కెగసి రెండుగ। మెగియున్న జలంధరాఖ్యు ♦ దేహా ముగొనివా। ర్నగుడఁ జనుపెంచి వృందకు। నగపఱచిరి క్షణములోన ♦ నాశ్చర్యముగన్.

వ. భిన్నమైయున్న భర్తృకళేబరంబు గని వృంద మూర్ఛిలిన మునీంద్రుండు కమండలోదకంబు ప్రోక్షింప మూర్ఛదేఱి.

వృంద-విలాపకీర్తన, నాదనామ, ఎంతహర్ష.ఆది॥

దైవ దుర్బలమో। నాప్రాప్తఫలమో! యీవేళవిగిత। జీవుఁడా మెను పతి॥ దైవ। కాలమున। కేమేలగునో! యేమగునో! యెటుఁగలే

వృంద-కీర్తన, కన్నడ-ఆదితాళము, రాకేంగు.

నీమాయదెలిసె। మనసునోలసె।మాయఁ, జేయ-న్యాయమగునా॥
నీమా॥ అప, కారబుద్ధివచ్చినట్టి-శౌరివని-కంటి।కి పటతపముగావించితివి॥
నీమా॥ పర, దారనాటి-వెంటనుంట- గౌరవంబగునా! మేర-మీరి-
తౌరాధీరా! ॥నీమా॥ గరుకుంకుశిష్యుఁడాయె। మోక్షు, గుండవరనీకు।
దండనుండఁదగదు-తలఁగు ॥నీమా॥

వృంద-గీ. జయవిజయులను నీపారి♦ షదులునాకుఁ। గీడొనర్చిరి
రాక్షసా♦ కృతులతోడఁ। బుణ్యశీల సుశీలు రి♦ ప్పుడుకి పులయి। నీదు
పనుపాచరించిరి ♦ నిశ్చయంబు.

వృంద-కం. ముందీవురాక్షసులచేఁ। బొందుగనిజ సతినిఁగోలు ♦
పోయిమనములోఁ। గుందికపులుదోడ్పడఁజే। కొంకుప్రకాశునినిమగుడఁ♦
గూరిమితోడన్.

వృంద-వ. దండకావన విహారంబు భార్యా వియోగంబు కపిస
హాయంబు నావచనంబునం జేసి నిశ్చయంబుగ నీకులభించ గలదని.

సం-తో॥ ఇందిరాపతికి-నిటుశాపంబిడి-వృందవిభుప స్మరియించి।
పొందుగననలము, నందుదుమికియూ, నందంబున మేనుబాసు॥రా॥

వ. పరలోక సుఖంబునకరిగె.

ముద్గ-పాట-ఆట-ఓర్చియుండుమిక-సలె.

రాజరాజ! విను। దశరథమహా॥రాజ॥ ఆజయావిజయులై। యసురు
లై నారిపుడు॥రాజ॥రావణకుంభకర్ణ, నాములైరిమహా॥రాజ॥ అబ్ధినడుమ
లంక। యందువసించిరి!రాజ॥ లోకకంటకులై య। నేకులగెలచిరి॥రాజ॥
మోక్షగుండేసుపైఁ। బూనిరివైరము ॥రాజ॥

ముద్గ-సీసము. కుతలేశనీకొడు ♦ కునుగోడలుబంచ వటియందు
నుండరా ♦ వణుఁడువచ్చి। రాముసేమరఁజేసి ♦ భూమిజఁగొనిపోయి
తల్లిరీతినిజూచి ♦ తానుబోగ్రిచు। వాలినివధియించి ♦ వానితమ్ముని గూడి
కపిసేనచేవార్ధిఁ ♦ గట్టజేసి। రావణాదులఁగూల్చి ♦ రామంశోపనయోధ్య
సేరితాఁపట్టాభి ♦ షిక్తుఁడగును ॥ యజ్ఞములొనర్చిమఱితీర్థ ♦ యాత్ర
లాచ। రించిద్వీపంబులేడుసా ♦ ధించియేలు। నిదియుగోప్యంబునీకునే ♦
నెరుకపరచి। తిని మహీవరయొరులకుఁ ♦ దెలియనీకు ॥

శివుని-క. ఈరీతినిముద్గలముని । శ్రీరాముని భావిచరిత ♦ చెప్పిన వినియో । గౌరీ ! దశరథునందనను । స్కారములర్పించిపలికెఁ ♦ గ్రమ్మ రమునితోన్॥

దశ-కీర్తన, శంకరాభరణము-ఆట, వింతలాయె-వలె.

సన్మునీంద్ర । సంతసమాయెను ॥ సన్ము ॥ మన్మనోభీష్టము । మానుగఁదీర్చితి ॥ సన్ము ॥ రాముఁడుహరియని । భూమిజరమయని । స్వామి తెలిపితిరి ॥ స॥ జోడుగగోడుకుఁగోడలుగానను । గూడగ నేటికి ॥ సన్ము॥ శ్రీకరమోక్షపు । రీతికృపతో । నాకథఁదెల్పవె॥ సన్ము॥

వ. నాపూర్వవృత్తాంతముదయాంతః కరణుండ గొంతసెలవిండని ప్రార్థింప ముద్గలుం డానందభరితుండై.

ము-మ. ధరణీనాయకసంహ్యాపర్వతముచెం ♦ తన్ వింతగా నొక్కప్రోల్ । గరవీరంబుననొప్పునాదుఁ గడులీ ♦ లన్ ధర్మదత్తాఖ్య భూ । సురుడొక్కండుగలాడు సద్గుణుఁడు సు ♦ శ్లోకుండు సద్ధర్ముఁడున్ హరిసేవాపరతంత్రుఁడై మెలఁగు ని ♦ త్యాత్మ సంతుష్టితోన్.

ము-వ. ద్వాదశాక్షర విద్యాపరాయణుండై భార్యాద్వయము తోఁగూడి యతిథిపూజ మొనర్చుచునుండు వాఁడొకపరి.

ము-తో॥ భాసురకార్తిక । మాసంబునహరి । వాసరమునగురి యుంచి । వాసిగఁదానుప । వాసయుక్తుఁడై । వాసుదేవునర్చించి॥ రామ॥

సం-వ. రాత్రిజాగరణకొరకు హరిమందిరమునకు నరుగుచుండ మార్గమధ్యంబున.

సీ. వెడదశరీరంబు ♦ విన్నుమన్నుకునంటి కాటుకకొండతో ♦ దీటుగాఁగ । దీర్ఘనిశ్వాసంబు ♦ ఘుర్ఘురస్వనమును దెగువభీమంబుగ ♦ దిశలఁబర్వ । రక్తలోచలముల ♦ రగులువహ్నికళంబు లలప్రళయాగ్నితోఁ ♦ ననుకరింప । లంబజిహ్వాగ్రంబు ♦ జుంబించువక్రదంష్ట్రలు వరహాంబుతోఁ ♦ జెలిమిసేయఁ । గడుదిగంబరమై పైకి ♦ గవయశుష్క । దేహమొకరక్కసినిగాంచి ♦ ద్విజవరుండు । దనువుగంపింప నొకకొంత ♦ తడవుభీత । చిత్తుఁడైయందు నిలచియో ♦ చింపఁదొడఁగె.

ధర్మ-కీర్తన, ఆది-కదంబరాగము, ఇంతపాపమెన్నఁడైన-వలె.

ఏమియీవికారరూప । మీటుల నోటగోప । స్వామికేమి

లోపమే । సలిపినానెతలప ॥ నేమియీ ॥ ఎన్ని సారులిటురాలేదు । యెన్నడిచటలేదు । చిన్నిరూపుగాదు । పై । కొన్నదలవబోను॥ యేమి॥ మోక్షగుండహరినిగొలువ । బోవుచుండతులువ । రాక్షసిటులనిలువ । జన । రాదికేమితోవ ॥యేమి॥

సం-వ. ఆపన్నివారణుండగు హరియుండ భయపడనేలనని నిశ్చయించి వాసుదేవ ద్వాదశాక్షరిజపించి తులసీదళయుక్తంబగు నుదకంబు దానిపైఁ జల్లిన.

సం-క. తులసీదళయుక్తంబగు । బలసంస్పర్శమునకలుష ♦సమితి దొలఁగియూ ! । వలపూర్వజన్మసంస్మృతి । గలిగిద్విజన్మునకుమ్రొక్కి ♦ కడువడిఁబలికెన్.

తే. నీప్రసాదముచేఁబాప♦ నికరమడఁగి । పూర్వజన్మవిజ్ఞానంబు♦ వొడమెమదికిఁ । జెప్పెదవినుసర్వంబు ♦ జెప్పఁగలను! । భూసురో త్తమ ! యేమినా ♦ పుణ్యమహిమ.

సం-తో॥ అనవుడునాశ్చ । ర్యమునొందియత । డనియెనపుడు మోదమున । వెనుకనెవరునీ । వేకర్మముచే । తనునిటుహైతివియనిన॥రా॥

కలహ-కీర్తన, కేదార, రూపకము, ఇనకులాధిపలె.

వినుముభూసురాగ్రణీ! అనుపమగుణ । గ్రామణీ! ధీమణీ!॥విను॥ ఇలలోఁ గలహాయనఁగను । వెలసితినేఁ దొలిభామున ॥విను॥ ధీరా-సౌరాష్ట్రమునావాసను ॥వినుము॥ భిక్షుండన్ । విప్రుండన్ । బ్రియమున వరియించి । యీతఁటివను బెండ్లాడెను ॥విను॥ పతిమాటలువినక । యతి ప్రీతినిగనక । సతిధర్మముగొనక । మతిమూర్ఖమువిడక । సతతమిట్లు । జరుపుచుండు ॥విను॥ శ్రీమీరన్ మోక్షపుర । స్వామిపనే । గొలిచి యెఱుఁగ ॥వినుము॥

కల-క. పతికన్నముందువంటక । మతిముదమునదినుచునుందు ♦ నతఁడేమనిన్ । బ్రతియనక యూరకుండనుఁ । బ్రతిమాలిన ముఖ ముద్రిప్పి ♦ పలుకకయుందున్.

కల-తో. ఇటువలెఁజేయవె। యీాపనియనినదు రెటనుతముగఁజేసెదను ; నటుమళ్ళినతటి। దటుకునఁబెళ్ళున। మెటికెలునేవిఁ చెదను॥రా॥

వ. ఇది మదీయనిత్యకృత్యము.

సంవా-సీ. భి-చెప్పినరీతిగఁ ♦ జేయవే మదినీవు.
కల-చెప్పిచేయించ ♦ నీచేతనౌనె.
భి-మూఁడుగాఁదిరిపంపు ♦ కొంపునటేకొమ్మ!
కల-నీయాజ్ఞనాకేమి ♦ నేరుప్పుంటు.
భి-దేవపూజయువైశ్య ♦ దేవమొల్లగునింక.
కల-వేఱుపాకంబుగా ♦ వించికొనుము.
భి-నేవంటుకొనువెడ ♦ నీవుండినఫలమేమి
కల-నాయింటనుండుట ♦ నాకుఁదగదె!
భి-ఎంతతెగువరినైతివి ♦ యిందువదన.
కల-నీకులోఁబడుదాననే ♦ నిశ్చయముగ.
భి-మారువక్కినశిక్షింతు ♦ మగువనేఁడు.
కల-రూపమునఁగూలి పాణంబు ♦ గోలుపోనె.

కల-వ. నానామంబు సార్థకంబగునట్లు వితండము లాడుచుఁ బ్రవర్తింపుచుండ నపకీర్తికిలోఁబడి యత్యంతబహుకాలంబు గడిపి విసికి యొకనాఁడు తనప్రియ మిత్రునిం జేరి.

భిక్షు-కీర్తన, ఆదితాళము, రారాసుభాగ, వలె.

విన్నా వెమిత్రా। యీ। వేళనాచరిత్ర॥విన్నా॥వినుటకుఁజిత్ర।మీ వేళనాచరిత్ర ॥విన్నా॥ ఇంటిలోఁఘోరహా । యింతితయానరాను । కంటక మాయె। వే। గమెనాచరిత్ర ॥విన్నా॥ చెప్పినరీతిగ। జేయదుపెండ్లాము। తిప్పలబెట్టు। నీ। తీరునాచరిత్ర ॥విన్నా॥ మోక్షగుండేసని । సాక్షినా తోఁబ్రితి । కక్షగజేయు । వే । గమెనాచరిత్ర ॥విన్నా॥

వ. ఇహపరసౌఖ్యంబులకు నాలవాలముదార యనుకారణంబు ననోరిచి యొతబోధించినను భస్మహవ్యమువలె వ్యర్థమగుచున్న యది దీనికేమైన యుక్తిచెప్పుము. సఖా! అనివేఁడిన.

సఖుని-క. క్రమముగఁబని చెప్పిననా। క్రమముగఁ దానాచరించుఁ ♦ గావునసీవ। క్రమముగఁజెప్పుముతానది । క్రమముగఁ గావించునదియ ♦ కార్యముపొమ్మా.

వ. ~~ఈ~~యుపాయంబున కచ్చెరువంది భిక్షుండుఁ దక్షణమున గీమునకువచ్చి యువిశిక్షింపఁగోరి.

దంపతుల వివాదము-మాసీవృత్తాంతము.

భి. మానిని! నాప్రియమిత్రుండు షహర్తుండు, మానుగ విందు కుంబిల్వకుమా। నేనును నాతనిం బిల్వనునాడును.

కల. నేరవుజ్ఞానవిహీన ! ధరణ్ । వానిసమానుండు లేడు కృతఘ్నుడ, వాపరమాపునిదూరెదవా । మానుగ నేజకపింపకుం బిల్తును, మావలదన్నను మానుదునా!

వ. ఇట్లుపలికి యతనిదోడితెచ్చి మృష్టాన్న తృప్తునింజేసి పంపితి నదిమొదలు నిషేధోక్తులాజ్ఞాపింపుచు సంసారంబు నెరవేర్చుకొను చుండి యొకనాడు.

సంవాద-కీర్తన, ఆటతాళము, రామునాపిన నలె.

భ-ఇద్దినమున నాతండిశ్రీది। తద్దినమువినగదె। ముద్దుగుమ్మా! నెరవేర్పవద్దు మనమిద్దరము ॥ఇది॥

కల-అద్దిరా! యిదేమియబ్బ। తద్దినముమా!నుదుం । బుద్ధిలేదూరకుండు। పెద్దలిదిమెచ్చెదర॥అద్ది॥

భి-మాటికినేటుటంబెట్ట । నేటికిదిబోటి! వినుు । కూటికైపితరులి। చ్చోటికిరుదెంచెదరె॥ఇద్ది॥

కల-ఏటికొండుకవుసిప్పు। చేయులకుమూలమిది। సాటివారువెలివేసియరె। టాటోటుమాటలుచాలు ॥అద్ది॥

భి-ఆక్షేపణలేకయుండ । దీక్షగనేనొక్కనికిం ।గుక్షికింతకూడువెట్టి । యాక్షణమెపంపెదను ॥ఇద్ది॥

కల-మోక్షగుండశౌరిపద । సాక్షిగనుశాస్త్రవిధి। లక్షింపకయిచ్ఛాగతి । నీక్షితింజరించెదవె ॥అద్దిర॥

వ. ఇట్లుభర్తను ధిక్కరించి తక్షణమపోయి పదునొండుమంది భోక్తలను నియమించి గృహాదులు శుద్ధిచేసి సమస్తశాకపాకాపభక్ష్యాన్నములు సిద్ధపఱచి భోక్తలందోడితెచ్చి శుద్ధాసనాసీనులంజేసియర్పింపుమన.

భిక్షుండు-నాకు శరీరముజబ్బుపడినది స్నానము మానుదునా?
కల-ఇంతదురాచారుండవా! స్నానముమానిన వృథా శ్రాద్ధముకాదా ?

భిక్షు-(స్నానముచేసివచ్చి యథావిధినర్చించి)

సంవాదము-ఉత్సాహవృత్తము.

భి-ఆదరుణ్ భుజించుదనుక ♦ నాగలేపుభామినీ! ముందునారగించిపిదప ♦ భోక్తలకునుబెట్టుమా!

కల-మాదమతివి ధర్మశాస్త్ర ♦ మతముసీకుఁదెలియదా! ఇందఱన్ భుజింపఁజేసి ♦ యేనుపిదపఁదినియెదన్.

వ. ఇట్లుపసవ్యంబుగఁజెప్పినపనులెల్ల సవ్యంబుగ నాచరించుచుండి నప్పుడు బిండప్రదానంబుతోఁగూడ శ్రాద్ధంబునెరవేర్చి.

సంవాదము-మత్తకోకిల.

భి-ఈదినంబుపవాసముండెద ♦ నింతనేభుజియింపనా। మోదమందిభుజించుమిప్పుడు ♦ మూడుజాములుమీఱెనా.

కల-వాదమా!యిదిపైతృకంబుప ♦ వాసహేతువుగాదుమా। ర్యాదగన్దినుమంచుఁబెట్టితి ♦ నారగించెనునాతఁడున్.

వ.అటుపిమ్మటఁ బ్రమాదంబున.

శో. ఈపిండంబులను । నిపుడుగంగకో । పుతివై చిరమ్మనఁగ। బాపమనక మల, కూపములోనవి । పడవైచితి నావెనుక ॥రామ॥

వ. ఆయకృత్యంబున కసూయనొందియు నదిలోపలనడంచికొని.

క. మలకూపంబుననుంచుము । జలములలోవ్రేయఁదగను ♦ సతియన మలిన। స్థలమందు నుండనియక। తలఁగించిజలంబులందుఁ ♦ దప్పకయిడితిన్.

వ. అట్టివిపరీతకృత్యంబునకునోర్వలేక యలుకరెట్టింపభిక్షుండు

భి-కీర్తన, ఆదితాళము, కేదారగౌళ, ఇంతరంసం-వలె.

ఎంతగయ్యాళివేసెవు! నా। శాంతముఖ్ బ్రోదోచినావు, కుంతముందూరిచి।గొంతుసిపి । గుంతలోద్రోతునా । దోషకారీ ! హంతకారీ! తంత్రకారీ! యంతమొంది-తుమ। దింతునొంతు॥నెంత॥దీక్షతో నాయిల్లు సేరి వ్రతి। కక్షఁబూనితివోరా॥ మోక్షగుండేసుని సాక్షిగాను। శిక్ష గావింతును జిక్కనిట్టి । రక్షపెట్టి। రాతఁగొట్టి భిక్షుకుంబంపితు । సిక్షణమున ॥ఎం॥

వ. కఠోరంబుగాఁబలికి నన్నుత్యజించి గుణసీలసుగుణంబులు గల యొకకన్నియను బెండ్లియాడిన నేనురోషించి విషపానంబున నసువులు విడిచితి నప్పుడు.

కల-తో. దండధరునిదూ, తలువచ్చిరి యు । ద్దండపరాక్రమ మొప్పఁ। జండశాసనము।సలుపుచుగొనిచని।శమనునిసన్నిధినిలుప॥రా॥

చ. శమనుఁడు చిత్రగుప్తుఁగని ♦ చక్కఁగనీవిడచేసినట్టి కర్మము లువిమర్శచేసి వివ ♦ రంబుగఁదెల్పుము నాగనాతఁడా । క్రమముగణించి దేవరని ♦ రంతరమీచెలి పాపకృత్యముల్ । బ్రిమిదముగానొనర్చె నిది♦ బంధురశిక్షకుఁ బాత్రురాలగుఁ.

చిత్ర-సీ. ఇష్టాన్నమును భర్త ♦ కీయకతినెగాన వ్యగ్రనీజన్మంబు♦ వడసెస్వమల । భక్షణయగునిజ ♦ భర్తతోద్వేషించి కలహంబెనిత్యంబు గాన నడచి । పందియైస్వమలము ♦ భక్షించుచుండును శాకభాండము నుంచి ♦ భర్తసూడ । కుండముందుగఁదిని ♦ యుండెనుగాన్రనఁ బిల్లియై తనుగన్న♦పిల్లలఁదిను। నధిపుసాధింప నాత్మహ ♦ త్యయొనరించెఁ । గానఁ బ్రేతశరీరంబు ♦ పూనిముందు। ననుభవించియనంతర ♦ మానవమూఁడు । తనువులెత్తఁగదగు భామ ♦ తనయ ! యిపుడు.

చిత్ర-తో. ప్రేతశరీరో । పేతయగుచు మరు।భూతలమున నుండు టకుఁ । బ్రీతిగనాజ్ఞా, పించి పంపుఁడీదె - దూతలవెంబడినటకు॥రా॥

చిత్ర-వ. ఇది క్రిమమైన శిక్షయని చిత్రగుప్తుండు పలికిన విని యముండు నిజభటుల కాజ్ఞాపించిన.

కల-ఉ. దూతలు నన్నుఁదెచ్చి పగ ♦ తోమరుభూమిని జేర్చి యిచ్చటన్
ప్రేతశరీరమిచ్చి విడి ♦ పించిరి పంచదశాబ్దముల్ నరేకా
జేతముతుత్పిపాసలఁ గృ ♦ శింపఁగదాళఁగలేక నేనుగృ
ష్ణాతటముందుఁజేరఁగని ♦ నన్నటనుండగనీకఁ గ్రమ్మరిన్.

వ. హరిహరదూతలుగొని తెచ్చియీనిర్జలప్రదేశమున విడిపించిరి.

కల-కీర్తన, తోడి, ఆదితాళము, వినవేయొకమనవి-వలె.

ధరణీసురతిలక । తత్ప్రభృతియుండునే । తాళియుండు ధర॥ తర ముగాదికను।భరియించుటకును । తరిగెబలమంతఁ । దనరెబలుచింత॥ధర॥ అలసితికడుదాహమునన్ । వ్యాకులముగిలిగ నాకలిరిక్ష ।నిలువనేమిగా

దు। నిజముగనునాదు। కలుషమడఁచితి।కరుణనుగాచితి ॥ధరణీ॥ ఆహో! మునుపుత్రివి। ధర్మోనులనుబుట్టు యోగమునుధర।హుల్లఁగ మెల్లఁగనల్లన జేయుము॥ధరణి॥ క్షితిఁబురా, కృతపురా, గతంబు। హాతమొనరించితివి। ధృతపుణ్యమతివి॥ధర॥ వెలయఁదపోబలము। గలతను మహిమము। దెలి యనెవరితరము॥ధర॥జగన్నుతుండైన।మో,క్షగుుడహరికరుణ,వడసినధ॥

వ. నేనాతనురంత పాపములు సేసి యింతవంతపాలైనను భవద్ద యాంతఃకరణమున నాకొఆతలు దీరెఁ దమకసాధ్యాంబేదియు లేదు. నన్నుగడ తేర్పవలసినది. దీనదయాపరా! యని వేడినవిప్రుఁడు.

సీ. నీవుసేఁనపాప ♦ నికరంబులెల్లను నిర్మూలమయ్యెను ♦ నేటి తోడఁ। బ్రేతత్వమును బాసి ♦ పిమ్మటయోనిత్రి యంబునొందగఁజాల♦ ననివిచార।హడైదవునీకు♦నపాయంబులేని యు ♦ పాయంబుఁగంటిని ♦ భ యపడకుము। జన్మాదిగానేను ♦ సలిపినకార్తిక। వ్రతఫలంబునవర్ధ ♦ భాగమిపుడు। ధారవ్రాసితిఁగొనుమని ♦ ద్వాదశాక్షర। మునుజపి యించి తులసీయు ♦ తముగ జలము। పాణియందుంచఁ బ్రేతరూ ♦ పంబడంగి। విమలలావణ్య యగునొకఁ ♦ వెలఁదియయ్యె.

వ. అంతనాయింతి యనంత తేజోభిరామయై ధర్మదత్తునకుఁ బ్రణమిల్లి.

కల-స్రగ్విణి. నీప్రసాదంబునన్ ♦ నేనుధన్యాత్మనై। సుప్రభా యుక్తమా ♦ సుందరాకారమున్। విప్రచూడామణీ ♦ వేగఁగైకొంటి నా। నాపకారంబులం ♦ నాకుమేలయ్యెన్.

వ. ఇట్లనుచుండునంతలో దేదీప్యమానమగు నొకవిమానముఁ గొని విష్ణుదూతలరుదెంచినఁ గని ధర్మదత్తుండు వారికి సాష్టాంగ నమ స్కారంబులర్పించి.

ధర్మ॥ ఈవిమానమును నెవరికొరకుమీరిచటికిఁ దెచ్చితిరి పుడు। నావైనమునా। కానతియ్యుడని। యడిగినంతవారపుడు॥రామ॥

విష్ణుదూతల-కీర్తన, కమాస్, జుల్వా-నేరమేరజార-వలె.

నేలవేలుపా! వచింతు। మాలకింపుమా। మేలుగభువన।మేలెడు వనమాలిబహిర్ద్వార। పాలురము మేము ॥నేల॥ ప్రేతరూపంబున। నీతెర వునన్న। పాతకురాలినిదే। నీతపోబలమున। నాతినిజేసితి। వాతరు ణింపు। నీతురాలయ్యెను॥నేల॥ శ్రీమోక్షగుండేశుఁడా మాధవుండుదా।

వైమానికముబం పెను। భామలతో నీవు। నీమానినీమణి। యీామేటిపు ష్పక। మెక్కుడుపోదము ॥నేల॥

ఉ. చిన్నటినుండి శ్రీహరికిఁ బ్రీతిగఁ గార్తికమాన సువ్రతం। బెన్నఁగఁ జేసినావు జపి ♦ యించితివెప్పుడు ద్వాదశాక్షరిన్। బన్నుగ జాగరంబు నుప ♦ వాసములున్ జరిగించినావు స। కన్న ఘనుండవం డు త్రిజ ♦ గంబుల భూసురవంశ శేఖరా!

గీ. అట్టిపుణ్యంబునందు న ♦ ర్థాంశమిపుడు। దాన మొసఁగితి వీమెకుఁ ♦ దానఁ జేసి। ద్విగుణమయ్యెను బుణ్యంబు ♦ ద్విజవరేణ్య। విష్ణుమూర్తికినదిమహా ♦ ప్రీతియయ్యె.

క. సుకృతార్థంబును గొనుటను। సకలాఘంబులకుఁ బాసి ♦ సద్గుణఖనివై। యకలంకరూప తేజము। లకు దావకమయ్యె నీమె ♦ లావణ్యనిధీ!

వ. ఈకారణంబున మీకు విష్ణుసాయుజ్యంబు గలిగె భక్తపరా ధీనుండగు వైకుంఠుని దయారసంబపారంబు వినుము.

సీ. హరిని నారాధింప ♦ నాత్మానిపాదికి దాక్షిణామండల ♦ స్థాయిదొరకె। గ్రాహగృహీతమై ♦ గజరాజు ప్రార్థింప గ్రాహంబునిమి నా ♦ గమునుగాచె। హరిచక్రమునఁ గూలి ♦ నట్టియాగ్రహంబు విజయుఁడై జనియించె ♦ గజముజయుఁడు। నాబుట్టియిరుపురు ♦ నారాయణునిపార్శ్వ చరులైరివారలె ♦ వ్వారన నేమ। విష్ణుఁగొల్చుచునుందుమా ♦ విష్ణునాజ్ఞ। మిమ్ముఁగొనిపోవ నీవిమా ♦ నమ్ము నొట। వచ్చినాము హరి ప్రభా ♦ వమునఁ గాదెఁ। మాకుఁ జెడిపోనిపదవి సం ♦ భావ్యమగుట.

వి-దూ-కీర్తన, కాపి, ఆది, ఆనాతిమ్ము-వలె.

ఆనందాబ్ధి, లోనదోగుచు। గదలుఁడిపుడు॥ఆనం॥ మేనుప్రాంగ। గానునీవి। మానమున, మఱిమెక్కుడు॥ఆనం॥ నారాయణుని। జేరిచెదము। మీారాఘనుని। కారుణ్యమును। గోరిసర్వ। చారసుఖము। లారూఢముగ। ననుభవింపు॥ఆనం॥ దీక్షుపుణ్యముక్షీణింప। నాక్షణంబునను। మోక్ష గుండసం, రక్షునిపనుపున। నీక్షమాతలి। కరుదెంతురు ॥ఆనం॥

ఆ. ధర్మదత్తనీవు ♦ దశరథుఁడనుపేరఁ। బొప్పి కొలమునందుఁ ♦ బుట్టఁగలవు। నీసతీమణులును ♦ కౌసల్యయు సుమిత్ర। యనఁగఁ బుట్టి భార్య ♦ లగుదు రపుడు.

క. జగతీసుర నీసుకృతము। నగముంగొనినట్టి కలహ ♦ జనియించును గై। కగ నామొసఁగు మాఁడవ। మగువయగుఁ భావి వర్త ♦ మానమిది సుమీ.

గీ. దేవతాప్రార్థనమున శ్రీ ♦ దేవివిభుఁడు। రాముఁడన నీకు నుదయించి ♦ రావణాది। దనుజులనుగూల్చి ధర్మసం ♦ స్థాపనంబు। నేసి రాజ్యంబు పాలించుఁ ♦ జిత్తములగ.

సీ. మాధవచైత్రోర్జ ♦ మాఘమాసంబుల నుదయంబునను స్నాన ♦ మొనరఁ జేసి। యేకాదశీవ్రత ♦ మొప్పంగనర్చితి బృందావనము వ్రేసి ♦ పెంచితరసి। బ్రాహ్మణులనుమఱి ♦ వైష్ణవులనుగొప్ప లను భజియించితి ♦ వనుదినంబు। మదమత్సరంబులు ♦ మాని యీకీర్తిని జన్మవ్రతంబుగ ♦ సలిపినావు। గాన విష్ణునకు ప్రీతుండు ♦ గాకయున్నె। నీకు సాయుజ్యమీకున్నె ♦ నిన్ను గనుట। చేత మేమును ధన్యుల ♦ మైతిమహహా। హరిసదర్శనపుంబోదము ♦ సరగరమ్ము.

సం-వ. అనపలికి జయవిజయులు వారిని విమానారూఢులఁ జేసికొని దేవతూర్యరావంబులు సంగీతజలాగఁ దక్షిణంబున వైకుంఠ పురంబున విష్ణుసన్నిధి జేర్చిరి.

ముద్ర-కీర్తన. భైరవి, ఆదితాళము, గుర్తోర్థనా-వలె.

ధాత్రీశ్వరా! దశరథనామ॥ధా॥ ధర్మదత్తుఁడనెడి తయు వింతగను॥ ధాత్రీ॥ గోత్రధరుని॥గురురూపము। నేత్రములఁగనిసేవింపఁగదె॥ధాత్రీ॥ మిత్రకులజనుప విత్తేశాదిపుర। చిత్రములనుప్రేక్షింపుచు సుజన। స్తోత్రములకుఁ దాఁబాత్రుఁడగుచుఁగను। మైత్రిని జిరకాలమువసించి నాథ చట॥ధాత్రీ॥ నిర్మలినంబగు నిజకృతపుణ్యాను। కర్మనుడఁగినంతట నం దుండక। ధర్మదత్తుఁడీపుడమిని దశరథనర్మయనఁగ నవతరించె నెవరన నీవసుమి॥ధాత్రీ॥అతనిభార్యలిరువురు కౌసల్యాసతిసుమిత్రలైరిపుడుగల హాయను। నతివకైకయననలరెను మువ్వురు, క్షితివరసతులై చెలఁగిరినీ కును నిశ్చయము॥ధాత్రీ॥ శ్రీమిఱఁగ శ్రీమోక్షగుండహరి। శేషశంఖ

చక్రములు గ్రమముగను రామలక్ష్మణ భరతశత్రుఘ్నులను। నాములు నీకుఁ గుమారులైరి విను వీరె కను ॥ధాత్రి॥

వ. జన్మాంతర సుకృతపరిపాక విశేషంబున నిన్ను ధన్యునింజే యంగోరి యీజన్మంబున భగవంతుండు నాల్గురూపంబుల నీయందవత రించె నీతని కతంబున నీకు విష్ణుసాయుజ్యంబు గలుగు నిశ్చయము.

క. నీవడిగినస్వచరిత్రము। నేవినిపించితిని ధారుణీశ్వర యింకన్। దేవులతోఁబుత్రులతో। వేవేగనయోధ్య నేరి ♦ విశ్రాంతిమెయిన్.

వ. నిజరాజ్యపాలనంబు సేయుచు సుఖంబున నుండుమని యాశీ ర్వదించిన దశరథుండుఁ గళత్రపుత్రసహితంబుగ మునీంద్రున కనేకప్ర ణామంబు లాచరించి వారినివీడ్కొని యనంతరంబో పార్వతీ॥

శివుని-తో. వందిమాగధులు। బృందములై తమ। ముందుఁబొగ డుచునుండగ। దుందుభిఘోషము। తూర్యరావములు। సందడియలరగ మొరయ ॥రామ॥

వ. నిజయానంబుల నారోహించి రెండు మూఁడు దినంబులకు నిజరాజధానియగు నయోధ్యకుఁ జేరి యానందమున నగరు ప్రవేశిం చిరంత దశరథుండు గొలువుకూటంబున నివసించి సభికులు విన భర తునితో నిట్లనియె.

దశ-కీర్తన, జంఝూటి-ఆదితాళం.

పొమ్మికకేకయభూపతి-పురికిని నెమ్మదిఁబొదలఁగ భరతుఁడ॥పొ॥ నెమ్మదిని,నిన్నిపుడురమ్మనిమీ మేనమామ। సమ్మతమునఁబిలువవచ్చె ॥పొ॥ తాతకు, నవ్వారునిరతము। బ్రీతినిదండము। పెట్టుముభరతుఁడ॥పొ॥మాత లునీ, మదిఁగొలువ।నితో గూడశత్రుఘ్నుని। ఖ్యాతిగానుబిలచుకొని॥పొ॥ కోరిన, చదువులు నేరుచు, కొనుమచ్చటనివ్వు, కొదువలు లేకను॥పొ॥పొ రులను, భక్తిగను। ధారుణిమోక్షగుండ, ధాముని నమ్ముచువెడలి ॥పొ॥

అంత. క. భరతుడుజనకునియాజ్ఞను
సరగున శిరమునవహించి ♦ శత్రుఘ్నునితో
బరువడి కేకయరాట్పురి
కరుదెంచెను బంధుదర్శ ♦ నార్థముగాఁగన్.

కాండాంత త్రోహర॥ అసితాఖ్యాన, రాయణకవిరా, మాయ ణమునుహరికథను । ఘనముగఁజెప్పెను, గద యాదిది బాల, కాండము చిలుకునుసుధను ॥రా॥

ఇదివినువారల, కిహసౌఖ్యంబులు। గొదవలేక చేకురును। ముద మునఁదుదకును। ముక్తిలభించును ।. మోక్షగుండహరికృపను॥ రామా॥

క. నాచేతనయినకొలఁదిని
జూచిరచించితిఁదీని ♦ సుజనులు నెరసుల్
దోఁచినయెడ దిద్దుపిరని
నాచిత్తములోననమ్మి ♦ నాననయంబుగ౯.

శ్రీ మోక్షగుండ రామాయణమునందలి బాలకాండము.

సమాప్తము.



గీ. రాజ్యభారంబు దశరథ ♦ రాజునీకు
నీయఁదలచెను దానినీ ♦ వియ్యకొనిన
రావణాది నిశాటన ♦ గణములఁదుంచి
మమ్ము రక్షించుమెన్నను ♦ మదనజనక.

వ. అనిన శ్రీరామచంద్రుఁడు నారదున కిట్లనియె.

రాము-కీర్తనము, ఆదితాళము.

దేవమునీశ్వర। చెప్పెదను। నావాక్యంబులు నమ్మినను। రావణాది దుర్మార్గులఁదుంచి సు! రావళిఁ బ్రోచుట-కరుదెంచెదనే ॥దేవ॥ దండకాటవిని। దాపసవృత్తిని। నుండెదబహునాళ్లే గడచట। మోసగసీతా। మిషమునఖలులను। ఖండించెదమోక్షు। గుండేసుడనై॥దే॥

వ. ఈప్రకారంబున శ్రీరామచంద్రుని రావణవధార్థము చను మనిపేరేపించి ముమ్మారునమస్కరించి రాములసెలవుపొంది నారదుండుయథేచ్ఛాజనియె. అంతదశరథమహారాజు రాజ్యపాలనంబుచేయుచు గొలువుకూటంబునఁ బరివేష్టించియున్న సభ్యులఁగని యిట్లనియె.

దశ-కీర్తనము, అటతాళము-కాఫిరాగము.

వినుడిదిసభవారు విన్నప మొక్కటి,ఘనముగముదిసితి, మనవము నరోసితి, పనిబూనిరాజ్యముఁ, బాలింపఁజాలను। గనుకరామునకును, గట్టుదుఁబట్టము॥విను॥ మీకిదిసమ్మత, మేకదదీనికి, జేకొనినసర్వము, సిద్ధము సేయుడు, మాకులమునగల, మర్యాద యగునిది, యాకరుణాంబుధి, యగ్రజుఁడగ్గునుఁ॥విను॥ భరతశత్రుఘ్నులు, పరగఁగ కేకిటు, నరిగిరిమాతుల, పురమునుజేరగ, ధరనునారాయణ, దాసనుతుండగు, వరగుని మోక్షుగుండ। హరినిదలంచుచు ॥వినుడిది॥

స, శోహర.

వదలకదశరథుఁ। వాక్యంబులుసభ, వారలుదామాలించి, సదమలమతులయి, సంతోషింపుచుఁ, బిదపనరిరి యోచించి॥ రామ॥

సభి-కీర్తనము, ఆదితాళము-కళ్యాణి.

ఇదిఘనకార్యము। భూవరా! మా॥కిది॥ ఎదలోపలసే। వెంచినకార్యము। ముదమునఁజేయుముచాలు॥ ఇది॥

మేలుగద్రిభువన, మేలెకు నేతకు, నీలోకము నేలుటెంత॥ఇది॥

మోక్షుగుండరామ, మూర్తిఁనిమాక, ధ్యతునిజేయుము, రాజ॥ఇది॥

వ. అని సభ్యులు పలికిన.

సం, దశ, తోహార. అప్పుడుదశరథుఁ డావసిష్ఠుఁగని. యయ్యా! కులగురువర్యా! । ఇప్పుడు రామునికిది యొక్కఁగింపగ, నేగుడుసద్గుణ ధుర్యా॥ రామ॥

క. అనుడువసిష్ఠుఁడు రాముని
గననేగినవారిరాకఁ ♦ గనిరాముఁడెదు
ర్కొని కాళ్లుగడిగి తజ్జల
మును శిరమునఁజల్లుకొనియె ♦ ముదితయుఁదానున్.

వ. ఇట్లు కులగురువును దోడితెచ్చి రత్నపీఠంబుపయి కూర్చుండఁజేసి పూజించి కరకమలంబులు ముకుళించి రాముండిట్లనియె.

రా-కీర్తనము, ఆటతాళం, నమిలాం-వలె.

మాకుశుభంబుమీ । రాక కేవలమును, శ్రీకరమైయున్నది, ధీరవర ॥మా పాకిటముగగృహ । పావనమాయెను । మాకులమిదెపాదలె ॥ ధీర॥ తమ । పాదాంబువు । దాల్చుటకతసస్సా, ర్థకమాయెనాజన్మము ॥ ధీర॥ అవిరళమోక్షుగుండాధీశుగొల్చుమీ । రనఘులుధన్యాత్ములు । ధీరవర ॥ మా॥

సం-తోహార, ఇనకులవర్యం, డీరీతిగనన । విని వసిష్ఠమునివరుడు। మనమునసలరుచు, మాబోంట్లనునీవు, మాయలఁబెట్టెదవెపుడు॥ రామ॥

నీపదజలమును । నెత్తినదాల్చెను । నీలగళుడుప్రియమునను । నీపదజలమున । నీరజభవుడుపు । నీతుఁడయ్యెఁగ్రమమునను॥ రామ॥

ఇటులనుటుపదేశించుటగాదే ! యిలలోగలజనులకును । బటుతరసాక్షివి । పరమాత్ముడవను । పరిజ్ఞగలదుమీదయను॥ రామ॥

వశి-కీర్తన, జంఝూటిరాగము-ఆటతాళము.

దేవదేవుఁడవు। నీవుపుట్టినావు। రావణవధకుశ్రీ, రామా! రామా వేవేగమీసేవ । గావింపనీదూష్య । జీవనమందుంటి । నీవరకు ॥ దేవ॥

అగుణుఁడవగునీవు । సగుణుఁడవైయింపు । భగవంతుఁడనగను బ్రబలితివి । తగనిన్నుఁగనుగొంటి । ధన్యుడనయితిని । జగదీశ మాయలోఁదగిలించకే ॥ దేవ॥

గురుగురుఁడవునీవు । గురుఁడనినన్నుట । కరమొప్పనాభాగ్య
గరిమగాదే । నరపాలతాళ్ళ్యారి । నారాయణార్చిత । వరదమోక్షగుండ
వాసరామ ॥ దేవదేవుఁడవు॥

వ. అనిపలికిన సంతోషించి శ్రీరామచంద్రుండిట్లనియె.

రా-తోహర. మీరరుదెంచిన। కారణమేమో! కోరితెలుపుమో
స్వామీ ! సారెకు నేశిర, సావహించియది । సలుపుకుసంశయమేమీ.

వ. అనిన వశిష్ఠుండిట్లనియె.

వశి-కీర్తన, రూపకతాళము, మధ్యమావతి.

రఘునందన ! రఘునందన ! రఘునందనరామా ! ॥ రామా ॥
అఘసంహార ! రాజ్యమునీ । కర్పింపగ । నెంచెరాజు ॥ రఘు॥
ముద్దియతోఁగూడనెక్క । పొద్దుండుము నేఁడు రేపు। ప్రొద్దున
మీతండ్రిగారి । యొద్దకు నేతెంచినచో । ముద్దుగనన్నియుఁదెలుపును॥
రఘు॥

ఈక్షితిపరిపాలనమున। కీయర్హుఁడగుదువయ్యా! మోక్షగుండపుర
మందిర। సాక్షాన్నారాయణాక్ష। రక్షకనేవేడ్కొనియెద ॥రఘు॥

వ. అనిన.

సం-తోహర. మంచిదిమీయను। మతిమురీతిగా। వించెదబాండ
నియనగ। మించినభక్తిను, తించదశరథుని। గాంచనేగియిట్లనెగా॥రా॥

శ్రీమీరగరఘు। రామునికన్నియుఁ । జెప్పివచ్చితినిరాజా! క్షేమం
బుగ నభి, షేకద్రవ్యముఁ చేర్పింపుమురవి తేజా ॥రామ॥

క. అనిన నృపాలకుఁడు సుమం
తునిగనియటుచేయుమనినఁ ♦ దోడ్తో భటులన్
గనియతఁడాజ్ఞాపించుడుఁ
జనికూర్చిరి సకలవస్తు ♦ సంభారంబుల్.

రగడ. అంతనృపాలకు ♦ నాజ్ఞనుజారులు । వింతఁగఁదెల్పఁగఁవిని
యూపౌరులు । చెలువుగఁబురిగై ♦ సేసిరి చేలగిరి।నిలయంబులు ప ♦ న్నీట
నునలికిరి। ముత్తెపుముగ్గులు♦ముదమునఁబెట్టిరి। చిత్తరువలవిరి♦చిలుకలు
గొట్టిరి। పలుతోరణములు♦బరువడిగూర్చిరి। చలువపందిళులు♦చయ్యన
దీర్చిరి । ఎచ్చటఁగనవా♦యింతురుభేరులు । ఎచ్చటఁగనదీ ♦ వింతురుపా

రులు । తులలేకనుబహు♦తూర్యనాదములు। వెలసెనున లేట♦విపులమోదములు।కడువడి గాయక♦గణములుపాడగ । గహనచేడియలు♦ఘనముగ నాడగ। మంగళజలములు♦మరితెప్పించిరి।అంగుగ నభిషే♦కార్థముంచిరి। పురియెల్లెడలను♦బాలుపునఁజూడగ । మురియుచుజనములు♦ముచ్చటలాడగ।నాకలకలరవ♦మటుమందరయను! కైకదాసి చక్కఁ ♦గ దావినియును । నెక్కమేడపై ♦ కొయ్యానెక్కియు । గ్రక్కున నాశ్చ♦ర్యంబునఁ జిక్కియు । రాముని దాదిని ♦ రయమునఁగనుఁగొని । భామినియిట్లని ♦ పలికెనుఘనముని.

మంద-కీర్తనము, జంఝూటి, ఆదితాళము.

ఏమది ! చెలి ! నామది ! కెరింగింపవమ్మ ॥యేమది॥
భామినిరో ! పట్టణము । నేమి, టిక, లంక, రించి ॥ేమది॥
కానగ ను, కౌసల్య । దాన, ముల, నిచ్చు, చున్న ॥దేమది॥
చేడియలు । నేడేమొ । వేడు, కలు, సేయు, చుండి ॥రేమది॥
భూమినిశ్రీ । మోక్షగుండ ! స్వామి, దయ, తోడఁ, చెల్పు ॥మేమది॥
తోహర. తన్నడిగినము, దరకారాముని । దాదియిటుల దానను । బన్నగరాముని । పట్టాభిషేకం । బెన్నగ రేపఁ వినెను ॥రామ॥
తందరనొందుచు । మందరకై కేయి । మందిమునకును జేరి । క్రిందటి కసిదీ, ర్చికొన సమయమని । తొందరపడియానారి ॥రామ॥
కేళిగృహమున వాలికమీదను। బూలపాన్పుపైజాల।లీలంతోషఁ బవ, ళించియున్నయా, లేమకనియెనవలీల॥రామ॥

మందర-కీర్తనము, కళ్యాణి, ఆదితాళము.

సరోజసమానముఖి ! భరింపగజాలసఖి॥ సరోజ॥

నరా, ధిపుం డరే, యరే, ధరి, త్రినెల్లరా, ముడే॥భరించక। వరించెక। బరోక్షుంబునక ॥సరోజా॥

నన్నుక, గనుం, గొనుక, బ్రియుం, విభుం, డనం, గనె, దినంబుక, ఘనంబుక వినేయుండుదుక ॥సరోజా॥

క్షమా, ధిప, త్వమె, ల్లసీ । కుమా, రుడూ, నమో, క్షుగుం, డమాన్యా, డుమీకుక । బ్రిమోదంబిడుక ॥సరోజా॥

త్రోహర. సేమీదను కసు, జ్ఞేమగలిగితే, కొడుకునుఁబోనాడి।

రామునకిచ్చునె, రాజ్యముదశరథ! రాజుకపటివగలాడి ॥రామ॥

వ. అనిన పలుకులు విని కైకాదేవి మందరను గసరివైచుచు నిట్లనియె. కయిక-కీర్తన, దర్బారు, అటతాళము.

రామునకియ్యగ। రాదటెరాజ్యము । గోమలినీకింత । క్రూర మెటులగలిగెను ॥రామున॥

ఘనముగఁగౌసల్య। కన్నకుమిన్నగ । గనుచుండునన్నును । గడు గుణవంతుడగు ॥రామున॥

ఈమేలువార్తనా । కెరిగించినందుకు। బేరిమతో ముత్యములఁ। దామమిచ్చెదగొను ॥రామున॥

భరతునకైననేమి । ధరమోక్షుగుండరఘు । వరునకునైననేమి। యిరువురొక్కటెనాకు ॥రామున॥

వ. అనిన మందర గటగటపడుచు నిట్లనియె.

మంద-తోహర. నీసంతోషము నీటనుగలియను। నీసుతుఁడెక్కువగాదా! ఈసువహింపవు।ఇంతమూర్ఖమా! ఇకనయిననువినరాదా॥రా॥

కీర్తన-పీలురాగము, ఆదితాళము.

తల్లితల్లి! భరతుని, తల్లి! ననుగన్న,తల్లి! వినుమీతల్లి! తెలిపెద తొల్లినన్ను నీ। తోగూడమీా, తల్లిదండ్రిలే । దాసిగబంపిరి॥త॥తడయక రాముని! ధరణిజనుని। కొడుకునుగోడలు। గొలువగవలదా ॥త॥ సవతి యయిన కౌసల్యకులోబడి । తివిరిదాసివై । తిరుగవలదేనీవు॥త॥ అక్షుణమేవారి పక్షమగునుపతి । మోక్షుగుండవిభు, సాక్షిగఁదెలిపెద॥త॥

తోహర. భరతునిదేశ। ప్రభుని జేయుమని। పదునాల్గేండ్లడవులకు। బరువడి రాముని। బంపుమనుచునీ। వరునడుగుము మేలుమనకు॥రామ॥

వ. ఇట్లుపలికినఁ ద్రివక్రవక్రోక్తులు విని యర్ధాంగీకారంబున.

కయిక- కీర్తన, ఆదితాళము.

ఏమనియడిగెద। నామనోనాథుని। రాముని గానన। సీమకంపుమని॥ఏ॥ అడిగితిబోన। న్నదలించునుగాని, చెడుకార్యంబును। జేయునటేసఖి॥ఏ॥

కైకమానసమెంత, కఠినంబనుచును । లోకులునన్నను । కోకను బోదురా ॥ఏమ॥ సాకూన్నారాయణ । రక్షకుడయినట్టి, మోక్షుగుండేశుడే! మోహాస రాముఁడు ॥ఏమని॥

ద్వి-అనియిటు పలికిన- నాకైకతోడ । ననియెనాసుందర యతి హర్షమునను। యువతిదేవాసుర-యుద్ధంబునందుఁ। దవిలి యేతెంచియు దమకుదోడ్పడఁగ। నిందుసుందుగోరిన-నేతెంచిదశర । థేంద్రుండు నీవప్పు డేగితివెంట। రథచీలయూడఁగ-రణమధ్యమందు, రథచీలగానీక, రంబుం చితబల। నీదుధైర్యమునకు, నృపుఁడలరారి।నీకుకోరిక దెల్పు, నేనిత్తు రెం డువరములననియెను, వలననేవింటి। మఱచితీవిప్పు.నే- మఱువఁగలేను। ఒక దానికినిరాము-నుగానటవులకు। బ్రకటితంబుగఁబంపఁ, బదునాలుగేండ్లు। మఱియొకదానికి- మనభరతునకుఁ గరుణతోఁబట్టంబుఁ- గట్టునట్లుగను। గోరుము నీకోర్కె--కొనసాగువిభుఁడు నేరవచ్చెను వేళ చెచ్చెరవచ్చె.

మంద-కీర్తన-బేగడరాగము-ఏకతాళము.

జవదాటకే, చానరోనామాట ॥జ॥ ధవళాక్షినీకోప । భవనము జేరుము ॥జ॥ అలివేణిసొమ్ము । లలంకరింపకు । మలినాంబరము। మాన నగట్టుము ॥జ॥ క్రిందబరుండుము । సుందరినాథుని । జిందరవందర । చేయుమునామాట ॥జ॥ మోక్షగుండేశుని । సాక్షిగబల్కెద। దీక్షతో నీకోర్కె । దీరునునామాట॥జ॥

తోహర॥ అప్పుడుకైకదాసి। యగుమందర తన, కుపదేశించిన కరణి। జపలతఁదోడుత। సలుపదలచికోప । సదనముజేరె యుదరుణి॥రా॥

భూమిపయినబడి।పొరలుచునుండగ। భూమీశ్వరుడేతెంచి।కామి నిబాన్పున । గానకద్వారకు । గనియడిగెను విచారించి ।రామ॥

కైకయేదిరా! కనబడలేదన । గారణమెఱుఁగనురాజా! ప్రాకట ముగగోప । భవనముచేరెను, బరికింపుడు మారాజ॥రామ॥

క. ద్వారకుఁడు తెలుపఁగానా
నారీమణివార్తఁదెలిసి ♦ నరపాలుండే
కారణ, మోయని పొగులుచుఁ
జేరగఁజని దేహమును స్పృ ♦ శించుచుఁబల్కెన్.

దశ-కీర్తన, ఆదితాళము.

ఇదియేమే! సుదతీలలామా! యిటుమళ్ళిచూడవే భామా ॥ఇది॥
కోమలి! నీకింత! కోపముగల్గుట। కేమిలోపమువచ్చె ॥ఇది॥
వెలలేనిచీరలు । విడిచియీరీతిగ । మలినవస్త్రముగట్ట ॥ఇది॥

కొమ్మరో! రత్నపు । సొమ్ములనెల్లక । నెమ్మదివగవగను ॥నిది॥
మృదుసుమతల్పము । వదలియాడిగువను । సుదతిపరుండగను ॥నిది॥
శ్రీమోక్షగుండ । స్వామియెసాక్షిగ । నీమాటమీరలేదే ॥నిది॥

తొహర॥ ఎవరయినను ని, న్నెగ్గులుపలికిన।వివరింపుమునాతోను।
భువిఁజెలులయినను। బురుషులునైనను। బొరిగొందునువ్యథమానను॥రా॥

నినుయాలించిన। నిరుపేదలనై। నను ధనికులజేసెదను। నినుదూ
రినచో । ధనికులయిన ని, ర్ధనులగునటుజేసెదను ॥రా॥

రామునిసాక్షిగ । రమణిరో ! సీతల । పేమాయినను నేదీర్తు ।
భామినిరో ! నా, ప్రాణములిమ్మని, పలికిననదియర్పింతు॥ రా॥

వ. అని దశరథుండు ప్రతిజ్ఞగాఁ బలికినవాక్యంబుల కలరి కన్నె
త్తిచూచి తిన్నగా లేచి గద్గదస్వరంబున నిట్లనియె.

కయిక-కీర్తన, అటతాళము, జంఝూటి.

మాటదప్పకు రాజచంద్ర ! కోటిసేయును నీకు, గుణముభూ
మిందరి! ధాటిగదేవని! శాటులయుద్ధము। నాటివరద్వయమీ।నాకువెర
వేర్పు॥మాట॥ ఒక్కదానికి భరతునకు। గ్రక్కునబట్టము, గట్టుకాదన।
తక్కకరెండవ। దానికిరాముని। నిక్కడనుంచక। సిలువెళ్ళనంపు॥మాట॥
దండకాటడవికేగుమనుము। దండిగబలునాలుగేండ్లుండుమనుము
ఖండితమిదియనా। కాంక్షితమగు మోక్షగుండ దేవునియాన। రెండవ
దిగోర॥ మాట॥

తొహర॥ పిడుగువంటియా। నుడుగుకర్ణములబడిన మాత్రము
ననపుడు। గడగడవడకుచుఁ । గడువడిమూర్ఛిలి । పడియె బుడమిపయి
నృపుడు॥ రామ॥

కొంతకాలమున, కును దెప్పిరితవ । చెంతనున్నకామినినీ । యెం
తయుగనితన । మంతనమెరయగ । జింతిల నవె న త్తతని ॥రా॥

దశ-కీర్తన, ముఖారిరాగము. అటతాళము.

కలికీ ! యిదియేమే ! నాతోనిటు । పలికిఫలమేమే ॥ కలికి॥
రామునిదండకావన । ములకుబంపుమటంచునాతో । నమకకను
కఠినాత్మురాలా ! పలుకనోరెట్లాడెనికుఁ ॥గలికి॥
నిరతముబొగడుదువు । రాముగుణ । నికరమెన్నుదువు । సరగ

నాకుపచారములుదా । సలుపునాకౌసల్యాశోడను । సరిగ ననుచుండు దువు నీవీవఅకునది యిపుడేలమరచితివి॥ కలికి॥

ధరలోదాళ్ళూరి । నారాయణ । దాసుకడ జేరి । వరములిడు శ్రీమోతుగుండని । వాసుడెదలోమెచ్చవలదా । భరతుఁడిలనేలినను రఘుపతి । పురములోనుండంగదగడా॥ కలికియిది॥

తోహర-అనియిటుభూపతి । యతినిష్ఠూరములాడిన వినియాకై క । మనమునగోపము। మల్లడిగొనగా। మగనిమాటగైకొనక॥రామ॥

కయికకీర్తన, యదుకులకాంభోజి- ఏకతాళము.

ననుగారించక మానుమా ! నాథా ! నాథా ! ॥నను॥

మనమున నిసుమంత । నినునమ్మగాలేను ॥నను॥

వేళా, కోళా । లేలా । మేలా । మనుజాధిపాల ॥నను॥

పలుమా, టలచే, ఫలమా ! యిల బొంకుల మా, రివిచాలు చాలు॥ నను॥

జలజాప్తా, న్వయజాతుల్, దెలియన్న, వ్వాలకైనన్। గలలోబొం కరునీవా, కులజాతుండ, వలమర్యాద, దలపోయంగ, వలదేనేను ॥నను॥

మనసొప్పింతు। బనిగావింతు, నినుమెప్పింతు, బహుమానింతు, ననుచునుమొద, టనునవి, తెలిఁపిన । వెనుకనువినసఁయుచర। వెతజెందెదవు ॥న॥

నాకన్నమిన్న, యగాకాంతలెన్న, నీకున్నవాసు, గాకేమియింక నీకావరంబు, లోకయికయీను, పోకాదటంచు, బోదోలరాదే, యీ కపటము, లిటుఘటియింపుచు ॥నను॥

సరగమోతుగుండేశు, సాక్షిగశ్రీరామునకున్ । ధరయిడినీదేవులతో । జిరసౌఖ్యంబులదేలు । భరతుడునే, నును మేనుల్, దొరగ దమా, తరువాతన్, నిరంతరము, సరాసరిగ, జరించినను, భరించెదరె, సరెసరే, ధరారమణ ॥నను॥

వ. ఇట్లు కయికమాట్లాడిన కఠోరవాక్యంబులకు బదులుచెప్పట కుఁదోఁచక దశరథుండు మహాదుఃఖాంబుధిలో మునుఁగుచు నారాత్రి నాలుగుయామంబులు నాలుగుయుగంబులుంబోలెఁ గడపుచుండెనంత నుదయమైన నక్కడ రామపట్టాభిషేకమందిరమున కందఱుఁజేరిరి.

ఆహా! యీదుఃఖంబున
కేహేతువోయనుచుం గైక నిరసులుఁజూచెరా.

వ. ఈప్రకారంబున నన్నుఁబిలిపించి మహత్తరమయిన దుఃఖాంబుధిలో దశరథుండు మునుఁగుచున్నాఁడదేమి! కారణముతల్లీ సద్గుణమతల్లీ, అనిన రామునకుఁ గైకాదేవి యిట్లనుచున్నది.

కయిక-కీర్తన, కాఫిరాగము, అటతాళము.

రాజుదుఃఖకారణంబు। రామ। తెలిపెద। దేజమలరనీకె చెల్లు।దీని దీర్పగ॥రాజు॥నాకురెండువరములిచ్చి నాడుపిమ్మట। శోకమొందుచున్న వాడు-చూడుమిచ్చట॥రాజు॥నరకములకు బాపితండ్రి, నరసిబ్రోచిన।వర సుతుండె! పుత్రుడనగ। బరగుజూచిన॥రాజు॥ఆడితప్పలేక యున్న- వాడు జనకుడు। నేనుమోక్షగుండనగర- నిలయుపలుకు ॥రాజు॥

వ. అనినఁ గైకాదేవి వాక్యంబులువిని రాఘవుం డిట్లనియె.

రాజు-కీర్తన, యదుకులకాంభోజి, అటతాళము.

జనకుని కార్యము, సలుపలేనట్టి యా, జన్మమేటికమ్మా ॥జన॥
వనభోక్తి, యిట్టిజీ, వనము గాంచెలివిమ, మైనదాప్రిగుటమేలు ॥జన॥
రాజాజ్ఞయైనను, రాజ్యమునైనను। భూజాతనైన విడుతు ॥జన॥
మోక్షగుండవిభు। సాక్షిగతత్త్వణా- మునవచింపుముతల్లీ ॥జన॥

తోహర. అనినవాక్యముల। కతిహర్షంబున। ననియెఁగైక రామునకు। దనయనరద్వయ। మునకొక్కటికిని। నినుబంపగ వనమునకు ॥రామ॥ కడచుదాసికీని। పుడమికిభరతుని। యొడయనిజేయగనడుగ। దడయక పితృ్య। త్వరమీయక దా। బడియున్నాడనినుఁ ఘన ॥రామ॥

నీకుఁ బట్టంబుగట్ట యత్నించుచున్న రాజునుజూచి భరతునకు బట్టంబు గట్టుమనియు రాముఁడు జటావల్కములుధరించి నిరాహారుండై దండకాటవులకే తెంచిపదునాలు గేండ్లుండవలసినట్లు పంపుమనియు నేను గోరినందుకు నిదివఱకు రెండు వరంబులు నాకు నిచ్చియున్నాఁడు గాన లేదనఁజాలక నిన్నుఁ బాసియుండలేక దుఃఖించుచు నీతో మాటాడుటకు లజ్జించియున్నాఁడు. కాఁబట్టి పితృవాక్యపరిపాలనముచేసి కీర్తివడయుము. కుమారా! సుకుమారా! శరీరజితమారా! అనిన కైక మాటలకామోదించి రఘునందనుండు.

రా-కీర్తన, అటతాళము, రామకృపా-వలె.

పోయెద బోయెద । బోయెద నాతల్లీ! హాయిగి నేదాపు । కాట విజేరగ । భరతునకీరాజ్య । భారనర్పించియు । బరువనిబిత్రు వాక్య, పాలనజేయగ ॥బోయెద॥ ధరణిమోక్షుగుండ । ధాముసాక్షిగ । నరమరలేకన । న్నంపుముమ్మాటికి ॥బోయెద॥

వ. ఇట్లు దృఢముగా రాముడు గైక కు బలుకుచున్న సమయంబున దశరథుండు మూర్ఛదేరి కుమారుని జూచి శోకావేశంబున.

దశ-తేవారము. హా! నాకుమారరామా! హా! త్రిలోకాభిరామా! మానుగరాజ్యమిచ్చి, మురలగైకొంటిహెచ్చి । నేను బ్రాంతాత్మకుండ । నీచవర్తనుడ జనుడ గానలకునంపనిన - ప్రాణములు నుండగలనా.

వ. అనిపలికిన దండ్రికినమస్కరించి యుత్తరీయంబుచే గన్నులయాముగాజు నీరుతుడిచి దుఃఖమడగ నుంచుచు రాముడిట్లనుచున్నాడు.

రా-కీర్తన-ఏకతాళము.

వగపేటికినాతండ్రి! వనములకుచుబనుపండి । తగబదునాల్గేండ్లుండి । తడయకవచ్చెదజూడి । తెండి, తెండి । జగతిశ మాటమీఱజూడండి ॥వగ॥

తమవాక్యము బాలింపక । దల్లికిబ్రియమునుగూర్పక । అమరులకార్యముదీర్పక । అలమునులసేవింపక । వేగ-బోగ - సముకూఱనాకు గానభావింపక ॥వగ॥

వరరాజ్యసుఖముకన్నక । వనవాసమధికమన్నక । భరతుని ప్రభువుగగొన్నక -బాలించునుగనుగొన్నక । వత్తుక-జొత్తుక । ధరమోక్షుగుండ దేవుకృపయున్నక ॥వగ॥

వ. అనియిట్లు దండ్రినూరడబలికి తక్షణంబున రామలక్ష్మణులు కౌసల్యమందిరంబున కరుదెంచిరప్పుడు.

సం-తోహార. శ్రీరామునకుచు । క్షేమముగలుగగ । గోదిబ్రాహ్మణులకెల్ల । భూరిదక్షిణలు । పొలుపుగనిచ్చుచు । గొదించుచుండె గౌసల్య ॥రా॥

నీకీర్తి మోక్షగుండ। పుర। సిలయసకలదిశలు వెలయుచుండ॥నా॥

వ. అని విప్రుండుగ్ర మహాగ్రహ సమగ్రుండగు నిగ్రహంబున నగ్రజుని యగ్రిభాగంబున నిలిచి పలికిన లక్ష్మణుని వాక్యంబులకలరి కౌగిలించుకొని యుపశాంతికొఱకు రాఘవుండిట్లనియె.

రా-శోహార. తమ్ముడని వ, తలటి శూనుడవే! సుమ్ము వేళగాది పు।। సమ్మతినోర్చుము। క్షణభంగుర దే, హమ్మును నమ్మకు మెపు ॥ రామ॥

పారహీనస, సారముం బడి। శాశ్వతమని న మ్మదరు। సారె కుబుట్టుచు। జచ్చుచునుందురు। జనులు భ్రమల బడెదరు.

రా-కీర్తన, బేహాగ్ రాగము, రూపకతాళము.

ఏదియు నిజమనుచునమ్మ రాదు వినుము సోదరా! నాదమేలనింద్ర జాల, వతుగాదా సోదరా॥యేది॥ మనముభోగ ద్రవ్యపాన। వనితాదివి షయభోగము। లనయము మేఘుస్థ సౌదా। మనివిధముగ దెలియుము॥యే॥

కాలిన యినుము పై జల, కణము పడి నశించిన, పోలిక ప్రతిక్షణ మాయుప్పోవు దరిగి కాంచిన ॥ నేదియు॥

సత్యమనుచు మోక్షగుండ, స్వామియొరుక లేకను, మృత్యుపాలై యమబాధ,। మిడుకుచుండ రేమోను ॥యేదియు॥

గీ. పాము నోటంబట్టు ♦ వడియు నీగనుగప్ప
దినంగం బూనినట్లు ♦ దినముంగాల
మనెడు పాము మ్రింగు ♦ టరయక యస్థిర
భోగములను బొందం ♦ బూనుచుంద్రు.

క. కలవంటిది స్త్రీభోగము
కలిమియు మైనిడసమము ♦ గదయౌవనముల్
జలబుద్బుదమనవచ్చును
తెలియక జీవులుభ్రమింతురి ♦ దృఢమా యనుజా.

క. దేహాత్మబుద్ధిచేతను
మోహించినజనులకెల్ల ♦ మోక్షములేదప్పుర్
దేహేంద్రియ ముఖ్యమ్మెవి
మోహాదులం గెలువవలయు ♦ ముఖ్యముతి యిదియుం.

రా-తోహర. క్రోధముచేనడ, గుణు మోక్షంబును । క్రోధ
ముచే మదిగలగు । క్రోధముచేహింత, గురు పితృభ్రాతృల-గూల్చుతలపు
తాగలుగు ॥రా॥

క్రోధముచే నెన, గూడునుసంసృతి- క్రోధమెధర్మక్షయము ।
క్రోధమువదలిన-గోరికలెల్లను-గొనసాగును నిదినయము ॥రామా॥

సంతోషమంబే! నందనవనమగు । శాంతి కామధేనువగు । శాం
తివహించిన, సజ్జనపాలికి-శత్రువులెవ్వరో! యెరుగు ॥ రామా॥

క. కాల్పన దేహేంద్రియముల
కానలవెల (గొందునాస్వ ♦ యంజ్యోతిస్స్వ
భావింపుచునారబ్ధము
వేవేగమెప్రాజ్ఞుడనుభ ♦ వింపగనలయుర్.

గీ. ఎంతపర్యంతమాత్మను ♦ నెఱుగలేడో!
యంతదాకభ్రమించుదే ♦ హాన లంపడ
గానసయ్యాత్మనెఱిగిన ♦ వాడికెందు
ద్వేష రాగంబులుండవు ♦ స్థిరమువత్స.

తోహర. అనుజునకీరీ, తిని బోధించియు-నాతల్లికి నిట్లనియెన్ ।
ననుదీవించియు-వనములకనుపుము-మనమున వగనకుమనియెన్ ॥రామ॥

వ. ఇట్లుపలికినఁ గౌసల్య సమ్మతించి యరణ్యప్రవాసంబులం
దుఁ బ్రయాసము లేకుండునట్లుగఁ ద్రిమూర్తులు సంరక్షింతురు గాక
యని దీవించిన నపుడు లక్ష్మణుఁడన్న కిట్లనియె.

ల-కీర్తన, ఆదితాళము, తంగంమెట్టు,

శ్రీరామచంద్ర! కారుణ్యసాంద్ర! ధీరనాసంశయము! రాఘవా
తీరెను నిశ్చయము॥శ్రీరా॥నీసేవమాని । నేనుండలేను। నీవెంటనేవత్తును
రాఘవా! నీవువద్దనబోకుము॥శ్రీరా॥ రావలదన్నను! ప్రాణములొల్లను!
వేవేగమోక్షగుండ! రాఘవా! దేవర నీసాక్షిగ ॥శ్రీరా॥

వ. ఈ ప్రకారంబునఁ బల్కిన లక్ష్మణునకు కూడవచ్చుటకు
రాముడు సమ్మతించి యీవార్త దెలుపుటకు సీతాదేవి గృహంబున
కరిగినఁగాంచి యర్ఘ్యపాద్యంబులర్పించి యిట్లనియె.

సీత-తోహర. శ్వేతచ్ఛత్రము-వివిధవాక్యములు-వెలయఁగికేఁగా

దులును। ఖ్యాతిగవచ్చిరియొ. కాండవిపులరా- హేతుకేశవలెననెను॥ రా॥

రా-త్రోహార. దండకాటవికి-దరలనలెనుము. తండ్రియాజ్ఞ చేన బలు। దండిగమీయు। త్వన సేవింపుచు। నుండు నింట బహువిధుల ॥రా॥

వ. అనిన.

క. ఏకాంగ్రణమున భూమిభుఁ
డాకానల కేగుమనుచు నాజ్ఞాపి చెన్
నాకును వివరింపుమనన్
గాకుత్స్థకులుండు తెలిపెఁ గాంతామణికిన్.

చ. భరతుని రాజ్యకర్తగను బట్టముఁగట్టగఁ దండకాటవిఁ
దిరుగఁగ నన్నుఁ బంపునటు నీరతఁ కైకకోరగ నా
వరములు రెండు భూవిభుఁడ వారికినిచ్చెఁ జతుర్దశాబ్దముల్
జరిగినవత్తుఁ గ్రమ్మఱను జక్కఁగ నింట వసింపుమీవనన్.

సీత-కీర్తన, శంకరాభరణము, ఆదితాళము.

ఔనౌనుమీమాట। యాశ్చర్యకరముగు। గానల బ్రదుండ। నేనింట నుందునె॥ఔనౌ॥ఇద్దర మొకచోట - నుద్దికనుందము। బద్ధనశోకము-వచ్చెదనీవెంట ॥ఔనౌ॥ పతిసేవకన్నను - బాగులేని యున్నవి। క్షితినారాయణకవి, నుత మోక్షగుండేశ ॥ఔనౌ॥

వ. అనిన శ్రీరాముఁడు.

రా-త్రోహార. కంటకంబులును - కఠినపు శెలలును - గలవ్రనసువ గాలేవు-వంటకమబ్బదు-ఫలములుగడ్డలు-భక్షింపగ వలెనుసుమ ॥రా॥

ఘోరరాక్షసులు। కూరమృగంబులు-గోరితిరుగుచునట వినుము। నారీమణికా-ననములకురారా-నేరవింట నెనిలుము ॥రా॥

వ. అనిన సీతాదేవి విలాపంబున నిట్లనియె.

సీత-కీర్తన, హిందము, తోడి, ఆదితాళము.

గడియయినగాని మిము, విడువగజాలవిభో! అడవులమీతోనుంటనది యింద్రభోగముగు॥గడి॥ మీరారగించినంత। మిగిలిన ఫలములాను। లారగించిననవి, యమృతోపమానముగు॥గడి॥తమతోడసంచరింప దర్భలు కంటకములు। శ్రీమతేకమృదుపుష్పలయి-రాజిల్లునాయక ॥గడి॥

నేరాకమానవిక। నారాయణాఖ్యనుత। ధారుణిమోక్షుగుండ। ధామ
శ్రీరామరామ॥గడి॥

క. మనుజ్యోతిష్కులువలికిరి
తనపతితో నడవికేగు ♦ ధరణిజయనుచున్
ననురానియ్యనిచో నా
ఘనులాడిన మాట కల్ల ♦ గాదె నృపాలా!

సుగ్రీవం. ననురానియకే ♦ నాథ! మీకేగిరన్
బన్నుగాదేహమున్ ♦ బాతునేనిక్కమా
పన్న సంరక్ష! నా ♦ ప్రాణముల్ నిల్పవే
తిన్నఁగానాదుసం ♦ దేహమున్ దీర్పవే! అని.

సంధ-తోహ. ఈమాడ్కినిసతి-వేమఱువేడిన-రాముండిట్టులనె
లలనా! నీమదిగనుటకు-నేనంటినిగాని-నిన్ను బాయగాగలనా! ॥రా॥

దండకాటవికి - దరలినానెంబడి యండజాక్షి! నీవురమ్ము-దండి
గనాయరుం, ధతికిహారములు, దగనుపాయనము లిమ్ము ॥రా॥

వ. ఇట్లు సీతవచ్చుటకు సమ్మతించి వేదవిదులగు బ్రాహ్మణుల
కును దక్కిన సమస్త జనంబులకును దరిద్రహతంబగునట్లు షోడశమహా
దానంబులవారిగ శ్రీరామ లక్ష్మణులిచ్చిరి. సీతా, కౌసల్యా, సుమి
త్రలు గూడ నరుంధతీలోనగు సువాసినుల కభీష్టవస్తువులు దానంబు
సేయుచుండిరప్పుడు.

సంతో. త్రిజటాఖ్యుండగు - ద్విజుండొక్కండు ద, రిద్రింబునఁ
బాధితుడై । నిజకుటుంబమును, నిర్వహించుకొన, నేరక యున్నాతు
మడై ॥రామ॥

గీ. హాలికవృత్తిని ♦ జీవనమాచరి పఁ
దలఁచి గుద్దలినాగలి ♦ దలనుమోచి
కొనుచునేగి స్వయంకృషి ♦ గోరిచేయ
నతనియిల్లాలుతత్తణ ♦ మచటకరిగి.

కీర్తన-త్రిశ్రజాతి, సతతంబుసు.

సాక్షిణనాయక! ఫలమేమి । నీకిక ॥సా॥
మేను, సుడిన, డగ-మిగులశ్రమల నలయగ నేటికి ॥బా॥

అగ్రిజాతినిబుట్టి - యన్యవృత్తికిజొచ్చి - తీ గ్రిహాచారము - నేమందు నయ్యయో! ॥పా॥

శ్రీరామచంద్రుండ, వారిగదానము, లీరాతివిప్రుల । కిచ్చుచున్నాడట ॥పా॥ నీపేరువివరించి । నీలేమివచియించి - మాపేరు వివరించి - మఱియు యాచింపుము!॥ పా॥ శ్రీమోక్షగుండేశు-డామహనియ్యుడు-నీమనోభీష్టము । నెరవేర్చుఁబోపమ్మ ॥పా॥

సం-వ. అనిపలికిన భార్యమాటల కియ్యకొని.

కం. వ్యవసాయపుఁ బనిముట్లను
నవతలఁ బాఱంగవైచి ♦ యాతురమున రా
ఘవ లక్ష్మణులుండినయెడ
కవనీసురవర్యుఁడరిగి ♦ యతివినయమునన్.

త్రిజట, కీర్తన, ఆదితాళము.

రామచంద్రమహాప్రభో! నామొరప్రేమతో విసుమా॥రామ॥ నేమహీసురుఁడ నిత్యదరిద్రుఁడ । స్వామిత్రిజటుడను నామమువాడను॥ దారపు, త్రులకున్, నిరతము । కోరినట్టుగనుగూడును గుడ్డయు, గూరిచిపెట్టుట భారమయ్యెను ॥రామ॥

నాదరి, ద్రముదీ, రగదమ । రాదరించి యి, ష్టార్థపదార్థము । లీఁదగుమోక్షపు, రీశ వేడెదను ॥రామ॥

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె.

రా-తోహ. అన్నిపదార్థము, లయిపోయినవిక। నావులమందలు గలవు। ఎన్నగరాతిని। వేయుమంతవఱ, కిచ్చెదఁగైకొనగలవు॥రా॥

వ. అనిన భూసురపుంగవుం డాశాపాశబద్ధుండై లేచి.

సీ. కుడిభుజమ్మునవ్రేలు♦కొల్లాయిగుడ్డను-బిఱ్ఱబిఱనడుమునుపై♦బిగియఁగట్టి
దోవతిపైకెగ ♦ దోపి జుట్టువిదిర్చి కుఱుచగాశిఖముడి ♦ గుదురవైచి
నరములలోకిఁ♦ప్రాణంబులుగుదెవట్టిపాణియందొక్క పా♦షాణమూని
కేక వేసియుఁబిడి♦కిలిఁబెట్టుగాఁద్రిప్పి యెదమీఁదజంపె ♦మట్టెట్టుదూల

గీ. నెమ్మదినిరామమూర్తిని ♦ నిలిపిపొగిడి
జూచువారలు రాముఁడు ♦ జోద్యమందఁ
బ్రదుకుజీవనమిదియని ♦ బ్రాహ్మణుండు
తనబలంబున నరయుప ♦ దాఁకసైచె.

వ. ఇట్లుత్రిజటుండు సరయుపుదాటక రాజువేసి యంతవఱ కుండు నావులఁ గొనిన రాముండచ్చెరువొంది యిట్లనుచున్నాఁడు.

రాము-తోహర. పన్నుగ మొదవులఁ-బదినూర్లిచ్చెద- బాపడ! కోరుమనంగఁ। జన్మమునకునతి - శయమగునట్టి - మ్మన్ననిచ్చిపను పంగఁ॥రామా॥

వ. అవియన్నియుఁగొని సంతోషంబున దారాపుత్రులఁగలిసి తననెలవునకుఁజని సుఖంబుగానుండె. ననంతరంబున ధనుర్బాణధరులయి రామలక్ష్మణులు సీతతోఁగూడ కాంతారంబునకుఁ బోవ నిశ్చయించి యనుజ్ఞకొఱకుఁ దండ్రిగృహంబున కరుగుచుండఁ బురజనంబులు గట కటపడుచుఁ దమలోన.

పౌరుల-కీర్తన, రూపకతాళము, హిందూస్తాని.

కైకకోరిన వరములెంత। శోకకరములు।వీకనెటులదిరుగుదురు విపినపథములు॥కై॥ సీతసుకుమారి నడువ। జేగాదుగా। థాతవ్రాత వాపనేటి - తరముగాదుగా॥కై॥ ఈక్షితిదప్పింపరైరి యెవ్వరైనను మోక్షుగుండ వరనగరా, ధ్యక్షుడయినను॥కై॥

వ. అని పరస్పరంబు జెప్పుకొనుచు వగచు పురజనుల దుఃఖ నివృత్తికొరకు వామదేవుండను ముని యిట్లనియె.

వా-తోహర. మునుపుదశరథుఁడు, దననుగూర్చితప- మొనరింపగ హరిమెచ్చి। కనబడినీకేమి। కావలెననసీవు। దనయుడవగుమననిచ్చి॥రా॥ రాజుకోర్కెదీ, రగనుదయించెను। రావణాదులనుద్రుంచుఁ। దేజమలర ముని-దేవతలనుగడ-తేర్చివేగఁబాలించు॥రా॥

వా-కీర్తన, ఆదితాళము, పరమపు.

ఆదినారాయణు, డగునీరాముడు। నాదిలక్ష్మిసీత-యనికనుడు। ఆదిశేషుడే! యగులక్ష్మణుడు। మేదినిబుట్టియుమెలగుచురు॥ఆ॥కరుణతో డమీన, కమఠవరాహనర। హరిశ్రీవామన-పరశురామ। వరరూపము లీ, వఱకుదాల్చిరఘు-వరతనువిప డు-వడసెనుచూ॥ఆది॥

అక్షయప్రకృతి- లక్షణుడీతడు- మోక్షుగుండపుర - రక్షకుడు। రా, క్షసగణముల-శిక్షయొనర్పగ। నీక్షితిబహురూపు-లెత్తుచుండు॥నా॥

వా-తోహర. ఇతనిగూర్చిమీా, కేల। వగచెదరు-ఇతడుపరాత్పరుడనుచు । సతతముదెలిసియు, సన్నుతిసేయుడు । సద్గతినిచ్చుచుమనుచు॥ రా॥

స-తోహర. అనవుడు రాము మహాత్మ్యమెఱిఁగి యా జనులగ్గించిరి యంత। జనకుని సెలవును-గొనజనికైకను-గనిఁ పలికెను నా చెంత॥ రా॥

క. సీతాలక్ష్మణయుతముగ
నాతల్లీ! ఘోరవనావ ♦ నంబులకును నే
నేఁ బోతును నీయాజ్ఞను
నాతండ్రికిఁ జెప్పవచ్చి ♦ నానుగదమ్మా!

ద్వి. అని యిట్లు చెప్పిన-నాకైక లేచి। ఘనముగా రాముల, క్ష్మణ సీతలకును। నారచీరెలుదెచ్చి-నాతి వేక్వేఱ। వారలకిచ్చిన-వరుసతోనంది రామలక్ష్మణులువ, స్త్రములువర్జించి। శ్రీమీరఁదాల్చిరా, చీరలుసీత। గట్టంగలేకున్నఁ-గాంచిరాఘవుఁడు। గట్టంగఁబూనెన, క్కడనున్న రాజ। వనితలుమొదలైన-వారుదుఃఖింప। గనివసిష్ఠుఁడువల్కెఁ-గైకతోఁ గనలి॥

వసి-తేవారము. ఏమి! దుర్మార్గురాలా! ♦ ఇంతకాఠిన్యమేల! రాము బాయంగలేక ♦ రమణిపోవంగఁగైక! భూమిజకుజీరనిడఁగఁ బోలునే ♦ నీకువశిగ । నీముఖంబరసినంత ♦ నిరయమే తెంచుఁగాంత॥

వసి-కీర్తన, కన్నడరాగము-రూపకతాళము.

ఇదినాయమనీకుఁ-జాతకి!॥యిదినాయ॥ ఇటుఁ జేయంగదూష్యమని। తల, పోయలేక-కావించితి॥విదినా॥

మిడి-మాలమేల! యింత-నర-పాలచంద్రునకును। సను-కూలవతివిగాక। మది, జాలినొంద । గావించితి॥విది॥

రఘువీరుబాయలేము । చను-దేరగలము వెంట। మన, సారసాదుమీద । శా, దూరిలోనసీ! వుండుము॥ఇది॥

తన-తండ్రితోడగూడి। భర, తుండుమోక్షుగుండ। పతియుండఁజేయుగాక। నీ-పుండుచోటదా । నుండునే॥ఇదినా॥

వ. అని వసిష్ఠుండు కఠినముగాఁబలుకుచు ధరాపుత్రిమకూలాంబరాభరణంబులు ధరించిపోవునటుల నిరూపించెనంత రాజు కైకదిక్కుఁజూచి శోకకోపంబులు మల్లడిగొన నిట్లనియె.

దశ-కీర్తన, హిందూ, తోడి-రూపకము.

అడిగియుంటివా! న, న్నడిగి॥ పుడమిజాతలక్ష్మణుల । నడవికను పగ॥నడిగి॥ హానివృద్ధులు।గాన, వైతివయ్యాయో! మానుషాకారమున నున్న । దానవపురాలా! ॥అడిగి॥ చీరలియ్యగా । నీకు । జేతులాడెగా । నారి మోక్షగుడ పుర, నాథుసాక్షిగ॥నడిగి।

సం-తోహ. అని నిష్ఠూరము,లాడి భూషణములనుమఱి నువ్వులవలును। జనకజకిప్పించిన ధరియించెను।దనపతియనుమతమునను॥ రా॥

వ. అంత సీతాలక్ష్మణసహితంబుగా రాముండు మున్నూట యేఁబదిమందితల్లులకుఁ బ్రదక్షిణనమస్కారముఁలాచరించి సుమిత్రం జేరి నిలిచిన నామెకొంతవడికుఁ జింతించి పిమ్మట లక్ష్మణున కిట్లనియె.

క. రాముని దశరథునిగఁ గను
భూమిజనను,గాఁగ గనుము ♦ భూరివిపినముల్
శ్రీమదయోధ్యగఁ గనుఁగొను
సౌమిత్రి! నీకు నొదవు ♦ సకలశుభంబుల్.

వ. అనిపలికి శ్రీరామునింగని.

సు-గీ. నీకుసోదరుండు ♦ నీకు నమ్మినబంటు।
నీకు సేవకుండు ♦ నీకుహితుఁడు
నీకు మేలుగోరి ♦ నీవెంటవచ్చును
నడవులందుఁగరుణ ♦ నరసిబ్రోవు.

వ. అనియొప్పగించిన మంచిదని రాముండు సీతాలక్ష్మణులం గలసి పోవుచుండ నప్పుడు.

సం-తోహర.

మనుజేసుండు సు,మంతుని గనుగొని।మనయరదముఁదెమ్మనగా। చని యాతఁడు దెచ్చినఁ బిత్రాజ్ఞను-జనకజ నెక్కించెనుగా॥ రా॥
గ్రక్కున తండ్రికి-మ్రొక్కి- రామల,క్ష్మణులు ధనుశ్శరములతో నక్కజముగ రథ, మెక్కియుఁబోని, మ్మనిరి సుమంతుని ధృతితో ॥రా॥

వ. ఇట్లతివేగమున రథమువిపినమార్గంబువట్టిపోవఁ బౌరులంద రొక్కమ్మడి రథంబుఁజుట్టుకొని నడుచుచుండిరంత దశరథుండు దుఃఖాతిశయంబున నడువనోపక బహిర్ద్వారంబున నిలచి చెయ్యెత్తిపిలుచుచు.

తేవారము:-నిలుపు నిలుపోసుమంత! ♦ నీకుద్వర మేలనింత! నలసితిని నింకనవల ♦ నడుగు బెట్టఁగజాలఁ। జెలియింతో నాకుమారు ♦ చెలువ మింకొక్కమారు। బలు ప్రియంబుననుగాంచి ♦ పంపుమను సమ్మతించి.

గీ. రథము నిల్పుమటంచును ♦ రాజువలుక
రథముఁబోనిమ్మటంచును ♦ రాముఁడనఁగ
నంచ కాతండు రథముఁసాఁ ♦ గించుచుండె
నంతబలికె వశిష్ఠుఁడ ♦ య్యవనిపతికి.

తోహర. శోకింపుచు నీ, సుతునిబంపఁగా। నీకుఁదగదు వినవయ్యా! ఏకాలమునకు-నేదిప్రాప్తమో! యెవరికెరుక కినుమయ్యా॥ రా॥

సం-తోహర.

పదపదమని భూ, పతినిగాంతలఁను। సదనంబునకును జేర్చె। సదయుడగుచుఁగా, సల్యాదులఁదా। విదితుఁడగుచు నూరార్చె॥ రామ॥

వ. అంత నయోధ్యకుఁగోశమాత్రంబునందున్న తమసానదీతీరంబునకు నారాత్రి శ్రీరాముఁడుసేరి యక్కడ విశ్రమించి యక్కడివలకుఁ దనతోఁగూడ వచ్చిన పురజనులఁగని యిట్లనియె.

తోహర. భరతునిఁ గొల్వుఁడు! పురికిని జేరుడు! బహుదూరము వచ్చితిరి! బరువడిబొండని - పలికినరాముని, బాయలేక యిట్లనిరి॥ రా॥

పౌరు-కీర్తన, రూపకతాళము, తాప మొందగ.

మిమ్ము బాయగజాలము-మేమువత్తుము। రామ! నెమ్మదితో వెంబడిరానిమ్ము వేగము। రామ!॥ మిమ్ము॥ మీరువిహరించినచోటే! యూరగు మాకు-రామ! మీరు లేనట్టిచోటే! కారడవిమాకు। రామ!॥ మిమ్ము॥ భరతునితోఁబనిమాకేల! బట్టణమేలా! రామ! తరుణీసుత భ్రాతృధనధాన్యము లేల! రామ!॥ మిమ్ము॥ కూడ రావద్దన్న మోక్ష-గుండనాయకా! రామ! నేడుమాప్రాణములుమేన-నిలుచునే! పోక। రామ!॥ మిమ్ము॥

వ. అనిన వారల నిశ్చయంబెరింగి వారినేమరించి పోదలంచి యాకిటుకు సుమంతునికిఁ దెలిపి యందఱిని శయనించుఁడని చెప్పిచొక్కఁజల్లినట్లందఱు నిద్రింపుచుండ.

సం-తోహర. అర్ధమరేయిని-ననుజాదులతో-నరదమునారోహించి। తద్దయుసాకే, తమునకుఁబోయెడు దారిఁబట్టుకొని నడచి॥ రామ॥

ఇంకొకదారిని-నేగిరి యడవికి-నెవరికెరుకపడకుండ। శంకలేక దమ, సానదిదాటిరి సరయువుదాటిరి యిచట॥ రామ॥

వ. ప్రాతఃకాలంబున.

ఉ. పౌరులు మేలుకాంచి రఘు ♦ వర్యునిగానక చింతనొంది తా
మారథనేమిమార్గమును ♦ నారసిచూడ నయోధ్యదిక్కుగా
బాఱినయట్లుతోఁచిన శు ♦ భంబనియూరికిఁ బోయిరాముఁడుం
జేరకయుంటకైవగచి ♦ చెచ్చెఱనిండ్లకుఁ జేరిరందఱుం.

సం-తోహ. అంతటనాసా, యంత్రికి గంగా,ప్రాంతములకువారు జనుడు।సంతసమున నచ్చటనున్నట్టిని,షాదనాయకుడు గుహుడు॥ రామ॥

క. ఫలములుఁ బుష్పలుఁదేనెలు
నెలమిని గానుకలుగొనుచు ♦ నెదురుగఁ జనిసా
గిలిపడిదండములిడి కే
వలభయభక్తులొదవ రఘు ♦ వర్యునకనియెం.

ఉ. నేను నిషాదవర్యుఁడను ♦ నిక్కముదెల్పెద శృంగిబేర సం
స్థానము నేలుచుందుదును ♦ సజ్జనవంద్య! గుహాభిధానుఁడం
గానలకేగమీరిటకు ♦ గ్రిక్కునవచ్చుటెఱింగియుంటిగా
నానిలయంబునం నిలిచి ♦ నన్నుఁగృతార్థుని జేయుదేవరా!

గుహుని, కీర్తన, అటతాళము, ఒకదివ్య.

స్వామి! నాజన్మము-సార్థకమాయె! భూమిపైనాపాప, ములు గూలిపోయె॥ స్వామి॥ ఈనిషాదరాజ్య-మేలుదేవా! నేనుసల్పుచునుందు. నీపాదసేవ॥ స్వామి॥ కందమూలాదులు, గలప్రమాయింట। విందుగా గొనుము నే-విందునీబంట॥ స్వామి॥ మోక్షగుండధామ! మునినుతనామ సాకూన్నారాయణ-రక్షశ్రీరామ! ॥ స్వామి॥

వ. అనివలికిన గుహుని వినయవాక్కుల కలరి రాఘవుండిట్లను చున్నాఁడు.

రా. ఉత్సాహవృత్తము. దండకాటవులకు నేగి♦తాపసులనుగూడి ల। వుండుమనుచుఁదండ్రి వనుప♦నొప్పివచ్చినాడ నేను డఁదగదు గృహములందు♦ నూళ్ళయందుగాపునం। ఖండితముగ నేటిరాత్రి ♦ గంగదరిని నుండెదం.

వ. ఇట్లు తెలిపి సీతాసహితంబుగా జలపానంబుఁజేసి గుహుని చేనిర్మింపఁబడిన కుశపర్ణాస్తరణంబున శయనించినిద్రింపుచుండ లక్ష్మణుండు ధనుర్బాణధరుఁడయి శ్రీసీతారామచంద్రగురుప్ర నారాధింపుచుఁ బదునాల్గేండ్లవఱకు నిద్రాహారములు వర్జించియుంత నిశ్చయించి నిద్రాదేవిని స్వాధీనముచేసికొని తానుదిరిగి యయోధ్యకుఁజేరునంతరు నూర్మిళయందు రెట్టింపుగానుండుమని యాజ్ఞాపించి రామునికి వచ్చినయిడుముల గుఱించి గుహునితో నిట్లనిచెప్పుచున్నాఁడు.

లక్ష్మ-కీర్తన, కాంభోజ, ఆదితాళము.

ఎంత! చెల్పుదురాసఖా!. వీరలకష్ట మెంతనికాంతునుర । ఇంతకుమూలముకైక । వంతలపాల్ సేసెగదరా యెంత॥ కాంచన పర్యంకమున । సుఖముగశయ । నించు వీరికింతలోన । నెంచగ సినేలబవ । ళించగవలసెనయ్యో!॥ యెంత॥ పట్టుపీతాంబరములు । శృంగారముగ । గట్టుచుండెడి వీరలు । నెట్టననారచీరలు । గట్టగవలసె! నయయో!॥ యెంత॥ ఎండకన్నెరుగరుగా । శ్రీకరమోక్ష । గుండవాసునినాత్మిగ । దండగ గారడవుల । నుండవలసె! నయ్యో!॥ యెంత॥

వ. అనులక్ష్మణుని దీనాలాపంబులువిని గుహుండిట్లనుచున్నాఁడు.

గు-శ్లోహార. పూర్వజన్మకృత । పుణ్యపాపమునఁ । బొదలును సుఖదుఃఖములు.। సర్వముగుడువగఁ । జనుజీవులకును । స్పష్టమివియు స్వకృతములు.

అనుభవింపకను-నజనకునైనను-నాముక్కంటికినైన । ననుపుగ నారాయణమూర్తికినైన । ననుదప్పునె । భువిలోన॥ రామ॥

క. పగలురగ రాత్రి నిశివ్రా
వఁగఁబగలును, వచ్చునట్లు ♦ వర శాఖ్యము వ్రా
వఁగ, సుఖము ♦ దుఃఖము వ్రా
వఁగ, సుఖమును, జీవతతికి ♦ వచ్చుచునుండుఁగా.

క. జలమునుబంకమునొకటిగఁ
గలిసియభిన్నముగ నున్న ♦ గతి సుఖదుఃఖం.
బులుఁ రెండుఁగూడి యుండియుఁ
బొలుపుగ నేదజ్ఞునొకటి ♦ పొందును దేహిఁగా.

గు-తోహర. కావున సుఖదుః, ఖములను సమముగ। భావింతు రుధీవరులు । భావములోపల-నీవుపరికొంట। కైవసకవుమికజాలు॥ రామ॥

అని వారిరువురు-ననుకొనుచుండగ-నంతదెల్లవారగను । జనకత నూజా-సహితముగనురామ-చంద్రుఁడు మేల్కనితగను ॥రామ॥

ఉ. రాముఁడు మఱ్ఱిపాలుగొని ♦ రమ్మనియా గుహునంప నాతఁడుం
ధీమతిఁదెచ్చియీయగను ♦ దీవ్రముతో జడలుంధరించి మ
మ్మామహనీయగంగఁ దరి ♦ యింపఁగఁ జేయుమటన్న నావఁదే
గా ముగురెక్కరాదరికి ♦ గ్రక్కునఁ జేర్చె నిషాదభర్తయున్.

వ. ఇట్లద్దరిజేరినపిదప నడవికి మీతోగూడి వత్తుమని కోరిన సుమంత గుహులనూరార్చి సుమంతుని నయోధ్యకుబొమ్మని సెలవిచ్చి మేమీసారివచ్చు నంతకు మారాకఁగోరుచు శృంగిబేరంబున నుండు మని గుహుని వీడ్కొలిపి గంగాభవానికి సమస్కరించి శ్రీసీతారామ లక్ష్మణులు గంగనుబొగడి యనంతరంబ.

గీ. అచ్చటికియోజన ♦ త్రయమైన యట్టి
యాభరద్వాజమునియుండు ♦ నాశ్రమంబుఁ
జేరెరాఘవుఁడనుజాత ♦ సీతలరసి
యరుగుదేరఁగనాటె సా ♦ యంత్రమునకు.

సం-తోహ. రాముని రాకభ, రద్వాజుఁడుగని। ప్రేమను నెదురుగ నేగెన్ ।శ్రీమహిళాపతి-గామదిదెలిసియు। వేమఱుబొగడగసాగెన్ ॥రా॥

భరద్వా-కీర్తన, దర్బారురాగము, రూపకతాళము.

శ్రీరామా! శ్రితకామ! శివశంకరజపనామ ! క్షీరాంబుధివరత ల్పక! ఘోరాహిత! ధారధర! మారుతసమ! ॥శ్రీ॥ నిభక్తులరక్షింపగ భూ భారముబరిమార్పగ । నీభువిలోనుదయించిన! । నీభోగము-వేభం గుల-నేబొగడెద॥ శ్రీ॥ నారాయణకవిపాలిత। శౌరిమోక్షగుండేశ్వర !। నీరాకయు మేలాయను, ధీరాత్మక। కోరికలీ, డేరెనుగద॥శ్రీ॥

క. అనివేఁడి పర్ణశాలకుఁ
గొనిదెచ్చియుఁ బూజసేసి ♦ గురుతరభక్తిన్

వినమితుఁడయి కొలువఁగ నా
దినమచ్చటనిలిచి యబలు ♦ దేరెనుబిదపన్.

వ. అంత రాముండు భరద్వాజుని వీడ్కొని యమునానదిదాటి చిత్రకూటాద్రికిఁ జేరిన నందుఁదపంబు చేయుచున్న.

సం. తోహ. వాల్మీకుండను-వరమునిచంద్రుడు-వారలగనుగొనె నంత। బేర్మినిలక్ష్మణ।సీతారాములు । సెలగిమ్రొక్కి-యనిరంత॥ రామ॥ తండ్రియాజ్ఞచే - దరలివచ్చితిమి-దండకావనికినరుగ । దండిగగొన్నా-ఖ్యండగ సుఖమగు-తావుదెలుపుడనసరిగ ॥రామ॥

వా, కీర్తన-ఆదితాళము, నీసను.

నీవుండనితావులేవీ! యేవీ! నీవెఱుంగని తావు-లేవీ! యేవీ!॥నీ॥ స్థావరజంగమ-స్థలములలోపల । వేవేగంబున-వెతకినగాని॥ నీవుం॥ అంత ర్బాహ్యము, లందునాదిమ । ధ్వాంతరహితమై-యలరుచునిండి ॥నీవుం॥ నానామాని వి, తానహృదయ సం। స్థానంబున వి, జ్ఞానరూపమై॥నీవుం॥ మోక్షగుండపుర, రక్షణప్రకృత వి।లక్షణయంత, ర్లక్ష్యవశ్యమై॥నీవుం॥

క. ఏనామస్మరణంబున
నేనమలుఁడనైతినో! గ ♦ ణింపఁగ నదిఁగు!
నీ నామసత్ప్రభావము
దానిని దెలియంగ నెవరి ♦ తరము మహాత్మా!

వ. తొల్లి నేను జాతిమాత్రంబున విప్రుండనయ్యుఁగిరాతవృత్తిచే గిరాతకులంగలసి జీవహింస చోరకర్మాది వృత్తులచేఁ బ్రవర్తింపుచు బ్రహ్మర్షుల యనుగ్రహమువల్ల నీనామమును సంపాదించి నిష్టతోఁ జపించుచున్న నాపయినఁ బుట్టలు పెరిగెఁ బిమ్మట నీయనుగ్రహమును బొంది వల్మీకమును భేదించుకొని బయట వచ్చుటచే వాల్మీకియను నామము వచ్చినది. అంత బ్రహ్మర్షినయి యిక్కడ నిలిచి తమనామ స్మరణ మఱువక చేయుచున్న కారణంబున.

వా-తోహర. నీయనుగ్రహము-నేటికి గలిగియు-సీదేవీసహితము గ। బాయకనాకును-బ్రత్యక్షంబయి-తీరెడ నిష్టము లిడగ॥రామ॥

ఇంకిక నాతప, మిూడేరెనునే-నెలమిఁగృతార్థుఁడనైతి । బంకజాక్ష! యీపర్వతాగ్రమునఁ- బరగఁగనుంపుము ప్రీతి॥రా॥

వ. అని రామునెడంబఱచి.

క. గిరిమధ్య నీటిదాపున
నరసియు నొకపర్ణశాల ♦ నత్యద్భుత సుం
దరముగ శిష్యులచేతను
విరచింపఁగఁ జేసె మౌని ♦ వీరుఁడు గడిమిన్.

వ. అంత సంతోషించి శ్రీరాముఁడు కాంతానుజ సహితుండుగ నాపర్ణశాలయందు వసించియుండె.

క. అంత నొకనాఁడు సీతా
కాంతాంకతలంబు దిండుగాఁ ♦ దలనిడి య
త్యంత సుషుప్తిని రఘుకుల
కాంతుఁడు పవళించియున్న ♦ కాలమునందున్.

సం. తోహర. కాకియొకటి వే, గమునజనకసుత, కాలి వ్రేలుముక్కునను। బీకిరక్తమును-బీల్చదోలినను-బోకవచ్చెఁ గ్రమ్మఱను॥రామ॥

వ. ఇట్లేమఱించి వచ్చి బాధింపుచుండినఁ గొంతవడికి రాముండు నిద్రలేచి। వ్రేలియందు రక్తస్రావమగుటఁ దిలకించి యిట్లనుచున్నాఁడు.

సీతారామసంవాదము. పాట-ఆది.

రా॥ స,రోరుహాక్షి! రక్తమట్లు-గారఁగన్। గారణంబదేమొ తిన్నగావచింపుమా! క్రూరు-లేరు లేరుసుమ్మిట॥ సరో॥

సీ॥ సు,ధీర। మీరునిద్రయందు-దేరఁగన్। జేరియొక్క-కాకిముక్కు-చేతనిటువలెన్। గీరన్। గీరన్। గారెరుధిరము॥ సుధీ॥

రా॥ స,హోదరుండు లేఁడె। దాని-మోదఁగన్। బాదమిట్లుజీరినట్టి పాపికాకము। ఏదీ-యేదీ-లేదుచూడఁగన్॥సరో॥

సీ॥ ఫ,లాదిసంగ్రహంబు జేయఁ-గాదగన్। నానుమరదిమోక్షుగుండ-నాథ! పోయెను। బోదుమీద-మీదవచ్చును। ॥సుధీ॥

వ. అనివారు చెప్పుకొనుచుండునంతలో.

సం-తోహర. క్రిమ్మర నక్కా-కము సీతాంగన। కాలుచీరుటకు రాఁగ। నెమ్మదిగని క్రో,పమ్మున నొక్క-తృణమ్మును వైచెను వేగ॥రా॥

వ. ఇట్లు రామకర నిర్ముక్తతృణంబు బ్రహ్మాస్త్రంబై వాయసంబుపైకి ఘోరంబుగా గవిసిన నది కావుకావుమని వాపోవుచు.

కాకి-కీర్తన, యెదుకులకాంభోజి, అటతాళము.

దేవేంద్ర! యోశచీ! దేవీ మనోనాధ! వేవేగఁ కావు! కావు! ఓవిష్ణునందన! యోవాణీవల్లభ! వేవేగఁగావు! కావు! ॥దేవే॥ అక్షయబ్రహ్మాస్త్ర-మావరించె దిశా! ధ్యక్షులారా! కావరే! మోక్షగుండేశ్వర! ముక్తీశ! నేనిక-మొఱ్ఱక్కెదఁ! గావు! కావు! ॥దేవే॥

వ. అనియిట్లువాపోవుచు వేడుకొనుచున్న కాకి కేకవాక్యంబుగా వారందఱిట్లనిరి.

తోహర. రాముడువైచిన! బ్రహ్మాస్త్రంబును! మేమునిలుపఁగాఁగలమా! ఆమహానీయ్యుని - నాశ్రయించినను - నతఁడుడుపునునిక్కఁజనుమా! ॥ రామ॥

వ. అనివారిచేత నియమింపఁబడి త్రిలోకంబులు దిరిగియు నెందును శరణంబులేక కాకంబు గ్రమ్మరవచ్చి శ్రీరామమూర్తి మఱుఁగుఁజొచ్చి భయభక్తుల నిట్లని వినుతించె.

కా-కీర్తన, కమాసు-ఏకతాళము.

సీతాధిపా! శ్రీరామా! త్రిభువననుత! ॥శీతా॥ గౌతముని నాతిన పుడుపు-నీలను జేయవె!॥సీతా॥ కావు-కావు కలుషాపహర!॥ సీతా॥ కుజన హారణ! సుజనహృదయ గురుజలజాత నిలయ!॥ సీతా॥ ననుగన్న! జనకుఁడవన్న! కనుగొన్న! నినునమ్మియున్న! ననుఁబ్రోవుమన్న॥సీతా॥ నీకన్న వేరు! లోకాధ్యు లేరు! కాకుత్స్థ లేరు కాపాడువారు! చేకొని పాపము-జిందరవందర! జేసిశుభములిడు॥సీతా॥ రామరామ! నా, రాయణాక వినుత నామ! మోక్షపుర, ధామా! రాజల, లామా! పాపవి, రామా! సజ్జన, కామ! రూపజితకామ! నీరదశ్యామ! శరణు॥ సీతా॥

వ. అని యీవిధంబున వేడిన కాకిపయిఁ గరుణగలిగి శ్రీరామదేవుండు పలుకుచున్నాఁడు.

క. నాయస్త్రము వృధవోవదు
నీయంగంబొక్కటిమ్ము! నే ♦ డనవినియా

వాయసమొక కన్నిడితాఁ
బోయెను శ్రీరామునాజ్ఞఁ ♦ బూనియథేచ్ఛన్.

వ. అదిమొదలు గాకులకు నొంటికంటిచూపేర్పడె. నాపిమ్మట సీతారామలక్ష్మణులు ఫలహారంబులుసేసి వాల్మీకాది మహాఋషుల సాంగత్యంబులచే బ్రహ్మానందంబు నొందుచుండ నిక్కడ.

సం-శ్లో హ. మంతనమెరియ సు, మంతుడు రథమును, మరల నయోధ్యకుఁ జేర్చె। వంతచేత దల, వంచుచుజని భూ, కాంతున కెలగియు నిలచె॥ రామ॥

వ. ఇట్లునిలచినఁగాంచి దశరథుఁడు వగచుచుఁ కన్నెత్తిచూచి.

దశ-శ్లో హర:-ఇడుములఁ గుందుచు। గొడుకులు గోడలు।నెచటనున్నారోయి। యడరుచునన్నే। ముని నిర్దయతో। నాడినారో చెప్పవోయి॥ రామ॥

అనియెలుగెత్తియు-హాయని యేడ్చుచు-నడిగిన నాదశరథుని। గనుగొనిచింతా, క్రాంతుడగుచును-ననియెమంత్రి నెమ్మదిని॥ రామ॥

సు-ద్వి. రాజేంద్రశృంగిబే, రము జేర్చినాను। వేజడలు ధరించివెడలి జాహ్నవిని। దాటి కాల్నడకతోఁ-దద్దయుఁజితి। కూటశైలమ్మున, కును జేరినారు।తల్లిదండ్రులకును-దండముల్ సెప్పు।మల్లనవగవవద్దనుమనినారు। సాకేతమునకన్న-సకల సౌఖ్యంబు।లంకానలం దెక్కు-వనియనినారు। సీతయత్తలకును-జెప్పిదండములు। భూతలాధిపయిదెపోవార్తలనిన॥

మ. వినికౌసల్య విలాపమొందుచు విభున్ ♦ వీక్షించి హానాథ! నీ
యనుకూలంబుఫలించెఁ గైకకొడుకున్ ♦ హర్షంబుతోనిందు ర
మ్మనిపిల్పించి ప్రభుత్వమిమ్ము వలదీ ♦ యాలస్యమింకేలనా
తనయుల్ నాఁకులుగూరలై బ్రతుకరా ♦ దైన్యంబునన్ గానలన్.

వ. అనునుడువు లాడలిపైఁ యుడుకుజల్లినట్లయిన వాపోవుచు.

దశ-కీర్తన, సురట-ఆదితాళము.

ఎందుకుఁబల్కాదవే! సుందరి!॥ ఎందు॥ నందనునెడఁబాసి। డెందముగుందగ। ముందేనేముఃఖింప, నిందరిలో। నందుకుదోడుగ,నగ్ని జిలికిన

రీతి॥ ఎందు॥ నేనింక ప్రాణాలు, నిలుపగజాలను। గానగ శాపము, గలదు నాకు మానినియింతలో మర్యాదబోనాడి॥ ఎందు॥ శ్రీమోక్షగుండపు రీశుని సాక్షిగ। గామిని! నాశాప। కారణము। వేమరునేనీకు-వినుపింతునింత లో॥ నెందు॥

ఉ. ప్రేమను వేటలాడుటకుఁ ♦ బిన్నటనాఁడు ధనుశ్శరంబులన్
యామినియందుబూనిఁ వెల ♦ యన్ సరయూనది తీరమందునో
భామిని! పొంచియుండఁగఁద ♦ పస్వికుమారుఁడొకండు నీటికై
కోమలి! వచ్చిహస్తగత ♦ కుంభము గ్రిక్కున ముంచెనీటిలోన్.

వ. అప్పుడు.

దశ-తోహ. బుడబుడమనిచ, ప్పుడుగలిగిన న, ప్పుడుగజమని నేఁద లచి। జడియక నైచితి-శబ్దవేదియను-శరమును దరిపైనిలచి॥ రామ॥

హాతాతా! హామాతా! మిమునను-నావిధివాపెనుననుచు। నేశె రువిక! నని-యిలపై బడవిని-యే తెంచితి భయపడుచు॥ రామ॥

వ. ఇటుల చెంతకుఁజేరి యిట్లంటి.

దశ-కీర్తన, హిం॥ కాపి-ఆదితాళము.

నీవెవరో! తెల్పుమునాకు॥ నీవె॥ నేవనకుంజరమని-భావించి వేసితినిశర ము॥ నీవె॥ వేటకువచ్చితినీ। యీ। యేటిదరినినుంటినీ। ధాటిగనయోధ్య మాదీ, దశరథావనీశుఁడను॥ నీవె॥ కానక చేసితినీ, తప్పుగావుము మొ్రక్కితినీ, పూనినాకుబ్రహ్మహత్య। పొందెనేమిచేయువాడ॥ నీవె॥ ఏకులమే స్థలమురా। నేల! నీవీస్థలము ప్రాకటముగ। మోక్షగుండ, పాలుదయ లేక పోయెను॥ నీ॥

వ. అనిన నతండు.

క. నాపేరు యజ్ఞదత్తుఁడు
భూపాలక వైశ్యుఁడను ద ♦ పోమహితులు మా
తాపితరులు గలరంధకు
లీపొంతను నిదిగోయుందు ♦ రినకులవర్యా!

గీ. వారిదప్పిఁదీర్ప ♦ వారికై వచ్చితి
నాపురాకృతంబు ♦ నన్నుఁబాప

బ్రహ్మహత్యయనెడు ♦ భయమునీకింక లేదు
మిగిలినట్టి పనికి ♦ వగవనేల !

యదుకులకాంభోజి-కీర్తన, ధన్యాసి, ఆదితాళము.

ఇకఁబొమ్మా ధరణీవల్లభా॥ ఇక॥ అమ్మయునబ్బయు-నతిదాహముచే-నల్లాడుచును-న్నారచటికినిక॥బొ॥

ఏకారుచురా-చీకులునాకై। యీకలశంబును-గై కొనిపవిక॥ బొ॥

నాపోబడిఁగా,నక నేడయ్యో! వాపోవుదురీవార్త దెలుపనిక॥బొ॥

దక్షుతతోవారి-దాహముదీర్పగ। మోక్షుగుండపతి, సాక్షిగనీవిక బొ।

య-తోహ. శాపంబెత్తురు। చనుమికదడయకు । శరవేదనబడజాల। బాపుజేరియా। బాణములాగుము। ప్రాణముబాతునీవేళ ॥రా॥

వ. అనిపలికినఁ జింతాక్రాంతుండగుచుడగ్గరి యతనియెడ నాఁటియున్న శరంబుపెఱికిన యజ్ఞదత్తుండు దేహంబుబాసి దివంబునకరిగనంతనేను విధినిదూరుచు నక్కలశంబును నెత్తినమోచికొని మెల్లన నడుగులిడుచు యజ్ఞదత్తుండుసెప్పిన గుఱుతుప్రకారము మునుసల్పున్న చోటికిఁబోయిన కాళ్ళచప్పుడువిని.

వృద్ధు-తేవారము:-కొడుకు!సిపింతసేపు♦ దడయగానేలఁజెప్పుఁ। బడుగులముదప్పిచేత♦ బడలియున్నాముధాత। యిడుమలొందంగఁజేసె♦ నిటుల దలమీఁదవ్రాసె। గడియయును నిన్ను మేము ♦ కానకను నిలువలేము.

వ. అనిన భయభ్రాంతచిత్తుండనై యుదకకుంభంబచ్చటదించి వారిపాదంబులపై వ్రాలి.

దశ-తేవారము. నేనుమీసుతుఁడఁగాను♦నిక్కమును దెల్ప లేను। భానువంశోద్భవుండ ♦ వసుధలో దశరథుండ। నేనిచటవేటలాడఁగాను ♦ జనుదెంచినాఁడ । గాన కపకారమొకటి ♦ గడఁగినేజేసియుంటి.

వ. అదియేమియనిన వచించెద.

చ. సరయువుఁజేరిమీకొడుకు ♦ చప్పుడుఁజేయుచు నీరుముంచఁగాఁ
గరియని శబ్దవేదియను ♦ కాండమువైచితిఁ గూలెనాతఁడా
తురపడివైచినాఁడ దయ ♦ తోఁగనుమంచును నేనువేఁడ నా
గురువుల దప్పిఁదీర్చుమన ♦ గొబ్బున నిరముఁగొంచువచ్చితిన్.

దశ-తో:-నేపాపాత్ముఁడ-నీచవర్తనుఁడ- మీపుత్రునిజంపితిని। నాపయిమిక్కిలి, గోపముసేయక- ననుబాలింపుఁడుధృతిని ॥రామ॥

మేకొనియుదకము-మీకుదెచ్చితిని- జేకొనిత్రాగుఁడువడిగ।నాకృత్యముమానసముననుంచక - ననుగృపగనుఁగొనుఁడనఁగ॥ రామా॥

వ. అంతవారు మూర్ఛపోయి కొంతవడికిఁదెలిసికొనుచుకుంగూర్చి.

వృద్ధు. కీర్తన, జోగిరాగము, ఆదితాళము.

మాపుత్రరత్నమా, నీవు-మము బాసిపోతివా! ॥నీవు॥

మాపైనగలభక్తి-మఱచిపోయితివా! భూపతినెపమున-భువినింతటిలో। బాపురేవిధియెడ- బాపెనుమనలను ॥మా॥ మాకెవ్వరింకదిక్కు-మర్యాదచేయగా। గాకులకొల్లజేసి-కదలిపోతివిగా। యీకానలలో నెటులమెలగుదుము, చీకులమెవ్వరు-చెట్టబట్టెదగు॥మా॥ భూమీశుచేత నేఁడు-పొలియగనాయెగా। శ్రీమోక్షగుండశౌరి-ప్రేమలేదాయెగా। శ్రీమీఁటి చిరంజీవివి కమ్మని। మేమను మాటలు-మిథ్యలాయెనుగా॥ మాపుత్ర॥

వ. ఇట్లు దుఃఖించి యెట్టకేలకు ధైర్యంబుఁబూని.

వృద్ధు. తో:-క్షితిపాలకనీవు-జచ్చులుజేర్చియు-జితిఁజేర్చుము త్వరలోన। నతులితముగమా-సుతుఁడరుదెంచిన। గతిఁకఁబోదు మేమసిన.

గీ. అటులఁజితిఁ జేర్చితినినేను ♦ నంతవార
లగ్నిలోఁజొచ్చి ముందు మా ♦ యటులనీవుఁ
బుత్రశోకాగ్ని చేతనే! ♦ పొలియఁగల వ
టంచు శపియించి దివికరు ♦ దెంచిరంబల.

దశ-తో:-కావున నాశాప, కాలమువచ్చెను-గామినివ్యర్థముగాదు। వేవేగంబున- బోవునుప్రాణము- వెలఁదిరొనిల్వగఁబోదు॥రామ॥

వ. అని కౌశల్యకుఁజెప్పి తత్క్షణంబున.

శా. హారామా! సుగుణాకరా! ప్రియసుతా! ♦ హాసీత! హాలక్ష్మణా!
మీరుక్ నన్నుఁడఁబాసిపోవుకతనన్ ♦ మేనున్ విసర్జింపఁ జే
కూరెన్ దీనికిఁ గైకకారణమగున్ ♦ గూర్చిరాత్మయంచాడుచున్
జేరెన్ దేహముఁబాసి స్వర్గమునకున్ ♦ శీఘ్రంబెరాజేంద్రుఁడున్.

సం-త్రోహర. అంతటకౌసల్యాదికామినులు-హాహాకారముతోడ। నెంతయువగచుచు-నెదలుమోదుకొని। చింతనొందిరపుడాడ॥ రా॥

కా-కీర్తన. ఆదితాళము, జోగి.

సుగు,ణాకరా! రణ,భీకరా! నృప-లోకశేఖరా! యిహ, లోకభోగముసరి,పోకవేగము।ని,రాకరించిపొందితే!పరలోకసౌఖ్యము॥సుగు॥

నిను, దూలనాడితి, గను, జాలిబెట్టితి-సు,శీలుడంచునీమది గన, జాలకెన్నితి॥సుగు॥ అల, కైకకృత్యము। బహు, శోకమూలము। అ,నేకమైనకష్టము। లెడ, లేకదోచెను॥ సుగు॥ధర, మోక్షగుండ నా। ధను, కక్షగట్టెనా। సురక్షితంబుగల్గునా! తల, వ్రాలతదొలగునా! ॥సుగు॥

వ. ఇట్లు రాజకాంతలు దుఃఖింపుచుండ.

సంధి-తో. తెల్లవారగను-దెలిసియుపురజను-లెల్లరుగుములయి వచ్చి। గొల్లునవందరు, గూడియేడువగ- గోలయయ్యెనదిచూచి॥రామ॥

చ. గురుఁడువసిష్ఠమౌని చని ♦ గొబ్బుననందఱ నూరడించి భూ
వరఘనమూర్తిఁ దైలమునఁ ♦ బక్వముఁ జేయఁగఁబంచి దూతనొ
క్కరుఁగనియోరి! నీవరిగి! ♦ గ్రక్కునఁ గేకయరాట్పురంబునం
దిరవుగనున్న యాభరతు ♦ వేగముగాఁగొనిరమ్ము పొమ్మిఁకన్.

వ. గిరివ్రజపురంబుననున్న భరతునిగాంచి యేసమాచారముఁ జెప్పక తమ్మునితోఁగూడఁ ద్వరితమ్మునవసిష్ఠుండు మిమ్ము దోడుకొని రమ్మనెనని చెప్పి పిలుచుకొనిరమ్ము దూతా.

తోహ. అని పంపిన నత, డతివేగమ్మున-జని యావార్తనుదెలుప। వినిభరతుండతి - వికలచిత్తుడయి-తనవారలువీడ్కొలుప ॥రామ॥

భర-కీర్తన, ఆదితాళము-శంకరాభరణము.

ఓహో బంధులార! నేన,యోధ్యకేగుదెంచెదా।యాహా! నన్ను బిలువభటుని-పంపిరి యోచించెదా॥ఓ॥

రాముడెందుబోయినాడో! రాజుమాటదెలియదు! ఏమి! కారణమో! నా- కేమిదోచగా లేదూ॥ఓ॥

దక్షుఁడగుచు వసిష్ఠుఁడు-దానుబంపెనేమో! హా! మోక్షగుండ శౌరి-కరుక। మోసమేమో! వచ్చెహా! ॥ఓహో॥

వ. అప్పుడుశత్రుఘ్న సహితంబుగా భరతుండు శీఘ్రయానంబున సాకేతనగరంబుఁజేరి కళాహీనముగానున్న యానగరంబునుగని ఖిన్నుండయి రథంబుదిగి మాతృగృహంబునకరిగి యొంటిగానున్న తల్లికి నమస్కరించిన లేవనెత్తి దీవించి యిట్లనియె.

తోహర. మాతులుడత్తయు - మాతామహియును । దాతయు జుట్టంబులును॥ ప్రీతిగగుశలంబే! కదయనవిని-మాతకుదానిట్లనెను॥ రామ॥

భర-కీర్తన, ఆదితాళము-మధ్యమావతి.

ఎందుబోయె । నాతండ్రినేడు॥ యెం॥

ఎందుబోయెమది-యందుదోచ లేదు । ముందునీను గృహమందు నిలిచితన। డెందమందునానంద మొందు నిపు, డిందు-లేడాయెదండ్రి॥ఎం॥

దుందుభిరవముల సందడులలరగ। వందిమాగధులు-బృందములై తన, ముందరగొలువగ సుందరముగ జెలు। వొందు, భూమీంద్రుడిపు॥ డెం॥

ఈక్షితినారాయణ కవినేలెడు । మోక్షగుండపుర। రక్షకుదయతో । నీక్షణమున ప్రతిపక్షగణంబుల । శిక్ష-జేసెటిదక్షు ॥డెందు॥

వ. ఇట్లడిగి కించిన్మాత్రంబు దుఃఖితుండయిన.

కయిక-తో. వగవనేలసుత-వాజిమేధముఖ-వరయాజకులేగతికి । దగజనుకురో! యా, స్థానమునకుమీ । తండ్రిసేరె సద్గతికి ॥రామ॥

సం-తో. అనగా న్నామాట, వినగామూర్ఛిలి, యవనిపైని బడి పొరలి।గొనకొనిశత్రు, ఘ్నునిసహితంబుగ।గొంతవడికి దెప్పిరిలి॥ రామ॥

క. నాయనస్వర్గమునకుఁ దాఁ
బోయెను సమయంబునందుఁ ♦ బొలుపుగ మాకుం
ఏ యేబుద్ధులు గఱపెను
నాయెడదయయుంచి తెలుపు ♦ ననుగన్నమ్మా!

వ. అనిన దల్లి యిట్లనియె.

తోహ. శ్రీరామునినా, సీతనులక్ష్మణు, సారెకుదలపోయుచును। దోరపుదుఃఖము, తోఁబొదలుచుగడ । తేరెననగవిని యనెను ॥ రామ॥

వారెచటికినావలెనే! పోయిరో ! వారక దెలుపగదమ్మ! చేరువ శోకరును-జేరనిహేతువు-జెప్పుమనగనాకొమ్మ ॥రామ॥

కయిక-కీర్తన-ఆదితాళము-జంఝూటి.

వినుతనయా! తెలిపెద॥విను॥నినుగురించిచే, సిననాకృషి ॥విను॥ నట్టడవికిరఘు-నాథుబంపగా। బట్టమునీకును-గట్టగను గట్టిగగోరితి-గాంతునితో విను॥ రెండు వరములిడి-యుండెగానమో। తండ్రియవియు లేదన లేక। దండిగవరములు-దయచేసెనువిను ॥తన॥ దీక్షగసీతా। దేవిలక్ష్మణు। లాక్షణమునరా। నడవులకు। మోక్షగుండపతి। సాక్షిగఁజనెవిను॥తన॥

గీ. వారినంపి పిదప ♦ వారిపైఁ బ్రియమునఁ
బొగలిపొగలిచచ్చె ♦ జగతివిభుఁడు
కొదువయేమియింకఁ ♦ గుతలంబునేలుము
తనయ యనిన నతఁడు ♦ గినలిపలికె.

భరత-కీర్తన, ఆదితాళము.

పోపోగదేపోగదే! పాపాత్మురాల!॥పో॥నిపుట్టినై ధర-నేబుట్టుట! రోత॥పో॥మాతననుచునిక-బ్రీతిగగనవచ్చు। నే! తండ్రిజంపిన। ఘాతకురాలవు॥పో॥అన్ననువనముల, కంపి యీరాజ్యము। నన్నేలుమనియెదవు నాలికెటులాడె॥బోపో॥శ్రీమోక్షగుండపు, రీశుని సాక్షిగ। వేమారుసీమోము। వీక్షింపఁగాఁజాల ॥పో॥

వ. అని యిట్లు కఠోరంబుగాఁ బలుకుచున్న యెడఁ జూడవచ్చిన వారిలోఁ గొందఱ్ మందరవల్లనే! యింత తొందరగలిగనన విని శత్రుఘ్నుండు క్షాత్రవంతంబున లేచి.

సం-తోహార. గూనిముండనిక-కూల్చివేతునని-దానిపాదములు బట్టి। మానుగగిరగిర, మనితిప్పియునిల, పైనబడగదాఁగొట్టి ॥రామ॥ మరికైకనుజం, పగదలచిననిది। మాతృద్రోహంబనుచు। భరతుఁడు పోదము-పదకౌసల్యా, వరగృహమునకన వినుచు ॥రామ॥

వ. అంతలేచి యిరువురుఁ - గౌసల్యానగరంబునకుఁజని భర్తృవియోగంబునఁ బరితపించు నామెపదంబులపయిఁబడి యేడ్చిన.

కా-తో. లెమ్ముతండ్రి!స,ర్వమ్ముదల్లిచే-నెమ్మదివినియుండెదవు। యిమ్మహినెల్లను, నేలుమునీవిక -నిష్టార్థంబులు పొదవు॥రా॥ రామలక్ష్మలు, భూమిజయునునా, రచీరెలు, ధరియించి, ధీమతి నడవుల-దిరుగబోయిరిక-దేవుసెదిక్కనగాంచి ॥రామ॥

భరత-కీర్తన, హిం, తోడి-ఆదితాళము.

మొఱదోచదా యెదల్లీ! యిక నేమిచేతునే। కుటిలాత్మురాలు కైక యిటువలె జేసెను ॥మొ॥

ఈకృత్యమెల్ల నేను। యెరిగియుండితేను। బ్రాకట బ్రహ్మహత్యా। పాపము నొందును॥మొ॥ గురునివసిష్ఠుని। దరుణితో గూడను। నరికిన వచ్చిన । దురితముబొందుదు ॥మొ॥ నాతల్లి మోక్షగుండ । నానునిసాక్షిగ । నీతప్పు నే జేసి । యెఱుగనుమన్నించు ॥మొఱదోచ॥

వ. ఇట్లు భరతుండు ప్రమాణపూర్వకముగాఁ బలికిన గౌసల్య జాలినొంది కొడుకును లేవనెత్తి నాయనా! నీమనోభావంబుఁగనలేక పలికితినని గారవింపుచు నొకరినొకరు గౌఁగిలించుకొని యెలుఁగెత్తి యేడ్చుచున్నతఱి వసిష్ఠుండువచ్చి భరతునితో నిట్లనియె.

చ. వగవగనేమికార్యము ధ్రు ♦ వంబుగఁ జచ్చినవారు వత్తురే ?
జగమున నశ్వమేధమును ♦ సల్పియెరాముఁ బరాత్ముఁగాంచి యీ
యగణితమర్త్య భోగముల ♦ నన్నియుఁబొంది దివంబుఁ జేరెఁ దా
మిగుల నృపాలుఁడన్నిటను ♦ మేటిగదా! యిఁక లేవ్రులోపముల్.

సీ. దేహమెప్పటికిని ♦ ధ్రువముగానుండదు- మృత్యువు వెన్నంటి ♦ మెలఁగుచుండు । సర్వసంపదలును ♦ శాశ్వతంబులుగావు ప్రాప్తంబుకుదువక ♦ వాసిచనదు । పుత్రదారాదులు ♦ బూనివెంబడిరారు బ్రహ్మాదులును నడ్డ ♦ పడగలేరు। బాల్యకౌమారయువ్వన ♦ జరావస్థలు పరిణమించకనెక్క ♦ పగిదినుండ ॥ గీ. విట్టితనువుల నెన్నితా ♦ నెత్తినాఁడొ! పుట్టిచచ్చుటసహజంబు ♦ పురుషులకును। నశ్వరంబని దీనిని ♦ నమ్మరార్యు । లింక దుఃఖించినను ఫల ♦ మేమిభరత !

క. చినిగినగుడ్డలు విడిచియు
మనుజులు గ్రొత్తవిధరించు ♦ మాడ్కిని తనువుల్
వెనుకటివి విడిచి నూతన
తనువిలఁ గాలక్రమమునఁ ♦ దాల్తురు జవుల్.

క. కావున విజ్ఞతఁగైకొని
చావులు పుట్టుకలు రెండు ♦ సమమని మదిలో

భావించియు సంస్కారముఁ
గావింపుము తండ్రికిపుడుఁ ♦ గడువసిష్ఠోక్తిన్.

వ. అని బోధించిన వశిష్ఠుని వాక్యంబుల వలనఁ దెలివినొంది తైలద్రోణంబుననున్న తండ్రికళేబరంబు దీయించి విధ్యుక్తప్రకారంబుల నగ్నిసంస్కారంబుచేసి దశరాత్రంబులు కర్మమాచరించి వేదవిదులగు విప్రులకు షోడశమహాదానంబులిచ్చి సభాస్థానంబునఁ బరిజనమంత్రిసహితంబుగాఁ గొలువుదీరియున్న భరతునకు వసిష్ఠముని యిట్లనియె.

క. మీతండ్రి యనంతరమున
నోతండ్రీ ! రాజ్యభార ♦ మూనుము రాముం
డాతత దండకవనమున
కీతఱిఁ జనెఁ గైకకోర్కె ♦ లెల్లఫలించెన్.

వ. అనిన భరతుడు.

భర-కీర్తన, రూపకతాళము, జంఝూటి.

రాముని సేవింపబోదు-రాజ్యమేలను। నోమునీంద్ర ! హేయసుఖము। లొల్లనునే, నుల్లంబున॥ రా॥ కారడవులరాముడుండ - నూరనుందునా। మారుమాటలేదు రేపు, మనమందర - మరుదెంతము॥ రా॥

కైకదప్ప స్త్రీపురుషులుగడమవారలు। ప్రకటముగమోక్షుగుండ। పతికృపతో - రావచ్చును॥ రాము॥

తోహ. రామునిదోడ్కొని-రయమునవచ్చియు- రాజ్యమువేగ పైదను। రాముడురానంటే! మఱియచటనె! రమ్యముగానుండెదను॥ రా॥

వ. అనినిశ్చయించి నేగినతరువాత వశిష్ఠాదిమునులును సుమంత్రాదులునుఁ దల్లులును జతురంగ బలంబులు పౌరులునుగూడి రా భరత శత్రుఘ్నులు గదిలి గంగాతీరంబునకుఁ జనిన గుహుండుసూచి.

గీ. కాననంబుల దిరిగి రా ♦ ఘవుండు మరల
వచ్చునో ! యంచు దండెత్తి ♦ వచ్చుచున్న
యటులఁ దోఁచును నీరాక ♦ యైననేమి
నన్ను గెలిచియుఁ బొమ్ము నీ ♦ వన్న ననియె.

గీ. రాముఁ బ్రార్థించి తోడ్తెచ్చి ♦ రాజ్యమియ్యఁ
బోవుచున్నానటన్న ను ♦ ప్పొంగి యతఁడు

ఫలములును దేనెనిచ్చియుఁ ♦ బడవలంగు
నుంచి యందఱ నదినిదాఁ ♦ టించె నపుడు.

వ. భరతశత్రుఘ్నులు రామ లక్ష్మణులవలెనే జటావల్కలము లుధరించి యానాఁడు భరద్వాజాశ్రమంబుఁ జేరిన సతెండు.

భరద్వా-తోహర. పురిసీ కిచ్చియు-బోయిన రాముని-బోని య్యంగాలేవా! భరతుడ! యిటువెం, బడి బడివారల। దరుమగజను చున్నావా! ॥రామ॥

సం-తోహర. అనిసభయంపడి-మునివర! రాముని। గొనిదెచ్చి యు విభుజేయఁగ। జనుచున్నానన। సంతసపడి యా, యనసత్కారము జేయఁగ ॥రామ॥

వ. అందుండి మఱునాఁడు బయలుదేరి చిత్రకూటాద్రిఁ జేర వచ్చినఁగాంచి లక్ష్మణుండు మునిజనపరివృతుండయిన యగ్రజుంగాంచి.

ల, కీర్తన, ఆదితాళము.

వారెవరో! చూడుము॥వా॥ వివిధసేనలతో-వెడలివచ్చు॥వారె॥ సమరధులున్నారుగా। అతి, గధులున్నారుగా। రిధహయ భటవా, రణ ములుగలవా॥రె॥ ఇనకులుల చిన్నెలు। ఇదె। గలిగియుమనదెస। కలరివ చ్చు॥వారె॥ప్రతిపక్షవీరిలో। ప్రతి।మోతుకుండపుర-రక్షకయల॥వారె॥

వ. అనిన రాఘవుండు.

రా-తో. భరతుడు మనలను - బురికినిరమ్మని - ప్రార్థింపగ రా బోలు। సరగున నీమది-సంశయపడకుము-సౌమిత్రియికజాలుఁ ॥రామ॥

సం-తో. అనుకొనుచుండగ - నంతలోనవా - రిగుదెంచినముద మొందె। తనతల్లులకును,దండములొసగియు,ఘనముగదీవసలంది॥రామ॥

క. కులగురునకు దండము లిడి
యలరుచు ధన్యుండనైతి ♦ నయ్యా! మా త
ల్లులుఁ దమ్ములు వచ్చిరియిట
కలవడి మాతండ్రియేడి! ♦ యగపడడసఁగఁగ.

వ. విని వశిష్ఠుండిట్లనియె.

వ-ద్వి. మిమ్ముఁగానలకంపి-మేదినీవిభుఁడు। మిమ్ము గలగనుచు.

మృతుడయ్యె నంత। భరతుని బిలిపించి-పరలోకవిధులు।బరువడి జేయించి, పృథుపుగమ్మన్న। నెల్లకమిముజూడ, నెయ్యానవచ్చె। తల్లులతోఁ గూడ-దశరథరామ!

అనుపల్కు-లాలించి-యారామవిభుడు। జనకజాలక్ష్మణ-సహితాబుఁగాగ। గడువడిమూర్ఛిల్లి-గ్రిక్కునఁదెలిసి। సుడియుచునిట్లని, శోకింపదొడఁగె॥

రా-కీర్తన, రూపకతాళము, హిం॥ శోకి.

తండ్రి! పోతివా! గన్న॥తం॥ తీవ్రమయిన-కైకకోర్కె-దీర్చిపోతివా॥తం॥కొడుకులకొరకు। వెత।గుడిచియుఁగడకు। బడలిచేత నెవరు లేక బాసిపోతివా ॥తం॥ చాలకాలము, నీచాటున మేము। లీలమెలగుప్రాప్తి మాకు। లేకపోయెను॥తండ్రి॥ ఎంతదలంచితో! మ,న్నెంతబిలచితో! సంతతంబు మోక్షుగుండ, స్వామికెరుకగు॥ తండ్రి॥

వ. అప్పుడువచ్చిన వారందఱు కన్నీరుమున్నీరుగాఁ బారనేడ్వ వసిష్ఠుండు శాంతవచనంబులఁ వారందఱ నూరార్చి రామునిఁ డగ్గరి.

క. లోకంబులు గల్పింపను
బ్రాకటముగఁ బెంపనొంపఁ ♦ బతివయ్యునిటుల్
బ్రాకృత పురుషుని విధమున
శోకింపుచు నుండనేల ♦ సురగణపాలా!.

వ. నీయంతవానికిది దగునే! దుఃఖించినఁ జచ్చినవారు వత్తురే! లెమ్మన గురువాక్యంబువలన రాముండుదేరి తమ్మునితోఁగూడ గంగానదియందు స్నాతుండయి తండ్రికివాసోదక పిండోదకముల నిచ్చి యాదినముపవసించి మఱుదినంబున స్నానంబుఁజేసి యథాస్థానంబునకువచ్చి మునిజన పరివృతుండై యున్నయన్నకు భరతుండు సాష్టాంగనమస్కారము లర్పించిన నిట్లనియె.

క. పితృవాక్య పాలనకు నే
ధృతితోఁగానలకు నేగు ♦ దెంచితిసేవుల్
క్షితిభారముఁ దాల్పకయీ
గతినడవికి రాఁగ నేమి ♦ కారణమనుజా!

వ. అనినఁ భరతుండు దీనాననుండగుచు నిట్లనియె.

భర-కీర్తన, ఆదితాళము, బ్యాండుస్వరము.

రామచంద్ర! రమ్మిక। రాజ్యమును గొమ్మిక। తామురాక నేనిక। దరలిపోను బురికిక। భూమిపాలింపగ-బోలనేను। శ్రీమీరమీఁహంపుజేసెదను॥ రామ॥ కపటచిత్తురాలగు। కైకమాటదలపకు। తపనకులజ నాయెడ। దప్పులేదు చొప్పడ। విపులాటవుల కేగుటిక మానుము। కృపయుంచునామీఁద గేవలము॥ రామ॥ మోక్షగుండ దేవునీ। సాక్షిగ నీవురాననీ। పక్షపాతముంచిన! బాదములువిడుతునా! లక్ష్మణసీతలు లలితాంగులు। అక్షయ కష్టములందలేరు॥ రామ॥

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె.

క. జనకునియాజ్ఞను దాటఁగఁ
జనునా! రాజ్యంబునీకొ ♦ సంగియు ననుఁగా
ననములకు నరుగుమనియెను
బనివడి నెరవేర్చకున్నఁ ♦ బాపముగాదా?

వ. అనిన భరతుండు శోకవ్యాకుల చిత్తుండై యోగ్యదర్భాసనంబునఁ గూర్చుండి యిట్లనియె.

భర-తో. ప్రాణాయామము। బట్టియునేనును। ప్రాణంబులువిడిచెదను, గానమీరురా, కయయోధ్యకునే। బోనుసత్యమనియ నెను॥ ప్రా॥

వ. అంత భరతుని మనోనిశ్చయంబునకు నేమిచెప్పుటకుఁదోఁచక శ్రీరాముండు గన్నుగీటిన వశిష్ఠుండు భరతున కభిముఖుండయి యిట్లనియె.

వశి-కీర్తన, అటతాళము, నాయన.

అగ్రజుశాసన।మాలించరాదా!।వ్యగ్రతగానీవు,వర్తింపవలెనా!। అ॥ కారణకార్యము। లారయవలదా! తీరు మిక్కిలిగాలు। దెలియగవలదా॥అ॥ రావణుగూల్చిసు, రావళినెల్లను। బ్రోవగబుట్టిన-దేవుడుగాడా॥ అ॥ ఆపనిదీర్చగ। నదికడుమేలగు। పాపాత్ములెల్లను। బలిసిరిభూమిని॥ అ॥ మోక్షగుండపురా, ధ్యక్షునివల్లనే। రాక్షసకులములు- శిక్షింపబడనగు॥ అ॥

వశి-తో. తిరిగిరాముడరుదెంచిన నాపని। దీర్చవాగనీకయేరీ చేరియొకకార్యము। జేయుడుజనులకు। క్షేమంబగునసూరి॥ రామ॥

సం-వ. ఇట్లు భరతునకుఁ దెలిపి రామునింగాంచి.

వశి-తోహర. పదియునాలుగ,బ్దంబులునిండిన। పిదపనయోధ్య కురండి! సదమలముగ స,జ్జనులౌననగా। బృథివినెల్లనేలండి॥ రామ॥

వ. అని తెలిపిన.

క. ఇందుకురాముఁ డొడంబడ
నందుకు భరతుండునొప్పె ♦ నటుపిమ్మటఁ దా
వందన మొనరిచి సభవా
రందఱువిన భరతుఁడనియె ♦ నగ్రజుతోడన్.

గీ. తండ్రితర్వాత రాజ్యంబు ♦ దమదికాన
నాకుఁదగదయ్య సింహాస ♦ నంబునెక్కఁ
బాదుకలనిందు వానికే ♦ భక్తితోడఁ
జేసికొనియెద రాజ్యాభి ♦ షేకమింక.

ఉ. మీరరుదెంచుదాఁక నెల ♦ మీఱ బృథివీభరమూని ప్రీతితో
నూరకపాదుకల్ గొలిచి ♦ యుండునునేఁ బదునాలుగేండ్లకున్
మీరరుదేరకున్న విను ♦ మీ! విషమైనను ద్రావిచచ్చెదన్
సారసనేత్రమీపదము ♦ సాక్షిగ నారఘువర్యుఁడిట్లనెన్.

రా-తోహర-తమ్ముడ! నీయిష్టమ్మురీతిగా। దప్పక నేజేసెదను। బొమ్మికబాదుక-నిమ్మంటివి కై, కొమ్మని యిచ్చెనుదయను॥ రామ॥

వ. అంత భరతుండానందమొంది పాదుకల శిరసావహించి రామునకుఁ బునఃపునః ప్రమాణంబు లాచరించిన దీవించియిట్లనియె.

రా-కీర్తన, అటతాళము.

ప్రజలను బాలింపుమీ! తమ్ముడ!॥ప్ర॥ సుజనులగాంచి- సారది బూజించి। వృజినమునొందక-గజిబిజిలేకుండ॥ప్ర॥ నీతిమానక । ఖ్యాతిఁ బోనీక । దాతతండ్రిలబోలి - ధర్మమార్గముగాను ॥ప్ర॥ పేదసాదలను బిట్టుదూరకను। నాదరమునమిత-మయిన పన్నుగొనుచు ॥ప్ర॥ రాక్షస నాశు । మోక్షగుండేశు । నక్షయఫలదుని-నర్చనజేయుచు ॥ప్ర॥

వ. అనిబోధించి శత్రుఘ్నుని భరతునికి సహాయంబుగానుండు మని నియమించితల్లులకుఁ మగుడనమస్కరించిన కైక రామునకిట్లనియె.

కయిక-తో. నీవుదేవుడవు। నిర్వికారుడవు । కేవలపరిపూర్ణుడవు। నావిరించికిని నయిన దెలియదరా।మవునే! గుణశూన్యుడవు ॥రామ॥

కపటాత్మను నే,గష్టపుజీవిని, నృపహంతను గావుననుI నపరాధము నీ, కాచరించితిని, నపనయించి కావుమను ॥రామ॥

వ. అనిన.

గీ. మాయచేత జనులు ♦ మనుజునిగాను భా
వింతురి కానునేను ♦ విశ్వమయుఁడ
నమరహితము గోరి ♦ యవతరించితి వచ్చి
నట్టిపనులు దీరి ♦ నంతఁబోదు.

రాముని-తో. నీవేమెఱుగవు। నీకీబుద్ధిని । నేబుట్టించితిసుమ్మీ। రావణుగూల్చియు । రయమునవత్తును । గావునబురికిక బొమ్మీ ॥రామ॥

నన్నుధ్యానింపుచు, నన్నుమరువకను, నాతల్లీ! నీవుండు।అనువుగనంత్యము-నందునాపదవి-నంది సుఖింతువుజుండు ॥రామ॥

వ. అని కైకమ్మకు విజ్ఞానంబుఁగఱపి యందఱవీడ్కొలిపిన గద లివచ్చిన మార్గంబుననే! శీఘ్రయానంబున సచివామాత్యసహితంబుగా నయోధ్యంజేరి యందరిని వారి వారి నివాసంబుల నిలిపి తానందుండ నిశ్చయింపక భరతుండు.

క. నంది గ్రామము జేరియు
నందుఁ సింహాసనమున ♦ నాపాదుకలిం
పొందగ నిలిపియు నిరతముఁ
జందన కుసుమములఁబూజ ♦ సల్పుచుమఱియుఁ.

సం-తో. ఫలభోజనమును-వసుధశయనమును-బ్రహ్మచర్యమును గాగ।సలలితనియమము-సలుపుచుదమ్మునిసహితముండెగడువేగ॥ రామ॥

పాదుకాజ్ఞచే-బాలన జేయుచు-బదునాలుగువర్షములు। గాదగు కాలము, గణనము జేయుచు । గడుపుచునుండెదినములు ॥రామ॥

క. అక్కడ రాముడు మదిలో
నిక్కముగాఁదలచె నిచట ♦ నిలిచిన పౌరుల్

ఇక్కడికి వచ్చుచుందురు
చక్కగనెక్కడికినయినఁ ♦ జనఁదగుననుచుర్.

తో. అని తాళ్ళూరినా, రాయణకవిరా, మాయణమును హరి కథను । ఘనముగఁజెప్పెను, గనగనయోధ్యా, కాండము చిలుకును సుధను ॥రామ॥

ఇదివినువారల, కిహసౌఖ్యంబులు । గొదువలేక చేకురును । ముదమున దుదకును। ముక్తిలభించును। మోక్షగుండహరికృపను ॥రా॥

రామా! రామయనవే! శ్రీరామాయణకథవినవే! గౌరీ!॥రామ॥

క. నాచేతనైన కొలఁదిని
జూచిరచించితిని దీని ♦ సుజలును నెఱసుల్
దోఁచినయెడ దిద్దుదురని
నాచిత్తములోననమ్మి నా♦ ననయంబుర్.

అయోధ్యాకాండము-హరికథ,
సంపూర్ణము.

---



శ్రీ ర స్తు.

# మోక్షగుండ రామాయణము—హరికథ.

## అరణ్యకాండము.



క. శ్రీమద్రామకథామృత
మామోదముఁ గ్రోలి ♦ యలరుచు ఘనులౌ
నామహనీయుల కెల్లను
భూమినిధర్మార్థకామ ♦ ముక్తులుగలుగున్.

వ. అంత శ్రీమద్రామమూర్తికిఁ జిత్రకూటాద్రియందున్న ఋషికాంతలు మంగళహారతులు పాడి రెట్లనిన.

మంగళహారతి–సురటరాగము–అటతాళము.

మారఘుకులజాత! మహిజాసమేత! జయమంగళం–శుభమంగళం॥
మారకోటిసుకు! మారశరీరా! జయ–మంగళం–శుభమంగళం॥
మానిహృద్గోచర–సుహిత తేజ! నీకు–మంగళం–శుభమంగళం॥
మానితకామక్రోధాదిఖండన! జయమంగళం–శుభ–మంగళం॥
మండలోజ్వలమోక్షగుండరాఘవ!జయ,మంగళం–శుభ–మంగళం॥
మహినారాయణ–కవి,మానసాధీన!జయ,మంగళం–శుభ–మంగళం॥

వ. అనంతరము శ్రీరామలక్ష్మణులచటి మునులవీడ్కొని కదిలి యత్రిమహాముని యాశ్రమంబుఁ బ్రవేసించిన నమ్మహర్షి యెదుర్కొని తోడితెచ్చి పూజించిన సంతసించి రాముండిట్లనె.

రా–త్రో.

వనయాత్రకు రా–వలసిన నెపమున–నినుగన గలిగె మునీంద్రా!
ఘనయమునేనుగృ, తార్థుడనయితిని–నను బ్రోవు కృపాసాంద్రా!॥రామ॥

వ. ఆ న నత్రిమహాముని యిట్లనియె.

అత్రి–కీర్తన–ఆదితాళము.

కరి, వరద! కామితఫలదా! ప్రోవవే! కరి॥వ॥దా॥

ధరనుసిమాయలో-దగులక మెలగక-దరమే! యుపహార-సుంల
కైన॥కరివర॥ ననుభావనునిచే-యనువచ్చినసీ। ననుమాటలునా। కద్భు
తములు॥ కరివర॥నారాయణకివి, నందిత! సంసార। తారక! నేనిక-
ధన్యుడనో! ॥కరివర॥ వసుధమోక్షుగూడ। వాసదయానిధే। యసు
రులబాధలు। హరియింపుము॥ కరివర॥

వ. అంత ననుసూయాదేవి సీతాదేవిని గని.

అన-తో. అన్నివిషయముల - ననుసరింపదగు - నధిపతిని బతి
వ్రతలు। కన్ననసీవటు-గావించుటకయి-కదలివచ్చితివి మేలు॥ రామ॥

సం-తో. చేడియనీగతి-జెలగుచుదాంగొని, యాడియు సన్మానిం
చెక। వాడనిపూలును-మాయనిచీరలు-[illegible]లు నర్పించెక॥ రా॥

[illegible]

వ. ఇట్లు దండకారణ్యంబుఁజొచ్చి యత్రిశిష్యుల వెనుకకుఁబంపి యొంటిగా నరణ్యంబునఁ బోవుచుండ.

సం-తో. శూలముభుజమున-సొంపుగదాల్చిక, రాళవక్త్రిమును దెఱచి। వాలాయముగా। వచ్చెవిరాధుఁడు। వడినార్చుచు జేజరచి॥ రా॥

వ. ధీరులవలె నీనారీమణితోఁగూడ గారడవింో దూరిదూరి వచ్చెదరు మీరెవరు! చరాచరంబులుగూడి పరుగున వచ్చినదురంబున భరించగల విరాధుండను బ్రతుకఁదలచిన నీసతిని విడచి కడువడితో జడదారులార! మీయిరవులకరుగుఁడు. అనిన రాఘవుండు విరాధుని గనుంగొని.

చ. దశరథ రాజసూనుఁడను ♦ దానవ! నాదియయోధ్యతండ్రిచే
...గా ... భవా

వ. అప్పుడు.

చ. పుడమితనూజఁ గాంచి రఘు ♦ పుంగవుఁ డద్భుత కోపదృష్టితోఁ
గడువడినర్ధచంద్ర మను ♦ కాండము వైవ విరాధుఁ డీల్గి యా
వెడదశరీరముల్ విడిచి ♦ వేగవిమానము మీఁద నెక్కి యే
ర్పడదివినుండి మ్రొక్కుచును ♦ బల్కెరఘూద్వహుతోడనివ్విధిన్

వి-తో. వినురఘువర! నే-విద్యాధరుడను-మునుదూర్వాసుడున న్నా। గనలుచుశపియించిన నందునరాక్షసుడనయితినిటునేను॥ రామ॥

నీచేజచ్చితి- నిన్ను నెఱింగితి-నీవుపరాత్పరుడగుటను।నీచకృత్యము లు, నేటికిబోయెను- నేనుముక్తికిక జనుదు॥ రామ॥

వ. తదనంతరంబ శ్రీరామలక్ష్మణులు శరభంగముని యాశ్రమంబున కరిగిన స్వామిరాకనుగని యెదురేగి నమస్కరించి.

శర- కీర్తన- అటతాళము- బేహాగ్ రాగము.

స్వామిశ్రీరామ రామచంద్ర!నమో।స్వామిశ్రీరామ॥ రామ॥ నీమముతోడుత। నీదర్శనమును। గామించి తపమాచరింపుదు॥స్వా॥ నేధ న్యుడనయితి। నేగడతేరితి।నేటికిగోరికలుతీరె॥స్వామి॥మోక్షగుండపురా, ధ్యక్షనారాయణ । రక్షమీపదములు నమ్మితి॥ స్వామిశ్రీరామచం॥

చ. అనికొనియాడి గంధకుసు ♦ మాక్షతలుల్ గొని తెచ్చిపూజనం
బొనరిచి గందమూలముల ♦ నెయ్యున నిచ్చిన నారగించి రా
వెనుకను దత్సమీప ముని ♦ బృందములెల్లను రాముఁరాక కే
విని శరభంగసన్ముని ని ♦ వేశముఁ జేరఁగ వచ్చిచేరగన్.

తో. రాముడుసీతా-లక్ష్మణయుతముగ- నామునులకుమ్రొక్క గను । నామోదంబున । నందరురాముని । నర్చించిరిభక్తిగను ॥రామ॥

అప్పుడు,

ముని-కీర్తన, ఆదితాళము, హిం, కాపీ.

తావకదాసులము । రామ! రామ । భావములనుగొలుతుము॥ నీవువైకుంఠుడవు । శ్రీ । దేవియెసీతయవు । రామ ॥తావక॥

వరశంఖచక్రములు।రామరామ। భరతశత్రుఘ్నఘనులు । ధరల క్ష్మణుడేశేషుడు । నగుచునుదయతో। బుట్టినవారు । రామరామ॥తావ॥

రాక్షసులనుగూల్పను। రామ । రక్షింపసాధులను । నీక్షితిగలి గితివిరామ । మోక్షగుండేశుడవై। రామ॥ తావ॥

ఇట్లుపొగడి,

తో. తమతమవౌ యాశ్రమములుసూడగ । దనునరమ్మనుచు బిలువ । ప్రమదంబునజని । పరికించెనువారు । పరమభక్తితో గొలువ॥రామ॥

అచ్చటచ్చటను-నసులుశిరములు, నగపడరాముండ నెను । నిచ్చ వెలుపుడివి-యెక్క డీవనియన-నెలమినివారందఱును॥రామ॥

ఉ. రావణు నాజ్ఞచేత మద ♦ రాక్షసబృందము లప్పుడప్పుడున్
దేవర ! వచ్చిమానుల వ ♦ ధింపుచుఁ బోవుచునుండ్రు కూరులై
కావున నివ్వి పుత్తెలెము ♦ కల్ గడుశౌర్యముమీర వారి మీ
రేవిధినైన వేగ వధి ♦ యించి దయన్ మునులఁ బ్రోవగావలెన్.

అనివేడిన.

తో. సాధుపులనుగడు బాధజేయునసు - రాధములనుబోకుండ। నీధరఁగూల్తును-నిక వారల భయ-మేమిమీకు లేకుండ ॥రామ॥

వ. అని శపథంబుగా రాముఁడు పలికిన మునులందఱు డెందం బుల నానందంబునొందుచు.

మును-ఆర్యావృత్తము.

జయజయ తులసీధామా ! జయజయరవికుల సుధాంబునిధి సోమా !
జయజయ తారకనామా! జయజయత్రిజగద్విభో! పరంధామా!

వ. ఇట్లు వారువొగడుచుండఁ గ్రమంబున వారి యాశ్రమం బులన్నియుఁజూచుచు సుతీక్ష్ణాశ్రమంబుఁ జేరిన.

సం-తో. రామదివ్యమం, త్రంబుజపించెడు-నామునివర్యుఁడు లేచి। రామునకెదురుగ-రయమునజనితా-నేమముతోఁ దోడ్తెచ్చి॥రామ॥

పాట । ఆదితా॥ గురుమహారాజవలె.

దశరథరామా! దశరథరామా! దైవలలామా! దశరథరామా॥
సరగున నీమంత్రి, జపమును సలుపగ।దరమెగాని,తరుణోకిఁదక్కక॥దశ॥
నీపదసేవయు-నీదుదర్శనము। నాప్రాప్తంబున-నాకులభించెను॥దశ॥ అక్ష
య ప్రకృతి వి, లక్షణ చిన్మయ। మోక్షగుండపుర, రక్షపరాత్పర ॥ద॥

ఇటులనుతించిన రామచంద్రుండు.

పంచచామరము.

సుతీక్ష్ణనాముమంత్రిమూర్తి ♦ శుద్ధితో జపించి హృ
ద్గతుండనైన నన్ను భక్తిఁ ♦ గాంచి గొల్చుచుంటివో
నతిప్రమోదమయ్యెనారు ♦ నర్థిమోక్షమిచ్చితిక్
క్షితిఁ జనించవింకమీఁద ♦ సిద్ధమో మునీశ్వరా ॥

అనిపలికిన.

రా-త్రో. అరయగ మీగురు, డగునగస్త్యముని, వరునిఁజూడ బోవలెను। బిఱబిఱ మూవెరు, వెంబడిరమ్మని-పిలిచికొనుచుఁ వెడలె ను ॥ రామ ॥

వ. ఇట్లుపోవుచు.

క. సీతారాము లగస్త్య
భ్రాతృగృహాంగణముఁజేరి ♦ భక్తిని నాతం
డాతిథ్యమియ్యఁగొని సం
ప్రీతునిగాఁజేసిచనిరి ♦ ప్రియమున నవలన్.

వ. ఇట్లుచని యగస్త్యాశ్రమంబు సమీపించి సుతీక్ష్ణమునింగాంచి,

త్రో. మీగురునకు మా, యాగత వార్తను-రాగంబున నెఱిగిం పఁ । వేగమె పొమ్మన - వెడలి సుతీక్ష్ణుఁడు-దాగదిలెను రాముడం పన్ ॥ రామ ॥

ప్రేమను శిష్యుల-కామోదంబున- రామనామ మహిమంబు । వేమఱు దెలుపుచు-వెలయుచున్న గురు - వీరున కెరగికరంబు ॥రామ॥

గీ. స్వామి! శ్రీరామచంద్రుఁడు ♦ జనకజాత
సోదరులతోడ మిమ్ములఁ ♦ జూడవచ్చె
నవఁగనుప్పొంగి యర్ఘ్యపా ♦ ద్యములఁగొనుచు
నేగి శిష్యాళితోఁగూడ ♦ నెదురుగాను.

వ. ఇట్లుచని జానకీలక్ష్మణ యుతంబుగా రాముండు మ్రొక్కిన లేవనెత్తి యాలింగనంబుఁ జేసికొని పర్ణశాలకు గొనివచ్చి పీఠంబిడి పూజించి ఫలహారంబులు వెట్టి యిట్లనియె.

అగ-కీర్తన, ఆదితాళము, బిలహరి.

అత్యంతసంతోషము, భవ, దాగమనంబుమా ॥కత్యంత॥ శ్రు

త్యంతములచేత। శోధించిచూచిన। నిత్యానందమైన। నీదివ్యదర్శన॥మత్యం॥ నీనామమంత్రాను, ష్ఠాన, తత్పరులకు। మానుగగోచర, మా నీదుదర్శన ॥మత్యం॥ మోక్షగుండమందు। మోహనరూపుండై। సాక్షివై నిలచిన సర్వజ్ఞ మీరాక ॥యత్యంత॥

అగ-తో. నామరూప సుగు, ణములు లేనిజగ। న్నాథుండవగు నీయందు। నామాయయుదాని। యందుమహత్తు న, హంకారము దానియందు ॥రా॥

అందున త్రిగుణము, లయ్యెభూతములు। నింద్రియములు ప్రాణములు। బొందుగ నన్నిటి, యందుసూక్ష్మముగ, నుందువంటకను నీవు॥ రామ॥

క. రాజస సాత్విక తామస
రాజితగుణములను గలిసి ♦ బ్రహ్మహరిశివుల్
గాఁజనియించియు జగముల
నోజను బుట్టించి పెంచి ♦ యడుపుదు వభవా!

అగ-తో. క్షీరసముద్రపు। దీరంబునమును। జేరియజాదులు వేడఁగ। ఘోరరాక్షసులఁ। గూల్పదలఁచియవ। తారమొందితివి చూడఁగ ॥రామ॥

క. అప్పటినుండియు దర్శన
మెప్పటికగునోయటంచు ♦ నెదురారయుచున్
దప్పక యీస్థలముననే
నెప్పుఁగఁదపమాచరింపు ♦ చుంటిననంతా!

వ. నేటికిఁ బ్రత్యక్షంబైతివి. నామనోభీష్టంబుదీరె. నేను గృతార్థుండనైతి.

అగ-ఉత్సాహవృత్తము.

గౌతమీతటంబునందుఁ ♦ గలుగుపంచవటికిని
సీతతోడజేరుమది వ ♦ సింపమంచితావగున్
బ్రీతితో మునీంద్రులందు ♦ బెక్కుమందియుంద్రు వి
ఖ్యాతియాఫలాదులచట ♦ గలవుసూ సమృద్ధిగన్.

వ. అని చెప్పి యక్షయతూణీర బాణంబులును ఖడ్గంబును మహేంద్రచాపంబును నిచ్చి వీడ్కొలిపిన నగస్త్యునకుఁ బునర్వందనంబులు సమర్పించి పంచవటికిఁ బోవుచున్న నప్పుడు.

సం-తో. దారినడుమ కొండనుబోలిన యాకారముతోఁగనబడిన । శూరు జటాయువు । జూచి నెమ్మదిని । జోద్యమంది వేగమున॥ రామ॥

తమ్ముఁడ! లక్ష్మణ! తెమ్ము ధనుర్బాణమ్ములు ద్రుంచెదివీని । లెమ్మన నపుడా, లించి గృధ్రపతి-యమ్మెయిఁ బలికెను బూని॥ రామ॥

జటా-కీర్తన, కాపి, ఏకతాళము.

రామ! నేజటాయువువను నామమువాఁడ । నీ । భూమిలోన దశరథునకుఁ-బోలుపుగ సఖుఁడ ॥రామ॥ ఈవనంబునందు నేను-నెపుడు మెలగెదనో! దేవమీకు హితము నేను-దెలుప దొడగెద ॥రామ॥ పంచవటికి బోవుచున్నవారు మీరలు । మించి దనుజు లప్పుడపుడు-మెలగుచుందురు ॥రామ॥ మోక్షగుండదేవ మీరు - మోసపోకుఁడు । యీక్షమాకుమారి నరసి-యేలుచుండుఁడు ॥రామ॥

వ. కావున నేను వధార్హుఁడగాను మీహితంబుఁ గోరువాఁడ ననుఁడు మన్నించి యనంతరంబున.

మధురగతి రగడ - పల్లవి సహితము.

పంచవటికి జనిరీ । వారు । పంచవటికి జనిరి॥ కుందకురంటగ-కోవిదారములు । జందన తిందుక-సాల వృక్షములు । మందారంబులు-మామిడిగున్నలుఁ। బొందుగఁ జెలఁగెడు-పొగడలుఁ బొన్నలు। మాలూరంబులు మాకందంబులు । దాళంబులు హిం-తాలచయంబులు । దాడింబలునుగ, దమ్బవృక్షములు । నాడెములగు ఘన, నారికేళములు । కరకలుసిరికలుఁ గంటక ఫలములు। గురువకములు న్యగ్రోధవృక్షములు। శ్రీగంధంబులుఁ జిరుబిల్వంబులు । బాగుగ జాతీ, ఫల వృక్షంబులు । నౌదుంబరములు - నశ్వత్థంబులు । మోదుగలనఁటులు-మొనలగు తరువులు । ఫలకిసలయసుమ భరితములనుచును । వెలయుచునుండఁగ-వేగమెకనుచును । శుకపికరవములు, సొంపుగ వినుచును । బ్రకటిత శీతారామలక్ష్మణులు॥ బంచవటికిఁ జనిరి.

గీ. ఇటుల పంచవటికి ♦ నేగి నిర్మలమైన
తావుఁ జూచి యచట ♦ దాశరథులు
పర్ణశాలఁ గట్టి ♦ బాగుగఁ బూజించి
యొనర నందుఁ జేరి ♦ రుత్సవమున.

వ. ఇట్లు పర్ణశాలయందు నివసించి మునుల సద్గోష్ఠితోఁ గాల యాపన చేయుచున్నంత.

సీ. అంతట లక్ష్మణుం ♦ డన్నకు వదినెకు
నుపచరింపుచునుండి ♦ యొక్కనాఁడు
ఫలములఁ దేఁబోయి ♦ వనమునఁ దిరుఁగుచోఁ
నురురుగాల్ దేలెడు ♦ నొక్క ఖడ్గ
మభిముఖమైరాఁగ ♦ నదిగొని యచ్చటి
వెదురు జొంపంబును ♦ జనురులుగను
గరఖడ్గమున నరు ♦ కగ నందు మునియుండి
చచ్చిన నాతని ♦ చావుఁ జూచి

గీ. వెఱచి మూర్ఛిల్లి తెప్పిరి ♦ వేగలేచి
యన్నకడ కేగి నే బ్రహ్మ ♦ హత్యఁ జేసె
నాఁడ గతి యేమి యని చర ♦ ణముల వ్రాఁలి
వగవనూరార్చి శ్రీరఘు ♦ వర్యుఁ డపుడు.

సం-తో. అచటి మునుల గని-యయ్యో! యిది యె। ట్లని రాముం డడుగగను। బ్రచురంబుగ వారు, పలికిరి స్వామీ! భయ పడకుడు మీ రికను ॥రామ॥

వ. శూర్పణఖ మగని విద్యుజ్జిహ్వుఁడనువాని లంకకుఁగాపుంచి రావణుఁడు దిగ్విజయార్థంబుగాఁ జనిన.

గీ. లంక తాను గాను త ♦ లంపున నాతఁడు
మాయనేర్వ దాను ♦ బోమె నపుడు
మరల రావణుండు ♦ పురమున కేతెంచి
వానిచేష్ట కలిగి ♦ వసిగఁ గదిలి.

వ. పాతాళంబున నున్న యతనిఁ జేరి యనక్రవిక్రముండై.

ము-తో. తప్పక యాతని-తల దునుమాడియు-దనపురి జేరెను

మరల। జుప్పనాతితో - జెప్పె నీ యిష్టము। చొప్పున బొమ్మని యవల॥రామ॥

వ. శూర్పణఖ తనయుండు జంబుఁడనువాఁడు దండ్రిపగదీర్పుట కయి సూర్యునిగూర్చి బహుకాలంబుఁ దపంబుఁ జేయుచున్న.

ఉ. భానుఁడుమెచ్చి ఖడ్గమును ♦ బాపినఁ దానిటురాక నిన్నునన్
బూనికఁబంపెనిన్ గొనను ♦ బొమ్మని చెప్పి తపంబుఁ జేయుటన్
మానకపోయి యావెదురు ♦ మధ్యముఁ జేరి సమాధినుండె నా
దానవుఁడట్టి ఖడ్గమిది ♦ దానిగొనెన్ మన లక్ష్మణుండ హా!

వ. ఇట్లలవడిన ఖడ్గముఁబూని మీాతమ్ముఁడు.

ము-తో. వెదురుజొంపమును-జిదుమగ జంబుని-వెడదశిరము దెగనీగ్గె।నదిగనిమునియని-యదరుచువచ్చెను-నిదిమంచిది వెతదొగ్గె॥రామ॥

సం-తోహర. ఈవిధిగానే। రావణాదులజ-యించి బ్రోవు। మమ్మనిరి। తావకచిత్తము, దయయుంచండని-తాపసులెల్లను జనిరి॥రామ॥

క. అంతట శీతారాముల
నెంతయుఁ బూజించి ఫలము ♦ లిచ్చియథేచ్ఛన్
సంతుష్టులఁ గావింపుచు
సంతతమును గొల్చుచుండె ♦ సౌమిత్రితగన్.

వ. అప్పుడు చుప్పనాతి యథాప్రకారము సుతునకు బోనపుటికగొనివచ్చి ఖండతనుండయియున్న కొడుకుంగాంచి కొంతవరకు దుఃఖించి యగ్నిసంస్కారంబుఁ జేసి సమీాపస్థులయియున్న మునులను గాంచి క్రోధతామ్రాక్షియయి.

చుప్ప-కీర్తన, ఆదితాళము-బేహాగ్.

ఓహోపాపాత్ములారా! యుండు॥ద్రోహా॥ మంచి।ద్రోహా॥ సాహసమునవింత-ద్రోహము జేసినార॥యో॥ మారు లేకను నాకు, మారుజంపినయట్టి-వీరు డెవ్వరోవాని-పేరు దెలుపునాతో॥నో॥ మోక్షు, గుండశౌరి - యీాక్షు, ణమునవారి - పక్షమైననుగాని, శిక్ష జేయకమాన॥నోహో॥

వ. అని కరాళించి పయికిలంఘించిన శూర్పణఖ వెబ్బకుఁ దబ్బిబ్బునొంది జడదారులు వడవడ వడఁకుచు.

మును-ద్విపద. అనబోకుమమ్మల-నతివరోయొక్క-। మునికుమారుడువచ్చి-ముదమున వెరురు । జొంపంబునతి కెపు, చోనీసుతుండు । జంపంగబడియె నా, జడదారిపిదప। నాపర్ణశాలకు-సరిగెనుసీవు। పోపొమ్ము వానిజం, పుటకనిపంపి।దీనికృతంబున-దెగునురావణుడు । మానకగలుగును, మనకుసౌఖ్యంబు । లనియుబ్బుచుండిరి-యచటితాపసులు।జనుదెంచె నాపర్ణ-శాలదగ్గరకు।జయ్యాననడుగుల, జాడవెంబడిని । నయ్యాసురాంగన-నప్పుడుగాంచి.

క. నవ్వుచురా ముందనియెను
నివ్వనమున కేలవచ్చి ♦ తెందుందువు నీ
వెవ్వరిదానవు తెలుపుము
నివ్వెఱగగు మాకునేడు ♦ నిన్నుఁగన్నంతన్.

వ. అనినఁ జుప్పనాతి.

చు-తోహర. రాక్షసరాజయి లంకనునేలెడు రావణుచెలియలినగుదు।నీక్షితినాపేరు, వినుడుశూర్పణఖ-యెఱిగింపుడుమీరెవరు॥ రా॥

వ. అనియడిగిన రాముండు.

రా-కీర్తన, ఆదితాళము-కళ్యాణి,

ఆకర్ణింపుము భామినీ॥ నీవాక॥
రాకుమారుడను రాముడునాపేరు। సాకేతమ్మగుమాది॥యాక॥
సీతాదేవిది । చెలువుగభార్యగు । సీతడుతమ్ముడు-నాకు॥ నాక॥
ఈక్షితిఁదశరథు, డెలమిదండ్రియగు। మోతుగుండవిభు, సాక్షి॥ఆ॥

గీ. తండ్రియాజ్ఞచేత ♦ దండకవనములఁ
దిరుగవచ్చినాము ♦ తెఱవమేము
నీవుమాకడకును ♦ నేడువచ్చుటకేమి
కారణంబొ చెప్పు ♦ కోమలాంగి!

వ. అని యడుగుటయు.

ఉ. రావణునాజ్ఞచేతను న ♦ రణ్యమునన్ జరియింపుచుండు నే
నీవనమందుఁ దాపసుల ♦ నేరినిఁజూచిన మోహితాత్మనై
భావజుకేళిలో బలిమిఁ ♦ బట్టిరమింతును నెప్పుడున్న నే
వారినిఁబట్టి మ్రింగుదు ♦ ధ్రువంబిది నా కెదురాడరెవ్వరున్.

చు-కీర్తన, అటతాళము, హిం॥ కాపి.

మారుకేళిఁదేలింపుము। మారశరీరాననను॥మారు॥మారుబారిద్రో యకుము। కోరినిను మోహించితి॥మారు॥ వేడుకగనీకునాకు నీడుజోడుగ నుండు। నేడుమోక్షగుండహరి-త్రోసునిను బాయజాల॥మారు॥ అనిన,

రా-తో॰హర. నాకుభార్యయు, న[illegible] దీనికిని। నీకును సరిపడ కుండు। నాకుఁదమ్ముఁడగు నాతిలేనువిను। జేకొని రతులనుగూడు రా॥

కావున, లక్ష్మణు-గలియగబొమ్మన-వేవేగమెచనుదెంచి। భావ జుకేళిని బరగఁగూడుమన-భ్రాంతిభావమునుగాంచి॥ రామ॥

మత్తకోకిల-నేనువీరికి సేవకుండను ♦ నేఁడునన్ను వరించిరన్
జానసీవును దాసివౌదువు ♦ చాలకష్టముగన్దెరున్
గానరాముఁడెనిన్ను నేలును ♦ గ్రక్కునజనుమన్న నా
మానినీమణి రాముఁజేరి క్రి ♦ మంబునన్ రతిగోరినన్.

క. ఇద్దఱితోఁ బడఁజాలను
ముద్దియ లేనట్టివాఁడు ♦ ముదితరో! యతఁడే!
వద్దన్న నేమి! యాతని
యొద్దకె చనుమన్నఁ గనలి ♦ యుగ్రరవమునన్.

చు-తో. అచ్చటికిచ్చటి- కలయద్రిప్పుచును- హాస్యములాడెద రార। చెచ్చెఱనేనీ-సీతనుమ్రింగియు-జెలగినిన్ను దమిదీర॥ రామ॥

సం-తో. కూడుదుననుచును, గూయుచుగదిసిన, గూర్రరాక్ష సినిజూచి। పోడిమిచెడియా। భూమిజవడకగ। బూనగలక్ష్మణుఁడు లేచి॥రా॥

లక్ష్మ-కీర్తన, అటతాళము, ఘరజు.

కోరికనుదీర్చెద-రారావె చెలి॥కో॥
నీరూపురేఖ। నేగనినంత। సారెకుమోహము। మీరెనేనీకు॥కో॥
నీమదినేగం,దామనియంటెని। గామినివిడువక,గలనటవేసేదు॥కో॥
మోక్షగుండహరి,సాక్షిగనీపని-దీక్షగనిప్పుడె-తీర్చెదనేచెలి॥కో॥

వ. అనిన విని కోపంబు విడిచి యానందంబున సౌమిత్రినిడగ్గ ఱిన రామునానతిఁ గైకొని లక్ష్మణుఁడు.

సం-తో. కరమునఖడ్గము, బిఱబిఱదాలిచి - కదియజేరికదున లుకన్। కఱకఱనాసా, కర్ణంబులుచెగ-నఱికెనురక్తమ్మొలుకన్॥రా॥

వ. ఇట్లు ముక్కు-చెవులుం దుదముట్టంగోసిన రక్తంబేఱుగం బాఱ సిగ్గునుదుఃఖంబును దననుమ్రుంప శీఘ్రయానంబున ఖరాసురుని యాస్థానంబునకుం జనిన నవ్వికృతాకారంబుఁజూచి.

క. నీకీ యవస్థ వచ్చుట
కేకారణమమ్మ నాకు ♦ నెఱిఁగింపందగుః
శోకింపకు నేనిప్పుడె
లోకేశులనైన క్షణము ♦ లోన జయింతుర్.

వ. అనిన, శూర్పణఖ యన్ననుగాంచి.

చుప్ప-తో. రాముండనునొక-రాచకుమారుకు। భీమబలుడుతమ్ము నితో। భామామణితో-వచ్చిగౌతమీ। సామీప్యంబునధృతితో॥రా॥

నెమ్మదినుండగ- నేజనివలచిన-సమ్మతించకనునేను। తమ్మునిచే కర్ణమ్ములుముక్కును-దరిగించెనునీవుచూడు॥ రామ॥

వ. అనిన ఖరాసురుండదరిపడిలేచి దూషణత్రిశిరులు వెంటరాం జతుర్దశ సహస్రపరిమిత రాక్షసబలంబులం గూడుకొని కదలిననాచప్పుడుప్పరంబు నిండిమెండుకొని దిగంతంబులు బ్రతిధ్వనులియ్య నదివిని రాఘవుండనుజుని జూచి.

ఉ. రాక్షసురాలి పంపునను ♦ రాక్షసబృందము లొక్క-పెట్టునన్
లక్షకొలంది వచ్చునటు ♦ లక్ష్మణతోఁ జెపు నేను వారికిన్
శిక్ష యొనర్తునంతకును ♦ సీతనునొక్క-గృహాంతరాళమం
దీక్షణముంచి ప్రోవుమిఁక ♦ నేగుమటంచును బంపి పిమ్మటన్.

వ. కోదండరాముం డఖండ ప్రచండ మార్తాండ సదృశకాండంబులు తండోప తండంబులుగాం గోదండంబున నంకించి యెదురు చూచుచున్నంతం దక్షిణంబున రాక్షసదళంబులు చుట్టుముట్టి.

సం. తో॥ కొట్టుడుతిట్టుడు-పట్టుడుముట్టుడు-కోయుడుత్రెయ్యుం డనుచు। నట్టహాసమున-నసురులు తరుశిలశూలంబులువైచిరితఱుచు॥రా॥

వ. అప్పుడు.

సం. తో॥ బాణపరంపర-బంపిరాఘవుండు-పటుతర సేనలనెల్ల। బ్రాణంబులకెడ-బాపెనిముసమునం। బరమమునులురంజిల్ల ॥రా॥

వ. అంత ఖరాసురుని యానతిం జత్తంబునంగొని దూషణుండు భీషణంబుగాంజని.

దూ. కీర్తన-ఆదితాళము-కమాసు.

నీవన నెంతరా ! నరాధమానాకు ॥నీవన॥ కావరమా। తీవరమా, చేవచెడ। బేర్వులు, ఫోవులు । గావిదళించెద ॥నీవన॥ మానవులా । దానవుల। బూనిరణ । ఖోణిజయింపగ । మానుము। మానుము ॥ నీవన॥ కండలును గుండెలును । జెండెదను । దండిగ శ్రీ మోక్షు, గుండ విభునియాన॥ నీవన॥

వ. అని ప్రగల్భంబులాడి కొన్ని శరంబులమునిచి మహాట్టహాసంబుఁ జేసిన నవ్వి శ్రీరాముండిట్లనియె.

రా-తో. నీవారలగతి । నీవెరిగియునిటు । నీవేటికిబేర్లెదవు। చావుమూడియి, చ్చటికివచ్చితివి । గావున నిటుగూసెదవు ॥రామ॥

సం-తో. మంచిదుంకుమని । మహనియ్యాస్త్రము,మించియురంబును గాడ । నంచితముగ । వే, యంగ నవనిఁబడిత యతడునీల్గెనపుడాడ ॥రామ॥

క. పిమ్మట ద్రిశిరుండతి కో
పమ్మునఁ జనుదెంచి యోర ! బలవంతుఁడవే
రమ్మానామెదుటికి బీ
రమ్మెల్లను గాంతునని శ ర్మములు వైచెఁ.

వ. నిర్వక్రపరాక్రమంబుగల శక్రద్వేషులు పెక్కండ్రు లెక్కకు మిక్కుటంబుగాఁ బిక్కటిల్లుచు నాచక్కికి వచ్చిన నొక్కొక్కరిని ముక్కలుముక్కలుగా జెక్కి చిక్కువాపినాఁడ నెక్కడనో ! డాగియుండి యిప్పుడొక్కరుండ విక్కడికి గ్రిక్కున వచ్చితివి. తక్కక నీడొక్కఁ జీల్చెద. నీకుదిక్కెవ్వఁడుండురా! దానవా! ఇదివఱకు నా ప్రతాపముఁ గానవా !

సం-తో॥ అనియొక ఘనశర, మును సంధించియు।నతిభీకరమున వేసియ । మునుకొని యాతని । మూడుశిరంబులు, దునిసిపడియెనా చాయ॥రామ॥

వ. అంతఖరాసురుండు కోపోద్దీపితుండై యెదిరించివచ్చినగాంచి.

రాము-కీర్తన, ఏకతాళము, పూరీకళ్యాణి.

ఓరిదానవా! పోరకమానవా। చేరవచ్చినావా యూరకజనవా !

ఓ॥ మున్ను పోరి-మన్ను గూరి-మృతులయి-యున్న వారి । గన్న బాటిపోక్ష ను । వన్నె దీరి-చెన్ను మీఱి । యసికిని-నెన్న జేరి-నన్నుఁ జేతివి ॥మోరి॥ దండిమోక్ష, గుండరక్ష-కుండనై । మెండుకక్ష-జండ రాక్ష, సుల నిల। జెండపేక్ష-నొందుదీక్ష। వెడలితి, నుండురూక్ష।నిండ,శిక్షయగు॥నోరిదా॥

వ. అనిన ఖరాసురుండిట్లనియె. దిట్టతనంబున లోకాధికుండగు రావణు తోఁబుట్టువు మీకట్టెదుటికివచ్చిన నట్టహాసంబున నట్టియపకారం బప్పట్టున గట్టిగ నొనర్చితివి కట్టాయిట్టి చెట్టవాని నెట్టుసహింపఁదగు. వెగువగల మగవానివయిన బిగువుతప్పక జగడంబునకుఁ దగులుపడుము. నేమగువనుగాను నీపొగు ఁడగురఁ జేసెదఁ దులువా! నాయెదుట నిలువ గలవా! వలవా! అని పలికి కఱకుటమ్ములు పెక్కులువైచిన సొలయక రాముండు.

పంచచామరము. వృధాభిమానమైనపల్కు ♦ విజ్జ్రుంగి పల్కఁగ్
బధంబుగాదు నీవువీర ♦ బంటవైననిల్వరా!
వధింతు నీదు మర్మముల్ గ్ర ♦ మ బునక్రశోద్వేఁలో
వధింతు నీ శిరంబునేఁడు ♦ వ్రియ్యవ్రియ్యలై పడన్.

వ. ఇట్లు పలికి యొక్క యమోఘాస్త్రంబు ధనువునసంధించి.

సం-తో॥ ఆకర్ణాంతము-బీకివిడువగను-నడిచని యాతసిశిరము। ఖ్రాకటముగ నిల, పైన గూల్చె సుర-వరలు మేలనగఁగరము ॥రామ॥

వ. ఇట్లు ఖరాసురాది రాక్షసుల నిశ్శేషముగా వధించిన పిమ్మట సీతాలక్ష్మణులు గుహలోనుండి వచ్చి హతులయిన రాక్షసులఁ గని యాశ్చర్యంబునొంది రాముని కుపచరించి యిష్టాగోష్ఠిగానుండిరి.

సం-తో॥ అంతశూర్పణఖ-యాక్రందింపుచు-నపుడు లంకకును నడిగె।సంతోషంబున।సభకుజేరి రా, క్షసపతిపదముల కెఱగె॥ రామ॥

వ. అప్పుడు రావణుండు దానియొక్క వికృతాకారంబుఁజూచి.

రావ, కీర్తన, ఆదితాళము, బేహగ్.

అప, కార మెవ్వరు చేసిరమ్మ! వారి, పేరు జెప్పుము వింద కొమ్మ! అప॥ ఈ, తీరున దుఃఖపడకమ్మ! నారి-వారి, బోరి-చంపుదు నప ॥కార॥ ఆ, ఖండలాదులు వచ్చినారా! మోక్ష-గుండ వారి పంపి

నట్టివారా దనుజ, పింక నీకడ్డపడరైరా! తుండె, ములుగ - జెండి వేసిద నప ॥కార॥

వ. అనవుడు చుప్పనాతి యిట్లనియె.

క. మునివేషధారి రాముం
డను రాచకుమారుఁ డొక్కఁ ♦ డతివయుఁ దమ్ముం
డనురాగంబునఁ గొలువఁగఁ
జనుదెంచెను బంచవటికి ♦ సరభసలీలన్.

క. ఆతని యిల్లాలగు నా
సీతాసతి చక్కఁదనముఁ ♦ జెప్పందరమే
భూతలమున నాకంబునఁ
బాతాళమునందునైనఁ ♦ బ్రతిలేదు సుమీ!

చుప్పనాతి కీర్తన, బేహాగ్-ఆదితాళము.

ఆ, సుందరి యందమే! యందమందు। జగ। మందు నేనుఁ గాన నాపసందు ॥ఆ సుందరి॥ మాటలచే మరుని ఘోటినేలు। నెర, నీటుగల్గు వాల్‌చూపులుమీలు। జిగి। తేటలయిన చెక్కుటద్దములు। దాని। తోటి పొందేచేయు వేనవేలు। మరుని ఘోటినేలు - వాల్ చూపులుమీలు-ఆచెక్కుటద్దములు పొందెచేయు వేనవేలు॥ఆసుందరి॥

కొండలాసిబ్బెపు చనులతీరు। వే,దండము తిన్నని నడకసౌరు। మోము। గూడ శ్రీనాథుని సతిని మీరు। బ్రహ్మాండములో దానికి సరిలేరు, సిబ్బెపుచనులతీరు। తిన్నని నడకసౌరు। శ్రీనాథుని సతిమీరు। నల। దానికి సరిలేరు ॥ఆ॥

చు-తో. దానినీకుఁ దేఁబూని నేను జనఁ-గానే తమ్ముని చేత నానాసాక, ణాలములఁ గోయించెను। నేనెటులుందునుభారిలా! ॥రా॥

వ. అంతఁ జాతాక్రాంతురాలనయి చని ఖరాసురుని యుద్ధంబునకుఁ బంపిన ఖరదూషణ త్రిశిరాది చతుర్దశసహస్ర రాక్షస దళంబుల నొక్కండ విదళించె. వీరనకేలఁ జతుర్దశ భువనము లెత్తి వచ్చిన నమ్మహాసియునకు లక్ష్యమా! రావణా! లోకవిద్రావణా!

చు-కీర్తనము, ఆదితాళము-కేదారిగౌళ.

నిశాటకులవర్యా! వినుమిక ॥నిశాట॥ విశేషముగ నే। వివ

రించెద విను ॥నిశాట॥ సీత లోక విఖ్యాత రూపవతి । భూతలమున నీ । కేతగునూ । ప్రీతిగ నది య, బ్బిన జాలును విను ॥నిశా॥ మోక్షగుండ హరి । పక్షమేమొ ! కాని రాక్షసవరులను । శిక్షించె, నీక్షణమున నీ-విద్ది మెఱుంగుము ॥నిశాట॥

వ. అనిన మంచిదని చెల్లెలి నూరార్చి యింటిలోని కనిపి రావణుండారాత్రి కాలోచితకృత్యంబులు దీర్చి శయనించి కంటఁగూరుకు రామిఁ దన మనంబున.

రా-సం-తో. రాముడెవ్వరో ! రాగ గారణం । బేమి గాతవిూదరికి । ఆమానవు డీ-యసురుల జంపుట-కేమికార్యమాతనికి ॥రామ॥

మానవులకు నీ । మహిమగలుగ సా । మాన్యమె యోచింపగను । దానవకుల వి, ధ్వంసుడుహరి యవ । తారమె త్తెనేమోను ॥ రామ॥

క. కావున నాతనిచేతను
జావిఁక సిద్ధంబునాకు ♦ సరియటులయినన్
ఆవైకుంఠం బలవడు
నే వెరవుననైన దీని ♦ నెఱుగంగఁ దగున్.

వ. అని నిశ్చయించి ప్రభాతంబున రథారోహణంబుఁ జేసిమారీచుని గృహంబునకరిగె నప్పుడతండు మునింబోలి సమాధినిష్ఠుండయి పరాత్పరుని హృత్కమలంబునఁ గాంచుచు.

మారీ-కీర్తన, రూపకతాళము.

పరమాత్మా! పరమేశా! పరమానందస్వరూపా! గురుతరసహస్రిరక్షిత, గుగుమయసురు చిరదీపా! ॥పర॥ నీరాంత, ర్లీలాముని-జాల సుహృత్క్షేలామర । లోలా శ్రీమోక్షగుండ, పాలారి విశాలావర॥ పర॥

వ. ఇట్లు నిశ్చలత్వంబున నీశ్వరారాధనంబుఁ జేయుచు మారీచుఁడు గన్నులు దెఱచి రావణుంజూచి సత్కరించి యిట్లనియె.

మారీ-తోహర. ఏమిపనికినీ । విచటికివచ్చితి । వెఱిగింపుముదను జేందాప్రి । శ్రీమిూఱగనేఁ - జేయగల్గినను । జేయుదు గరుణాసాంద్రా॥ రామ॥

సీ. అనవుడు రావ ♦ ణుండనియె నోమారీచ!
తరణివంశుజుఁ డయో ♦ ధ్యావిభుండు

నగు దశరథునకు ♦ నాత్మజుండగు రాముఁ
డనుజుండు భార్యయు ♦ ననుసరించి
చనుదేరఁ దండ్రియా ♦ జ్ఞనువచ్చి యాపంచ
వటియందునిలిచి తీ ♦ వ్రంబుగాఁగ
ఖరముఖ్యులనుజంపి ♦ కడువడిమన శూర్ప
ణఖ ముక్కు సెవులును నఱికివైచెఁ

గీ. గాన నాతనిసతిని దేఁ ♦ బూనినాఁడ
నీవు మాయామృగంబువై ♦ నేఁడుపోయి
రాముఁగొనిపొమ్ము మిగులదూ ♦ రంబునకును
సీతఁ గొనివచ్చి లంకకుఁ ♦ జేర్తునేను.

వ. అనిన నప్పుడు మారీచుండు బ్రాల్లిపడి.

మారీచ-కీర్తన, ఆదితాళము, శంకరాభరణము.

అబ్బబ్బా! రామునిచేత - దెబ్బతిన్నవాడను । నిబ్బరముచాలదు మా, యబ్బతోఁడుచాలును ॥అబ్బ॥ పిన్ననాడేవార్ధిఁబడ । వ్రేసిబాణమునను । నన్నిప్పుడు బ్రతుకనిచ్చు - నా నామదిమఱువను॥ అబ్బ॥ మోక్షుగుండశౌరి యతఁడు-మునిజన సమ్మతుఁడు । సీక్షితినెగ్గాచరించి-యెవరు బ్రతుకనేర్తురు॥ అబ్బ॥

మా-తో. తర్వాతనునే-దండకవనమున । దగనాతండుండుగను। బూర్వవైరమున - బులిరూపంబునఁ - బోయి తగిలితిని నేను॥ రా॥

తీవరముననొక-దివ్యశరంబును-నైవదప్పిపోగాను । జావుదప్పినే నరగనచ్చియి, చ్చటమునినై యున్నాను॥ రా॥

క. రాముండన రత్నంబన
రామామణి యన్నరవము ♦ రాజని యెన్నఁ
రామొదలను గలిగినయా
నామంబులు విన్నఁ గ్రన్న ♦ నఁ భయపడుదుఁ.

వ. అదియునుంగాక యొక్కవిశేషంబు వివరించెద.

క. రాక్షసకులంబు నెల్లను
శిక్షింపఁగఁ బూనియతఁడు ♦ చెలఁగు నయోధ్యా

సుక్షేత్రంబునఁ బొడమిన
సాక్షాన్నారాయణుండు ♦ సర్వజ్ఞుఁడగుఁ.

మా-తో. కావున నాతని, తో వైరంబునఁ - జావుదప్పదు మన
కెల్ల। దేవదేవుడని- తెలిసిభక్తితో । సేవించుటకదు మెల్ల॥ రా॥

వ. అని పలికిన మారీచుని యధైర్యవచనంబులు విని రావణా
సురుం డిట్లనియె.

రావ-కీర్తన, బేగడరాగము, ఆదితాళము.

భయపడకు। భావములోపల॥భయ॥ నయమతిసేవేళ। నామాట
మీఱకు॥ భయ॥ రాముడాపరం-ధాముడుచావైన। నేమివానిచేజచ్చి।
తేముక్తిగలుగును॥ భయ॥ నేనుజయించితే వానియిల్లాలుతో। మానని
సుఖములు। మానుగబొందుదు॥భయ॥ మోక్షగుండరఘు-మూర్తినేమ
ఱించి యీక్షణముననేను నిలసుతఁదెత్తును॥ భయప॥

సం-తో. పొమ్ము శీఘ్రమున-బోననియంటే! పొరిగొంతునునిన్న
నగఁ। నెమ్మదిహరిచే-నీల్గుటమేలని-సమ్మతించిదాఁ జనగఁ॥ రామ॥

వ. ఈపర్యాయము రామునిచేతనిశ్చయంబుగా మరణంబుగలు
గుననితలంచి మారీచుండు రావణునిరథం బెక్కి యిరువురునుమహావేగం
బున బంచవటికినరిగి రాముని పర్ణశాలకు సమీపించిన నంత.

క. కాంచనవర్ణము రజత ప
మంచితమగు పొడలునీల ♦ మగునేత్రంబుల్
మించుగ రత్నపుఁగొమ్ములు
గాంచనమణి ఖురము లమరఁ ♦ గా మృగమయ్యెఁ.

వ. ఇట్లుమారీచుండు విచిత్రమైన యొకమాయలేడి యాకారం
బుధరించి పర్ణశాలచేరువకు రాఁగాగాంచి రాముంకు సీతకిట్లనియె.

చ. రమణిరో భిక్షురూపమున ♦ రావణుడిప్పుడువచ్చు ముఖ్యరూ
పమును నదృశ్యమౌనటులఁ ♦ బావకులోపల, దాచిమాయరూ
పమునుధరించియుండు మొక ♦ వర్షముదాఁక దశాననుండు దా
సమసినమీదఁవచ్చి ననుఁ ♦ జయ్యనఁ జేరుదువాక జానకీ!

వ. అనిబోధించిన వల్లెయని యాప్రకారంబొనర్చి సమీపమున
జరించు మాయామృగంబునుజూచి మాయాసీత శ్రీరామునకిట్లనియె.

సీత-కీర్తన, అటతాళము, హిం॥ కాపి.

రామయీమృగమ్ము। బ్రేమతోఁబట్టితెమ్ము॥శ్రీరామ॥ హేమాభముఁదెల్లపొడ-లేమొవింతగానున్నది॥ శ్రీరామ॥ ఈడదీనితోఁడగూడి। యాడుకొన వేడుకయ్యె। నేడుపట్టితెచ్చిదయ। తోడనాకుసియ్యవగు॥ శ్రీరామ॥ వనవాసముదీరినంత। మనమయోధ్యఁజేరినపు। డనుపుగమాయత్తలకుఁ, గనబఱచి యానందింతు॥ శ్రీరామ॥ ఎన్నడిట్టి మృగమును గన్నామెయీవనమందు। గన్నులకుబండువుగ। నున్నదిది మోహముగుండ॥ శ్రీరామ॥

సం-ద్వి. అనుసీతవాక్యంబు, లాలించిరాముఁ। డనుజునిఁజూచి యిట్లనిమోదమ్మునొంద। దాని-నేదెచ్చునం, తకునుసీవిచట। జానకిఁగాపాడు-జాగ్రతగాను। దానవమాయల, దగులకుమనిన। మానుగామృగమయి, మారీచుఁడలుక। తోవచ్చినటులఁదోఁ, చుచున్నయది। పోవలదన్నన, ప్పుడు రాముఁడనియె। మారీచుడైనల, క్ష్మణవానిమాయఁదీరుగామాయించి-తెత్తునేఁజూడు। సీతకోరికనుదీ-ర్చెదనుంతుమనుచుఁ। జేతవిల్లంబులుఁ జెచ్చెరఁబూని। పోయియామొకనును-బొంచిపట్టంగఁ। బోయిననదియు న, ద్భుతముగా నపుడు.

సం-తో. చిక్కినట్టుగా। దక్కినట్టుగాఁ-జేరువకును దాఁ జేరు। మక్కువఁబట్టగ-మఱిపోయినచో-జిక్కులఁబెట్టుచుఁబాఱు॥రా॥

వ. ఇవ్విధంబున మోసంబుజేయుచుఁ జాలదూరంబు త్రిప్పిన నదిరాక్షసమాయగా నిశ్చయించి రాముండు కోపోద్దీపితుండై.

సం-తో. చాలగబ్రహ్మాస్త్రంబున మాయెలు। దూలవ్రేయన సురుండు। హాలక్ష్మణ! యను - నార్తారవమునఁ - గూలెనవనిపైనతఁడు॥ రామ॥

వ. ఇట్లు మారీచుండు గూలిన నతనితేజంబు పరాత్పరుఁడయిన రామునియందుఁగలిసె. నంత నాధ్వనివిని సీతాదేవి భయాకులితచిత్తయై లక్ష్మణునిఁజూచి.

సీత-కీర్తన, హిం, తోడి, రూపకము.

పొమ్ములక్ష్మణా! లే। లెమ్ములక్ష్మణా! నెమ్మదిరాముండుపిలిచె, నిన్నులక్ష్మణా! ॥పొమ్ము॥ ఏలపిలిచెనో। చిక్కు-తేవిఁగలిగెనో! జాలమేల

జేసెదవు చాలులక్ష్మణా! ॥హా॥ రాక్షసాళుల-చేత రాపుకలిగెనో! మోక్షగుండశౌరికయిన । మొక్కులక్ష్మణా!॥హా॥

వ. అను దీనాలాపంబులువిని లక్ష్మణుండు.

క. మారీచుఁడు మాయామృగ
ధారుండై వచ్చెనతని ♦ దఱుముచుఁ జని యా
శ్రీరాముఁడు చంపినచోఁ
బేరెలుఁగున రామునట్లు ♦ పిలిచెనునన్నున్.

ల-త్రో. వాఁడుగాఁడుత్రిభు, వనములుపైఁబడివచ్చిన భయమేమ మ్మా! కూడముట్టియును-గూల్చెడెగడియలో। కొదువఁబండునేయమ్మ॥

నన్నిచ్చటనుం, డమనిచెప్పెఁజని-ననునాపయిగోపించు । నన్నుయాజ్ఞకెదు, రాడజాలనత-డతివేగమె యేతెంచు॥ రామ ॥

వ. అటువెనుక సీతాదేవి యత్యంత సంతాప కోపంబులు వ్యాపింప మరఁదినిగాంచి.

స్రగ్వి. రాముఁడాలీలఁ జీ ♦ రంగ నాలింపకే
తామసించేవు ఖే ♦ దంబునుర్ జెందవా!
రాముఁడిచ్చోటికిన్ ♦ రాకయున్నంతనన్
క్షేమమంచీవు ద ♦ క్కించుకోఁ బూనితో!

వ. దండకారణ్యంబుననుండఁ గోదండరాముని బొమ్మని భూమండలంబుఁ దానొక్కండనేల భరతుండు గాంక్షించె. రాముని క్షేమంబుఁ గామింపక నామీఁది ప్రేమాతిశయంబుచేత నీమాక్కియుపేక్షించి నీవున్నవాఁడ, నన్నమేలు గన్నులఁ గనలేని మీయిద్దరి సుద్దిబుద్ధికిఁ దద్దయుండోఁచె. నీకేలయింతదుర్బుద్ధి నాప్రతిజ్ఞవినుము.

సీత-త్రో॥ గోదావరిలోఁ- గూలిప్రాణములు - గోల్పోదునుగా సికను । నేదక్కుదునే! నీకు-భరతునకు-నేడని యేకువగాను॥ రామ॥

చేతులతోదన-చెవులుమూసుకొని-చింతాక్రాంతుం డగుచు । నోతల్లీ! నే, బోమెదరాముం, డుండిన చోటికి ననుచు ॥ రామ ॥

క. వనదేవతలారా! యీ
జనకజఁ గాపాడరయ్య ♦ చనిమెదసింకన్
ననుదూలనాడెసీమెయుఁ
గన నామెడఁదప్పు లేదు ♦ కంటిరిగాదే!

వ. అనియొప్పగించి దుఃఖించుచు మెల్లమెల్లగానడచుచు రామ సహాయార్థంబుగాఁ జనియె. నాతనరిగి తరుణంబుగానెంచి యాప్రాంతములఁ దాగియుండిన రావణుండు దండకమండలంబులు ధరించి భిక్షుక వేషంబునఁ బర్ణశాల డగ్గరిన నతని నిజమునిఁగా భావించి సీతాసతి పర్ణశాలఁదాటి వచ్చి మహావినయంబునఁ బూజించి.

సీ-తో॥ కందమూలములు । ఘనముగనిడిభ । క్షణజేయుడుముని వర్యా! అందముగానా, యధిపుడువచ్చెడ-నంతకుండుడో యార్యా॥ రా॥

వ. అనిన భిక్షుకవేషధారి యిట్లనియె.

రావ-తో. ఎవ్వరునీపతి । యెఱిగింపుముసతి । యిది రాక్షస సం వృతము । ఇవ్వనవాసం, బేటికిగలిగెను । నెవరుపంపిరన వినుము॥ రామ॥

సీత-కీర్తన, అటతాళము, కాపి.

జానకినాపేరు । జనకునికూతుర । మానుగ నయోధ్య, మాది, శ్రీరాముడు । నానాథుడగువిను । నామఱది లక్ష్మణు । డౌను దశరథు డే, యగును మామామ ॥ జానకి ॥ తండ్రిపంపగనన్ను । దమ్మునిదో డ్కొని । దండకమునకు నా । ధవుఁ డరుదెంచెను । దండిగనొకపని । యుండిపోయిరి వార । లుండుడుందాక । మోక్షగుండేనుడలఁచుచు॥ జా॥

వ. అనిన నతండు.

రావ-తోహర॥ లంకాధిపుడను । రావణుడనుహా । లస్త్యసు తుడ శూరుడను । బూటకముగాగొని । పోదునన్ను మా, పురికివలచి యున్నాను॥ రా ॥

క. మునివేషధారియగు రా
మునినీక విడనాడినన్ను ♦ మోహింపుము నీ
కనుకూలమైన సుఖములఁ
దనిపెద వనవాసబాధ ♦ తలగును లలనా!

వ. అనువాక్యంబులు గర్ణశూలాయమానంబులయిన సీతయు ల్లంబున భీతిల్లుచు.

సీత-కీర్తన, అటతాళము.

రణరంగశూరుడు రఘు-రాజకుల శేఖరుడు । బ్రాణతార్తిభంజ నుడగు। రాముడెఱుగ పురనిన్న॥ రణ॥ నన్ననగాని నూట-లన్నిటికఫలమేమి

నిన్ను నొక్క-బాణమున । నేఁడుధరఁగూల్చుజూడు ॥రణ॥ ఉంటిమిసుమంత మోక్ష । గుండశిఖుఁడే తెంచు-వే, దండమశేకములనఁ - దగునునాతని నిన్ను ॥రణ॥

వ. అంతట.

సం-తోహార॥ రాక్షసాధిపుం-డక్షయమగుగురూ-క్షేక్షణములవీక్షించె। నాక్షణమున నాయతివమ్ముంగల ని-జాకారముఁగనఁబఱచె॥ రా॥

కరములువింశతి-శిరములుపదియును-గాలమేఘసదృశంబు । గిరి బోలినయా-కృతితోఁడభయం-కరముగబరగెగరంబు॥ రామ॥

వ. ఇట్లు దన నిజరూపంబు గనఁబఱచి.

క. జనకజచుట్టును భూమిని
దననఖములఁ ద్రవ్వి బాహు ♦ తతిచేఁ గడు బ
ల్మిని నెత్తి రథముపైనిడి
వినువీధిని బఱపెనపుడు ♦ వేగముతోఁడన్.

వ. అంత సీతాకాంత భయభ్రాంత స్వాంతయయి చింతించుచు నెలుగెత్తి.

సీత-కీర్తన, ఆదితాళము, పీలురాగము.

రామా రామా! జగదభిరామా! రామా। వైరివిరామా! రామా॥ రా॥ రామా! నేనన। రానిమా।టలను। నామఱంది న,న్నా నెఱుగకజయ ॥ రా॥

పాపాత్ముఁడు చెఱ। బట్టెనన్ను వీని । రూపుమార్చినను, గాపాడుమురఘు॥ రా॥ రాక్షసుడింత ప, రాక్రిముడాయెను । శిక్షింపుముతగ-మోక్షగుండరఘు॥ రా॥

వ. ఇట్లు దుఃఖింపుచున్నంత.

గీ. ఆలతాంగివిలాపంబు ♦ లాలకించి
పక్షి రాజు జటాయువు ♦ పరఁగవేగ
నడ్డముగ వచ్చి యోయసు ♦ రాధమా! భ
యంబు లేశము లేక న ♦ యంబు విడిచి.

జటా-తో॥ లోకమాతయగు - సీకమలాక్షిని - జేకొనిపోవఁగఁ దగునా! ప్రాకటముగఁద, త్పతియుండిననీ-ప్రాణముగూల్పక పోనా!॥ రా॥

వ. ఐన నమ్మహానీయుని సేవకుండగు నేనుండ నీపుండరీకాక్షి కేమిభయము. మదీయ తుండాగ్రమున నీకండలు తుండములు జేసి మోడ వేయుదు. గుండెగల దండిమగండవైననుండుమురా! రండా! నిలువగలవా! నాదండనని రాక్షసుని నాక్షేపించి తత్క్షణంబునఁ దనపక్ష యుగ్మంబు విసరి పైకెగసి తుండంబునంబొడిచి.

సం-తో॥ రథముమల్చి గుర్రమ్ములగూల్చి చూర్ణముగావించె నుధనువు। పృథుకోపంబున-బిట్టుదాకి-నొప్పించెను రావణుతనువు॥ రా॥

వ. ఇట్లువిరథుండయి రావణుండు రోషానలంబు జాజ్వల్యమానంబుగా మండుచుండ.

సం-తో॥ ఒక్కఖడ్గమున, నెనర జటాయువు-రెక్కలు గాళ్లను విఱుగ। గ్రుక్కిన గ్రక్కున। బక్కి-జేడుదా।స్రుక్కి-ధరణిపై మొరుగ॥ రా॥

క. మరియొకరథమునసీతను
నురవడినెక్కించుకొనుచు ♦ నుష్పరవీధిన్
బఱచుచునుండగ మదిలోఁ
బురపురఁ బొక్కుచును వగచెఁ ♦ బొలతుక యంతన్.

సీత-కీర్తన, హిందూస్తాని, రూపకతాళము.

ప్రాణనాథుమన్న వీడీ, పాటు పడునా! ప్రాణములతో వీనినవల-బాఱనిచ్చునా! ॥ప్రాణ॥ జనకునిపుత్రినై దశర, థుని-కోడలనై। యనుపమ కష్టము బొంద। నాయె! బుడమిపై ॥ప్రాణ॥ పతినిబాసి దనుజునకును పట్టుపడగను। బ్రతిలేక విధాతనుమట। వ్రాసెనేమోను॥ ప్రాణ॥ శ్రీమోక్షగుండేశుడైన। శ్రీరామునకు। నామాట నెఱిగించెడి। పుణ్యాత్ములెవ్వరో! ॥ప్రాణనాథు॥

వ. శ్రీరామున కీపోబడి సూచించువఱకు నీ జటాయువు జీవితుండయి యుండుఁగాక యని మనోవీధి నుద్దేశించి మఱియు.

సీత-తేవారము. హాసుమిత్రాకుమారా!♦హామహామేరుధీరా!। నీ సమానంబుగానా!♦నిఖిల లోకములలోనా। దోసమన కట్టిమాటఁ♦ దొలగకాడితిని నోట। యీసుతో జూడకన్న!♦నికను మన్నింపుమన్న॥

వ. ఇట్లు సీత విలపించుచుండ రామలక్ష్మణులు వెంబడించి వత్తురేమో! యను శంకచేత లంకాధిపుఁడు వాయువేగంబున వియ

న్మార్గంబునఁ దిరిగి చూచుచు బోవుతఱి జానకి యధోముఖియయి యప్పుడు.

గీ. ఋశ్యమూక మను గి ♦ రి ప్రదేశమ్మునఁ
గూరుచుండి రైదు ♦ గురు కపీ న్ద్రు
లరసి చీరజించి యందు ♦ సొమ్ములు మూటఁ
గట్టి వారి యెదుట ♦ నట్టివైచె.

వ. వీరయిన నా వార్త శ్రీరామున కెఱింగింపరా! యని సీతాదేవి సొమ్ములమూట వారి ముందఱఁ బడవైచె నంత.

సం-తో. అంబుధిదాటి ర, యంబున లంకకు - నసురేంద్రుడు చనుదెంచెఁ । గంబుకందరిని-గడిమి నశోక వ, నంబులోపలను నుంచెఁ ॥రా॥

వ. ఇట్లునిచి త్రిజట లోనగు రాక్షసాంగనలఁ బెక్కండ్రఁ గావలియుంచి.

క. అతివేగ మీరు జానకి
కతిహితములు గఱపి యెటుల ♦ నైనను నన్నుఁ
సతతంబుఁ గూడునటు స
మ్మతిఁ జేయుం డనుచు మాటి ♦ మాటికిఁ దెలిపెఁ.

వ. ఈ ప్రకారంబున నాజ్ఞాపించి రాక్షసుండు యథాహఁ రీతిగా రాక్షసరాజ్యపరిపాలనంబుఁ జేయుచుండె నక్కడ శ్రీరాముండు.

సం-తో. మారీచుని దును । మాశ్రి పర్ణశాల । జేరవచ్చుచుం డగను । దారినదుమ ఖే । దమున నెదురుపడ । దమ్ముని గని యిట్ల నెను ॥రామ॥

రాము-కీర్తన, శంకరాభరణము, ఆదితాళము.

సుందరి నొంటిగ । నందుంచి యిచటికి । నెందుకు వచ్చితి । వెఱిగింపు లక్ష్మణ ॥సుంద॥ మనమీద గసరూని। దనుజులు సనుదెంచి। వనితను నేమేమి । నంత నొందింతురో ॥సుంద॥ నీ మోము వాడిన । దేమో! చింతించేవు। శ్రీమోక్షగుండేశు। డేమిగావించునో! ॥సుంద॥

వ. అనిన లక్ష్మణుండు విన్నఁబోయిన మొగంబుతో నన్నకు నమస్కరించి.

శా. మారీచుండిలఁ గూలుకాలమున రామా! మీవలెన్ నన్ను దాఁ
జీరన్ మీరని యోచి శోకపడఁగా ♦ సీతాంబ పొమ్మన్న నో
నారీ! రాక్షస మాయలంచుఁ దెలుపన్ ♦ నా మాటలాలింపకే
దూరెన్ మిక్కిలి నెమ్మదిన్ విసికి నే ♦ దుఃఖింపుచున్ వచ్చితిన్.

వ. అని తెలిపి నా పదంబులపయి వ్రాలి.

క. నా వలనఁ దప్పు లేదిఁక
నా వనదేవతలె సాక్షి ♦ యన్నయ్యా! నీ
సేవకుఁడ నన్ను దయతోఁ
గావు మనుచు దుఃఖపడగఁ ♦ గరుణాన్వితుఁడై.

వ. లక్ష్మణు నూరార్చి లేవనెత్తి దేహంబు నిమిరి.

రాము-తొ. తరుణి మాటలకుఁ దందర నొందుచుఁ-దమ్ముఁడ నీవు రానేల! సరగున బోదము - చాన చెంత నె-వ్వరు లేరొక్క-తె బాల ॥రామ॥

వ. అని యోచింపుచుఁ దమ్మునిఁదోడ్కొ-ని శీఘ్రయానమ్మున వచ్చి పర్ణశాలఁ జేరి యరసిననాఁడు సీత లేకుండినఁ దల్లడింపుచుమూర్ఛ పోయి కొంతవడికిఁ దెలిసి దిక్కు-లు పాఱఁజూచి శోకావేశంబున.

రాము-కీర్తన, హిం, ఝోండి-ఆదితాళము.

ఇక నేమి చేయుదు । నిక నెందుజూతును । అకటవిధినాథు । డతి వనుబాసెను॥ ఇక॥ ఎవరువచ్చినారో! యెవరు గొంపోయిరో! వివరించునట్టివార । లెవరును గనరారు! ॥ఇక॥ భువిమోక్షగుండ । ధవుడనై యున్నను । నవిరళ సుఖదుఃఖ । మనుభవించకబోనా! ॥ఇక నేమి॥

సీ. నినుఁగూడి విహరింప ♦ వనవాస మాయాస
ముగఁదోఁచ దాయెనే! ♦ భుజగవేణి!
నినుఁగూడి భుజియింప ♦ ఘనకందమూలాదు
లరుచింపవాయెనే! ♦ యమృతపాణి!
నినుఁగూడి శయనింపఁ ♦ గను గుశాతల్పంబు
గఱకుగాదాయెనే! ♦ కమలపాణి!
నినుఁగూడి వచియింప ♦ దినములు గడపుట
దడవుగాదాయెనే! ♦ తలిరుబోణి!

గీ. కంటగింపుచు మాయామృ ♦ గంబు రీతి
వచ్చిమారీచుఁ డెడఁబాపె ♦ వనిత మనల
నాదుతలవ్రాత యెుతఱి ♦ నతడెఁ దెచ్చె
నింక నెంటిగ నెటుచరి ♦ యించు నిచట.

వ. ఇట్లు దుఃఖింపుచు సౌమిత్రిని గాఁగిలించుకొని.

రాము- తేవారము. నమ్మినావెంటవచ్చె ♦ నట్టడవిలోనఁజొచ్చె! దమ్ముడా! యెచటలేదు ♦ తరుణిగానంగరాదు। సొమ్మసిలెమేనుచాల♦ శోకమార్పంగఁ జాల। నెమ్మదిని దెలియనైతి ♦ నెలతుకనుగోలుపోతి.

వ. రాముఁడిల జాలినొందుచున్న లక్ష్మణుఁడును గొంతవడి కుఁజింతించి పిమ్మట ధైర్యంబవలంబించి యిట్లనియె.

క. జగములు నీలో నుండును
జగములలో నుందువీవు ♦ సర్వజ్ఞ! హరీ!
యగుణుండవయ్యుఁ బ్రకృతిని
దగులుటచే నొదవె! శోక ♦ దైన్యాదు లొగిన్.

ల-తోహర. అజ్ఞానులవలె- నడలనేల! మీ - యంతవారిపని గాదు। యాజ్ఞోలంఘన, మాచరించియెవ్వరు-రాజు వారిలనులేరు॥ రామ॥
తమరు ధనుర్బాణములు ధరించిన - సమయమునన్నె త్రిజగములు। కమలాక్షియు నె, క్కడనుండిననేమి। గడియకుఁ దెలియదెచాలు॥రామ॥

వ. నావంటిబంటు మీవెంటనుండ సంశయమేల! విపినంబునవె దకిజాడఁగందము పిమ్మటఁ గాఁగల కార్యంబు యోచింతము లెమ్మనె మ్మని పలికిన తమ్ముని సాహసవాక్యంబులచే ధైర్యంబుఁబూని యిద్దరు గలిసి యచ్చటచ్చట వెదకుచు.

రా-కీర్తన, జంఝూటి, ఆదితాళము.

కానరే! నాప్రాణసఖిని-ఖగమృగభూజములారా! నేనువచ్చునం తలోన-నెలతలేదు హితులారా ॥కా॥ తానెచ్చటికైనబోయి-దాగియు న్నదేమోను। యేనీచకర్ముఁడువచ్చి - యెత్తుకొనిపోయెనో ॥కానరే॥ మోక్షగుండహరిని నన్ను-మోసగించి యెవ్వడో! రాక్షసుండు వచ్చి చెలిని భక్షించిపోయినాడో! ॥కానరే॥

వ. అని యివ్విధంబునఁ నవ్వనంబునఁదిరిగి సందు గొందులు సూచుచుఁబోగా నొక్కచోట రథపతాకాదులు విఱిగిపడిన గుర్తులు కనబడిన నిక్కడఁ గొద్దికాలంబున యుద్ధంబు జరిగినట్లున్నదని యెంచుచుఁగొండవలె నచ్చటఁబడియుండిన జటాయువునుగని రాక్షసమాయగా నెంచి రాఘవుండు.

గా-తో॥ ఒక్కరక్కసుం, డున్నాడిచ్చట। నుక్కడంతు సౌమిత్రి! యక్కజముగవి, ల్లమ్ములిమ్మనఁగ। నాలించియుఁగ డుమైత్రి॥ రామ॥

జటా-ద్విపద.

నేజటాయువును మ, న్నింపగాఁ దగుదు। నీజనకునకును నేను మిత్రుండ రావణాసురుఁడునీ- రామ నోరామ! తావడిగొంపోవఁ దాకినేవాని। రథమునుహరుల సా, రథినినడంచి। వధియింపఁబోయిన, వాఁడుజిక్కకను। ఘనఖడ్గముననాదు - కాళ్లుఱెక్కలును। దునిమిన న్నిటు బడ-ద్రోచి తాఁబోయె। గొనప్రాణములదన్ను - కొనుచునే మీకు। జనకజజాడను- సరగఁజెప్పుటకు। జీవించి యున్నాడఁజెడును దేహంబు। దేవస్పృశించి మీ-దివ్యధామంబు। ననుపుగనిచ్చి కృ, తార్థునిజేయు। మని వేఁడి ప్రాణంబు, లంతట విడచె॥

వ. అని చెప్పి జటాయువుమృతుండయినఁ గొంతతడవుదుఃఖించి.

రా-తో॥ పక్షివిభుఁడు మన, పక్షముగలిగియు - రాక్షసాధముని బోరి। యీాక్షితిఁగూలెను - సితఁడుధన్యుఁడగు నికఁజాగేటికిఁ జేరి॥ రామ॥

వ. కృతార్థుని జేయఁదగును లక్ష్మణా! యని యన్నదమ్ములిద్దఱుఁ గాష్టంబులు దెచ్చి యగ్నిచేత అవులుకొలిపి యందు జటాయువు కళేబరంబు దహింపఁ జేసి తాము స్నానంబుఁజేసి.

సం-తో॥ మృగమాంసంబు- ల, మితముగఁదెచ్చియుఁ- దగఖండంబులుజేసి। యగణితమయిన విహంగజాతులకు - నాహారంబుగ వేసి॥ రామ॥

వ. ఇట్లతనికిఁ బరలోక క్రియలుగావించిన నతండు ధన్యుడై దివ్యవిమానంబు నెక్కి వైకుంఠధామంబునకుఁ జనుచు దివినుండి శ్రీరామబ్రహ్మమును నుతియింపఁదొడఁగెగ.

జటా-కీర్తన, అటతాళము, జంఝూటిరాగము.

జయరామ! దశరథరామ! సీతా। రామరఘురామా! శ్రీరామ! రఘురామ। సుత్రామనుతనామ! ॥ జయ ॥ నా, తల్లిదండ్రియు గురువుదైవము- దాతవీవనుచు। నెర, దాతవనుచు। మదిం-దలతు నినుగనుచు॥ జయ॥ భవ, బంధ భయములు వాపుటకు- నాపాలిదేవుడవు। నాపాలిడే ప్రియభక్తవరదుడవు॥ జయ॥ వర, మానిహృద్గృహాలందుదోచుమ, హానుభావుడవు। మహాను సుజ్ఞానరూపుడవు॥ జయ॥ నా, రాయణాహ్వాయ- దాససన్నుత, తోయ భవనయనసిత-తోయ భవనయన। వరతోయ నిధిశయన॥జయ॥

వ. ఇట్లుకొనియాడి యతంశుఁ బరంబునకుఁ జనియె నిక్కడవీరు సీతాన్వేషణంబుఁ జేయుచు దక్షిణాభి ముఖులయి పోవుచు.

రాము-కీర్తన, యదుకులకాంభోజి, అటతాళము.

శ్రీకంతువిల్లునే। నీకొఱకైవిఱిచి। చేకొంటిగదె! జానకీ!॥జా॥ ననుఁబాయజాలక। నావెంటవచ్చిన నిను గోల్పోతిని జానకీ! ॥ జాన ॥ గొప్పయింటబుట్టి! గొప్పయింటజొచ్చి। తిప్పలొందవెనె! జానకి! ॥ జా॥ ఆపదలనింతోచ, వాయె గూడ నిపు, స్సందుచేతను జానకి॥ జాన॥ శ్రీమోక్షగుండశౌ, రిని నేనైయుండి ని,న్నేమఱితిని జానకీ॥జాన॥

వ. ఇట్లుమాటిమాటికిఁ దలచుకొని దుఃఖింపుచు ధయిర్యంబు నొందుచుఁ బోవునెడ నొక్కచో వికృతాకారంబునవచ్చి తననుఁగూడుమని లక్ష్మణుని వేఁడిన యయోముఖికి నసిధారచేతఁ జప్పనాతికంటె గొప్పసౌఖ్యంబు లిచ్చి చనుచున్న నొక్కచోట.

సీ. ఉదరంబునోరును ♦ నొకటిగా నొప్పియుఁ
బాదశిరంబులు ♦ బరఁగలేక
యోజనాయుతమగు ♦ నురుబాహువులుగల్గి
యేదిచిక్కినను బో ♦ నీకదినుచు
నున్నకబంధుని ♦ యురుబాహువులమధ్య
రామలక్ష్మణులుగ ♦ రంబుఁజిక్కి
యన్నదేవినికి ♦ నాహారమయ్యెద
సన్సీతను జూడ ♦ జాల్పుయునుచుం

గీ. దమ్ముఁడన రాఘవుఁడు ♦ విచారమ్మునొంది
ఖడ్గమున వానిదక్షిణ ♦ ఘనభుజంబు
దున్మెఁ జెవామభుజంబు ఖం ♦ డించె ననుజుఁ
డంతనాతఁడు మీరెవ్వ ♦ రనుచునడుగ.

వ. రాముని యాజ్ఞచే లక్ష్మణుఁడు దమ వృత్తాంతంబుఁ జెప్పి నీవెవ్వరని యడిగిన.

కబం-తోహ॥ నేగంధర్వుఁడ - నిఖలమునీంద్రుల - నేగర్వంబున జెనక। బాగుగనొకముని-పరగనాకు శా, పముఁ బెట్టినానావెనుక॥ రా॥ అసురుఁడనై నే, నమర విభునిపయి, నరిగిన నాతఁడువడిగ । వెస దనవజ్రము । వ్రేసెనాశిరము । విపులోదరమునఁనడఁగ॥ రామ॥

వ. అప్పటినుండి శిరఃపాదవిహీనుండనై దీర్ఘబాహుమధ్యంబున సంచరించు జంతువుల బిగఁబట్టి మ్రింగుచుఁ గబంధుఁడన నిక్కడ నున్నాఁడ మీవలన శాపముక్తి యగునని మున్నుముని లనుగ్రహించి యున్నారు కాఁబట్టి నావికారశరీరంబు దహించి ననుఁ గడతేర్పుఁడని వేడిన వారటులచేయ దివ్యగంధర్వుఁడయి వియన్మార్గంబున నిలిచి యంజలి బద్ధుండయి.

కబం-కీర్తన-ఆదితాళము-తంగంమెట్టు.

రామ! రఘురామ! రవికులాంబుధిసోమ! నీమహిమను దెలియ నేనెంతవాడను ॥ రామా ॥ పంచభూతములకుఁ - బంచకోశములకుఁ- బంచవర్ణములకుఁ - బరుఁడవుగురుఁడవు॥ రామా॥ విశదముగను జతు, ర్దశభువనములస, దృశముగ నీదివ్య,-దేహమునందు నిలిచె॥ రామా॥ శ్రీమోక్షగుండవాస ! శ్రీధరచిద్విలాస ! భూమి నారాయణదాస, పోష ! శ్రీ శ్రీనివాస ! ॥ రామా ॥

వ. ఇట్లుపొగడిన సంతోషించి శ్రీరాముండిట్లనియె.

గీ. వినుముగంధర్వ నీస్తోత్ర ♦ మునకునేను
సంతసించితి నీకలు ♦ షంబు దొలఁగ
దివ్యయోగంబునొందుమ ♦ దీయదివ్య
ధామమునుబొందు కమశాశ్వ ♦ తంబుగాను.

వ. అని యాజ్ఞాపించిన నాసందించి రామునకు రావణుని వృ

త్తాంతం బాద్యంతంబుఁజెప్పి శబరి యాశ్రమంబునకుఁ బొమ్మని చెప్పి త్రోవఁజూపి యతండుఁ బరమపదంబునకరిగె ననంతరంబ.

సం-తో. శబరి యాశ్రమ। స్థలమునకును రామ। సౌమిత్రులు పోవగను, ప్రబలమోదమునఁ-బరికించియువారి। రాకకుప్పి యెదురుగ ను॥ రా॥

క. చనుదెంచి వారిపాదము
లను వేడ్కనుగడిగి తజ్జ ♦ లంబు శిరమునన్
ఘనముగ నిడుకొని యాశ్రమ
మునకును దోడ్తెచ్చి పీఠ ♦ ములనిచ్చి తగన్.

వ. మధుర పక్వఫలంబులు సమర్పించిన భుజించిరి పిమ్మట శబరి కరంబులు ముకుళించి.

శబరి-భుజంగప్రయాతము.

పరంధామ మీదివ్య ♦ పాదాబ్జసేవా
పరత్వంబునన్ నిన్ను ♦ బ్రార్థింపఁగంటిన్
నిరాలంబమీరూపు ♦ నేఁడిందుఁగంటిన్
దురంతంబులౌ నాదు ♦ దోషంబులారెన్.

వ. శ్రీమన్నారాయణుండు సాకేతంబున రాముఁడైపుట్టి దశకంఠ కంఠలుంఠనంబుఁ జేయబోవుచో! నీయాశ్రమంబున కనుజయుక్తంబుగవచ్చి నిన్నుఁగృతార్థునిఁ జేయఁగలండని మద్గురువరుండగు మతంగమహామునీంద్రుండు చెప్పియున్నందున.

శబ-తో॥ ఇక్కడ దపమొన, రింపుచుమీరాక। కెదురుజూచుచున్నాను। గ్రక్కునజనె బహు, కల్పంబులునేటి। కక్కజముగన్నాను॥ రా॥ నాసంకల్పము। వాసిగదీరెను। నాకమ్మిక సద్గతిని। దాసశతములకు, దాసురాల నే, దక్కువజాతిని సతిప॥ రామ॥

వ. నిన్నుఁగొనియాడుసమర్థత నాకుఁగలదా! రామా! యని పలికినవిని దయారసంబాలుక రామచంద్రుండిట్లనియె.

రా-కీర్తన, జంఝూటిరాగము, ఆదితాళము.

నాథ క్తియొక్కటిచాలు। శబరి॥ నాథ॥ వైభోగంబులు-నిడుగానేరని। ప్రాభవమత్పదముసుల, భంబుగి చేరగ॥ నాథ॥ జాతినా

ననిశరీరంబొక్క ♦ యామడ పెంచిన
నై దామడలువిప్పె ♦ నదియునోగు
పదియామడలు పెంచెఁ ♦ బవనుజుఁడంగంబు
నిరువది యామడల్ ♦ దెరచెనదియు
ముప్పదిరెట్లుగా ♦ మొనయ నాతఁడు పెంప
నేబది యామడ ♦ లింతిదెఱచె

గీ. నంతనంగుష్టమాత్రుఁడై ♦ యంగుఁదూఁగి
వెలుపలికి వచ్చినిలిచిన ♦ వెలది మెచ్చి
నిన్నుఁబరీక్షింప ♦ దేవతలనుపవచ్చి
నాను నాపేరు సురస వి ♦ నంగివలయు.

తో. రాముని దేవిని-రయమునగనుగొని - రాగలవిక ద్వరగాను। నోమారుతి! నే, బోయెదనని యా, భామిని వేగమెచనెను ॥ రామ॥

వ. అంత హనుమంతుండరుగుచున్నఁగని సముద్రుండు మైనాకునితో నిట్లనియె.

సము-కీర్తన, ఆదితాళము, జంఝూటి.

మారుతి లంకాపురమునకు । జేరబోపుచు నుండెఁగాన। సారెకు నీవేగి కడు వి, శ్రాంతిఁజేయుము లెమ్మికన॥ మారుతి॥ సాగరముచే వృద్ధిపొందిరి । సగరు లెల్లను గ్రిందటన్ । బాగుగ దత్కులజుఁడగు రఘు । వరుని కార్యముఁజేయగన॥ మారుతి॥ మోక్షగుండ పురీశుకరుణా, వీక్షణంబున జేరుము । ఈక్షణంబుననీవు జేరుము । దీక్షతో సత్కారము॥ మారుతి॥

వ. అనియిట్లుసముద్రుండు సెప్పిన మైనాకుండు నరాకృతితోఁ బయికిఁ బెరిగి యాంజనేయునింగని.

తో. వారధిపనుపున-వచ్చినాఁడనా । పేరు దెమైనాకుండు । మారుతికొంచెము-మార్గాయాసము-దీరిన పిమ్మటబొందు॥ రామ॥

వ. సమస్తవస్తువులు ఫలములును దెచ్చినాఁడ నివి గ్రహించి కొంచెము విశ్రమించి పోవలయునని కోరిననతఁడు.

క. వారధి మధ్యనునిలువక
బారెదనని శపథముగను ♦ బలికితినిపుమా

వారలతో నటుగాపునఁ
గూరిమితో విశ్రమింపఁ ♦ గూడునె! నాకున్.

వ. నీయిష్టప్రకారము వచ్చి నాహస్తమును మాత్రము శిఖరంబుననుంచెద హస్తస్పర్శముచేత సంతోషింపుము. మైనాకా! యనిదశ యోజనంబుల వెడల్పు సహస్ర యోజనముల నిడుపుగల యటుచేసి యవతలఁబోవ సింహికయను ఛాయాగ్రహంబువచ్చి యాంజనేయుని మ్రింగుచుండిన.

క. జంతువులు పైనఁబోవఁగఁ
బంతంబున ఛాయపట్టి ♦ భక్షించియుదా
నంతట వారిని మ్రింగున
దంతయు దానెఱిఁగి మారు ♦ తాత్మజుడలుకన్.

తో. అకటా! యిదియొక, టడ్డమువచ్చెను । నాశ్చర్యంబుగ ననుచు । బ్రకటితముగ । గ్రిందికి జనిదానిబ, దమునఁదన్నెనుగనుచు॥ రామ॥

చ. ఇటువలెదానిఁదన్ని మడి ♦ యించి వియత్పథగామియై సము
త్కటబలుఁడౌచు దక్షిణపు ♦ దట్టుగ మళ్ళియు బోయిపోయి యం
తటను త్రికూటపర్వతము ♦ దానిపయిన్ వెలువొందు లంకయున్
దటుకునఁగాంచెమారుతి ము ♦ దంబునడెందము పొంగుచుండగన్.

వ. ఇట్లుగాంచి పగటిపూట లంకాపురప్రవేశముఁ జేయగూడదని సువేలాద్రిపై నివసించి రాత్రికాలంబున నుత్తరద్వారంబునసూక్ష్మ రూపుండై ప్రవేశింపఁబోయిన లంకిణి యడ్డమువచ్చి.

లం-కీర్తన, పూరికాళ్యాణి-ఆది.

నీవెవ్వడవురా! నీపేరదేరా! వేవేగఁజేర । ఈవేళరాకుపోర!॥ నీవె॥ ననుగెల్చిలంక । గనబొమ్ముబింక । మణగింతునింక । హరియింతుగింకకుంక॥ నీవె॥ లంకిణినేను । లంకగాచేను । బొంకగానిను బోనీను మానుమాను॥ నీవె॥ ధరమోతుగుండ, పురహరియుండ । జొరబోనీకుండ । గొరుకుదుగండకండ॥ నీవె॥

వ. అనిపలికి కాలితోఁదన్ని పోనీక యాగినఁ బొడగునఁ బెఱిగి గుద్దెత్తి కేసి యాంజనేయుఁడు.

తో. వెడదవక్షమున। నెడమపిడికిటను। బొడిచినరక్తముగ్రక్కి। పుడమిమీదబడి । పొరలిలేచియా । పడతిపలికెదా మొక్కి॥ రా॥

వ. ఓమహానుభావా! జగదేకవీరా! నీకు జయమగుఁగాక; నీవు లంకలోనికిఁ బోవలసినది. పూర్వమొకపరి బ్రహ్మనాకుఁ జెప్పినది యేమనఁగా నిఁక నిరువదియెనిమిదవ పర్యాయము త్రేతాయుగము వచ్చినప్పుడు శ్రీమన్నారాయణుండు రాముఁడన రఘుకులంబున బుట్టఁగలఁడతనిభార్యయగు సీతను రావణుండు తెచ్చి లంకలో నుంచునప్పుడు రాముని ప్రేరణమువల్ల వెదకుచు నొక్కవనచరుండు రాత్రికాలంబున వచ్చి నీచేత నాపఁబడి నిన్నుదండించగలండు. నీవెప్పుడు పరిభవమును బొందుచున్నావో! యప్పుడే! లంకయు నందున్న రక్కసులును జిక్కువడి నశింతురని చెప్పియున్నాడు. గాన నదినిజంబయ్యె వినుము.

తో. రావణుఁడుండిన । రమ్యసౌధమున । కావలగలదొకవనము। నావనమునఘన । మైనశింశుపం । బనుచెట్టున్నదికనుము॥ రా॥

అందుఘోరదను- జాంగనలలజడి-నొదింపగ దైన్యమున । గుందుచునాతరు కూలంబునసీత । యుందికనుము వేగమున॥ రా॥

చ. జనకజవార్తరాముసకు ♦ జయ్యనఁజెప్పి దరంబొనర్పనా
ఘనునిటు తోడిదెచ్చి దశ ♦ కంతుని కూలఁగఁజేసి లోకముల్
మునుపుమ డెందమందునను ♦ మానము నొందకు నన్నుఁగూల్చుటే
దనుజులు గుర్తిగిరంచుఁ గ్రిమతెక్ దలపోయుము వాయునందనా!

వ. అనిపలికి యతని వీడ్కొని రామధ్యానంబుచేయుచు లంకిణి యదేచ్ఛంజనియె. నంత హనుమంతుండు సూక్ష్మతనుండై లంకలోఁ బ్రవేశించి.

హను-కీర్తన, రూపకతాళము-కేదార.

దీనిసొంపు-గానగను। అనిలింపు। లైన।భ్రమపడ గే! మానసంబులోన,ముద మొదవెను।శ్రీనిధిమై చెలగుచున్న దియపురా॥దీని॥మూడులోక, ములయందు । జూడదీని।జోడుపురికలదే ! నాడెన్నైన-మాడువులు జితిము । వేడుకతో । వెలయుచున్న దియపురా!॥ దీని॥మోక్షగుండా, ధ్యక్షునితో। గక్షగట్టిగాన-నీనగరము । రాక్షసుడు-దీక్షగనునేలుచు । నీక్షితిపై-నిక సుఖపడగాజాలడు॥దీని॥

వ. ఇటువలె పురంబభివర్ణింపుచు గూఢచారుండయి చని.

మధురగతి రగడ.

వెదకెం బవనసుతుండు। లంకను। క్షితికుమారినపుడు। వరరథశాలలు-వైద్యశాలలును,।హరికరిశాలలు-నస్త్రశాలలును,। వీరభటులుగల-విపులగేహములు। శూరులు నిలిచిన-సుందరగృహములు। వీధులు దిన్నెలు-విపణిమార్గములు। సౌధంబులు ర-చ్చలు గోపురములు। దేవాలయములు-చెలియనిగొందులు। సావడులును దు, స్తరమగు సందులు॥ వె॥ వందిమాగధుల-వరగేహంబులు।నందములగు గా, యకులగృహంబులు। వారకామినుల। వరమందిరములు। పౌరాణికసుం, భన్మందిరములు।మంత్రివరుల ని, ర్మలమందిరములు। తాంత్రిజ్ఞుల సుం, దర మందిరములు। గదిసిసుమాలా, కారులయిండ్లును। వదలకచని వై, వజ్ఞులయిండ్లును॥ వె॥ కుంభశ్రవణుని-గోప్యపు నెలవును।కుంభనికుంభుల-గురు వాసములును। అతికాయుని ది, వ్యంపు సౌధమును। బ్రీతి లేని యకం, పనుని సౌధమును।కంపనునగరును-ఖరసుతు భవనము।దెంపునంజనియా-త్రిశిరుని భవనము।నక్షయకుమారుని-యమలమందిరము। నక్షయమగుధూ, మ్రాక్షు మందిరము।దూరియుంద్రజిత్తుని గేహంబును। దారుచు దేవాం-తకు గేహంబును।నామహోదరుని-యతులమందిరము।నామహాంగుండు-న్నట్టిమందిరము। సారదిమహాపా - ర్శ్వనివాసంబును। వరుససుపార్శ్వుని - వరనిలయంబును। గడమ పెక్కు-రా-క్షసులసదనములు। అడరు లేక ది, వ్యాంతఃపురములు॥ వెదకెబవనసుతుండు॥

వ. ఇట్లు వెదకి యెక్కడను గానక గ్రమంబున రావణుని దివ్యసౌధంబు జేరి యందలి పసితనంబునకు నచ్చెరువొందుచుం గావలియున్న వారల బరిశీలింపుచున్నం దిన్నని నడకలతో నంతఃపురంబుం జేరి యచ్చట.

తో. చెలగిరావణుడు-చెఱదెచ్చినయా-స్త్రీలు వానింగలసి। పలువిధసుఖముల - వడసియునిద్రా, పరవశులగుచును సొలసి॥ రా॥

వ. కోకముడులు బిగించుకొనకయు గంచుకంబులు మరలధరించకయు విమానంబుమీందనే యొరిగి నిద్రింపుచుండువారలం గని యాశ్చర్యకలితచిత్తుండయి హనుమంతుండు.

క. ఇట్టి నెరకాంతలుండఁగఁ
గట్టా! దశకంధరుండు ♦ కాకుత్థ్ససతిన్
నెట్టన జెఱవట్టెనుసరి
చెట్టతనంబుననుదాను ♦ జెడిపోవుటకై.

వ. అని కొంతవరకు చింతించి.

తో. స్వామికార్యమును-సలుపవచ్చి జ, వ్వనులపార్శ్వములగంటి
రామునింతి వీరలలో! వెదుకగ-రాదుకలుషమునుగొంటి॥ రామ॥

వ. ఇందుండఁ దగదని యెంచి యవతలఁబోయి యొక్కరత్న వే
దికపైఁ బుష్పసానుపునఁ బవ్వళించి నిద్రపోవుచున్న రావణునిఁ గనుం
గొని యతని యుభయపార్శ్వంబుల.

తో. ఆడియు బాడియు-నడపముఁగట్టియు-నాలపట్టములువట్టి।
వేడుకతోడుత।వింజామరములు।వేసియు నిద్రిలుముట్టి॥ రామ॥

వ. దేవగంధర్వ దైత్యకాంతలు వాఁడు నిద్రించిన పిమ్మటఁ
దమచేతి సాధనంబులు కౌఁగిలించుకొని మయిమఱచి నిద్రింపుచుండ
నద్భుతంబుగా రావణుని విభవంబుఁజూచి తలయూచి యింతలో.

తో. అతనికౌఁగిటను, నలరిసౌఖ్యముల, నందిసుప్తిజేఁజొక్కి।
మతిచెడియుండిన-రతిఁబోలినయా-మందోదరిఁగనిసిక్కి॥ రామ॥

వ. సీతనుగంటినని యానందించి గంతులువైచి వాలాగ్రంబు
జుంబించి కంబంబుల కెగబ్రాకి కొంతవఱకు జాత్రివికారంబులగుపఱచి
యనంతరంబ.

హను-కీర్తన, త్రిశ్రజాతి-జంఝూటి.

నేనెంతమోసపోతి। నేనెంతవెఱ్ఱినయితి। యీసుచుతరుణినిఁజూచి
జానకియనిశోచి। భ్రమసి। నేననుకొంటిగారు। యాపతివ్రతా, తిలక
మన్యగవయగోరునే। మదిదోచదాయెను॥ నేనెం॥ కడుమోక్షగుండ
విభుని। విడనాడియీరావణుని। కొడబడియీగతిని। బుడమిజమధువాని।
చెడునా। తడబడి యెంచితిని। పరమమూఢుఁడ। బాపకర్మకీటులలొంగితి।
నేరమ్ముజేసితి॥ నేనెంత॥

వ. అనియిట్లు చింతించి యనంతరము హనుమాంసయుక్తం

బగు పానీయశాల లరయుచుండెనని చెప్పిన విని శాంకరిదేవి శంకరుని కిట్లనియె.

క. జానకి పతివ్రతగఁద న
మానసమున నెఱింగియుండి ♦ మండోదరి నా
వానరుఁడు గాంచినప్పుడు
దానేల! భ్రమించెమదిని ♦ ధరణిజయనుచున్.

వ. ఆకారణంబేమో వివరంబుగ నాకు సెలవిమ్మని ప్రార్థించిన శర్వాణి కీశ్వరుం డిట్లనియె.

తో. సిరిరూపమువలె-హరిచేమందో। దరినిర్మింపఁగబడియెగా । సిరియంశంబున-సీతయవతరిం-చినదికాన సరిపడియెగా॥ రామ॥

వ. అది యెటులనిన రమాంశ సంభూత సీతగదా! మందోదరి జన్మకథ వినుము.

గీ. ఘనగుణోపేత మాల్యవ ♦ ద్గర్భజాత
ప్రణుత కాంతాసమేత రా ♦ వణునిమాత
వీతపాతక దుఃఖంబు ♦ చేతజిత్త
నుండుఁ బొగలుచుఁ దనయున ♦ కనియెనిట్లు.

కైకేసి-కీర్తన, ధన్యాసి ఆదితాళము.

ఓతనయా! విను। మొకదుఃఖమునా। కొనగూడెను నేను। ఆతె అఁగేమని। యడిగెదవేమో! యీతరి నే వచి, యించెదసర్వము॥ వ్రా॥ శేషోచ్ఛ్వాసము, చేనాలింగము। చేరెరసాతలము। శేషభూషణు భ, జింపుచునుందును। నేసతతంబది। నిలిచిపోయెనిక॥నో॥ ఇమ్మహి మోక్షు గుం, డీశునిగూర్చితి। పమ్మజేసినీవు। గ్రమ్మఱ నొకలింగమ్మునడిగికొని। రమ్ము దానినా, కిమ్ముధరించెద ॥నోతనయా॥

వ. అనినఁ దల్లివాక్యంబులకు వల్లెయని రావణుండు వెండి కొండకు దక్షిణంబుననచ్చి.

ఉ. ఉల్లముమోదమందనను ♦ నొప్పుగఁజేరి నుతించి నేఁడుమా
తల్లికి నాత్మలింగము ము ♦ దంబున నివ్వుమునాకు నీమనో
వల్లభమైనపార్వతిని ♦ బత్నిగ నివ్వుమటంచు వాంఛితం
బల్లనఁదెల్పఁగాఁవిని ద ♦ శాసనుతో నిటులంటిపార్వతీ!

శి-కీర్తన, ఆదితాళము, ఓన్న మోనారా.

రావణా! నీమానసంబు-రంజిలజేతు! నీవుగోరినవరములు-నేడొసంగుదు॥ రా॥ ఆత్మలింగమిచ్చెద మీా యమ్మను విడుము! ఆత్మపత్నినిచ్చెద నీ-వక్కటైకొనుము॥ రావ॥ ఈవరలింగము మరి-నేమరినీవు, పోవుచో భూమిని నుంచ, బోకుకొనలేవు॥ రావ॥ ఎందిది స్థాపితమౌనో! యందువసింతు! నందముగ మోక్షగుండ। మంచుభావింతు॥ రావ॥

వ. అని తెలిపిన మంచిదనిదశవదనుండు నిన్నును లింగంబుగొని

చ. చనునెడనీవు విష్ణుమది ♦ సంస్మరియించినఁ దానెఱింగి చం
దమున లక్ష్మిబోలువని ♦ తర్ల రచియించి మయాఖ్యునెప్పునా
తనికినొసంగఁ బుత్రిగన ♦ తండు దలంచి రసాతలంబు బా
వనముగఁజేర్చితానుఁ దన ♦ భార్యయు నర్మిలి నద్దముద్దుగన్.

వ. సాకుచుండిరి. పిమ్మట నచ్యుతుఁడొక్క విప్రరూపంబున రావణున కెదురుగవచ్చి యిట్లనియె.

తో. ఎందుబోయెదను! జేంద్ర!వచ్చెద వ్రా! యింతియెవ్వరనియడుగ। నిందుమాళిసతి-యీామెవిభుడుఁనా, కిచ్చెననుచుదానుడువ॥రామ॥

వ. కపటవిప్రుఁడు నవ్వుచు నిట్లు పలుకుచున్నాఁడు.

విప్రి-కీర్తన, రూపకము. ఎందుబోతివయ్యా.

మంచిచెడ్డలెందు నీవు, గాంచవైతివి! రావణ!॥మంచి॥వంచనగావించెనీశు-డెంచనైతివి! యేమాత్రము॥మంచిచెడ్డ॥ శైలసుతనుదాచెనుర, సాతలముననుు మయునియింట! బోలఁగ గపటంబు సతిని-జాలనొసఁగెనొ। నినుగొనుమని॥మంచి॥ దేవమర్త్యలోకములు-నీవెఱుంగుట!గాంచెదవని! తావడిబాతాళమందు! దాచెమఱుగుగ! నిశ్చయముగ॥మంచి॥ ఈక్షణమున మయునియింటి! కేగిజూడుము! కనపడుసతి! మోక్షగుండ దేవుసాక్షి! మోసపోకుము॥ దశకంధర॥

వ. అనిన నామాటనమ్మి రావణుఁడుదిరిగి కైలాసంబునకువచ్చి.

క. శంకరకపటంబుననీ। పంకజముఖినాకునిచ్చి ♦ పాతాళమునన్
శాంకరిని దాచితివినే। గొంకకనటజేగితెచ్చి ♦ కొనెదనుగనుమా!

వ. ఈకృత్రిమకాంతను నీవేకొనుమనిపార్వతీ! నిన్నునాకర్పించి లింగముగొనిచనుచు ముందువచ్చియున్న విప్రుసితోఁగలసి.

తో. అల్పశంక కే। నరిగివచ్చెదను। నంతవరకులింగమును। నిల్వు మునీకర, నీరజముననవ। నీసురయనిపలుకగను॥ రా॥

వ. బ్రాహ్మణుం డిట్లనియె.

విప్ర-కీర్తన, ఆదితాళము, వగ పేటికి। అన్నట్లు.

కడువడిగను రావలెను। గ్రక్కున సేజనవలెను। దిడవయినను లింగమును। ధరమీదనువై చెదను। వినుము, చనుము। చెడిపోవుగాదె కార్యమావలను॥ కడు॥ ఘటికాద్వయ మగుదనుక। గనిపింతునునావెను క యిటనుండనునే గనుక। నటుపయి న్యాగ్రహపడక। రమ్ము, పొమ్ము। తృటిలోనమోక్షుగుండ పతికృపను॥ కడువడిగను॥

వ. అని స్పష్టముగాఁ బలికినసమ్మతించి లింగంబు విప్రుని చేతి కిచ్చి మూత్రనివృత్తికొఱకు రావణుండావలఁజని.

క. మూత్రము.విడుచుటముగియక। రాత్రించరుఁడనినరీతి ♦ రాకుండినవా
ధాత్రీసురుండులింగము। ధాత్రినిడెఁ బశ్చిమాబ్ధి ♦ తటముననపుడున్.

వ. ఇట్లుంచి నారాయణుండు స్వీయలోకంబునకుఁ జనియె.

సీ. రావణుండంతయ ♦ థావిధి మూత్రవిసర్జన జేసి య ♦ చ్చటికి వచ్చి
విప్రుండు లేకున్న ♦ వెదకిలింగంబును గదలింప నేమియుఁ ♦ గదలకావు
చెవిఁబోలుగ త్రంబు ♦ శిరమున నేర్పడగోకర్ణమను పేరు ♦ ప్రాకటముగ
గలిగెనాస్థలమున ♦ కెలమిఖిన్న మనస్కుఁడయి దశాననుఁడు నె ♦ య్యమున గదిలి

గీ. చెలఁగి పాతాళలోకంబుఁ ♦ జేరియచట
మయగృహంబుననున్నట్టి ♦ జేరియచట
డెందమందున మెచ్చి యా ♦ నాదమోది
యతనితో నిట్లు పల్కె స్నే ♦ హంబు గనుర.

రావ-కీర్తన, ఆది, ముఖారి. వలదచటికి

మయ! తనయ నిజమయా! దయజూపుమయా! ॥ మయ ॥ నయమైనసద, స్వయజుడ రావణా, హ్వాయుఁడ లంకాధీశుఁడ, బ్రఖ్యాతిపరుఁడ॥ మయ॥ నానునిజగుచెలి। నాకమర్త్య నర, లోకములో లేకమె। నిటువచ్చినాను॥ మయ॥ లక్ష్మణమైనదీ। లగ్నమునందే। మోక్షుగుండేశుకృపను। ముదితనీదగును॥ మయ॥

వ. అనిప్రార్థించిన హరివలన సర్వము మూఁడే! యెఱింగియున్నవాఁడు కావున మయుండు మంచిదని కన్యనిచ్చి పెండ్లిచేసె.

తో. అరిభయంకరంబగు నొకశక్తిని వరణాంబుగనర్పించి। తగుణిని దశకం, ధరునిమాట దా సరగబంపెమోదించి। రా॥

క. మందోదరమున నెప్పుట। మందోదరియనుచుజనులు ♦ మహింబిల్వఁగనా
సుందరియొప్పెనురావణుఁ। డందంబుగఁజేరెలంక ♦ కతివయుదానున్.

గీ. ఇట్లులంకఁజేరె ♦ యిల్లుప్రవేశించి
తల్లికడకుబోయి ♦ దండమొసఁగి
యెల్లసంగతులను ♦ దెల్లంబుఁగా దెల్ప
నాలకించి యామె ♦ యాగ్రహించి.

వ. అంగజ విభంగునిఁ యడిగి లింగంబుఁ దెమ్మని యెఱుంగఁ జెప్పి పంప నాసంగతి భంగపఱచి దొంగ జాడలఁజని యీయంగనను దెచ్చి పరిసంగంబుఁ జేయవచ్చితివి. బంగారువంటి వంగడమున వెంగలి పుట్టితివి. బేలా! నీకీయధైర్యంబేలా! అని తృణీకరించిన రావణుండు లజ్జించి.

తో. గోకర్ణమ్మున, కు నరిగిపద్మజు। గూర్చి తపము జేయగను। ఆకమలజుడత్యంతప్రేమ బ్ర, త్యక్షమైన మొ్రొక్కుచును॥ రామ॥

రావ-కీర్తన, పూర్వికళ్యాణి, ఆటతాళము.

కంజోద్భవా! కావవే! ॥ కం ॥ అంజలిసేసె భక్తి, రంజిల్లగ మ్రొక్కెదను ॥ కంజో॥ నాకుద్రిలోకవ। శ్రీకరసైక బ, లాకృతి-గై కొనగ-లోకేశ్వర, చేకూర్పుము॥ కంజో॥ పోలగనేఱిర-కాలములంకను। నేలగ మోక్షపుర-పాలసుత! వరమీయుము ॥ కంజో॥

వ. అని వేఁడి వరంబులు వడసివచ్చి దిగ్విజయంబుచేసి సర్వసుఖంబులను భవింపుచుండె నదికారణంబున.

క. వైదేహియనుచునామం। దోదరిఁగనిభ్రమసె! నైన ♦ మొనరిచెనిదియా
మీదహనుమంతుడొకపని। మోదంబునజేసెచపుము ♦ మోసవిధముగన్

వ. అది యేమియనిన మయునకు బంధుండఁడగు గయుఁడను రాక్షసుండు బ్రహ్మాదపంబున మెప్పించి వరంబువడసి పరాక్రమవంతుడయివచ్చి.

క. రావణునను మతమున లం। కావరనగరంబునందుఁ గాపురముండెఁ
గావున నాతనివస్త్రము। పావని రావణునిశయ్య పైఁబడవైచెన్.
సం-తో౹హర. దశవదనునివ, స్త్రము విభీషణుని। తల్పముపైఁ
దానుంచెన్। విశదంబుగ గపి, వీరుండిదిమొక, వింతచేసియరుదెంచెన్.
క. రావణునగళ్ళు మొదలుగ। దేవారులయిండ్లుగలయఁ దిరిగినసీతా
దేవి కనఁబడకయుండిన। బావనిచనినయ్యశోకవనమునకపుడున్.
వ. లంకలోనంతటఁదిరిగి యెందునుగానక లంకిణిచెప్పిన గుర్తు ప్రకార మశోకవనంబుకరిగి.
శా. నానాపక్షిమృగాకులంబునవర త్నస్థాపితామూల్య సో
పానభ్రాజిత వాపియుక్తమును స త్ప్రాసాద రమ్యంబు నా
నానూనద్రుమరంజితంబగు నశో కారణ్యముం జొచ్చి ని
త్యానందంబున వాయుజుండు వెదకెన్ హర్షంబునన్ జానకిన్.
వ. ఇట్లు ప్రతివృక్షమూలంబున వెతకుచున్ బోయి మణిమయ శతస్తంభ సంభరితంబయిన భర్మహర్మ్యంబును గని యాశ్చర్యంబు నొంది యచ్చటను సీతనుగానక నెమ్మదిని నధైర్యంబుదోఁచి.

హను-కీర్తన, చాపుతాళము.

సీతజాడనాకు నెందు, జిక్కదాయెను। భూతలేంద్రు చెంతకెట్లు పోవువాడను॥ దానవేంద్రుమందిరంబు, లోనజూచితి। వానిపుత్రులున్నయిండ్లు-పూనిచూచితి॥ సీత॥ సందుగొందులందుబోయి- చాలజూచితీ। బాందుగ వనంబునందు, బొంచిచూచితి॥సీత॥ చక్కగ శ్రీమోక్షుగుండ-స్వామికామినీ। యెక్కడగన్పించదన్ని - యెడలగంటిని॥ సీత॥
తో. వనచరావళిని - వదలినన్ను శూరునిగా రాముఁడు మెచ్చె। జనకజపోబడి-గనజాలుదుపీ। వనుచునానవాలిచ్చె॥ రామ॥ కానవచ్చితిని-కార్యముదీర్చెను - వానిరీతినేడిచట। మానినిపోబడి - గానరాదు వే-మఱువెదకితి నేడకటా!॥ రామ॥
వ. లంకిణిచెప్పిన విధంబున నీయశోకవనంబున నెంతవెదకినను సీతయుండుతావు దొరకదయ్యె దైవమా!

హను-కీర్తన, ఫిల్ రాగము, అటతాళము.

ఇకనేమిచేయుదు-నెక్కడలేదు। ఇకనెందువెదకుదు - నింతికన రాదు॥ యి॥ విసికిప్రాణములు-విడిచెనో కాక। మనసుని వేదప్పి-యచ్ఛ

నిబడెనో!॥ యి॥ తనమాటవినకున్న - దానవవిభుడు । దునిమెనో! దనుజులుదినినారో కాక॥యి॥ ఒరులకుగానరా,కుండ రావణు । బరదేశములనుంచ, బంపెనోపీడు॥ యి॥ భూమిజజూడక । శ్రీమోతుకుండ। ధాము నికడకేల్లు-దగఁజేరువాడ॥ యి॥

వ. నేను వృధాగజని సీత దొరకలేదని చెప్పిన భార్యావియోగ దుఃఖంబుచేఁ బొగిలి తత్క్షణంబున.

తొ. చచ్చునురాముడు - జచ్చులక్ష్మణుడు- సరగుననదివిన్నంత। జచ్చునుభరతుడు-శత్రుఘ్నుండును, జత్తురుబాంధువులంత॥రామ॥ ఇనకులమడగును-నిటువలెనదిగని-యినజుడు జచ్చును పిదప । వనచరులందఱు వరసగజత్తురు - వనితలేదనుచుదెలుప॥ రా॥

వ. ఉభయకులంబుల వ్యర్థంబుగ నీరుజేయుటకయి నేనెచటికిఁ బోవుటకన్నను.

క. వానప్రస్థుని విధమునఁ । గానలకును జేరితపముఁ ♦ గావింతునుగా
దేని జలనిధినిదుముకుదుఁ।గానియెడ క్వహ్ని జొచ్చి♦ కమవడిఁజత్తుఁ.

వ. అంతేకాని ప్రాణంబుల పయి యాసవడి తిరిగిపోయి అంత మందిని జెరుపఁదగదని కొంతవడికిఁ జింతించి పిమ్మటఁ దనంతటఁ దాను ధైర్యంబు దెచ్చుకొని.

హ- కీర్తన, రూపక, కమాసు.

నేమానుకునా।కసక । నేమానుకునా॥రాముని కరుణాసారము। నామీదను బ్రసరింపగ । నీముల్లోకంబులలో, నెంచుమంచిన బరికింపక॥నే॥ స్పష్టంబుగ భూజాతను। దృష్టికి జూపించుడనుచు। నష్టదిశాపతులనునే-నల్లాడించెదనుగాక॥నేమా॥కుమ్మరసారెవిధంబున, నిమ్మహి గులగిరియుతముగ। దిమ్మదిరగ గిరగిరమని। త్రిప్పియుదిప్పలుపెట్టక॥నేమా॥నాలాపును మోతుకుండ । నాథుడువిని సైయనగను । నీ లంకాపురినసురుల। త్రోలవణాంబుధి ముంచక॥ నేమా॥

వ. ఏదోయొక్కవిధంబుగ సీతనుగాంచి మఱిపోదును గాని యల తింబోలె నూరక పోదునా! యని నిశ్చయించి యతిలాఘవంబున నా మేడపైకెగిరి యవతల నిదానంబుగా నుపలక్షించిన నచ్చట.

తో. ఎండజొచ్చుటకు-నెడములేకగను- మెండుగనాకులుబలిసి। దండిగగుబురై-యుండినశింశుప-తరుమూలంబున సొలసి॥ రా॥

క. దానవతరుణుల మధ్యను। దానుమలినాంబరంబు♦ధరియించిమదిన్।
దీనత్వంబున రామ। ధ్యానమునొనరించుభూసు♦తన్ గనుఁగొని యెన్.

వ. ఇట్లు కనుఁగొని యావృక్షంబుపైకి నెగిరి యాఁకుల నడుమ స్వల్పరూపంబునఁ గూర్చుండి చూచుచు.

హను- కీర్తన, ఆదితాళము.

ఆనందంహ్యాద।యానందం, పర।మానందం నిత్యానందం।జానకిగంటిని। జయముచేకొంటిని। నేనుకృతార్థుడ। నిశ్చయముగను॥ఆనం॥సీత కుశలమును। శ్రీరాములతో। జేతమలరగను। జెప్పుటకు।ఖ్యాతిగ నాభాగ్యంబునగలిగెను।నాతపమెల్ల నీ, నాడెఫలించెను॥ ఆనం॥ వృక్షచరులు వేవేలుండగవారి।వీక్షింపకను గ,టాక్షమున। మోక్షగుండపతి। ముద్రికనాకును। దక్షతినిచ్చెను। ధన్యుడనైతిని॥ ఆనందా॥

వ. ఇట్లానందంబునొంది జనకతనయతో భాషించుటకుఁ దరుణంబు వేచియున్నంతలో రాముని యాజ్ఞచేత నుక్కు- వనచరుండువచ్చి సూక్ష్మరూపంబున వృక్షాగ్రంబుననుండఁ జూచినట్లు రావణుండు గలఁగని తత్క్షణంబున లేచి.

తో. కొన్నికలలు ని, క్కు-వమగుచుండును । కొన్నియబద్ధంబగును, నిన్నిటికినిదిడి-యెటులగునో! కని-యెదనని తీవ్రంబునను॥ రా॥

తో. రాక్షసాంగనలు-రయమున గొలువగ। రామణుఁ డవనిజఁగనను। దక్షుడగుచు। దశవదనంబులు। దగనిరువది భుజములును॥ రా॥

క. కాటుకకొండనుబోలుని। శాటునిగనివాయుతనయుఁ♦డాశ్చర్యమునన్।
జాటగునటులాకులలో। మాటియుఁగనుచుండెవాని♦మాయాచేష్టల్.

వ. అంతరావణుండు సీతను డగ్గరి భయంకర వాక్కులతో బెదరింపుచు.

రావ-కీర్తన-ఫరజు, ఆదితాళము.

నామాటను మీరకు-నలినాక్షి। యింక॥నామా॥ వేమఱు గానన,సీమల దిరిగె। రాముండులంకకు। రాఁగలడా! యిక॥నామా॥మూడు లోకములనోడక నాకెను। రాజువారు లే,రిక చూడుసీవు॥నా॥ దానవ

కులనే,తను బలవంతుడ।నైననన్ను బో, నాడకుము।యింక॥నామా॥ రమ ణి మోక్షగుండ।రమణునిపై నింత । భ్రమనొందిన దాన, ఫలమేమి । యిక॥ నామా॥

వ. నిరంతరము నితాంతానంత శ్రీమంతుఁడనై దిగంతంబుల వంతనొందించి సాధించిన బలవంతుని నన్ను నావంతమైన మంతనంబునఁ జింతింపక యెంతయు డస్సిన యొక్క ఒక్కమానవుని పయి నింత భ్రాంతినొందవు పంతమా? ఇంతటనయిన నాయుదంతంబు విని కంతు కేళియందు నాయంతరంగంబును సంతసింపఁజేయుము. కాంతా! నీకేల యింతచింత! యెంతమాత్రముంచకుము కొరంతా-నిర్మలస్వాంతా!

తో. బాళిమీర ది,క్పాలుర నెల్లను, బంటులజేసెదనీకు। దాలిమి తోఁ ద,త్కాంతలు దాసీ। తనమొనర్చెదరు నీకు ॥రామ॥

తో. ఈరాక్షస రాజ్య,మిచ్చి నీకు నీ-యిష్టము-నొప్పుననడుతు, దీరుగ బట్టపుదేవివినీవని । పేరుబెట్టి పిలిపింతు॥ రామ॥

వ. అని యానిర్భాగ్యుండు గర్వ నిర్భేదములగు దుర్భాషలాడి న దుర్భరంబనక నిర్భయంబున రత్నగర్భార్భక తృణంబు చేఁబూని వానిఁ దృణప్రాయంబుగ నెంచుచు నధోముఖయై ప్రత్యుత్తరంబిచ్చు చున్నది.

సీత-కీర్తన, కళ్యాణి, అటతాళము.

ఓరిరావణ! యాడు,వారిముందర నిట్టి,పౌరుషములుపలుక।ఫలమే మిచూడు॥ శూరుఁడవునీవయిన రామునితో।నెదిరించినన్ను। జేరితేనా। నీవుధీరతతో। ఘనము,వినుము। రఘు,వీరుఁడేమరియున్న దొంగిలి। పారి వచ్చుట బంటుతనమా ॥యోరి॥ సాగరశయనుని। సాగిరాకుండనీ। సాగ రమేమాత్రి,మాగును వినుమా। వేగ శరవహ్నులనునింకించు। లేకున్న నడ్డము,గాగ సేతువు వేడ్కగట్టించు।వచ్చు-జొచ్చు।నీ,భోగములు నీపుర ము నిన్నును। బుత్రమిత్రులతోడ గూలుచు॥నోరిరావణ॥ ధారుణీదా ర్యూరి। నారాయణాత్మ వి,హరుఁడౌ మోక్షగుం, డాధీశ్వరుండు। గోరి తమ్మునితోడ నినుగదిసి।తలలన్ని యిలపై। గూలజేయునాడుగా తెలిసి। మొగ్గు,తగ్గు,గనువారికే యెరుకౌనునిరువుర।తారతమ్యము చెప్పవలెనా!॥ యోరిరావణ॥

చ. అనికఠినంబుగాఁ బలికి ♦ నట్టి ధరాత్మజ వాక్యముల్ దశా
ననుఁడిటులాలకించి వద ♦ నంబుల నాగ్రహ ముప్పతిల్లఁగాఁ
గనులను గెంపులొల్కఁగను ♦ ఖడ్గముఁ గేలధరించి జానకిన్
దునిమెదనంచు నాతురము ♦ తోఁ జనవద్దని యడ్డగింపుచున్.

వ. వానిభార్యయగు మందోదరి యిట్లనియె.

మందో-ఆదితాళము.

ఇ-దేమీపరాక్రమము! నిదానించియోచింపుము॥ఇదేమీ॥అదే మియా,ఉదా,నిపై!కిదూ,రిపో,యెదా,భళా! సదామం-చిదానె;మ్మదిన్ దెల్పె దన్॥ఇదేమి॥సురా,ప్సరాది రా,మలన్-వరిం,చిపొం,దరా,దయా, నరేంద్ర-వరాత్మిన్-జెరన్-బెట్టగా॥ నిదేమీ॥ కరం,బుమో,తుగుం,డస, త్పురా,ధిపుం,షు ర్రా,ముడౌ। బరాకా।చిరాకా।పరం బెంచవా॥ఇదేమీ॥

తో. అల్పభోగమున-కై చెడ నేటికి నతివలునీకిక లేరా! తెల్పుము మరియొక-తెతో నీకామము-తీరదేమొ ! యిదిమేరా ॥రామా॥

వ. నీయందు బ్రియంబులేక విముఖురాలయి యున్న యీపతి వ్రతను బలాత్కారము చేయుట మర్యాదకాదు. పరాంగనాసంగమం బు పాపంబుగ నీవెఱుఁగవా! నిన్నుఁగామించియున్న మావల్లనెల్ల సౌ ఖ్యంబులు దెల్లంబుగఁ బొందరాదా? చాలదా? ప్రాణనాయకా మానుము. స్త్రీహత్యచేయక, యింటికిరమ్ము నామాటఁ ద్రోయక.

వ. అనినమందోదరి వాక్యంబువిని సీతనుజంపుటుడిగి యిరువది కన్నులనగ్నికణంబు లురులనురిమిచూచి అధోముఖ, హేమాస్య,హా రిజట, త్రిజట, మహోదర్యాది రాక్షసాంగనలఁ దత్క్షణంబున బిలిచి.

రావ-కీర్తన, ఆదితాళము, బేహాగ్.

మీరు,గంటిరా! వింటిరా! చెలులారా! కల,కంఠిమాట యెంతకఠి నమోరా। వెంట,నంటి భయనయనములఁమీర।వాలు,గంటిని ద్రోక్కొండు నన్నుఁ జేర ॥మీరు॥ ఇక, రెండు నెలలు జెప్పిననుగాని। విన, కుండనేని పి మ్మటదీని। గోసి, కండలుదినుఁడు పంచుకొని। మోక్ష-గుండహారి యడ్డ పడినగాని ॥మీ॥

క. రావణుఁడసురాంగనలకు। నీవిధమున నాజ్ఞనిచ్చి♦యింటికిఁజనఁగా
నావెలఁదులు భీకరముగ। భూవరసుతఁ జేరి తెలుపఁ♦ బూనిరిబుద్ధుల్.

పంచ:- అరణ్యమందునిన్ను రావ♦ణాసురుండు దెచ్చుచోఁ దిరంబుగా నెఱుంగకున్న♦దీనమానవుండునీ। వరుండువానిమీఁదనింక ♦ వాంఛమాని రాక్షసే। శ్వరుణ్ వరింపుమెల్లభోగ♦శాలివౌదువంగనా!

వ. తమ్ముండు రాజ్యంబపహరింపననదంబోలె నీమగండు వనంబులఁ గృశింపుచున్నాఁడు. మా రావణునియొక్క ప్రతాంబువినుము.

స్త్రీల-కీర్తన, హిం, కాఫీ, అటతాళము.

జగ-దేకవీరుడు పద్మ, జాతకుల సంభవుఁడు । నగజాపతి సేవకుడు। నవమన్మథ సుందరుడు॥జగదేక॥ మించిదిగ్విజయము। గాంచి యన్ని టినిసా, ధించి యిాలంకనుబా, లించి గీర్తిఁగాంచినట్టి ॥జగదేక॥ ఎందు జావులేకుండగ । ముందేబ్రహ్మచేత వర, మందినాడు హీనిగూడు । సుందారిదెవైభోగము॥జగదేక॥ భూమిలోన మోక్షగుండ, ధాముడగు రాముపయి । ప్రేమమానిరావణుని। గామింపుము కాంతామణి ॥జగ॥

తో. మామాటలు విం-టేమంచిదినీకు । మేము సేవచేసెదము। కోమలి! వినకుంటే ! మఱినిలువుకు । గోయుచుభక్షించెదము॥ రామా॥

వ. అని యిట్లు చుట్టుకొని బాధింపుచున్న రాక్షసాంగనల నిర్లక్ష్యముగ వీక్షించి సీతాంగన దీనత్వంబున.

సీత-కీర్తన, ఆదితాళము, హిందూస్తానికాఫీ, రాగము.

ఇంతపంతమేలనమ్మ! యింతులారమానరమ్మ! చింతద్రోయమేలటమ్మ । చెలగికరుణజూడరమ్మ ॥యింత॥ బలములేని మనుజుడైన । బధిరుడైన నంధుడైన। దెలివిలేనివాడునయిన। జెలువునివిడనాడనౌన॥యింత॥ భూమిలోన మోక్షగుండ, ధాముడయినశ్రీకోదండ। రాముడే!విభుడనుచునుండ। నామదివేరానెపొండ ॥యింత॥

వ. అనివేడుకొనిన దీనాలాపంబులాలింపక భీకరంబుగఁ గేకలు వేయుచు.

తో. చెప్పినవినదీ। చేడెనునఱికియు। నిప్పుడెరక్తమువీల్చి। చప్పరింతమా! సరగునగండలు చవిచూతామా! నిల్చి॥రా॥ ఇకగొన్నాళ్ళూరిక బోధింపుచు। నిటులనె బెదరింతామా! యొకటరెంటగని। యోర్పుగలిగిమన-మొప్పునటులజేతామా ॥రామా॥

వ. ఈప్రకారంబున మనఃక్షోభంబు జేయుచు వీరుండ త్రిజటమాత్రమది సహింపక వేఱొక్కచో శయనించి నిదురించి కలఁగని లేచి రాక్షసస్త్రీలను బిలచి యనుచున్నది.

త్రిజట-కీర్తన, నవరోజు, ఆదితాళము.

కలఁగంటినేనొక్క--కలఁగంటిని। లలో ననేకములు గనుఁగొంటిని॥కల॥ రాముడేనుగునెక్కి-- రాగగంటిని । సౌమిత్రివచ్చినయట్టి-జాడఁగంటిని॥కల॥ లంకజొచ్చి రావణుగూ, ల్చఁగగంటిని, లంకను విభీషణుడే లంకగంటిని॥కల॥ రావణునిపుత్రులెల్ల- జావఁగంటిని। వేవేగదక్షిణ దిశకు-నేగఁగంటిని॥కల॥భూమిజ నయోధ్యకు గొం,పోవగంటిని। శ్రీమోక్షగుండేశ్వరుని-జెలగగంటిని॥ కల॥

వ. అనితన స్వప్నవృత్తాంతంబుఁ జెప్పిన నాలించి భీతచిత్తలై సీతమ్మను వదిలి యొక్కచో నందఱుఁబడి నిదురించుచుండిన సీతాదేవి విలాపంబున.

క. రావణుఁడు రెండునెలలకు। నావశమగునట్లుగా ఘ ♦ నంబుగ జేయుం।
డీవెలదుక వినకున్నను। దీవరమునఁదీనిఁజంపి ♦ తినుడనిపలికెన్.

వ. కావునవీరిట్లుక్రౌర్యంబుఁజూపుచున్నారు. దైవమా! దిక్కులేనిదాననైతిని. ఈకష్టంబెటుల భరింపనగును.

సీత-కీర్తన, జంఝూటి, రూపక.

అంతవానిభార్యనైనే-నడలవలసెను । జాతతోడవీరిచేత- జిక్కవలసెను॥నేనెంత॥ తెల్లవార నన్నుబట్టి-తిందురిందరు । బిల్లిచిలుక చందమాయె । భీతిచేతురు॥ అంత॥ మోక్షగుండరాఘవుఁడు - పేక్షజేసెను। రాక్షసుల బోనులోను-రహింనిద్రోసెను॥ అంత॥

క. అనిశోకావేశంబున । గనుగవలను నీరువరద ♦ గాఁగాఱఁగనా
వనజాక్షిశింశుపాతరు। ఘనశాఖను జేతనూత ♦ గాఁగొని లేచెన్.

వ. ఇట్లులేచి నిలువంబడి దిక్కులు పరికించిచూచుచు.

సీత-కీర్తన, వసంతరాగము, అటతాళము.

వీరిసేతలకు। బడజాలనే, వీరిబాధలకు। క్రూరరాక్షసులచే,గూలుటకన్నను।సారెకు నాకైనే। జచ్చుటమేలగు॥వీరి॥ వేవేగమెడకునా,

వేశియురివెట్టి॥నీవేళ నిచ్చట-జీవమువిడిచెద॥ నీరి॥భూమిమోక్షగుండ। ధామునకునుగాని। యీమేను నిలచిన, నేమి పోయిన నేమి॥నీరి॥

వ. అని మరణంబు నొంద నిశ్చయించి తనజడను గంఠంబున కు నురివెట్టుకొన నిశ్చయించియుండిన జానకి విపత్తును దీర్చుట కిదియ కదా! తరుణంబనియెంచి మరున్నందనుండు సీతవినునట్లు సూక్ష్మస్వరంబుతో నిట్లనుచున్నాఁడు.

ద్వి॥ అవనిలోపల నయోధ్యాపురినున్న, రవికులుండగు దశ, రధరాజమణికి, వరరామలక్ష్మణ- భరతశత్రుఘ్న, సుచిరనాములు-సుతులుదయించి। రంతుజ్యేష్ఠుండు రాముఖ్యసుతముగ। దుందరుణియును దోడుగరాఁగఁ దండ్రి। పనుపునదండకా, వనికరుదేర। దనుజాధముండగు-దశవదనుండు। చనిరాముఁడటలేని-సమయంబునందె। జనకజగొని పోవ, జాడదీయుచును। ఘనజటాయువు సెప్పఁ, గాజాడఁదెలిసి। యను వ్రుందబుష్యమూ, కాద్రికిఁజేరి। వాలిసుగ్రీవులు-వడిగలహింప। వాలిని జంపి తీ, వ్రమున సుగ్రీవుఁ। గపిరాజ్యమున కధి, కారిగాఁజేయుఁ। గపిపతియాజ్ఞచేఁ గదలి మర్కటులు। దిక్కు-దిక్కులకు నై - దేహినిజూడ। గ్రక్కునఁబోయిరి, కడికినేనొకఁడ। శతయోజనమ్ములు, సాగరమెగిరి। ప్రతిలేని లంకాపు, రంబునుజొచ్చి। పురమెల్ల వెతకి గొ,బ్బున వనమందు। బరువడినొకశింశు, పా మూలమునను। నురుదుఃఖకలితమై,యున్న సీతమ్మ। నరసితి ధన్యుండ, నైతి నేననిన.

వ. అవ్వాక్యంబులు శ్రీవణానందంబులైనఁ దన యుద్యమంబు మాని చెట్టుపైనఁజూచి యెవరుఁ గనబడనందున నెమ్మనంబున

సీతకీర్తన, జంఝూటి, అటతాళము.

ఔరార యిదియెంతో! వింత। కారణమెరుగను-గానిసునుంత। లేరెవ్వరితరులీచెంత। వారకనాకాశ। వాణిపలికెను! లేక। ఘోరరాక్షసులే! యిట్లూరక యనిరో! నే॥ఔరార॥కలయేనో! చిత్తవికలమో! కలయెక్కడిది నిద్ర-గాన నిశ్చయమో। తెలివిలో భ్రమరాదిదేమో! యిలనారాయణకవినేలు మోక్షగుండ। నిలయుని కెరుకగు, నిశ్చయమెటుగ। నే॥ఔ॥

వ. అనియిట్లు డోలాయమాన మానసయై యిట్లనియె.

క. శ్రవణానందముగా రా
ఘవుకథ వాకుృచ్చినట్టి ♦ ఘనులెవ్వరో!
పరివిమలముగ దర్శనమిడి
వివరింపగరాదెయెల్ల ♦ వృత్తాంతంబుల్.

వ. అనిమనోభావంబు వెల్లడిచేసిన నానందించి జిట్టెడు పొడుగు గల వానరాకృతితో హనుమంతుండు చెట్టుదిగివచ్చి సీదాదేవియెదుట నంజలి బద్ధుండయి నిలచిన జానకి భీతినొంది.

తో. వనచర రూపం, బున దానవు డే, వ్వాడో! రావణు డను పు। జనుడెంచెను రాక్షు, సమాయలటం। చునుదలచియుగనుగొనక॥ రా॥

వ. అధోముఖియై యూరకుండిన నాంజనేయుండిట్లనుచున్నాడు

హ-కీర్తన, అటతాళం. కాఫీ.

వాయుతనూజుడ । వానరవర్యుఁడ । మాయలుగావివి- మానుము శంక॥ వా॥ ఖ్యాతిగ సుగ్రీవుదూతను సచివుడ । మాతరో ! నేహను-మంతుడధీరుడ॥ వా॥ దండిగ శ్రీమోక్షు, గుండేశుడైన కో । దండ రామునకును । దాసుడ నిక్క-ము॥ వా॥

వ. అనిన సీతాదేవి యనుచున్నది.

తో. మీరువానరులు । వారుమానవులు । మీకును వారికి నేటుల । చేరువదొరికెనో ! స్నేహముగలిగెను ! చెప్పుము తెలిసెను నటుల ॥ రా ॥

వ. అనిన హనుమంతుం డిట్లనియె.

సీ. నినుఁబాసివెదకుచు ♦ నీభర్త ఋశ్యమూ
కాద్రిచెంతకురాఁగ ♦ నర్క-సుతుఁడు
సుగ్రీవుడనువాఁడు ♦ చూచియచ్చెరువంది
చేరువకునుజేరి ♦ చెలిమిచేయ
వానిభార్యనుగొన్న ♦ వాలిని వధియించి
కిష్కింధనిచ్చె సు ♦ గ్రీవునకును
నతఁడు బ్రత్యుపకృతి ♦ నాచరింపఁగఁబూని
నినుజూడ బంపించె ♦ వనచరులను

గీ. వారిలోనన్నుఁ బిలచి నీ ♦ వల్లభుండు
ముద్దుటుంగరమిచ్చి సు ♦ ముద్రికగాను
నీకునిమ్మన్న గైకొని ♦ నెమకికొనుచు
వచ్చినిన్నిందుఁ గంటినో ♦ వనజనయన.

వ. అనిచెప్పిన మఱియు.

హ-కీర్తన, ఆదితాళము.

రామముద్రిక । గొనుము । రామముద్రిక । రామనామాక్షర ములున్న । రమ్యముద్రిక ॥ రామ ॥ నిన్నునోసగెను, నాడు । నీమజన కుడు । పన్నుగనల్లునకునిచ్చిన । భద్రముద్రిక॥రామ॥ భానుతనయుడు। మము, బంపునప్పుడు । నానవాలురాముడిచ్చి, నట్టిముద్రిక॥రా॥ అక్ష యంబుగ । గడున, నర్ఘితమైన । మోతుగుండ దేవువేల్పు । మురియు ముద్రిక॥ రామముద్రిక॥

వ. అని యర్పించిన నయ్యంగుళీయకమును గైకొని కన్నుల నద్దుకొని యానందబాష్పములు రాల నిట్లనుచున్నది.

తో. మానుగ బ్రాణ । దానముఁజేసితి । మారుతి నాకును వినుము । ఏనీకునుబ్రతి । యేమిచేతునిక । నిలపయిస్థిరముగ మను ము ॥ రా ॥

వ. అని దీవించి మఱియును.

సీత-తో-హ. బుద్ధిమంతుఁడవు-పుణ్యపురుషుడవు- బుద్ధినిదెలసితి ననఘా! యిద్ధచరిత్ర! నాయిడుమలెల్లనీ- పేపుడు గంటిగదసరగ॥ రా॥

సీత-కీర్తన, ఆదితాళము-హిం, తోడ.

మారుతీ! శ్రీరామునకు నా, మాఱుగావచింపుమా । జేరిదను జులు బాధచేయ గృ, శించెనని వచియింపుమా ॥ మా ॥ రెండునెల లగు నంతకును మని-యుందునని యెఱిగింపుమా । ఖండితముగా రాని చో రా, క్షసులు దిందురు దెలుపుమా॥ మా॥ వేగముగగపిసేనతోడ ను - వెడలిరమ్మనిచెప్పుమా । బాగుగా నిరావణునివై, భోగమెల్లను బల్కుమా ॥ మా॥ రాక్షసేంద్రుని తలఁఋధరబడ । రాల్చుమనివాక్రు చ్చుమా । మోతుగుండపురీశనిసును - బ్రొమొక్కెనని ప్రకటింపుమా ॥ మారుతీ ।

గీ. నేర్చి నేరక యెగ్గులు ♦ నిన్ను బలికి
యనుభవించితి తత్ఫలం ♦ బదియుమఱచి
యన్నతోఁగూడివచ్చి న ♦ న్నాదరింపు
మనుచు నాముద్దుమఱదితో ♦ ననుముపత్స.

వ. అని కడువినయంబున నుడివిన పుడమికుమారి నుడువులకలరి యాంజనేయుండు.

హ-కీర్తన, బేగడ-చాపు.

సంశయింపకు। స్వాంతమునో నీవు॥ సంశ॥ వింశతిబాహుని-వి క్రమమదియెంత॥సంశ॥నిన్నెగ్గులాడుట-నిన్నా నేనప్పుడె। తన్ను దామను కొని। తాళితిగానిక॥ సం ॥ ముల్లోకములకు। దల్లివాసిక దెచ్చు। ఇల్ల ప్పుడీలంక। యేలేటందుకేన॥ సం॥ శ్రీమోతుగుండ శ్రీ, రామునలక్ష్మణు। వామాక్షితో డైచ్చి-వానిజంపించెద॥ సం॥

తొ. పుత్రిపౌత్రులతో-బాలియగలదురా, మునిచేతనుడ శానను డు। ధాత్రిన యోధ్యకు-ధపుడునునీవును-ద్వరలో జేరుదురనుడు॥ రా॥

సీత-తొ. మంచిదిరాముడు-మఱిలక్ష్మణుడును- మర్కట సైన్య ము లెల్ల। నెంచక వారధి। నెటులదాటగల। రెఱిగింపుమువిలసల్ల॥ రా॥

వ. అనిన.

హ-క. రాముని సైన్యయుతంబుగ
నామూపునమోచికొని ఘ ♦ నంబుగనుదధిన్
భామిని యవలీలగనే
ధీమతిదాటింపఁగలను ♦ దివిజులు మెచ్చన్.

వ. ఇంకనుగార్యంబులెల్లను స్వల్పకాలంబున నెరవేర్పఁబడును. ముద్దుటుంగర మిచ్చితిఁగదా! తిరిగి రామునకొసంగుటకొక్క యానవా లిమ్ము తల్లీ! భక్తజన కల్పవల్లీ.

క. అనిపలికిన ముదమందియుఁ
దనజడలో నిమిడియున్న ♦ తలమానికముం
హనుమంతుని చేతికినిడి
జనకజ క్రమ్మరనుపలికె ♦ సంశయపడుచున్.

వ. అనంత బలసంపన్నులగు రాక్షసుల నింత స్వల్పశరీరంబుగల మీరెట్లు జయింతు రదియొక గొప్ప సంశయంబనిన జనకనందనతోఁ బవమాననందనుం డిట్లనియె.

తో. పూర్వరూపమున-బొడకట్టెదనో! పొలతిరో! కనుగొనుమ నుచు! బర్వతాకృతిగ-బవనజుడుండిన-బరికించిభయ౦ పడుచు॥ రా॥

వ. జానకమ్మ కనులుమూసికొనిన నతండెప్పటివలె సూక్ష్మరూపంబుననుండె నప్పుడు కనులుదెరచి.

సీత-కీర్తన, రూపకము-కళ్యాణి.

పవనతనయ-రాముజేర బనుము పనుమిక వివరంబుగనావార్తను వినిపింపుము దయతోడను॥ పవన ॥ నీజవంబువింటి। నేడు, నీబలంబుగంటి! ఆజికిజాలిన మేటివి! యపురాసరియతివేగను॥ పవన॥ మోక్షగుండపతికి!నీవు! ముఖ్యబంటవైతి! వీక్షణమున మాశిక్యము - యినకులపతి కర్పింపుము॥పవన॥

వ. ఇదిగాక యింకొక సమాచారంబు చెప్పెదవినుము.

సీ. శ్రీరాముడును నేను ♦ జిత్రకూటాద్రియం దుండఁగ వచించి♦ యొక్క-కాకి! నన్నంటనలిగి తృ ♦ ణంబొండువైచిన బ్రహ్మాస్త్రమై వెంట ♦ బడిజగత్రి। యంబుద్రిప్పిన శర ♦ ణంబెందుఁగానక కావుకావుమటంచుఁ ♦ గాకిమరల। వచ్చియుదనపాప్రిపుఁ ♦ జొచ్చినదయగల్గి యొక కన్నునస్త్రంబు ♦ నకునొసంగు। మనుచురక్షించెనట్టి ద♦ యాంబురాశి! రావణుండిట్టి క్రూరకా ♦ ర్యాబొనర్ప! నూరకుండుటకిపుడునా ♦ నేరమేమొ! చాలవినిపింపవయ్యావా ♦ తూలతనయ!

వ. అనిన హనుమంతుం డిట్లనియె.

క. అమ్మా! యింక ద్వాలోఁగా। ర్యమ్ములు సకలంబుదీర్తు ♦ నాకలిగొంటిఁ। నెమ్మది నీవనమందు ఫ! లమ్ములుదిని పోవఁగా సె♦ లవు నాకిడుమా.

వ. అనిన మంచి దటంచుఁ జేసి త్వరగఁబొమ్మన వల్లెయని జానకికి వందనంబొనర్చి కదలి తానువచ్చి పోవుట రావణున కెఱుకపఱచువాడై.

తొ. ఆయశోకవన, మందుసీతయు, న్నట్టిచెట్టుదక్కఁగను। బాయకనన్నియు-వాయుతనూజుఁడు-హడ్రొసెను మేలుగను ॥రామ॥

వ. ఇట్లు చుట్టుముట్టి వనంబంతయుఁ బెకలించి యార్చి పేర్చి యెదిరించిన వనపాలకుల నెనిమిదివేలమందిని యొక్కపెట్టునఁ గూల్చిన రాక్షసస్త్రీలు నివ్వెరగంది సీతను కనుంగొని.

స్త్రీల-కీర్తన, ఆది-కమాస్.

అత-డెవరో! జానకీ! ॥యత॥ వివిధవృక్షముల-విఱచి వ్రేయు॥నత॥ వనచరునిరూపము। గేసరిప్రతాపము।ఉరుబలవీరుల। నుక్కడంచె॥నత॥ నిను, గాంచిపలికెను। యిట, నుంచిపోయెను। యొంచ మోక్షముగుం, డేను నిచెలి॥ యితడెవరో॥

వ. అనిన నామె యిట్లనియె.

తొ. శోకముచేతను-సృక్కుచుంటినిట-నాకెటు తెలియును నదియు। బ్రాకటముగమీ,రాక్షసమాయలు-మీకే తెలియఁగవలయు॥రా॥

వ. అనిపలికిన వారు భయంబునుబొందుచుఁ ద్వరగాఁజని రావణుగని మ్రొక్కి యిట్లనుచున్నారు.

స్త్రీల-కీర్తన, ఆదితాళము.

మీరుగృహము జేరిన। మీదచటజరిగిన। కారుబారు లిప్పుడు। గరుణచిత్తగింపుడు॥మీరు॥ కోతియొకటివచ్చెను। సీతతోభాషించెను। బ్రీతిమేను బెంచెను। బిట్టువనమువ్రంచెను॥మీరు॥ రాక్షసులను గూల్చెను। రమ్యహర్మ్యమెక్కెను। మోక్షగుండహరికిని। ముఖ్యుడేమెు ధరణిని ॥మీరు॥

వ. అనిపలికిన రావణుండు మహాశ్చర్య కోపంబులు పెనగొన, నేను బదివేల రాక్షసదళంబుల బలవంతులఁబంపిన వారుచని రంతలో సూర్యోదయంబగుటయు.

సీ. పంక్తికంఠుఁడుదన ♦ పర్యంకముననున్న కటిబంధనముఁగని ♦ గయునిదిగను। గుఱించిభార్యను ♦ గూడినాఁడనియెంచి ఖడ్గంబు గొని చంపఁ ♦ గవిసినంత। స్త్రీహత్యవలదని ♦ చెలులునివారింప నుడిగియాగ యునింటి ♦ కొనరఁబోయి। వీనిచేమృతివిధి ♦ వానికిలిఖయించెఁ గానని ద్రుతునిఖ ♦ డ్గమునఁ దునిమె। నంతఁ దనపాన్పుపైనున్న ♦ యంబరంబు। గని విభీషణుఁడన్నది ♦ గానెఱింగి। సరమనువధింపఁ జంద్రహా ♦ సంబుఁ బూన। వలదు స్త్రీహత్యయని స్త్రీలు ♦ దెలుపమాని॥

వ. అదిమొదలు రావణుని సాంగత్యంబువదలి యెటకేనియుఁ బోవ సంకల్పించుచుండె. నిక్కడ రావణప్రేరిత రాక్షస దళంబులు చనుదెంచి.

తో. తోరణకంబము-తుదగూర్చుండిన-మారుతిపై బాణములు।
సారెకు బరపినఁ - సరకుగొనకదా - సరగ జేసె శకలములు॥రామ॥

వ. ఇట్లు శకలంబులు జేసి వారిపయికిఁ గుప్పించి దుమికి క్షణమాత్రములో నందఱను ముష్టిఘట్టనలచే మర్దించిన హతశేషులచే నవ్వార్త దెలిసి యచ్చెరువొంది రావణుఁడు వక్రనాసుఁడు,బింగళాక్షుఁడు, దీర్ఘజిహ్వుఁడు, నశ్మవక్షుఁడు, శార్దూలముఖుఁడు ననుపేరులుగల నైదుగురు సేనాధిపతులఁ బంపిన వారు చని.

తో. కేకలువేయుచు-మూకలుగట్టియుఁదాకిబాణములు వ్రేయ।
భీకరముగగపి-వీరుడు బెదరక-తోకతోడఁ బొడిచేయ॥రామ॥

వ. వారునుబోకచుట్టుకొనినఁదోరణస్తంభంబుచేత నొక్కొక్కని మోది చక్కాడిన నదితెలసి దశకంఠుండు రక్తరోమ, శతజిహ్వ, రుధిరలోచన, స్తనితహస్త, శూలదంష్ట్ర, దుర్ముఖ, వ్యాఘ్రకబళులను నేడుగురు బలశాలురఁబంప వారుంజని.

రాక్ష-కీర్తన, ఆదితాళము.

ఎక్కడికోతివి-యెఱిగింపు,నీ। డొక్కచించెదము-సైరింపు। మిక్కిలినీమెర-మెచ్చులుసూపక॥ యెక్కడి॥ తొక్కిన త్రొక్కుడు-ముక్కునఁనోట। గ్రక్కున నెత్తురు-గ్రక్కెదవు॥ యె॥ కండలు వ్రేవులు-గుండెలుచీలిచి। వండితిందుము-వబ్బిడిగ॥ యె॥మోక్షగుండపతి-రక్షించినను రాక్షసులనుజే-రగదరమా॥ యెక్కడి॥

వ. ఇట్లు ప్రగల్భంబులాడుచు బాణపరంపరల ముంచిన హనుమంతుం డట్టహాసంబున.

తో. ఉరగంబులపై। కురికెడుగరుడుని। గరణిని బై బడదూకి। కరి
రథహయములు। నురుముచేసియమ। పురిజేరగ వారినూకి॥ రామ॥

వ. భుజాస్ఫాలనంబుజేసి నిలిచిన నదివిని ప్రహస్తుని సుతుఁడనంత ప్రతాప నిర్జితాంశుమాలియగు జంబుమాలి రావణానుజ్ఞచే వెడలివచ్చి. వేదండతుండ నిభంబగు నుద్దండభుజాదండంబున బ్రహ్మాం

డంబుననుండిన కొండలయినఁ బిండిపిండిగఁ జేయఁజాలిన దండి మగండ నగు నాదండకు రాగ బుండరీకాక్షుండైన నోపఁడు. నీకం డలోక కుండకయినఁ జాలవే! మంచిదుండుము. ఖండనంబున నీగుండెలు ఖండించి దండధరుని యండకుఁ బంపెద. మొండి! నామాటబహుళకరాఖండి. యనిన విని యాంజనేయుండు. ఖండేందుమౌళి కోదండంబుఁ బిండిచేసిన కోదండపాణిభటుండ. చండాంశుసుతుని సచివుండ. నాంజనేయుండ. ఖండనభీముండ. గుండెగలశూరుండవయిన నీవు వేడ్క నోర్ రారా రండా! ఇప్పుడే! మొండితునీముండ చేసెదనురలమార్లాండకుండ నని నప్పుడు.

తో. జంబుమాలి రో, షంబున బటు బా, ణంబులు పైబడ వైవ। డంబు చెడక సా, లంబు చేత ఖండబు జేసికడు జేవ॥ రామ॥

వ. పయింబడదుమికి రథరథ్యంబులఁ జూర్ణంబు చేసిన.

తో. అడిదముఁ బలకయు-నతఁడుఁబూని పై - కడరిననంతటఁ జేవోన। బిడికిటఁ బొడచిన-బీరము చెడువడిఁ - బడియెనాతఁ డిలపైన॥ రా॥

వ. ఇట్లు జంబుమాలి యీల్గిన నావార్త విని కొంతవడికుఁ జింతించి రావణుండు విరూపాక్ష, భాసకర్ణ, దీర్ఘజిహ్వ, ప్రఘునాదయులను - పంచసేనాగ్రనాయకుల నంకించి బంపినవారు బ్రతాపంబినుమడింపఁజని.

రాక్షసుల-ఏకతాళము, బ్యాండు.

మావనంబు బీకినై-వనీవెవండవు ॥పోవా॥ లేవా। యీవిధిన్-జావగన్-దేవుఁడునుగాటన్। శివిగ్రావాసెన్-గావునఁ బెగువన్॥ మా॥ లేరా-రారా! చేరగన్-బోరగన్। శూరుఁడవైనన్। ఘోరశరములన్। సారెకు వెడలెన్ ॥మావనంబు॥ చుట్టు, ముట్టు-పట్టగన్-నెట్టిలాగగన్ జుట్టము లెవరు తట్టినబాపన్ ॥మావనంబు॥ మోక్షు, గూడా-ధ్యక్షుని-పక్షమై రాక్షసులపయి। దక్షుడవగుచున్-దండువెడలితో॥ మావనంబు॥

వ. అనిన నాంజనేయుండు తగ్గుమొగ్గుదేయక నెగ్గులాడుచు నాదగ్గిరఁ జేరిన రక్కసులనుగ్గుచూచనుయిరి. మీరు సిగ్గులేక పెగ్గలు దీయుచు నగ్గలంబుగఁ జుట్టుముట్టితిరి ఇప్పట్టున మీపొట్టలు పగులఁగొట్టి తట్టునఁ బ్రొద్దుపట్టి పట్టణంబునకు నెట్టకున్న నేజెట్టినేనా! వట్టిగా దట్టిట్టుబోక దిట్టంబుగ నిలువుడు రాక్షసాధములారా! అనిపలికి.

తో. వారిపైనగడు-వడిబడదుమికియు - వారిబాణములుగొనక। దోరణకంబము, తో నొక్కొక్కని-మారిచం పెనుకొనుక॥ రామ॥

వ. ఆసమాచారంబువిని రావణుం డక్షకుమారునింజూచి.

తో. వనచర మొక్కటి, వచ్చియుమనదగు-వన మెల్లను బెకలించి। దనుజులజంపె ను-దగజనిగూల్చును - దానిపయినదెరించి॥ రాము॥

వ. అనినమంచిదని యక్షకుమారుఁడు బహుసైన్యయుతంబుగ రథారూఢుండయి నడచి తోరణ స్తంభంబుప యి క్రొయ్యార్యనిపగిది నున్న హనుమంతునిఁగని.

పంచచా॥ దురంబునందు నెంతొవాని ♦ తోడనైనబోరిబల్ । ప రాక్రమంబుఁజూపునట్టి ♦ పంక్తికంఠు పుత్రుడన్ । బరాకుమానియిందు నిల్వ ♦ పారిపోకు వచ్చెనా । శరంబులక్షయంబుగా వ ♦ శంబు గాదు చూడుమా !

వ. అనిపెక్కుమ్ము లొక్కుమ్మడివైచిన.

హ. పంచచామరము.

పరాత్ముఁడైన రాముదేవిఁ ♦ బట్టితెచ్చినట్టియా । దురాత్మునకైలితుంచు తెంపు ♦ తోడ తెవచ్చినావునీ। శరంబుదాంచినేడు విందు ♦ సేతుభూత పాళికిన్ । దరంబుగాదు నన్నువీక ♦ దాఁకి మళ్ళిపోవఁగన్.

వ. అనిపలికి పైకిలంఘించి యతండు వయిచిన బాణంబులు చూర్ణంబు జేసి.

తో. హుంకరించి వాని, యురమునరాముని । కి కరుండు పొడు వగను । బింకముచెడి-విల, విలదన్నుకొనుచు । విడిచెను దనప్రాణము ను ॥రా॥

వ. పిమ్మటఁ గాలఁజేత మట్టియతనిసైన్యమును బిలుకుమార్చి నక్కుమారుని మరణవార్త హతశేషుల వలనవిని రావణుండు నిర్వి ణ్ణుండయ్యె.

రా-కీర్తన, పున్నాగవరాళి, ఆదితాళము.

ననుబాసిపోతివా! నినుగోలు పోతిరా! యక్షతనయ! నను॥వనచ రుడెవ్వడో! చనుదెంచెమృత్యువై! యక్షతనయ! నను॥ బలశాలివనుచు

సు॥బరికించిచూతును। యక్షుతనయ! ॥నను॥ శ్రీమోక్షగుండ శ్రీరాము డుపంపెనో! యక్షుతనయ! ॥నను॥

వ. ఇట్లువిలపించుచుతండ్రికి ఇంద్రజిత్తుమ్రొక్కి యిట్లనియె.

క. నీతనయునిచావునకై। యీతీరునదుఃఖపడిన♦ నిదిమేలగునా। నాతండ్రి! శెలవిచ్చిన। నాతనినేఁబట్టితెత్తు న ♦ అసిముసమునన్.

వ. అనిన ధయిర్యంబునొంది.

తో. సురపతిఁగెలిచిన-జోదువునీవతి - శూరుడవగుదువు కాన। సరగుననావన-చరునిబట్టినా-సన్నిధికిక దెమ్మనిన ॥రామ॥

వ. ప్రళయకాలాభీల జాజ్వల్యమాన మహానలంబు చందంబున మండిపడుచు దండిభటు లనేకులు గొలువ రథారూఢుండై చని తో రణస్తంభాగ్రంబున నుండిన మారుతిఁగని కోపాటోపంబున.

ఇంద్రజి-కీర్తన, ఆదితాళము.

ఉండుండుముండుమురా! కోతివాడ! యుండు॥ ఉండుండుబహుర ణాపాండిత్యమున్నట్టు। మెండుగ దిరిగేవు। తుండెములుగ జేతు ॥నుండుం॥ శ్రీమోక్షగుండేశుని। సతతము। సేవించువాడవని। నామదికినిదోచె। న న్నెదిరించుము। నేమేఘనాథుడ। నీజిహ్వవదిలింతు ॥నుండుండు॥

వ. అనిపలికిన హనుమంతుండు.

తో. రాముని దూతను-రాక్షసవినరా-భూమిజఁ బొడగన వచ్చి। వేమఱు నిచ్చట-విహరించితి నా, విక్రమంబు గనబరచి॥రా॥

వ. ఇదివఱకు వచ్చిన మీవాఱలలలో నినుఁగలిపెద రారమ్మను డు మేఘనాథుండతని శరీరంబుపై బాణవర్షంబుగురిపించిన లక్ష్యపె ట్టక దక్షిణంబునఁ గ్రిందికివచ్చి తనలావుమెఱయ.

తో. అతనిరథంబును-నవనిగూల్చి మఱి - యశ్వములను మడి యించి। ధృతిశోభటుల వ, ధించినమఱిమొక-తేరునెక్కి యెదిరించి॥బ్ర హ్మాస్త్రంబును-బరువడివైచియు-బవనతనయు బంధించి। బ్రహ్మాదులు వి, భ్రమపడ రావణ-బ్రహ్మ చెంగటికిమించి॥రా॥

వ. అనేక విధంబులఁ గొట్టుచుఁ దిట్టుచు బాధింపుచు దోడుకొ నివచ్చి రావణుని యెదుట నిలిపిరి. బ్రహ్మాస్త్రంబుచే బాధ లేకుండు నట్లు బ్రహ్మచే మున్ను వరముఁ గొనియున్నాఁడు కాన హనుమంతుని

బ్రహ్మాస్త్రమేమియుఁ జేయదయ్యె నప్పుడు రావణునియాజ్ఞచేఁ బ్రహస్తుండిట్లనియె.

ప్రహ-కీర్తన, దర్బారు, అటతాళము.

ఎవ్వరివాడవురా । యెఱిగింపు రాజుతోడ । నిప్పాటి కెందు కొరా । కేతెంచినావురా॥ యెవ్వరి॥ వనమెల్ల బెరుకగా।దనుజులకునుమగ । బనియేమి నిక్కముగ । బలుకు నీపేరేమిరా॥ యెవ్వరి॥ శుభముగనీలంక, జొచ్చి చూచుటకును । త్రిభువనముల లోను । ధీరుడెవ్వాడు లేడు॥ యెవ్వరి॥ ధారుణి మోక్షగుండ, ధాముడో! శంకరుడో! సారసగర్భుడేను! సరగున బంపినది ॥ యెవ్వరివాడవురా ॥

వ. అనియడిగిన నాంజనేయుండు రావణునిదిక్కు నభిముఖుండయి యిట్లనియె.

క. ఓరీరావణ! వినరా! యీరేడుజగంబులెల్ల ♦ నేలుచునుండే। నారాయణాంశభవుండగు । శ్రీరామునిదూతనగుదు ♦ జిత్తంబలరన్

ఉ. సీతనుదెచ్చినీవిచటఁ। జేర్చినపిమ్మట రాఘవుండు। వి ఖ్యాతిగఋశ్యమూకమను ♦ నద్రికిఁ జేరిదివాకరాత్మజున్ । బ్రీతిగగూడివాలినొక ♦ వేటునద్రుంచిన నాటరాజ్యమున్। ఆతనికియ్యసంతసము ♦ నందుచుజానకిజాడఁ జూడఁగన్.

తో. దశదిక్కులకును-దరణీనందనుకు-దరి నును గపిసైన్యముల। విశదంబుగ । నేవెడలి జానకిని వెదకుచును సత్వముమిగుల॥ రామ॥

వ. సముద్రంబునొక్క కాలువంబోలె దాటి నీనగరంబుఁ బ్రవేశించి వెదకుచు నశోకవనంబుఁజొచ్చి శింశుపావృక్షంబుక్రిందఁ గూర్చుండిన.

తో. సీతనుగని రాము-క్షేమము జెప్పియు-బ్రీతిగనుంగరమిచ్చి । సీతిగఁజనకను-నా తెఱగంతయు-నీకుదెలుపగావలచి॥ రామ॥

గీ. వనముద్రుంచి వేగ♦వన పాలకులఁజంపి।నీదుసేన నెల్ల ♦ నీరుచేసి పరగనింద్రజిత్తు ♦ బ్రహ్మాస్త్రమునకును । నొక్కనీసుకడకుఁ♦ జేరినాఁడ.

తో. చావను బ్రహ్మాస్త్రంబుచేతనటు-గావున జిక్కితినేను । వే వేగంబున-వినుహనుమంతుడ-రావణ వాయుసుతుడను॥ రామ॥

హ-కీర్తన, అటతాళము, కాపిరాగము.

దానవరామ ప్రతాపమునీమది- గానవునీనటు-గావునఁ ద్రుళ్లె

డు। నేనెఱిఁగించెద। నిన్ను జయించిన। వానిని వాలిని,వధియించె జూడుము దానవ॥ ఖండేందుధరుని కో-దండము విరిచెను। దాఁడిగ భృగురాముఁదర్పమడంచెను । ఖండించెగరకర । ఖరముఖులను మోక్షు, గుండవిభుని పయి, గ్రూరము మానవు॥ దానవ॥

ఉ. ఉత్తమభూసురుండవయి ♦ యుత్తరదిక్పతి సోదరుండవై
చిత్తజవైరిబంటవయి ♦ చిత్తము సత్యము సత్వసద్గుణా
యత్తముఁజేయలేక యన ♦ యంబు దమోగుణమందునిల్పి దు
ర్వృత్తినిమించి కానక చ ♦ రించెదవే మదియో దశాననా!.

ఉ. అందఱునిన్నుఁగాంచి భయ ♦ మందుదురింతియె కానినీకు నీ
తిందగఁదెల్పలేరు కుమ ♦ తీ! స్వయమిప్పు నెఱుఁగఁజాలవే
మందు గళత్రపుత్ర సచి ♦ వార్థశరీరము లస్థిరంబుగా
నెంచుకునెంచలేవు చెడ ♦ నేటికిఁ దెల్పెద నాలకింపునా.

హను-కీర్తన, ఏకతాళము.

మాయానిర్మితమగును గాయము। న, పాయంబును ధాతుమయము హేయము॥ నిజమాయా॥ వనితలుఁ-దనయులుఁ-దనువులుఁ-ధనములుఁ-దనవియనుచు-గనునుజీవుఁడు॥ నిజమాయా॥ జల, మందుగలుగుబుగ్గల,రీతిఁ-బ్రీతిఁ-దోఁచియడగును॥ నిజమాయా॥ ఎన్నెన్నితనువులు। మున్నెత్తియుంటిమో! యికనెన్నితనువు । లిల-నెన్నగ-దిన్నగ-బన్నగ-నెత్తుదుమో! ॥నిజమాయా॥ లేకుండు నుండు-లేకుండు। బ్రాకటకౌముదిపగిదిగను॥ నిజమాయా॥ కలఁగొనసేక దేహాచయము-గానుపించుచుఁ। ఆ,లోనఁ మెటు,బోనో యదృశ్యము-లైనటు-గానెంచుము॥ నిజమాయా॥ధర-మోక్షుగుండ వరపురాధ్యక్షుఁడే-తనువులుఁ-సాక్షియై దీక్షతోడ । గనుగొనుఁ॥ నిజమాయా ॥

తో. ఆకాశమువలె-సంతటనిండిన-యచలుఁడు పరమాత్ముఁడు। బ్రాకృతతనువుల-బట్టుజీవుండనఁ బరగిసూక్ష్మముగనుండు॥ రామ॥

గీ. అట్టిజీవాత్ముఁడీ శరీ ♦ రాభిమాన। మునను దేహంబె! యాత్మగా ♦ బుద్ధినెంచి ♦ దనరసంసారవార్ధిలో ♦ మునిగి స్వకృత। కర్మఫలమును గుడుచుచు ♦ గడఁగియుండు.

వ. ఇట్లుండి కాలాంతరంబున.

తో. తనువింకొక్కటి-దానుధరించును-దృణజలూకమునుబోలి। కనుగొనసెన్నటి - కినియాద్యంతము - గనబడకుండునుబాళి ॥రామ॥

వ. కాఁబట్టి వివేకవంతుఁడు నిత్యానిత్యవస్తువుల విచారించి యనిత్యంబులయం-దాసరోసి నిత్యమయిన యాత్మనెఱిఁగి యాత్మయందుఁ గలసినగదా ! జన్మరాహిత్యంబు. రావణా ! యట్టి యాత్మస్వరూపుండీ రాముండని కనరాదా !

హ-కీర్తన, ఆదితాళము.

ప్రధానపురుషుడవ్యయుండు,రాముడు, । మానిమానసాబ్జసంస్థానధాముడు। తానే, తానై, తనరునాతడు ॥ప్రధా॥ అనంత నామరూపములు, నీయంతమై । సంతతంబు జేసితాను. నంతరాత్మయై, । శాంతి, దాంతివంతుడయితగు ॥ప్రధా॥ అజాండకోట్లయందు దానఖండుడై, చండకిరణు। రీతి మోక్షగుండనిలయుడై, దండి, నిండి, యుండునచలుఁడై॥ ప్రధానపురు॥

వ. అట్టిపురాణపురుషుడు దుష్టనిగ్రహ శిష్టపరిపాలన కొఱకుఁ బ్రతియుగంబున నేదోయొక రూపంబున నవతరించుఁ గాన నట్టి యవతారమూర్తి యీరాముండని తెలియుము దశకంఠా! నేను విశదంబుగఁ దెలిపితిని గాన నెఱుకగలిఁగి.

గీ. ఇంతటనునయిన యమ్మాల్య ♦ వంతమందు। రామలక్ష్మణు లున్నారు ♦ రాక్షసేంద్ర। సీతఁగొనిపోయియిచ్చిత ♦ త్సేవజెం । కులము నెల్లను రక్షించు ♦ కొనుముసరగ.

వ. అటులొనర్పక గర్వించితేని వినుము.

హ-కీర్తన-హిం, కాఫి, అటతాళము.

భండనభీముండగుకో-దండపాణి యేతెంచును । నిండు ధయిర్యముతోడ। నీదుపురిముట్టడించు॥భండన॥ధాటిగనునాకన్నను । మేటియగుకపిసేన । కోటానకోటులుదనుగొల్చుచు వెంటరాగ॥ భండన॥ ఖండితముగనుమోక్ష।గుండపతిసీతలలు । చెండువాడుగాదానీకు । జెచ్చెరను దెలిపెడిని॥ భండన॥

వ. అని ఖండితంబుగఁ బలికినఁ వానరేంద్రుని వాక్యంబులువిని

కోపోద్దీపితమానసుండయి కన్నులయందు నిప్పులుప్పతిల్లఁ బ్రహస్తాది మంత్రులదిక్కు చూచి.

తో. వింటిరెమీరలు వీనిప్రతాపము - వీనిప్రగల్భములెల్ల । నెంటిగనుండియు-నోడక నాకెదు, రొడ్డిగఁ గూసెడిక జెల్ల॥ దిక్కులగెలిచితి-దిక్పాలకులును- దేరిచూడ వెఱచెదరు । చక్కగమనుజుని-శరణుజొచ్చుమని-సరిగావీడిటు వదరు ॥రామ॥

వ. కావున వీనిని గట్టిగాఁ బట్టి పొట్టకొవ్వు రాలఁగొట్టి దిట్టతనంబున మట్టివేసియుండు. మంత్రులారా! సమస్తకార్య స్వతంత్రులారా! అనిన వారందరును సన్నద్ధులగుచుండ బుద్ధిశాలియగు విభీషణుం డన్నసన్నిధికివచ్చి నమస్కరించి యిట్లనియె.

విభీ-కీర్తన, నవరోజు, ఆదితాళము.

సరిగాదీపని రావణా॥ నీకు॥ సరిగాదీపని॥ సరగునదూతల। దరుణులబాలుర। ధరణీసురలనుజంప॥ సరి॥ దూతలుదమతమ।దొరలను మనునది। ఖ్యాతిగనందురుగాదే॥సరి॥ఊరకవిడుచుట-కొప్పకున్ననొక-తీరుగ దండనజేయు॥ సరి॥ గుండెగలుగు శూరుండవైన మోతుగుండ విభునిపైకేగు॥ సరి॥

వ. ఇట్లు బోధించిన విభీషణుని వాక్యంబులకామోదించి హనుమంతునిజంపుమనిచెప్పిన తలంపువదలి మంత్రులకు మరల నిట్లనియె.

తో. వానరులకు ధర,వాలమె। మూలముఁగాన వీనితోకకును। నూనెగుడ్డలను-మానుగఁజుట్టియు-బూనికాల్చి విడుడనెను॥రామ॥

వ. ఇట్లు ఖండితంబుగ నాజ్ఞయిచ్చిన రావణుని శాసనంబున రాక్షసులు చెలరేగి యాంజనేయుని బాశబద్ధునిచేసి ప్రతియింటఁగల గుడ్డలన్నియుఁదెచ్చి నూనెతోఁదడపి తోఁకకుఁజుట్టి నిప్పంటించి వాద్యంబులతోఁగూడ నపహాస్యంబు చేయుచు.

తో. దనుజులనందరి, దరిమియుగఱచిన । వనచర కీటకమిదిగో। మనకును దొఱకెను-మర్దింపుఁడని - మట్టుచుగొట్టుచు బగతో॥రామ॥

వ. పురవీధులెల్లఁ గలయఁద్రిప్పి పశ్చిమద్వారంబుకడకుఁ జేర్చిరింతలో గొంటులు రాక్షసాంగన లావార్త సీత కెఱిఁగించిన నామె వగచుచు.

సీత-కీర్తన, హిం, తోడి, అటతాళము.

ఎంతకష్టమువచ్చెచు । నేమిచేయగవచ్చును । ఎంతయని విల పింతును । జింతయెటువలెదీర్తును ॥ ఎంత ॥ మాయావాదిదైవము । మాకు నీవు సహాయము । జేయనోరువడాయెను । జిక్కులేకలిగించెను॥ ఎంత॥ సాక్షివై నారాయణ । శర్మను రక్షించిన । మోక్షగుండ దేవుని । ముఖ్యభక్తుడవయిన నీ ॥ కెంతకష్టము॥

వ. అని కొంతవడికు జింతించి యనంతరంబు ధైర్యంబున నగ్ని నిగూర్చి నమస్కరించి.

క. నేను బ్రతిప్రవతనైనను । క్షోణిని నావిభుండు సత్య ♦ శోభితుండయినన్ వానరుదేహముంగాల్పక । దానతిసీతలమునొందు ♦ దహనుండీపుడున్.

వ. అని నియతురాలై యగ్నిని బ్రార్థింప నమ్మహాపతివ్రత నియతువాక్కులకలరి జాతవేదసుండు శీతలుండయి యాంజనేయుని బాధింపకుండె. నిక్కడ హనుమంతుండు.

తో. ఔరానన్ని-యగ్నిదహింపక-యూరకుండుటకేమో । కారణమగు జన, కపిప్రియుడగుటనొ! మనరామానుగ్రహమో॥ రామ॥

వ. ఇవి యన్నియుంగావు. పతివ్రతాశిరోమణియగు సీతాదేవి యొక్క యపారకృపమైయుండవచ్చు. సత్యంబు సత్యంబు. నాకుంగొదువలేదని సీతారాములకు నమస్కరించి బ్రహ్మమంత్రంబు పఠియించిన మాత్రంబున బ్రహ్మాస్త్రంబు వదలిపోయె. నంతలో నినుండస్తమించుటయు.

గీ. పర్వతాకృతిగను వాయు ♦ పట్టిపెరిగి । చుట్టుకొన్నట్టి దనుజుల ♦ నుక్కుజేసి । క్షణములోపల నాకాశ ♦ మునకు నెగిరి । పంక్తికంఠునిమేడపైఁ ♦ బరఁగఁ దుమికె.

వ. ఇట్లు దుమికి.

తో. అతనినగళ్లను- జతికిలదోయుచు - నగ్నిని నంటింపగను । నతివడిగాలగ । నదిమొదలుగ బుర, మంతయుంగాచ్చెను తగను॥ రామ॥

వ. ఇట్లంజనాపుత్రుండు విజృంభించి వాలంబుపెంచి లంకానగరంబు విభీషణగృహంబుదక్కఁ దక్కినదేదియుంబోకుండఁ గాల్చినఁ బలాయనమగుటకు శక్తిలేని స్త్రీ బాల వృద్ధాదులు దేహంబులు గాలుచుండ నొకరి నొకరు గౌఁగిలించుకొని.

పౌరుల-కీర్తన, ఆదితాళము, శంకరాభరణము.

అయ్యయ్యో! చూడరే! యెంత! యన్యాయముగూడెనో! చయ్యనరావణునకు - జావేమైనమూడెనో! ॥అయ్య॥ పరకాంతనుబతి వ్రతను, జెరబట్టితాదెచ్చెను। బురముగాలేదత్ఫలము। బొందువేళ వచ్చెను ॥ అయ్య ॥ సుతులన్నదమ్ములు హితులు - బతులు సతులు ననుచును। వెతకులాడేవ్యవధలేదు। బ్రతుకుదూరమాయెను॥అయ్య॥ మోక్షకుండ రాఘవునిపై। గక్షకట్టకుంశీన। రాక్షసవరుల కాపు, రములకు జేటొదవునే॥అయ్య॥

వ. ఇట్లు పురజనులెల్లం జీకాకుపడంజేసి సముద్రంబునందు వాలంబు చల్లార్చుకొని హేమవర్ణంబుగ నలరారు లంకానగర భూమినిగని హనుమంతుం డాశ్చర్యంబు నొందెనని చెప్పిన శివునకు భవాని యిట్లనియె.

తొ. హేమవర్ణముగ - నేటికిలంకా। భూమియలరె వినియె దను। స్వామిచెప్పుమన - హైమవతినిగని। సోమశేఖరుండనెను॥రా॥

క. ఉరగులకమృతముం దెచ్చుట। కరుగురు గరుడుండుం గశ్యపు ♦ ధాతురుండై శ్రీ। హరినిగనిమ్రొక్కి యాకలి। దొరంగు తెఱంగడుగ నాయ ♦ ధోక్షజుండనియెన్.

విష్ణు-కీర్తన, ఆదితాళము, శహాన, వనమునుజూడంగ.

వినువినతా పుత్రి! నీకు-విస్తరించి దెల్పెదన్।మునుకరి మకరము లెనసి బోరగరి। ననువేడగ మక-రినినే దునిమితి॥విను॥ కరీంద్రుడపుడా। శరీరమునుదా।దొరంగిశాపముదీరగన్। దిరంబుగనుజనె। ధరిత్రినవియొక సరోవరముకడ।జాలనున్నయవి॥విను॥ ఘనంబుగను దత్క ళేబరంబులు। దినంగనాకలిదీరును। చన్నగనగు మోక్షగుండపతి యా, జ్ఞనచ్చటికి వీక్షణంబులోనిక ॥విను॥

వ. ఇట్లు తెలిపిన హరియనుమతి వడసి తార్క్ష్యుండు తక్షణంబున నాపుణ్యసరోవరంబుకడకుం జేరువటుకు.

క. గజనక్రి కళేబరముల। భుజియింపంగ వచ్చియున్న ♦ భూరిభంగుని ద। ద్గజ నక్రంబులం గైకొని। భుజగారి వియత్పథమునం - బోయె యథేచ్ఛన్.

వ. భ్రూభంగనామ గృధ్రపతిని గరిమకరములను రెండుపాదములఁ దగిలించుకొని భక్షించుటకు విశాలస్థలం బరయుచుఁ జని క్షీరసముద్రతీరంబుననున్న జాంబూనద వృక్షముయొక్క సహస్రయోజనపరిమితిగల యొక్క శాఖమీఁదఁ గూర్చుండెను.

తో. గరుడునిభారము- కడుదుస్సహమై- తనుశాఖవిరుంగగను। ధరబడకుండగ। దానిముక్కునను। దగగొని నెమ్మనమునను॥రామ॥

గరుడుని-కీర్తన, ఏకతాళము, హిం, తోడి.

ఏమితోచదెందుబోయెద! నిది। యెచ్చోటఁ బారవైచెద॥ నేమి॥ దీని। భూమిపైనుంచిన భూతకోటులకు। వేమరుగీడౌదవు॥యేమి॥ అందు మునీంద్రులు, యెందరోగలరు॥ ఇక॥ బాందుగవారి త-పోభంగమైన నేమందురో! శపియింతురో! ॥యేమి॥ ఆకలినిల్వ। లేకహరిదెల్ప। వీని,చేకొనిపోయి భుజింపగబోయిన। నీకొమ్మవిరిగెనయో! ॥యేమి॥ శ్రీమోక్షగుండ। స్వామియెండ। లే,డేమొకో! యాపద-లేశెంచె-బాపగ- నెవ్వరగుపడరు॥ యేమి॥

వ. అనియిట్లు విచారంబు నొందుచుఁ బోయి యొక్కచోఁదపంబుచేయుచున్న కశ్యప మహర్షినిఁగని వినయంబున నిట్లనియె.

మ. జనకా! యీతరుశాఖ యెందిడుదు నీ ♦ జంతుత్రయంబెచ్చటన్। దినినేఁబోదు ననంగసర్వముఁ దపో ♦ దృష్టిన్విలోకించి యా। యన వత్సా! విను నూరుయోజనములీ ♦ యంభోధి లంఘించినన్। గనుపట్టున్విజన ప్రదేశమగు లం ♦ కాద్వీపము న్దొప్పగన్.

వ. వీనిని భక్షించి యీకొమ్మయు దుంచిపొమ్మని దీవించి పంపిన వేగంబున నచ్చటికేతెంచి.

ద్విపద. ఆజంతువులఁదీని, యస్థిచయంబు।రాజితముగ మూఁడు, రాసులుచేసి। యామీఁదదరుశాఖ-నమరంగనిలిపి। క్షేమతిత్రోవైన, తేయుండు చనియె। నదితిత్రికూటాచల, మననలరారెఁ। బదపడియందు ద, పంబొనరించు।వాలఖిల్యాదు ల, ర్వాదివేలబుసులు। పోలంగదపములు-పూర్ణమైయుక్తి। పొందిరియంతజం, బూఫలసార। మందుఖనీభ-మైపొచి పట్టి। యుండెనాపైబురం, బొందునిర్మించి। యుంకీరి రాక్షసు,లోగిగా పురముగ। హనుమంతుఁడదికాల్ప-నారాళ్లుకరగి। కనఁబడెనాభూమి,కనక మయముగ.

వ. అంతట హనుమంతుండు తిరిగి సీతాంబసన్నిధి కేగి యిట్లను చున్నాఁడు.

తో. తల్లి నేనువన, మెల్లను బెఱికితి-దగులబెట్టితిని పురిని। అల్లాడించితి-నసురుల సెలవి, మ్మరిగెదనే నిత్తరిని॥ రామ॥

వ. నీభర్తను సుగ్రీవాది వనచర యుతంబుగాఁదోడి తెచ్చి నీ యిడుములు నివారింపఁజేసెద. ధైర్యంబున నుండుమని చెప్పిన సీత యిట్లనియె.

తో. రామవార్తక, ర్ణామృతముగసే, చేమారుతి! నేవింటి। నీ మీఁదను నే-నిక్కడవగపున-నెటులనుండె దనుకొంటి॥ రామ॥

వ. అనిన హనుమంతుం డిట్లనియె.

తో. నినునాభుజమున - నెక్కఁజేసికొని వనధిదాటిశీఘ్రమున। ఘనముగ రాముని, కడకుఁజేర్తు ర-మ్మనుచుపలికె నెయ్యమున॥ రామ॥

సీత-కీర్తన, ఆదితాళము-బ్యాండుస్వరము.

మారుతీ! యీరీతి-ధీరత-జేయగశూరుడవగుదువు, సుమ్మీనీవు నీరావణు। శ్రీరాముడు। జేరివధించె, దికనెన్నడు॥మారు॥ శ్రీమోక్షగుండపు, రీశునికీర్తియీ। భూమినిస్థిరముగ। బాదలవద్దా! యామాన్యుని సౌమిత్రిని। శ్రీమీఁఅదోడ్తెమ్ము - శీఘ్రముగ ॥మారు॥

వ. రాముండవతరించి రావణవధ చేసినాఁడను యశస్సు భూమి యందు స్థిరముగ నుండవలయును గాన నీవు ద్వరగాఁజని వారధిదాఁటి రామలక్ష్మణులు వచ్చు సదుపాయంబులు జేయుము వాయుకుమారా! రణరంగశూరా! రాక్షసవిదారా!

తో. ఈముద్రికశ్రీ, రామచంద్రునకుఁ। బ్రేమమలరనిమ్మనుచు। భూమిజయిడియిక। బొమ్మనమారుత। పుత్రుడామెవీడ్కొనుచు ॥రామ॥

వ. వేగంబున వెడలి సువేలాద్రిపయి కెక్కి- యీవలిదదికి నెగు ఱఁబోవునంత.

క. హనుమంతుడు లంకాపుర। మునజరిపిన నటన సర్వమును వ్రాసి ముదంబున రామునకిమ్మని పా। వనిచేతికినిచ్చెబ్రహ్మ పరమప్రీతిన్.

వ. ఆకమ్మగైకొని యానందించి బ్రహ్మశిలవుఁ బొంది మారుతి కుప్పించి యెగసి యుదధిమీఁద వచ్చుచుండ ముప్పదియామడలదూ

రంబుననుండి వినంబడెను ధ్వని విని యాగట్టుననున్న యంగదాదు లు ప్పొంగుచు.

తొ. కృతకార్యుండై । కేసరిపుత్రుడు , క్షేమంబుగవచ్చెడిని। ధృతితోనటుగా-దేనియిట్టిధ్వని - దేనివలన గలిగెడిని॥ రామ॥

వ. అని నిశ్చయించుచుండిరంతలో నాంజనేయుండు స్వకృత కార్యనిర్వాహక ప్రభావంబున భావంబునం గించిద్గర్వసమావేశుండై వారిని లక్షింపక వేగంబునం గొంతదూరము త్తరదిశకుంజని యందుం దపంబొనర్చు మునివరేణ్యుని పురోభాగంబున ధరాతలం బదరదుమికి నమస్కరించి యనుచున్నాఁడు.

హ-కీర్తన, కేదారరాగము, రూపకతాళము.

మునివరేణ్యావినుమా।ననుగృపార్ద్రదృష్టింగనుమా॥ముని॥ జన కాత్మజయుండిన-జాడనునేగని।చనుదెంచితి॥మునివ॥ ఆహా-దాహం। బా పగజాలను॥మునివ॥ నీరంబుల్-గోరిలంగల్-జారుజలాశయమిా। చేరువ నుండిన-జూపుము॥ము॥ ఆలస్యమువలదు। చాలాశ్రమపడుదు। బాలిం పగదగుదు। నేలాగుననజనుదు। మేలవే-దయాలవాల॥ము॥ శ్రీమార్ల మోక్షపుర స్వామినిగన నేజనవలె॥ మునివరేణ్యా॥

వ. అనివేడిన నమ్మౌని మౌనముూనినవానివలె సరోవరమున్న దిక్కుతర్జనిఁ జూపిన నెఱింగి యుంగరమును గమ్మాయి శిరోమణియు నచ్చటనుంచి దాహంబుదీర్చుకొని వచ్చులోపల.

గీ. ఒక్కకపివచ్చి రాముని ♦ యుంగరంబు। ముసికమండలమం దుంచి ♦ చనియెనంత। నాంజనేయుండు గ్రమ్మఱ ♦ ననుగుదెంచి। యం గుళీయకమెందున్న ♦ దనుచు నడుగ.

వ. మునీంద్రుండు భ్రూసంజ్ఞచే గమండలముఁజూపిన.

తొ. అందుగన్నరా-మాంగుళీయకము లగణితముగ గనబడిన। నిందలి ముద్రికలెవరివినాయది-యందున్నది యిమ్మనిన॥ రామ॥

వ. మునీంద్రుండు చిఱునగవుగదుర నిట్లనియె.

ముని-కీర్తన, రూపకము, ఘోరపా, బిలాహురి.

వినుముదెల్పెదను। వనచరోత్తమా! సర్వంబును॥ వినుము॥ ఇంతకుమును-పెంతనుండియొ! వింతగ హను, మంతులు సీత। నెంత

యుంజూచి-యేతెంచు నా। చెంతజేరుచు ॥ వినుము ॥ అచ్చట సీత। యిచ్చినముద్రి। యిచ్చటనుంచ। నింకొకకపి। మచ్చికనిక। మండల మున। హెచ్చితావైచెను ॥ వినుము ॥ దీక్షతో నీవు। దెచ్చి యుంచిన। మోక్షగుండేసు। ముద్రికయేదో! వీక్షించి దాని। వేగగై కొను। వృక్షచరాగ్రణి ॥ వినుము ॥

వ. అని తెలిపిన నాశ్చర్యంబుతో నాంజనేయుండు.

చ. మునివర సీతనాకిడిన ♦ ముద్రికయిక్కడఁ బారవైచి రా
మునికడ కెట్లుఁబోనగును ♦ మోదముతో వివరింపుమన్న నో
వనచర యీకమండల మ ♦ వశ్యము శోధనచేసినీవు దె
చ్చిన మొహరుంగరమ్ముఁ దగఁ ♦ జేకొని రాముని జేరఁబోపుమా!

వ. అనిన మంచిదని హనుమంతుం డంజలితోఁ గమండలము నందున్న యుంగరంబు వెలుపటికి తీయుటకారంభించిన నంతములేకుండ వచ్చుచుండె నప్పుడు.

తో. అన్నిటినరసిన। నపుడురామనా। మాక్షరసహితములగుచు నున్నగనుంగొని। యన్నియుందలో, నుంచి యిట్లనుచుదలచు॥ రామ॥

హ-కీర్తన, కన్నడరాగము, చాపుతాళము.

ఎందరైరొకో! ముందునావంటివా॥ రెంద॥ సందియముదీరె డెం దమునకు॥ మున్నెందరై॥ ఎందరోహనుమంతులే తెంచియుండగ నింద లో నిపుడు-నాదేమిగణనయగు॥ నెంద॥ నేనుయిాదురభి। మానముతో నుంటిఁ। గానిస్వతంత్రాధి। కారములేదార॥ యెం॥ మోక్షగుండేశుని, ముద్రికలెన్నగ। నక్షయమగుటయె। సాక్షియానీవార॥ కెంద॥

వ. అనియాలోచించి గర్వంబు సర్వంబు విడిచి మునికి నమస్కరించి వీడ్కొని శిరోరత్న లేఖనముల మాత్రముగొని.

గీ. తత్క్షణంబునసచటికి ♦ దక్షిణమున। ఘనమహేంద్రగిరిప్రాంత♦ మున వశించి। యాంజనేయునిరాకకు ♦ నరయుచున్న। యంగదాదుల కడకు నె ♦ య్యమునఁజనియె.

వ. అట్లరుదెంచిన యాంజనేయున కెదురుగఁజని యంగదాదులు గాఢాలింగనంబుచేసికొని సుఖాసీనుం జేసి.

వనచరుల-కీర్తన, జంఝూటి, ఆదితాళము.

వాయుజా! పోయిన కార్యము। కాయో! పండో! కడువడిదెల్పుము॥ వా॥ చేయగనీ। చేతగానీ। దీయవని నేమికలదు। పాయక బలవంతుఁడవు॥ వా॥ ధారుణీ। తనయను గనుగొని। జేరిమిగుల భా, పించితివా! నీవు॥ వా॥ శూరతను। జూపితివా। కోరికతో మోతుగుండ, శ్రీరాముని జేరుదాము॥ వాయు॥

వ. అని యడుగుడు,

తో. కాంచితిసీతను। దుర్గించితివనము భా, మించితిరావణుతోడ। మించితిలంక ద-హించితి నిటకరు-దెంచితిరాముని జూడ॥ రా॥

వ. అని చెప్పి యందఱుఁ గలసి రామదర్శనార్థముఁ జనువారయి యుత్సాహంబుతోఁ గదిలిపోయి కొండొక దూరంబుననున్న సుగ్రీవుని మధువనంబునకుఁ జేరిన నప్పుడు,

తో. ఆకలిదప్పులు, నడగఫలంబులు-నారగించి తేనియలు జేకొని పానము-జేతుము సెలవిచ్చిననని యవ్వనచరులు॥ రా॥

క. అంగద హనుమంతులనదు। గంగానే వారునటులఁ ♦ గానిమ్మనుడున్। బొంగుచువనమున వానర। పుంగవులటుచొచ్చి కొల్ల ♦ పుచ్చిరికడిమిన్.

వ. ఇట్లు ఫలంబులుతిని తేనెలుద్రావి కొమ్మలువిరిచి కొలకుల మునింగి యిచ్ఛావిహారంబుగ వానరులు వర్తింప వనపాలుఁడగుదధిముఖుండు కోపోద్దీపితుండయ్యె.

తో. ఎవ్వరి యాజ్ఞను-నివ్వనమునకును-నిపుడుజొచ్చితిరిమీరు। క్రొవ్వుసెడగనే-గొట్టిననడ్డం-బెవ్వరనుచు బలుమారు॥ రా॥

వ. వారిని మర్దించిన వారుపోయి మనవిచేయ హనుమదంగదాదులు దధిముఖుని గుండెలవియునట్లు నులిమిన భయపడి వాపోవుచు సుగ్రీవునిఁ జేరి నమస్కరించి.

దధి-కీర్తన, ఫీల్ రాగము, ఆదితాళము.

కపికులనాథా! కపికులనాథా! కృపజూడుమునను। గపికులనాథా॥ కపి॥ అంగదుండును-హనుమంతుండును-పొంగుచు గొల్లపుచ్చిరివనము॥ కపి॥ వద్దని నేను-వారినినాగ। గ్రుద్దిరినన్ను-గ్రుద్దిరిగాను॥ కపి॥ శ్రీమోతుగుండ-ధాముని యాన। నేమీను దెలుపు। నే తెంచినాను॥ కపి॥

వ. అనిన నతండు మహానందభరితుండయి శ్రీరామునిడగ్గఱి.

స్రగ్విణి:-జానకిం గాంచియున్ ♦ సంతసంబందుచున్ । వానరుల్ గ్రమ్మఱన్ ♦ వచ్చునట్లున్నదా । కానిచో గేళికా ♦ కాననంబందు నెం । తేని వర్తింతురే ♦ ధీరులై దేవరా!

వ. సీతజాడ దొరకకుండిన దీనులైవత్తురుగాని ధీరులై వత్తురా! మధువనంబంతయు నిర్మూలంబుచేయుదురా! దాశరథీ! సత్కృపాశరధీ! యనిన రాముండట్లయిన వారినిద్వరగాఁ బిలుపించుమనుడు దధిముఖుని గాంచి సుగ్రీవుం డిట్లనియె.

తో. రాముని కార్య ధు, రంధరులై చని-శ్రమపడివచ్చిరికాన। నేమనగూడదు - ఇకజనివారల-నిటకుదోడితెమ్మనిన॥ రామ॥

వ. అతివేగంబునం దధిముఖుండరిగి హనుమదాదులకు మ్రొక్కి-సుగ్రీవుండు వేగంబున రమ్మనినాఁడన నందఱుఁ గదిలి మహానందంబునం బోయి సుగ్రీవలక్ష్మణయుతంబుగ వసించియున్న శ్రీరామప్రభువును జేరి సాష్టాంగ నమస్కారముచేసి వారియనుమతంబున నందఱు నాసీనులయిరి. యప్పుడు రాఘవుండు వారలంగని,

క. మీరేగినకార్యము నెఱి । వేరినదా! యనుచు రామ ♦ విభుడడుగుటయున్ । ఊరకయుండిరి యందఱు । మారుతి యిట్లనుచుఁ బలికె ♦ మనమలరంగన్.

హ-కీర్తన, ఏకతాళము, కేదారి.

కాంచివచ్చితి । గనులారా॥గాంచి॥ మించి సంపాతి మొఱ-గించి పంప వార్ధి లంఘించి। మొంచి లంకశో-ధించి వివరించి భావించిసేవించి॥ కాంచి॥ భూరిమలినాంబరధారన్-మోహగుణ-విహారన్ బాగడెటికృశశరీరన్-సువిచారన్-గత ధీరన్-శ్రీమీరన్॥ గాంచి॥

వ. అని విన్నవించిన శ్రీరామమూర్తి యాదరంబునఁ గాంచి యిట్లనియె.

తో:-ఎటువలెబోతివి । యెటువలెగంటివి । యెటులను భాషించితివి । కుటిలాలకసీ। కునుదెల్పినము, చ్చటలుదెల్పు హితమతివి॥ రామ॥

వ. అనియడిగిన నాంజనేయమూర్తి యిట్లనియె.

గీ. స్వామిమీయాజ్ఞచేతను ♦ జనినమేము । ఘనుడు సంపాతి తె
లుప మా ♦ ర్గంబుదెలిసి । వరుస నూరామడలుగల ♦ వార్థినీదు । ద
యనువనచరులరయఁగ ♦ దాఁటినాఁడ.

వ. ఇటులదాఁటి రాత్రికాలంబున లంకఁబ్రవేశించి రావణకుంభకర్ణాదియోధుల గృహంబులెల్లనరసి మీదేవిని గానక యశోకారామంబులోనికిఁజని పరిశీలించిన నొకశింశుపావృక్షంబుక్రింద.

తో. దీనాననయై, దివ్యముగారామ । ధ్యానంబొనరింపుచును ।
దానవకాంతలు-దనజుట్టునుజల- మూని నిలువనొప్పుచును॥ రామ॥

వ. ఉండగాఁగాంచి సీతగానెఱింగి తదీయవృక్షంబుపై సూక్ష్మరూపంబున నిలిచి తతివేచి.

తో. తమకథ యాద్యంతమునుడివిన విని - ప్రమదంబున నను
జేరి । క్రమమున నంతయు - గర్ణానందము- గావచింపుమన జేరి ॥రామ॥

వ. మీకును మాకును గలిగిన సాంగత్యవివరంబును మీవలనఁ బంపఁబడినేఁ జనుటయు లోనుగా సర్వంబుఁ దెలిపి తమ ముద్దుటుంగరమిచ్చిన,

క. కనులనుబలుమఱునద్దుచుఁ । దనతల మాణికము నిచ్చి♦తగఁ
బొమ్మనుచున్ । ననుబంపించెనుమీతో । ననుమనె నొకకొన్నిమాట ♦
లాశ్రిత వరదా !

హ-కీర్తన, జంఝూటి, అటతాళము.

పదినెలలాయెను-బతిబాసియనెను । మదిలోన నికదనను-మరువవద్దనెను॥పది॥ రెండునెలలకు రా, కుండిననికను । ఖండించునీదశ-గళుడనియనెను॥పది॥ కూరిరులపాల్ చేసి-యూరకుండినను । వీరధర్మముగాదు వినిపింపుమనెను ॥పది॥ రాక్షసులనుజంపి-రక్షింపుమనెను। మోక్షగుండేశ్వర, మొక్కితి ననెను ॥పది॥

తో. కమువడితోనను-గాకముజీరిన।। గరమలిగెనుగద మునుపు।
ఎడబాపెనుననునీరక్కసుపై । నేలగినియవని తెలుపు॥ రా॥ ఆలక్ష్మణు
తో,ననుమనియెనుబర్ణ । శాలచెంతఁదానవిన । బాలవాక్యములు-భావిం
పకదను-బాలింపగవేగమున ॥రామ॥

వ. అన్నతోఁగలిసివచ్చి పుత్రమిత్రామలతఁగూడ దశకంఠుని

నులిమి తనచెఱబాపుమన్నది. సుగ్రీవునితోఁ దనకష్టంబుదెలిపి చాల యడిగితినని చెప్పుమన్నది. యంతనామెచే దీవనలంది సెలవుబొంది,

క. నేవచ్చిపోవుసంగతి। రావణునకుఁ దెలుపఁగోరి ♦ రయమునవనమున్। వేవేగమెపెకలించియు। దేవారులగొందఱను వ ♦ ధించితినలుకన్.

వ. అంత రావణుం డింద్రజిత్తుచేత నన్నుఁబట్టితెప్పించి యడిగిన నాసంగతియంతయు స్పష్టముగఁ జెప్పినవిని యలిగి నావాలంబునకు నూనెగుడ్డలుజుట్టించి కాలిపించిన వాలంబుఁబెంచి లంకాపురమంత యుఁగాల్చివేసి సముద్రములోముంచి శోకచల్లార్చుకొని,

హ-తో:-వారధిదాటియు వానరులనుగూడి వచ్చితిమీసన్నిధి కి। వారకయిదియే, వార్తయనుచు నాన, వాలిచ్చిన గొనియు లికి ॥ రామ ॥

వ. సుగ్రీవునిగని రామచంద్రుడిట్లనియె.

రాముని-కీర్తన, కాంభోజి, అటతాళము.

ఈమానికమ్మునే- నెటులనువీక్షింతు - నేమిచేతును భానుజా। కామించిమాపెండ్లి, కాలంబునందు మా, మామకూతురునిచ్చె। మం గళప్రదముగ॥ ఈమానికమ్ము॥ అప్పటినుంచి తన, కొప్పులోధరియించె, నిప్పటికిటుబంపెను। యెప్పుడో! మోక్షుగుం, డేశుడ నానేనా। యొ ప్పులకుప్పను దప్పకగాంజేది॥ ఈమానికమ్ము॥

వ. అని వగచుచుండ,

క. వగవబనిలేదురాఘవ। మిగిలినకార్యంబునకును ♦ మీఁదికననిలో।బగతురనుజాపి చెఱనా। పగదగుమీదేవిసరి వి♦ భంజనరామా.

వ. అనిసుగ్రీవుండు దెలిపిన దుఃఖంబువిడిచి ధైర్యంబుఁబూని యాంజనేయుని [illegible]ంబు జేసికొని,

తో. [illegible]రంబగునా, సాగరమెటుదాటితివి। అతిధ[illegible] యుద్[illegible]ంబు [illegible]శసిమెటులవచ్చితివి[illegible]

వ. అనిన రాముండు.

తో. అంతమందిరో, భానుయోధులా। యసురులుగనుగొనహెచ్చు। చింతింపక గాల్చితివి లంకయిది - యెంతధయిర్యమనవచ్చు॥ రా॥

వ. అనిన దానికి నాంజనేయుండు,

తో. జానకి విశ్వా, సంబున దమకో । పానలమున నాలంక । గానకముందే । కాలిపోయెనే-గాల్పగగలనెయకలంక॥ రామ॥

వ. అనువాక్యంబులకు శ్రీరాముండు పరమానంద భరితాంతఃకరణుండై,

గీ. ఎంతకార్యంబుజేసితి ♦ విద్ధచరిత । పరమబంధుఁడ వగుదువు ♦ పరఁగఁమాకు । నరయమత్పద మిచ్చెద ♦ నంతకంటె । నన్యమేమున్న దియ్యనీ ♦ కనుచుఁబలికె.

వ. అంత హనుమంతుండు నయ వినయ భయంబులుఁ దోఁప శ్రీరామచంద్రునకు సాష్టాంగ నమస్కారంబు లొనంగి యంజలిబద్ధుండై యనుచున్నాఁడు.

హను-కీర్తన, ఆదితాళము, శహానరాగము.

రామా! భానువంశజలనిధి-సోమ! శుభామలనామాభా॥ రా॥ హైమవతీజపిత దివ్య, నామనుతామరక్షేమదా! ॥ రా ॥ నేమది దెలియక । నేరకదనుజ వి। రామునొక్క యప। రాధమొనర్చితి॥ రామా॥ జనకజ తనకి, మ్మని యిచ్చిన పా, వనముద్రికయొక। మునితాగైకొనె ॥ రా॥ అమ్మని యెవ్వరో! క్రమ్మరయివ్వక । పొమ్మనిబంపెను । బొసగ మోక్షపుర ॥ రా॥

వ. అనిపలికిన వాక్యంబులువిని [illegible] నవ్వుచు నిట్లనియె

నేనేమునినై । నిలిచితినక్కడ, [illegible] గను । వాన

రవర యె [illegible] [illegible]

హ-కీర్తన, కీరవాణి, రూపకము.

తపనకులజ! దాశరథీ! యపరాధిని గాపాడు॥ తపన॥ అపరిమితానుపమనచో - నిపుణదీనపాలక ॥ తపన॥ నిగమజాలమైనను నీ - నిజము దెలియవనుచు విబుధు । లగుణునిగాదలపోసి । యఖిలమునను గాంతురు నే । నగచరుండ మూఢుడఁ దెలి । యగనేర్తునె! మోక్షగుండ-నగరనిలయ! నారాయణ। నామశర్మవినుత రామ॥ తపనకులజ దాశరథీ, యపరాధినిగాపాడు॥

వ. అని యనేకవిధంబులఁ బొగడిన శ్రీరామచంద్ర మహాప్రభువానంద వార్ధియందోలలాడి హనుమంతుని యందు సంపూర్ణ వాత్సల్యత యుంచె.

ఆశ్వాసాంత- తోహర.

అని తాళ్ళూరినా-రాయణకవి .రా-మాయణమును హరికథను। ఘనముగఁజెప్పెను, గదయిదిసుందర-కాండము చిలుకును సుధను॥ రా॥ ఇదివినువారల-కిహసౌఖ్యంబులు-గొదవలేక చేకురును । ముదమున-దుదకును-ముక్తిలభించును - మోక్షగుండ హరికృపను॥ రామా రామా యనవే శ్రీరామాయణకథ వినవే॥

క. నాచేతనైన కొలఁదిని । జూచిరచించితిని దీని ♦ సుజనులు నెఱసుల్
దోఁచినయెడ దిద్దుదురని। నాచిత్తములోననమ్మి ♦ నా ననయుంబుల్.

మోక్షగుండ రామాయణ హరికథయందు సుందరకాండము

సంపూర్ణము.



శ్రీరస్తు.

# మోక్షగుండ రామాయణము—హరికథ.

## యుద్ధకాండము.

:o:

క. శ్రీరామమూర్తియటులన। పారకృపారసముచిలుకఁ ♦ బలికినపలుకుల్
ధీరుండై వినివాయుకు। మారుఁడు పొగడంగఁదొడఁగె ♦ మనములరంగన్.

హను-కీర్తన, రూపకతాళము, తోడిరాగము.

శౌరీకోరీ! భజియింతు।సారసాక్ష! సేవింతు। మారకోటిమంగళ సుక।మార! తార-హార! మేరుధీర!॥శౌరికోరి॥మోక్షగుండఫాల! పృథు వక్ష హేమచేల! ప్రతిపక్ష మదవిఫాల! నిట-లాక్షవినుతశీల! గుణజాలా! శ్రితపాలా! బుధ,రక్షక! నా,రాయణకవి-పక్ష! వరకటాక్ష! సమద-రాక్షసనిచయా ధ్యక్షశిక్షదీక్ష! మోక్ష దక్ష! ॥శౌరి॥

క. అని కొనియాడిన రాముఁడు। మనమున నలరారి యప్పుడు♦ మారుతివినఁగా। నినజునిగనుఁగొనిపలికెను। ననఘా! యికఁ జేయవల యు ♦ నది యెటులొక్కొ!

తో. వారిధి మనమెటు, వలెదాటుదుము-క్రూర రాక్షసావళిని-పోరి యెటులజం, పుదుమో।మనమెటు-భూసుతగందుమొ! లలి ॥రా॥

వ. మహాదుర్ఘటకార్యంబు వచ్చెగదా! యిఁక నేదిగతి. యనిన నవ్వుచు నతండిట్లనియె.

సుగ్రీ-కీర్తన, ఆదితాళము, బేహాగ్.

రఘు,రామా! మీబోటులుచింత। చేత। బామరులరీతి-బలుకు టవింత॥ రఘురామా॥ తలపు, గలిగిన మాత్రములోన। సప్త జలధులు నింకింప, జాలుదుకాన॥ రఘురామా॥ మోక్ష,గుండపురీశ! మీకెందు। భూమండలముననడ్డ - ముండదనందు॥ రఘురామా॥

వ. అని పొగడిన ధయిర్యంబుబూని యాంజనేయునింగాంచి,

క. ననుమీరిపోపునంతటి।పనులున్న వె!జలధినాదు-బాణాగ్నుల చేఁ।గనుమిపుడె యింక జేసెద। ననిరావణుతలలుగూలు, నట్టులొనర్తున్.

వ. అయిన రావణునియొక్క సవిస్తారంబును వానిబలాబలంబులును విశదంబుగా నీవుచూచినమట్టుకు వివరింపుమన హనుమంతుం డిట్లనుచున్నాఁడు.

క. అలరునులంక త్రికూటా। చలశిఖరముమీఁదలవణ♦ జలధికినడుమన్। బలునైన కోటలేడును। గలవంబరచుంబితములు♦గా జెలువగుచున్.

తో. తేటయుదకముల-దేజరిల్లుచును - గోటయగడ్తలు గలవు। కోటనాల్గుదిక్కుల వాకిండ్లును-వాటిచెంత సొంపొదవు॥ రామా॥

వ. పశ్చిమద్వారంబున గజారోహకులును, నుత్తరద్వారంబున నశ్వారోహకులును, దూర్పుద్వారంబునఁ గాల్బలంబులును, దక్షిణద్వారంబున రథారోహకులును, గణనాతీతంబుగా గాచియుందురు. మధ్యకక్ష్యంబునఁ జతురంగబలంబులనారు లెక్కకు మిక్కుటంబుగాఁ గాచియుందురు.

ఉ. బంగరుమంటపంబులును ♦ బంగరుగోడలురత్ననిర్మితో। త్తుంగకవాటముల్ విమల♦తోరణపంక్తులుఁ జారువేదికల్ । రంగుజెలంగుగేహములు♦రమ్యవనంబులు మేటిబావులున్। బొంగుచునొప్పు లంకకును♦బోల్పఁగలేవు పురంబులేయిలన్.

వ. ఇట్టియసాధ్యంబగు లంకానగరంబుఁ దమకృపారసంబుచే సులభంబుగఁ బ్రవేశించి సీతాన్వేషణంబుఁ జేసివచ్చితి. రావణుని బలంబులలోఁ జతుర్థాంశంబునాచేత హతంబయ్యె. ప్రాకారమంటపాదులఁ గొన్నింటిని గూల్చి పురంబు దగ్ధంబుజేసి వచ్చితి మహాప్రభో! యాలస్యంబువలదు.

హను-కీర్తన [illegible] ఏకతాళము, జాతిస్వరము.

ఇఁక-దండు వెడలు రాఘవా! కపి-పిండుతోడ రాఘవా! యిఁక దండరిపుల రాఘవా! నీవు-చెండఁగలవు రాఘవా! ఇఁకదం॥ఇఁక, జాగువలదు రాఘవా! సేన రాగఁబంపు రాఘవా! వారి। సాగదోలు రాఘవా! కొన-సాగుబనులు రాఘవా! ॥ఇఁకదం॥ ధర మోక్షుగుండ రాఘవా! నీకు మ్రొక్కులిడుదు-రాఘవా! తమ-రీక్షణంబు రాఘవా! నన్నెక్కి కదలు రాఘవా! ॥ఇఁకదం॥

వ. అని ఆంజనేయుండుత్సాహంబుగాఁ బ్రోత్సాహంబు చేసిన నుప్పొంగి రాఘవుండు సుగ్రీవునిగని యిట్లనియె.

క. ఇదిమంచి ముహూర్తంబగు। సదయా! యీలగ్నమందుఁ ♦ జని లంకకుఁ జొ। చ్చెద సుతహితబల యుతముగ। విదలించెద రావణాధి ♦ వీరుల నెల్లన్.

వ. కావునఁ ద్వరగా గజ, గవయ, గవాక్ష, గంధమాదన, మైంద, ద్వివిధాది, కపిసైన్యంబులనెల్ల యుద్ధయాత్రకు వెలువరింపుము సుగ్రీవా యని రాముండనుజ్ఞ యిచ్చిన హర్షించి సుగ్రీవుండు సెలవొసంగినమాత్రంబున.

తో. తారకలనుసిక - తంబును వర్షపు-ధారలనైన గణింపఁ। దీరుగానికపివీరులసేనల। దీరదు ధరలెక్కింప ॥రామ॥

క. పదులును నూర్లును వేలును। బదివేలును లక్షకోటి♦పదికోటులు న। ర్బుదములు న్యర్బుదములుగాఁ। గొదువలులేకుండ వెడలె ♦ గోఁతులగుంపుల్.

తో. చెట్లనుండియు-గుట్టలనుండియు-గట్లనుండియుఁ గదలి। పుట్టబగిలిన-ట్లట్టహాసమునఁ-బొదలుచుఁ జేరెను బ్రబలి ॥రామ॥

వ. ఇట్లువానరసేనలు నేలనింగియు దిశలనుబట్టకుండ నసంఖ్యాకంబుగాఁ గిచకిచ ధ్వనులచే దిగంతరాళంబు భేదిల్లఁజేయుచు వచ్చిన సంతసించి యుద్ధయాత్రకు సాగఁదోలుమని నీలున కాజ్ఞాపించి రాముండు హనుమంతుని లక్ష్మణుఁడంగదునినెక్కి సుగ్రీవుండు దోడరాఁ బ్రవాహంబుప్పొంగి పాఱినట్లు గతిపయ ప్రయాణంబులవచ్చి సముద్రతీరంబగు మహేంద్రాద్రికిఁజేరి రాముండనుచున్నాఁడు.

రా-కీర్తన, రూపకతాళము. కళ్యాణి.

వనధిదాటి లంకజేర-వశమెమనకును। ప్రాణముకాతుడెట్లు బోయెనో! మనమున కాశ్చర్యంబగు॥ వనధి॥ నింగి ముట్టి వెడలు। త, రంగంబులు సుడులు। రంగుగ వెంబడి వెంబడిబొంగుచు నేత్రెంచెడు నీవననిధి॥ భీకరమకరములు। బలు, నీకగుమీనములు। ప్రాకటముగనప్పుడపుడుఁ-బైకెనిబొడగట్టి మునుగు॥ వనధి॥ ఎంతదూరమరయ। దీనికంతులేదు తెలియ। సంతతమును మోతుగుండ। కాంతుఁడనేనై యుండెన॥ వనధి॥

వ. అని శ్రీరాముండు డోలాయమాన మానసుండగుచుండ లక్ష్మణుండు.

క. శ్రీరామనీకు సేవా। పారీణులె! దాఁటుచుంద్రు♦భవసాగర మున్। ఊరక బలి కెదుగాకీ। వారధియన నెంతమొక్కొ!♦వశమగుమీకున్.

వ. అని పలుకుచుండ నింతలో సూర్యాస్తమయమైన సైన్యంబులెల్ల నియామకస్థలంబుల విడిసిరి. రామ లక్ష్మణ సుగ్రీవులుఁ గాలోచిత కృత్యంబులుదీర్చి యొక్కచో శయనించి జానకిని దలంచుకొని.

రాము-తోడిరాగము, అటతాళము.

ఎన్నడుగాంతునె। నిన్నిఁకజానకి! కన్నులకునుబొడ-గట్టుదువంచక్కడ। యె॥ ఒంటిగనుండఁగ। నోపనినీకిటు। నంటిపిపద్దశ। వచ్చెనెభామిని॥ యె॥ బాపురె! మనలను। బాపినకూరునిని। నాపగదీరగ। రూపడగించియు॥ నె॥ మోహగూఁడపురా। ధ్యక్షుడనయ్యును। రాక్షసమాయకు। భ్రమపడిపోతిని॥ ఎన్న॥

వ. ఇటుల విలపించుచున్న రామచంద్రునకుపచరించుచు లక్ష్మణ సుగ్రీవు లిటులనుచున్నారు.

శా. నిత్యానందమయుండవై తనరు నీ♦ నేర్పుల్ విమర్శింపఁగా
సత్యాధీశునకయిన దీరదనుచో♦ సర్వేశమేమెంత నీ
వత్యంతంబును దుఃఖమొందెదవు జా♦ యాభ్రాంతియున్నట్లుగా
శ్రుత్యంతంబున వెల్గునీచెయువులున్♦ జోద్యంబులౌనీశ్వరా!

వ. లోకవిడంబనార్థముగా నవతరించినారు గాన లోకానుసరణపరికారము నటింపుచున్నారే! కాని యన్యముగాదు. నిదురింపుఁడని పలికి యందఱు నిద్దురంజెంది. రంతనుదయంబయిన నిక్కడ లంకలో రావణాసురుండు [redacted] లువుకూటంబుఁజేరి మంత్రుల నందఱి రావించి యిట్లనుచున్నాఁడు.

గీ॥ మంత్రులార వినుఁడు♦ మర్కటంబొక్కటి। లంకిణిని జయించిలంకఁజొచ్చి। వనము బెఱికి వైచి♦ వైదేహిఁబొడగాంచి। పురముఁగాల్చి దనుజ♦ వరులఁ ద్రుంచి.

తొ. మనచేఁజిక్కియు-మఱివంచకుఁడై-వనధిదాటి వేగమున। జనియు రామలక్ష్మణులఁగపుల జ, య్యానదోడ్కొని మోదమున॥రా॥

వ. చనుదెంచి సముద్రతీరంబున విడిసినట్లు చారులవలన నే వింటి నెటులనైన రాముండు వారధినిఁదాటి రాకమానఁడు. దీనికేదేని సదుపాయంబు యోచించి తెలుపుఁడని పలికిన మంత్రులుద్దండంబున బొబ్బలిడుచు నిటులనుచున్నారు.

మంత్రు-కీర్తన, కేదారరాగము, ఆదితాళము.

ఏలనీగతిజాలి నొందెదవు। రాక్షసరాజ! ॥యేల॥ చాలగా దిక్పాలుర నవ। లీలగెలిచి నట్టిబల, శాలివి శ్రితవగహన। కీలివినీవు। చేలరీతి బలుకకింక-జాలుమమ్ము బంపిన నీ। వేళ బోయిపగతుర, గీలా భీలమొనరింతుము ॥యేల॥ ఖండితముగను మోక్ష, గుండ శ్రీకోదండ పాణిదండజేరి। దండికోతి, పిండుతో గూడ। చెండిపంచుకొని మేము। వండికడుపు నిండదిని। నిండువేడ్క తోడ వత్తు, ముందుము నీ డెంద మున ॥నేల॥

వ. అని మంత్రులు పలుకు వంతలో నింద్రజిత్తు ప్రహస్త శత మాయ,మహాకాం,యాతికాయ-మకరాక్ష-యూపాక్ష-విరూపాక్ష-ధూమ్రాక్ష-శోణితాక్ష-ఖడ్గరోమ-వృశ్చికరోమ-సర్పరోమ-కంపనా-కంపన-కుంభ-నికుంభ- మహోదరా, గ్ని- కోపన- దుర్ముఖ- దేవాంతక- విద్యుజ్జిహ్వాది రాక్షసవీరుల యక్షబలశౌర్య ధైర్యంబు లవార్యంబులగుచుండ సింహనాద భుజాస్ఫాలనంబులు చేయుచు రావణబ్రహ్మ కనుచున్నారు.

రాక్ష. కీర్తన, బేహాగ్- ఆదితాళము.

ఇక- మానుము మానుము నీవీచింత। యీమానవులు - వానరులననెంత॥ మనము॥ చూచి, చూడకుండ విడనాడు। వాడు, లేచిత తప్పించుక పోయినాడు। మే-మేచివెంబడి బడినేడు। వారి, పీచమడంచివచ్చెదము చూడు॥మిక॥ పటు, శౌర్యవిక్రమధీరులనుచు।నని, వార్య శస్త్రాస్త్ర నిపుణులనుచు। గనకా, హార్యధయిర్యపరులనుచు, నసురవర్య మాప్రతాపములుగనుచు॥ సింక॥ పెద్ద, కొండలు బిండిచేసెదము - ఆ, ఖండలాదులదోలెదము। కపి, తండముల నుగ్గుజేసెదము। మోక్షగుండ హరినిబట్టి కూల్చెదము॥ ఇకమా॥

వ. ఇంతలోఁ కుంభకర్ణుండాదినంబున నిద్రలేచియుండి యన్న

దర్శనంబునకు విభీషణయుతంబుగావచ్చిన గారవించి వారిని దగిన పీఠంబులనివసింప ననుజ్ఞయిచ్చి రావణుండు కుంభకర్ణున కిట్లనియె.

క. తమ్ముడనీవెఱుగవు చి। త్రిమ్మగు నొకవార్తగలదు ♦ రాముడనంగా । నిమ్మహింగల డొకభూపతి । సమ్మదమున వానిభార్య♦ జానకియనఁగన్.

వ. దండకావనంబున వారిద్దరుండఁగా సతినినేమఱఁజేసి యాసీతను దెచ్చి కూడ యత్నింపుచున్న నెప్పనాదున రాక్షస స్త్రీలఁగాపలిపెట్టి

తో. మనయశోకవన, మునసుంచినరా_మునిపేరణమున మొన్న। వనచరుఁడొక్కఁడు। వచ్చిచూచిపుర, మునుగాల్చియురాజన్న ॥రా॥

వ. వాఁడుజాడఁజూపించగా ననేకవానరులఁగూడి రామ లక్ష్మణులువచ్చి సముద్రింబున కవ్వలవిడిసి యున్నారు. దీనికేమి యోచన యన నవ్వి కుంభకర్ణుండు.

కుంభకర్ణుని_కీర్తన, జంఝూటిరాగము_అటతాళము.

రఘు, రాముని సామాన్యనరుఁడని_రావణాయనకు। ఓ। రావణాయనకు। ని, ర్లక్ష్యముగగనకు॥ రఘురాముని ॥ గో_విందుఁడేయతఁడామె లక్ష్మీ_సుందరియేసీతా।శ్రీ, సుందరియేసీతా ।వర। సుగుణవిఖ్యాతా॥ రఘురాముని॥ ఆ, ఘనునిసతి జెఱబట్టుటేరా, కుసులుచెడిరనుకో! రా, కుసులుచెడిరనుకో! ధర_మనుటలేదనుకో॥ రఘు॥ శ్రీ, మోక్షుగుండపురీశ్వరునితో। గక్షయేటికి। బ్రితి,కక్షయేటికి। సరిగాదుమాటికి॥ రఘురాముని॥

వ. అని కుంభకర్ణుండనునంతలో మహాపార్శ్వుండను రాక్షసుఁడు రావణునితో నిటులనుచున్నాఁడు.

క. సీతనుగూ [illegible] హితీరువ భీతినొంద ♦ నేలా! బలిమిన్। బ్రీతిగఁబట్టి ర [illegible] జవమజేమిచేయు ♦ నయ్యా! యనగన్.

వ. [illegible] న నానందంబునొంది మహాపార్శ్వుని

చుండగను॥వి॥ పుంజికస్థలయను-పుష్పబోణిని । రంజింపగను బల్మి-రమి యించితివి॥వినరా॥ అదివిని మోక్షగుం, డాధీశసుతుడు। నెదలోగిని సిశపి, యించెనాయజుడు॥విన॥

వ. ఇది మొదలుగ మదినొప్పని మదవతులగదిమి మదనకదనం బునఁ బొదలించితివేని నీపదితలలు పదిపదుల తునియలై పుడమిఁబడు గాక. యనివనజభవుండు శపించెఁగాన మునుపటివలె విచ్చలవిడి మచ్చ కంటుల జోలికిఁబోజాలరా! యోరీ! యనుచుండుసంతలో సుగుణభూష ణుండగు విభీషణుండు మృదుభాషణంబుల నన్నకు నభిముఖుండై యి ట్లనుచున్నాఁడు.

విభీ-కీర్తన, అటతాళము, హిందూస్తాని, తోడి.

అన్న ! నేనొనరించు విన్నప- మాదరింపుము రావణా । తిన్న గా నీమంత్రివర్యులుఁ- దెలుపనేరరు రావణా ! ॥అన్న॥ సీతనుదెచ్చుట నాశన- హేతువనుకో రావణా! నీతిమాలిజరించుటే! కడు - పాతకం బగు రావణా ! అన్న ॥ రాక్షసులను నమ్మిమది గర్వంబునొందకు రావణా ! మోక్షగుండాధీశు నెదిరి-మోహరింతురె! రావణా! ॥యన్న॥

వ. అవినుడుపు విభీషణుని దూషణవాక్యంబులు విని రోషించి భీషణంబుగా నవలోకించి యశనిపాత సదృశంబులగు పరుష వాక్కు లతో నింద్రజిత్తుగద్దించి కొలువుకూటంబు దద్దరిల్లునట్లుగా నిట్లనియె,

ఇం-కీర్తన, అఠాణరాగము, ఆదితాళము.

నన్ను - [illegible]లగగంటివా ! నన్ను । గన్నతండ్రినియంటివా ! నీవు॥ నన్ను ॥ పిన్న[illegible]యనియూరక, కున్ననుగానిలే - కున్ననోరుసునేనీ. వన్న మాటలకు ॥ న ॥ గిరిజగడము జేయ, గోరి యేతెంచి సభ । వారి ముం దర యేమో ! దూరి । తెలిపేవునీవు ॥ న[illegible] [illegible]భీముబలమునను, త్రా మాకులను గెలిచి । యీమహేంద్రజిత్తు [illegible] [illegible]ల్పినట్టి ॥నన్ను ॥ మోక్షగుండేశ్వరుని, పతుమ[illegible]నితి [illegible] । [illegible]క్షగా న[illegible]

కొట్టుదునా! యుడు, కోటులు రాలఁగ। మట్టుదునా। యురగులను। బట్టుదునా। శశి-భానుబింబముల నెట్టుదునా! ప్రమథులను॥ రా॥

వ. వీరందఱువినఁగ నాముందర రఘునందనుని వంది బృందంబు చందంబున నభినందించెదవు. తొందరపడకు కపిసందోహంబులఁ జిందరవందరఁ జేసి యమ్మనుజుల మ్రాదించి మాతండ్రి డెందంబు నానందంబు నొందింపకున్న నేనింద్రజిత్తునేనా! విభీషణా! అపృచ్ఛ సంభాషణా! యనిన పలుకులు ములుకులవలెఁ జెవిసోకిన నులికిపడి కనుకొలకులు గెంపులొలుక నలుకతో విభీషణుండు.

విభీ-కీర్తన, కళ్యాణిరాగము, అటతాళము.

రణభీషణుఁడైన - రాముని విక్రమ। మణుమాత్రమును నెఱుఁగ। కాఁడెదవిటుల। నసమిషేంద్రు జయించినటుగాదు। దహనాంతకాసుర। వనప పవనుల గెల్చినటుగాదు। ధనదేశులను బై। కొని సదా బెదరించినటుగాదు। నీకెఱుకలేదు॥ దనుజులనుబొలియింపఁగా నావనజనాభుఁడు రఘుకులంబున। జననమొందెను రాముఁడనఁగా। మనుజమాత్రునిగాదలంచెదో!॥ రణ॥ పుడమినారావణు। కడుపు జెడబుట్టితివి। కొడుకువ్రగావీవు। గులనాశకుఁడవు। జెడుగుపనులకుఁ జెడ్డవయినావు। నీకూతలకులో। బడెనుః దశకంధరుఁడు జెడిపోవు। శ్రీమోక్షగుండ। యొడయఁడెక్కడవయను కొనఁగలేవు। మీకికజావు। తడవుజరుగదు గవులగూడియు। వెడలి రాముఁడు లంక జొచ్చియు। గడియలోపల మృత్యువాతను। బడగఁజేయకయూరకుండడు॥ రణ॥

వ. ఇట్లుపలుకుచున్నంత రావణుండు నితాంత కుపిత స్వాంతుండయి దిగంతంబులు ఘూర్ణిల్ల నిట్లనియె.

క. మానవులను వానరులను। బూనికతోఁ బెద్దఁజేసి ♦ పొగడెదవిచటన్। మానసభోజనులగుని। దానవులనుసరకుగొనవు ♦ తగునా! నీకున్.

ఉ. రాముఁడు దైవమంచు వివ ♦ రంబుగఁ బల్కెదు దైవమైనదా। భూమిజగూడి కానలకుఁ ♦ బొల్పుగవచ్చునె! నేను వేగమే। ధీమతినేగి సీతగొని ♦ తేగనెదిర్చి జయింపకుండునే! నిమదిఁగాన లేక మము ♦ నిందమొనర్చెదుగా విభీషణా॥

తో. దాక్షిణ్యంబున - దమ్ముఁడవనియో - తప్పును గాచితి గాని । కక్షగట్టిపర । పక్షములాడిన । శిక్షింతునుదయమాని ॥రామ॥

వ. అనినవిభీషణుండు.

తో. ఈరాక్షసకుల, మెందుకుఁ జెరిచెద । వేలనీవు చెడియెదవు। శ్రీరామునకును, సీతనిచ్చి ర, క్షింపుమనుము బ్రతికెదవు ॥రా॥

విభీ-కీర్తన, ఆదితాళము, ఫరజురాగము.

రామామణినివ్వుము। రామునకు నింక ॥రామా॥ నా మాటలు విని-నను బ్రతికెదవు । నీ మతమును మా-నిన మేలు యింక ॥రామా॥ రాముడు నీదు శి, రంబులు వడిగా । భూమిని గూల్చక - ముందుగను నీవు ॥రామా॥ తరుచరులంబుధి - దాటి వచ్చి యీ । పురమును జెరుపక । ముందుగను నీవు ॥రామా॥ పుడమి మోతుగుండ, యొడయని తమ్ముని । కడు కోపాగ్నులు, వెడలక ముందే ॥రామా॥

వ. ఇట్లు నొక్కి- చెప్పిన రాక్షసరాజు కోపోద్దీపితు-డై దిక్తటంబు లటునిటుఁ జలింపఁ బెటపెటఁ బండ్లుదీటుచుఁ గుంభినీ తలంబదిరివఁ గుంభీందులిందు మ్రిగ్గ నంబోనిధులింకఁ గుంభిసంధరంబులు సెదర విజృంభించి యిదియొకవిలయకాలంబో! యని సభాసదులు భయభ్రాంతస్వాంతులగుచుండ దిగ్గున గద్దియడిగ్గనురికి వేగంబ కరవాలంబు జళిపించుచు భీషణంబుగా విభీషణు వ్రేయఁబోయి మాని వక్షస్థలంబు పయిన నొక్క-తన్నుదన్నిన వజ్రనిహతంబగు గిరింబోలె నేలంబడిలేచిన తమ్మునిఁజూచి.

రావ-కీర్తన, ఫీల్, ఆదితాళము.

పోరా! పోరా! యికలేచిపోరా! చాలునుపోరా! ఛీయటు ॥పోరా॥ పోరా! యికమా।పురిలోనుండక। పోరుమా[illegible] పురములేచి॥పో॥పట్టగరాముడు । జట్టమైననీ । పట్టునజని మొర । వెట్టుకొనగ లేచి ॥పోరా॥ తమ్ముడవనినిను । నమ్మెదగమచి । త్తమ్మున దెలిసితి । దాయాదివి లేచి॥పోరా॥ మోతుగుండకమ । లాక్షునినిన్నును । శిక్షింపక నే । సక్షితివిడువను॥పోరా॥

వ. అనిఖండితముగాఁ బలికిన విభీషణుండు రోషించియనలుండు, నలుడు, హరుండు సంపాతి, యనునలుగురు సచివులతోఁ బ్రయా

ణాబయి కాకుత్స్థుని కొలువునకుఁ జనువాఁడయి.

తో. నీకుహితమ్మును-నేనెఱిగించినఁ-గైకొనవైతివి నేఁ| తాకి వచ్చినం, తటనైనను జి-త్తమున దలంతువునాఁడు॥ రామ॥ ఇదివరకేనిను విడువదలచితినే। నేమో! నిలిచితిగాని। యిదిగో పో యెద, నిపకులేను సే, విఁచుటకయి మదిబూని॥ రామ॥

వ. ఇట్లుపలికి తత్క్షణంబున లేచి తనతల్లి మందిరంబునకుఁజని నమస్కరించి యిట్లనుచున్నాఁడు.

క. అమ్మా రామునితో సఖ్యమ్మొనరింపు మనుచుఁ బంక్తికంఠునితో నే। నెమ్మది బోధించినఁగో। పమ్మున నాయెడఁదన్ని పరిభవపఱిచెన్.

వ. ఈదురాత్మునిఁగనుచు నేనిందుండఁజాలఁ గరుణాశరధియగు రఘు వరునిఁ జేరెద. సెలవిమ్ము మాతా! త్రైలోక్యవిఖ్యాతా! యని యిట్లుపలికిన గైకేసి చింతాక్రాంతురాలయి కొంతవడికి వివేకంబునొంది యిట్లనియె.

కైకేసి-కీర్తన, ఆదితాళము, బ్యాగుస్వరము.

పోయిరావిభీషణా! యిక! బొమ్ము సుగుణభూషణా! పాయక శ్రీ రామ, భద్రుని కృపను, దీర్ఘాయురారోగ్య మ - హైశ్వర్యములు గల్గు ॥పో॥ నిన్ను జేరదీయును। శరణన్న వారిగాచును। మున్ను మీతండ్రి చే। విన్నానయోధ్య, లో-వెన్నుఁడు రాముఁడై - వెలయునటంచును॥ బోయిరా॥ మోక్షుగూడవాసుఁడై। ముని, ముఖ్యహృదయ భాసుఁడై। రాక్షసులను గూల్చి- రావణుని వధియించి- యీక్షితి లంకని, న్నేలించు నిజముగ ॥బోయి॥

వ. ఇట్లు దీవించి పంపిన నామెసెలవు గైకొని మంత్రులు దానును బయలుదేరి యాకాశమార్గంబున రామునిఁ దలంచి యిట్లనుచుఁ బ్రయాణంబయి.

తో. రావణానుజుని ప్రాణపంచకం, బీవిధిజనునన్ను ఁలు। వేవే గంబున-నెరిగి వియ [illegible] బోయిరి యిటుల ॥రామ॥

క. అంబ [illegible] లు। నంబరపథమునకు నేగ నడికసి

జెచ్చెరను। నిచ్చటికి। విచ్చలవిడిగా ముచ్చటలాడుచు ॥ వచ్చే॥ దనుజపతియనుమతిచే। మనపయికీ। జనుదెంచునరా-యనవరుణేనో! ॥వచ్చే॥ మోక్షగుండా, దృక్షమము। యీక్షణమే। దీక్షతోఁబంపిన-శిక్షయొనర్తుము ॥ వచ్చే ॥

వ. ఇట్లు వీరాలోచింపుచుండ దివినుండి విభీషణుండు.

తో. రావణానుజుఁడ-రామచంద్ర! విను-నేవిభీషణాఖ్యుఁడను! దేవరవాఁకి-దేవినిప్పమని-తెలిపినవినకనుబాను॥ రామ॥

గీ. నన్నునుగ్రదృష్టిఁగ్రన్ననవారసి। తన్నుఁగొలుపులోనఁ దానవేశు। డ నంతనతనివిడచియాప్తమంత్రులఁ గూడి। వచ్చినాఁడఁనీదుపాపుఁగోరి.

విభీ-కీర్తన, రూపకతాళము, కేదార.

దేవ దేవ! సేవకుండఁ-గావుమింక। నన్ను। కరుణాకర! నీవు దప్పరక్ష, కులులేరిక। భావములో। భావింపకు। వేవేగ ॥ దేవ ॥ అక్షయ నారాయణదా, సాఖ్యమనః। కంజ వరసదనా। మోక్షగుండవాస! శశివదనా। రాక్షసుడ-శిక్షింపకు-రక్షింపుము ॥ దేవ॥

వ. అనిపలికిన వాక్యంబులకు రాముం డాలోచింపుచుండ సుగ్రీవుండు గ్రమ్మఱ నిట్లనియె.

తో. అసురులమాయల-కంతులేదుమీా! దెసకునచ్చుచున్నాఁడు! పసమీాఱగఁగా, పాడదగున! చంపగదగునా! యనఁనపుడు॥ రా॥

క. శరణాగతుఁడై వచ్చిన। సరగున ప్రత్యర్థి నయినఁ జంపఁగఁదగునా! కరుణనుబ్రోవగవలయును। బిరుదగు నాకదిమొగానఁ-బ్రియమునఁ జూతుఁ.

వ. అట్లయినవీఁడు నమ్మకద్రోహమ్ముఁ జేయునేమో! యని భయపడెదవేమో! సుగ్రీవా!

తో. క్షణమాత్రంబున। సకలజ[illegible]క్షింపగఁబ్రోవగ [illegible]ఖనడపఁగఁ-గ[illegible]యున[illegible] లిఁను॥

పగవలదీతఁడు। సుగుణాఢ్యుఁడు ఘనుఁడు। దగునీతిపరుఁడు॥ దగదు॥ దూతనుజంపిన। దోషమను జ్యేష్ఠ। భ్రాతకుఁదెలిపెనాఁడు। విశిపించినాఁడు॥ తగదు॥ మనపక్షమునకు-మాటలుబోధించు। మనుజాసనపతితో। వెసవక ధృతితో॥ దగదు॥ మోక్షగుండేశ్వర! మోసమురాదిక। దీక్షగన భయమిడుము॥ తగదు॥

వ. అని తెలిపిన హనుమంతుని పలుకులకలరి జలజాప్తకులుఁడు జలజాప్తనందనున కిట్లనియె.

తో. అభయంబిచ్చెద। నావిభీషణుని। అరసితోడ తెమ్మనఘా! సభయులనెల్లను-సన్మానించుట। ప్రభువులపనిసౌమ్మనగా॥ రా॥

వ. వల్లెయని సుగ్రీవుండుపయి కెగిరి విభీషణుని మంత్రియుక్తంబుగాఁ గొనివచ్చి రామునిం జేర్చి నాత దత్పాదారవిందంబులకు శిరంబుమోపి సాగిలిపడి.

విభీ-కీర్తన, ఆదితాళము, బిలహరిరాగము.

శరణు దివా,కరకులజా! చరణవినిందిత-వరజలజా! ॥శరణు॥ ఇతరమునే, నెఱుఁగకను। గతినీవనుచును-గనినాను। శరణు॥ అక్షరనాకభయమిడి - మోక్షగుండాధిప! బ్రోవవే॥ శరణు॥ శ్రీయుతనా, రాయణదా, సాయతహృదయవిహార! సదా॥ శర॥

భుజంగ-నమోనంతరూపా! క-నచ్చక్రదీపా! నమోవేద పాదాసు, నాదానుమోదా! నమోలోకనాథా! ఘ, సజ్జానబోధా! నమోభూతరక్షా! స, నందాదిపక్షా! .

విభీ-కీర్తన, ఆదితాళము.

నీమయమంతయు। రామా! రామా! యేమిలేదుగద-రామా! రామా! ॥నీ॥ సోమ[illegible] సురలుదిక్పతులు। భూమిముఖాఖిల, భూతచయములు॥[illegible]ధులు, ద్విమూర్తులు గ్రహములు దనుజమనుజ మ[illegible]లు॥ నీ॥ నిగమాగమములు - నిఖిల విద్యలును [illegible]। నకులునుసిధులు॥ నీ॥ మోక్షగుండమున [illegible]క్షర। నారా, యణకవివినుతా!॥నీ॥

వ[illegible]ంచి శ్రీరామమూర్తి కృపారసంబొ

లుక [illegible]

తో. దానవసీపాత్రధనకును మెచ్చితి। గానసీమమదిఁగోను। దేని గోరినను। దాసినిచ్చెదను। దెలుపుమనఁగనతఁడనెను॥ రా॥

క. నీవరరూపముఁగంటిని। గావున నావంటి శుచియుఁఘనుఁడు నుధన్యు! డీవిశ్వంబునఁగలడే!. యీవేనిధ్యానమునువి♦వేకముభక్తిఁ!

విభీ-కీర్తన, కాంభోజి, అటతాళము, నిన్నునమ్మి.

కోరనేరవేరు-కోరికలుమది। జేరినీదుసేవ-జేయుభక్తిదప్ప॥గోర॥ ఘోరదుర్వారని-స్సారసంసారాబ్ధి। దూరిమునింగెడు వారిసాంగత్యము॥ గోర॥ నారాయణశర్మా-ధారా! మోక్షగుండాగార! నీదుకొల్వుకన్న నన్యమేమి॥ కోర॥

అనివేఁడిన రాముఁడు సంతసించి.

ఉ. నన్నుభజించుభక్తుల మ ♦ నంబుల నేనువసింతు సీతతోఁ
గ్రన్నన నట్టిభక్తుఁడవు ♦ గావున నీకభయంబొసంగితిఁ
బన్నుగ రావణాసురుని ♦ బట్టివధించియు లంకనీకు నే
నున్నత బుద్ధిగట్టెదను ♦ నెయ్యననేలుము శాశ్వతంబుగన్.

వ. అని తెలిపి హనుమంతునిచేత నిసుకతోఁ లంకాపురిని నిర్మింపఁజేసి యందు విభీషణుని గూర్చుండఁబెట్టి లక్ష్మణునివలన సముద్రోదకంబులు దెప్పించి యతని కభిషేకంబుఁజేసి.

రా-కీర్తన, త్రిశ్రజాతి, సంతతంబున.

ఓవిభీషణా! యోవరభూషణా॥ యోవిభీ॥ నీవుమనుముచిరజీవివగుచునిక నావచనమ్ము॥ నోవి॥ ఎందాకరవితార - కేందులుం నుందురో! యందాక లంకారాజ్యంబేలుచుండుడు॥ వ్రా॥ ఎందాకనాకథయీయాయుర్వినుండునో!యందాకలంకారా-జ్యంబేలుచుండుడు॥ వ్రా॥ మోక్షగుండేశుని, ముఖ్యభక్తుడవగు । [illegible] కారా, జ్యంబేలుచుండుడు॥ వ్రా॥

వ. ఇట్లు విభీషణునకుఁ బ[illegible]లిచ్చిన పిమ్మట సుగ్రీవుండు విభీషణునితోఁ.

తో. రావ[illegible]డునిపను-రాజ[illegible]వదకును నీవు। స్వామిపనికిబా-సటయయి నిలువగ[illegible]రా॥

వ. కనుంగొని విభీషణుం[illegible]

విభీ-కీర్తన, రూపకతాళము.

అందరికిదోడగునా- నందమయునకు । నిం ॥పొందగ దోడ్పడగ శక్తి,యున్న దెమనకు॥ నందరి॥మీసమానముగను నేను। మెలగనేర్తును రామ। దాసుడనై యెపుడు సేవ-దవిలిసేతును॥అందరికి॥ ప్రీతిగను మోక్షుగుండ-విభునిపనులలో। నేను। జేతనైనరీతిదిరిగి-జేతునవనిలో ॥నంద॥

వ. అని యిట్లు చెప్పుకొనుచుండ నంతలో రాముని పనుపున శుకుండను చారుండువచ్చి యాకాశవీధిని నిలిచి యాదలు వినుచుండ సుగ్రీవునికిట్లనియె.

తో. రావణుడెఱుకప- రచుమనువాక్యము-లీవిధమగు వినుమిన జా! వేవేగమే! కపి,వీరుడవైనరు-సేవింపగనేలయనుజా॥ రామ॥ నన్ను జేరితే! యన్నివిధంబుల- మన్ననజేసెదనేను । గ్రిన్ననసీలం, కకుంజను దేరుము। కపిసైన్యంబులతోను॥ రామ॥

వ. అని తనమాటలుగాఁ బలుకుమన్నాఁడను నంతలో వనచరులు జుట్టుకొనిమొక్కతన్ను తన్నిన దూతనువధించుట నీతిగాదని రాముండు డిపె. నంత వాఁడుమరల సుగ్రీవునితో రావణునకేమిచెప్పగుననవుడు

సుగ్రీ-కీర్తన, ఆదితాళము.

అన్న వాలినాకునతడు - మొన్నరాముచేతజచ్చె । నన్నను నే ననెడుమాట- యధమ! మానరా! ॥యన్న॥ లంకకురమ్మనియక- లం కముగఁగోరినావు । లంక కేగుదెంచువిధము -లలిని వినుమురా ॥యన్న॥ మోక్షుగుండవిభునిమోస - పుచ్చినావు కాననిన్ను । శిక్షజేయ రాము గూడి - చేరవత్తురా ॥యన్న॥

వ. అని చెప్పుము పోరా! రాక్షసాధమా! యని పలికినవాఁడు చావుతప్పించుకొని లంకకేగులోపల శార్దూలుండను రక్కసువ లనఁగపిసైన్యంబుల బలంబును రాముని ప్రతాపంబునువిని కొలువుచా లించి రావణుండంతిపురికిఁదిగె నిక్కడ రాముండు సముద్రునిఁగదిసి.

రా-కీర్తన, పూర్వికల్యాణి, రూపకతాళము.

దారియొసగరాదా । వారినాథ! నెనరులేద ॥ దారి ॥ పోరిజ గత్కంటకుడగు । క్రూరుని దశకంఠుద్రుంచి । ధారుణిభారంబుబాపఁ। గోరితి లంకకుజేరగ ॥దారి ॥ సకలపుణ్యవాహినులును । ప్రకటంబుగనీ

లోపల। నొకటిగ జేరగ గైకొని। యకల-కుడవగుచునాకు ॥దారి॥ వెలయగ నారాయణకవి । వినుతుడయిన మోక్షగుండ । నిలయునకును గూతునిచ్చి । చెలగిన శాంతాత్మనాకు ॥దారి॥

వ. ఇటువలె రాముండెంత ప్రార్థించినను సముద్రుండు మిన్నకుండిన నాగ్రహించి.

రా-తో. వినులక్ష్మణవీ- డెంతనురాత్ముడో! విశ్వసింపడెంతయును । ఘనముగనిప్పుడె । గ్రాగించెదను । గొనునాదు ప్రతాపమును ॥రా॥

వ. అని పలికి తమ్మునిచేనున్న విల్లమ్ములుచేకొని బ్రహ్మాస్త్రంబుసంధించి.

పంచచామరము. అహోసముద్ర! కొంచెమైన ♦ యాదరంబు లేకనీ । వహంకరించి యున్నవాడ ♦ వైననేను యుండునా । మహోగ్రకాండవహ్నిచేత ♦ మారణంబుచేసెదన్ । సహించుమంతెచాలు ధైర్య ♦ శాలివైన నిచ్చటన్.

వ. అని యస్త్రంబువిడువ నుద్యోగించిన నతనికోపాగ్నికి జగంబులు గడగడవడంకె హద్దుదాంటి సాగరోదకంబులు యోజనమాత్రంబింకె తిమితిమింగలములు జంకె నయ్యవసరంబున,

క. రత్నాకరుండు రవికుల, రత్నమునకు బహుమతులుగ ♦ రమణీయములౌ,। రత్నంబులు గైకొనుచుం బ్ర । యత్నంబునవచ్చె దివ్య ♦ మగు నాకృతితోన్.

వ. ఇట్లరుదెంచి యాశరధి దాశరధికి నమస్కరించి యుపాయనంబులు సమర్పించి.

సము-కీర్తన, హంసధ్వని ఆదితాళము.

కళ్యాణగుణగణంనమామి॥ కళ్యాణ॥ కమలదళాంచిత- ఘనమృదుచరణం। కల్మషహరణం। కరుణాభరణం॥ కళ్యా॥ కటితటరంజిత-కాంచనచేలం । కుటిలమదాసుర। కోటివిఫాలం॥కళ్యా॥ మోక్షగుండస-త్పురవిభుమఖిలా । ధ్యక్షుం నారా, యణకవిరక్షుం॥ కళ్యా॥

వ. ఈపగిదిం బ్రార్థించిన శాంతుండయి సీతాకాంతుండు సరిత్కాంతున కిట్లనియె.

తో. నేదొడిగినయీ-నిశితసాయకం । బేదిక్కుకువైచెదను।పో దువ్వృథాపా-దోధినాథ తెల్పుమునా నతడిట్లనెను॥ రామ॥ ఉత్తరదిక్కునానున్న కిరాతుల । నుక్కడంచురఘువీరా ! పొత్తుగలిగియె-ప్పుడునను బాధిం-పుచునుందురు రణశూరా!॥ రామ॥

వ. అనమంచిదని సముద్రునిబాధింపుచున్న యాభీరుమండలంబుపయి నమ్మహాసీయాస్త్రంబుఁ బ్రయోగించిన నది వారిని దునిమి పొదిఁజేరెఁ బిమ్మట సముద్రుం డిట్లనియె.

సముద్ర-కీర్తన, జంఝూటిరాగము, ఆదితాళము

వారధి, గట్టగ నీకపి। వీరులబంపవె। యోరఘుకులవర!వారధి॥ ఓరుపుతో, నేరుపుతో । భూరుహభూధరములు । జేతురు రపారముగ వారధి। దీనికి । విశ్వకర్మవర । సూనుడయిన నలు । డౌను సమర్థుండు॥ దీనికి॥ భూనుతమై । మానితమై । కానవచ్చు మోక్షగుండ । శ్రీనాధ వానితోఁ గలిసి॥

వ. ఈనలుండు చేతముట్టి వైచిన నెంత భారమైన వస్తువైనను నీటిమీఁదఁ దేలును. పిన్ననాఁడు గణ్వామహాముని వలన నట్లువరంబు వడసియున్నాఁడు. కాఁబట్టి యతని సేతువు గట్టుపనికి నియమింపుడు తక్కిన కపులందఱుఁ బర్వతాదులు దెచ్చియిత్తురు. రామా! దేవతా సార్వభౌమా! అని సముద్రుండు.

క. ఈ తెఱఁగున విన్నవించినఁ । సీతాపతి యలరి నలుని ♦ చేసిటి పరుల్గ। సేతువుగట్టింపఁగఁదాఁ । జేతంబునఁ దలచి యిటులఁ ♦ జెప్పె నతనికిన్॥

వ. ఇట్లునియమించి నవ పాషాణంబులన్ నవగ్రహములఁ బూజించి యచ్చటఁ దనపేర లింగస్థాపనంబు జేయుదలంచి హనుమంతున కిట్లనియె.

రా-కీర్తన, ఆదితాళము, కన్నడ, నజరబిర.

పవనతనయ! యికతెమ్మా! జయమునఁ గాశికి జనిరమ్మా॥ పవన॥ లింగద్వయంబును దెమ్మా, శివ, లింగ । మంగళకరముగ-మాకిమ్మానీవు ॥పవన॥ తడవు లేదు లగ్నమ్ము। యిక-దడ ॥ వడివడిగారా, వలెనుమ్ము నీవు ॥పవన॥ చాలభక్తిగోడనుండు । నిప్పు, జాల । ని, న్నేలు మోక్ష

గుండేశుండునీవు ॥పవన॥

వ. అని దెలిపిన రామాజ్ఞ శిరసావహించి వాతూలసుతుండు ప్రయాణంబయ్యె.

క. ఆకాశమార్గము నందా। నాకాశికి క్షణములోన ♦ నరుదెంచి యటన్ । ఆకాశకేశు నభవుని । నాకాశీవిశ్వపతిని ♦ నభిమతి జేసెన్.

వ. ఇట్లుపొగడిన సంతసించి యాంజనేయునికిం బ్రత్యక్షంబయి యతని యభిమతం బెఱింగి రెండులింగంబులిచ్చి నేనిట్లంటి.

క. ముదముంభజు నకునేని । చ్చినవాగ్దత్తమును దీర్ప ♦ శ్రీరాముని దా। ర్యవమునకును దక్షిణదిశ। కనిసుతావత్తు నింక ♦ నతివేగమునన్.

వ. అనిన హనుమంతుండిట్లనియె.

తో. మునుపిచ్చితిరే, మనివాగ్దానము। మునివర్యునకనియడుగన్ ।
హనుమంతునకు, ట్లనియాకిథ యా, ద్యంతము దెలిపితినడిగన్ ॥రా॥

శివు-కీర్తన, ఆదితాళము, వగపేటికి.

విను పూర్వపు వృత్తాంత । మును దెలిపెద హనుమంత-మును వింధ్యనగము చెంత-కునునారదు డత్యంత వీణా! గాన, మున ధీరుండౌచు-జేర-గానంత॥ వినుబూ॥ అమ్మునిచంద్రుని గాంచి। యద్రీశుండు మోదించి । సమ్మతి సన్మానించి, సాష్టాంగములర్పించి । మొంచి-మించి-నెమ్మోమునందు-బాశిజోడించి। వినుపూర్వ॥ మోక్షపురీశుని కరుణన్। మునివరతమరరు జేరన్ । ఈక్షితి బాపములారెన్। ఇదె శుభములు జేకూరెన్ । మీరీ, దారి। లక్షించి వచ్చు-వేళ, నను జేరెన్ ॥ వినుపూర్వ॥

వ. అని వింధ్యాద్రి ప్రశంసించిన.

క. నిట్టూర్పువిడిచెనారదు। డట్టియెడన్ గారణంబ♦హా। యేమొ కోట్టుగట్టులయెకిమీడవంజూ। పట్టితినే నలియుంమా♦బంకింపంగన్.

వింధ్య-కీర్తన, ఏకతాళము, శహానరాగము, కామినిసామిని.

ఏధర, ణీ ధర, మీడగు నా, కీధారుణి॥ నేధర ॥ సాధువరా మీపద-సాక్షిగనేనాడెద॥ నేధర ॥ అల్లశర్వాణీతెన-వల్లగలుగుట శివు, డల్లుడై రాజిల్లుటను శ్రీ, శాద్రికొంచెము బేర్కొ-నంబడు నేధర॥ మేరుగిరి స్వర్ణమయ । నైరంజిలుననివేవా। గారమని ప్రఖ్యాతినొందెను । గానినాతో సాటియగునే॥ యేధర॥ కొండలెన్నియొ లెక్క-కుండెనవి

యేల మోక్షు। గుండపతి కృపనిండ నేను, క్కండ దండిమగండ జూడవే॥ ధర॥

సీ. ఉదయధరాధర ♦ ముద యాశ్రితంబుమందేహాద్రి దేహ సం ♦ దోహమరయ। నిషధాద్రినోషధీ ♦ నిచయంబులే వయ్యెన స్తమి తప్రభల స్తగిరిని। నీలకాంతులబొల్చు ♦ నీలమహీద్రంబు మందాక్ష సహితంబు మంధరంబు। మలయాచలంబున ♦ వెలయుఁబాముల గుం పు రైవతాచలము ని ♦ ర్ధనముగాదె। మాటమాత్రంబు లగును ద్రి♦ కూట హేమ। కూటములుఁభారమును మోరియ ♦ నోటువడును। సహ్యా కిష్కింధకొంచాది ♦ శైలములు ము। నీంద్రయన్నిట మేటినై ♦ యే నుబోల్తు.

వ. ఇట్లుదుర్వార గర్వంబున నప్పర్వతంబు పలికిన నసహ్యంబు నొంది నారదుండు మనంబున.

తో. శిఖరదర్శనము, చేత ముక్తియుదు-శ్రీశైలాదులు నుండ। నఖిలగిరుల నిత, డవమానించుట। యాశ్చర్యంబగుఁ జూడ॥రా॥

వ. అనియెంచి యతని గర్వంబుఁ బాపువాఁడై.

నార-కీర్తన, కన్నడరాగము, రూపకము.

ఏది, నీసాటిశైల-మీజగంబున। నేగాన॥నేది॥ ఆదిత్య ముఖ గ్రహము, లాశ్రయింతు ద్రనునటంచు। మోదంబున మేరునగము। ముఖ్యంబుగనిక్కు-గాని॥యేదీ॥ విన్నానిదె ననుఁబోలను-వింధ్యశైలమని యెప్పుడు। నిన్నవమానింపుచుండ। నిట్టూర్పంచు కెవిడచితి॥నేదీ॥ మా వంటివారి కేల। మదియందున నుండనిమ్ము। పోవలె శ్రీమోక్షుగుండ। దేవుని సేవింపగాను॥నేదిసీ॥

వ. అనియిట్లుపలికి కలహాశనుండు యథేచ్ఛం జనియె. నంత వింధ్యధరాధరంబు.

శా. ఔరా! మేరుధరాధరంబు గడుగర్వాయత్తచిత్తంబుతో। నీరీతిన్ ననుఁదూలనాడెనట! క్వా ♦ నిమ్మెంతదో! తప్పతా।పారూఢం బదిగాంతునంతయును సూ ♦ ర్యాద్రిగ్రహాళుల్ తనున్। జేరన్ వచ్చుట దెట్లో! చూతుననుచున్ ♦ జిత్రంబుగా నత్తఱిన్.

వ. అని నిశ్చయించి తనశరీరంబు రెండువేల యిన్నూట రెండు

యోజనంబుల పొడవుఁబెంచి సూర్యసంచార మార్గంబు నిరోధించిన నదియొక విలయకాలంబై.

తో. పూర్వోత్తరముల-బొల్చువారికె-వ్వుడు సంతాపముగలిగె। పర్వినదిద్రిల-బండగ దక్షిణ, పశ్చిమస్థులకు గలిగె ॥రామ॥

వ. ఇట్లొప్పిన సమస్తయజ్ఞాది క్రియలభావంబయిన దేవేంద్రాదిదేవతలు బ్రహ్మసహితంబుగా వారణాసికివచ్చి నన్నిట్లు ప్రార్థించిరి.

దేవ-కీర్తన, ఫీల్ రాగము, ఆదితాళము, కామకుని.

దేవదేవ! రావె! నీవదిక్కు-కావవే! కేవలాంధకారమై।యీవిధంబుదోచెనదే॥దేవ॥ కాలమెరుకలేని, కారణంబుతోజన। పాళిసర్వకర్మలు। జాలమానియుండిరిల ॥దే॥ హవ్యములులేకమే। నుకట! యెట్లునిల్తుమో। యవ్యయ శ్రీమోక్షగుం,డా ధినాధమమ్మేలవే ॥దేవదేవ॥

వ. అని బహుభంగుల ప్రార్థించిన దయామయ హృదయుండనై వింధ్యాద్రికి గురువగు నగస్త్యమహామునిని వీక్షించి యిట్లంటి.

క. లోకోపకారమునకై। యోకుంభజ! దక్షిణాశ ♦ కురువడిజననీ। వాకుధరేంద్రునిగర్వముఁ। జోకార్చుము కాశినుండ ♦ బోలదనీకున్.

వ. అనిన వాక్యంబులువిని దుఃఖాక్రాంతుడగుచు నగస్త్యుం డిట్లనియె.

అగ-కీర్తన, హిం, కాపి-ఆదితాళము, ఈవిపరీ.

కాశినిబాసివి-శ్వేశా! పొమ్మన। నగునా! ॥కాశిని॥ఓశివా! నీదు కడనుండక నాదక్షి। ణాశకుబోవ గా,ళ్ళాడునెనాకిక ॥గాశిని॥ ఇమ్మహాస్థలమున। నెమ్మను బాసిన । గ్రిమ్మరజన్మము । గలుగదందురు గదా!॥ కాశిని॥ ఖండితముగ బలుక । గారణమేమియా! మోక్ష। గుండనాయకు! చెంత।నుండదగనేశివా!॥ కాశిని॥

వ. అని వగచుచుండిన నగస్త్యునకు నేనిట్లంటి.

ఉ. భాసురవారణాశి నెడఁ ♦ బాయఁగ నాయెఁగదా! యటంచు నీ
వీసమయంబునన్ వగవ ♦ నేటికి వింధ్యుని శాంతమూర్తిగాఁ
జేసియునాదెసన్ నిలువు ♦ శ్రీరఘునాథుని పూజఁగైకొనన్
వాసముఁజేయ నేసటకు ♦ వచ్చెద దర్శనమిత్తు నీకటన్.

వ. అని యొడంబఱిచిన మంచిదని యగస్త్యముని లోపాము

దాఁియుతంబుగాఁ గాశింబాసి దక్షిణాభిముఖుండై వింధ్యగిరి సమీపిం చివచ్చిన.

క. ఇనమండల పర్యంతం।బును బెఱిగిన వింధ్యశిఖరి ♦ మునివర్యు నిరా । కనిరీక్షించి యెదుర్కొనె । మనమున భయభక్తులొదవ♦మతి ఖర్వుండై.

వ. ఇట్లు గ్రుంగిన రూపంబుతో నమస్కరించి వింధ్యుండిట్లనియె.

విం-కీర్తన, కళ్యాణి, ఆదితాళం, మనవినిచే । వలె.

శరణుకృపాజలధే ! గురువర ! ॥శరణు॥ ధరణిని తమసం-దర్శ నమున నే । ధన్యుడనైనాను । గురువర॥ శర ॥ మావంశముజ, న్మము గేహంబును బావనమాయెసహా ! గురు ॥ శర॥ ఏమికోరి మీరే- తెం చితిరో । స్వామీ ! వచియింపు । గురువర ! ॥శర॥ మోక్షగుండరా- మునిపదాబ్జముల । సాక్షిగసవరింతు । గురువర ! ॥ శర॥

వ. అనిన వింధ్యగిరికి మునివర్యుండిట్లనియె.

గీ. మరలివచ్చువరకుఁ♦మానుగనీరూప
మున నె నిలిచియుండు ♦ మనఁక నతఁడు
మంచిదనుచుఁబలికె ♦ మాసిందునటనంపి
యతనియాజ్ఞరీతి ♦ నడఁగియుండె.

వ. అదిమొదలు గర్వంబులేక వింధ్యుండు గుజ్జురూపంబున నుండి పంద్రెండేండ్లకొక పర్యాయము మునిరాకఁగోరి నిక్కిచూచుచు రాకుండిన యథాస్థితినుండుచుఁ గాలంబు జరుపుచుండె.

తొ. అప్పటినుండి ని, రాటంకంబుగ-నర్కుడు విహరింపగను । ఎప్పటివలెఁ బను, లెల్లదీర్చుకొని-రిలలో జనులింపుగను ॥ రామ॥

వ. అట్లు లోకోపద్రవంబుఁబాసి కుంభసంభవుండు దండకావ నంబున నిలిచి నారాక నిరీక్షింపుచుఁ దపంబుఁ జేయుచుండెఁగావున.

శివుని-కీర్తన, ఆదితాళము, హుశేని, ఈరాజా.

నేనే తెంచెదను। నీవరిగిన వెనువెంబడిగను॥ నేనే॥ మానివర్యునీ, మాటదీర్పగ। జాన, కీశుమానక జూడగ॥ నేనే తెంచెద ॥ లింగములు రఘు, పుంగవునకు జె, లంగ, మంగళంబుగ నొసగము॥ నేనే॥ మోక్ష గుండా। ధృతునకు బ్రి, త్యక్ష, మైని, రీక్షింపగనిక॥ నేనే॥

వ. అనిచెప్పి వీడ్కొలిపిన నాంజనేయుండు లింగంబులుగొనివాయువేగంబునఁ గించిద్గర్వ సమావృతుండయి వచ్చుచుండె. నదియెఱిఁగి రాఘవుండు సుగ్రీవునిఁజూచి.

తో. వాయుసుతుఁడు రాఁడాయె ముహూర్తము। వ్రాయెనటుల గావునను। యీయెడదడయక। నిసుకలింగమును। నెలమిఁబ్రతిష్ఠించెదను.

వ. అనిచెప్పి సర్వవానరులుఁ గనుచుండ మునులసమక్షంబున సైకతమయలింగంబును బ్రతిష్ఠఁజేసి.

తో. తనకౌస్తుభమును- దలచినవచ్చెను- దపనకోటి తేజమున। మనుకులుండుగని-మనమలరగ న, మ్మణినిదాల్చె గళమున॥ రామ॥

వ. ఇట్లు మణినిధరించి తన్మహిమచేఁ గల్పించఁబడిన ధేను ధన వస్త్రాభరణాన్న దానంబులచే సభ్యులఁ దృప్తులంజేసి పంపిన వారు స్వాశ్రమంబులకుఁ బోవునెడ మార్గమధ్యంబున.

తో. మారుతియెదురై-వారినిగని యె,వ్వారివలన బూజితులై। మీరువచ్చితిరి-చేరితెలుపుడన-మేదినీసురులు నతులై॥రామ॥

క. రామేశ్వరమున సీతా
రాముఁడులింగప్రతిష్ఠ ♦ రహిఁజేయుచు మ
మ్మీమాడ్కిసత్కరించియు
ధీమతివీడ్కొలుప వచ్చి ♦ తిమి కపివర్యా!

వ. అనువాక్యంబులు విని కోపావిష్టమానసుండయి రాముని యెదుట భూమిపయిఁ బదద్వయ చిహ్నంబులేర్పడ నిలిచి యాంజనేయుండిట్లనుచున్నాఁడు.

హను-కీర్తన, కమాస్, రూపకము, వేటాడకు.

నన్నేలుగవహో! రామ! ॥నన్నే॥ మొన్నలంకకేగి దనుజ। ముఖ్యుల నేసరకుగొనక। యెన్నగసీతావార్త న, మున్నతమతి నెఱిగించిన ॥న॥ వ్యర్థంబుగఁ గాశికేగి। వచ్చితి లింగముగైకొని। సార్థకమే మయ్యావృథా। శ్రమబెట్టితి రఘునందన!॥ నన్నేరు॥ ఒక్కటినీకై తెచ్చితి। నొక్కటినాకొరకుదెచ్చి। తెక్కడవైచెదను జెప్పు, మివిమోతుపురాధీశ్వర॥నన్నేరుగ॥

గీ. ఇంత త్వరపడువాఁడవి ♦ శ్లైలనన్ను।
ద్రిప్పితివికష్ట తరమూర ♦ దేశమునకుఁ।
జెలఁగి యీరీతిహాస్యంబుఁ ♦ జేయుటకును!
దొరల మాటలకెదురు లే ♦ దో! తలంప.

వ. అని నిష్ఠురంబుగా మాటాడిన పవనతనయునకు రవికులభవుం డిట్లనియె.

మత్తకో. నీవు పల్కినపల్కులెల్లను నిశ్చయంబగుఁగావునన్। భావనీ! యిదిమత్ప్రతిష్ఠిత♦భవ్యలింగము దీనినీ । లావునన్ దొలఁగించి నీవు చె♦లంగి తెచ్చిన లింగమున్। ధీవరుల్ మదిలోనమెచ్చఁ బ్ర♦తిష్ఠచేయుము క్రిమ్మరన్॥

వ. అని నయంబున వాకృచ్చినసమ్మతించి యమ్మేటిలేచిపోయి

తో. లింగంబును గది,లింపగబోయిన। లేశముగదలకయున్నన్। లాంగూలముమె,ల్లగను జుట్టితన-లావున లాగుచునున్నన్ ॥రామ॥ వాలము మూలము,వరకు దునిగసరి-వారుగనగనాలోన । నేలబోర్లబడి. చాలమూర్ఛితుం,డై లేవక పడియున్న॥ రామ॥

వ. వానరులు హాహాకారంబులు చేయుచు మూఁగిసీదదీర్చి లేపిన గొంతవడికి లేచి దురభిమానంబువదలి శ్రీరామభద్రుని బరబ్రహ్మంబుగా భావించి సాష్టాంగ నమస్కారంబులనేకంబు లర్పించి కొనియాడుచున్నాఁడు.

హను-కీర్తన, పూరికళ్యాణి, ఏకతాళము. జానకీపతి.

మైథిలివరా! మన్నింపుదేవర!॥ మై॥ సాధుజనాధార! సత్యవాక్యసార!॥ మైథిలి॥ మంచిపోరిడ, వంచువేడ-లేకభ్రి, మించినాడ-నెంచితోడకనునను గొంచెకాడ,టంచుపీఁడ,కికగరు । ణించుజాడ, మించుజూడ, దగు॥మైథిలీ॥ పిన్నగొప్ప, లన్న చొప్ప, డచినా । యున్నతప్పదెన్న జెప్ప, బోలదు। సిన్నుదప్ప, నన్యు నెప్పటికి నేనన్న నెప్ప,నన్నునొప్ప।దగు॥మైథిలీ॥ మోక్షుగుండ,రక్షకుండ, వక్షలాధ్యక్షుకుండ, వక్షురుండ-వనుచును । దీక్షమెండ । పేక్షయుండ । నిక్షితి బ, రీక్షనిండ-లక్షదండ,ములు॥ మైథిలీవరా॥

వ. అని యనేకవిధంబులఁ బ్రార్థించిన నానందించి దయాకలిత

హృదయుండై రాముండు.

గీ. వినుమునీవేగి తెచ్చిన♦విశ్వనాధ। లింగమునునిల్పు రామేశ♦ లింగమునకు। నుత్తరంబుననన్న న ♦ ట్లొప్పనిలుపఁ గాంచి సంతస మంది రా ♦ ఘవుఁడువలికె.

రా-కీర్తన, ఆదితాళము, హిందూ, కాఫి, వందనంచతు.

చెప్పెదర్ణ బవనాత్మజా ! యిప్పటినుండియు జరిగె। యిచ్చటి యేర్పాటులు॥ జె॥ ముందునీలింగమునకు। పూజింపకనాలింగము,నిందు బూజించినపూజ। లెల్ల నిష్ఫలంబులు॥ చెప్పెదర్ణ॥ నాకుదెచ్చినట్టిలింగ। మీకోవెల యందుండును। గాక కాలాంతరమున। గావింతుసత్ప్రతిష్ఠ॥ చెప్పెదర్ణ॥ ఛిన్నపుచ్ఛగుప్తపాద। చిహ్నముననీవిగ్రిహ। మెన్నటికి జెడకయుండ। నిమ్మజనులుసూడగ॥ జెప్పెదర్ణ॥

వ. అని యానతిచ్చిన నటులనే తెగినతోకయు గుప్తపాదంబులు నలిగిన హనుమద్విగ్రిహమును నిజాంశచే నిర్మించి హనుమంతుండందు నిలిపినఁ గాంచి.

తో. శ్రీరాముఁడు ప్రేమ, గేపగనచ్చట। మారుతితీర్థంబనగ। మా రుతి తగని, ర్మాణముజేసెను-మహనియ్యులుమేలనగ॥ రా॥ రామతీర్థ మును-లక్ష్మణతీర్థము। లామీాదనుగావించి। రాముండునుధరనతిపావన ములు। నగుననెరాముడుగాంచి॥ రా॥

గీ. అచట శ్రీరాఘవుండు ని ♦ జాంశచేత। సేతుమాధవుఁడన వెల ♦ సియుఁబ్రిసన్న। చిత్తుఁడై వానితోకస్పృ♦శించినంత। పూర్వరీతినె దృఢముగాఁ ♦ బొల్పెసంగె.

వ. రామేశ్వరుని మస్తకంబున హనుమంతుని తోకచుట్టిన రీతి చిహ్నంబుగా నిలిచియుండెనంతఁ గాశీవిశ్వేశ్వరుండు శ్రీరామప్రతిష్ఠి త సైకతలింగంబున నావిర్భవించి యిట్లనుచున్నాండు.

శివు-కీర్తన, శహన, ఏకతాళము. పురమునలం.

తరణి కులా, భరణ! బుధా-దరణ! శుభాచరణా! శ్రీ,కరముగ। వినుమిది॥ సరగవిప్రివే, షమునబూర్వమొక, పరిభిక్షార్థము-దిరుగుచు నుంటిని॥ దర॥ మునికాంతల్-ననువింతల్- గనుపడమోహించి। వెను వెంబడిగను-విడువడివెడలిరి॥ మునికాం॥ కనలి తత్పతులు-గని నీలింగ

ము । దునిగిపడునుధర-ననిశపియించిరి॥ తరణి॥ రంగుగ ర,త్యంగముమ-ల్లింగముదెగిపడియెా । అంగనలెల్లను నదిగనితొాలగిరి ॥రంగుగ॥ ముంగలవినుమది మొాక్షుగుండరఘు । పుంగవపెరిగెను।భువిదివిబట్టక॥దరణి॥

వ. ఇట్లుమల్లింగము మహాలింగంబై వెలసిన నది యకాల ప్రళయంబై యుండఁగని చతుర్ముఖుండు దానియాద్యంతంబు గనఁగోరి.

తొా. కోటివర్షములు - గోరివెదకి కను,గొానజాలకగ్రిమ్మరిను। హాటకగర్భుం,డరుదెంచియు న,న్నరసియెరగి యిట్లనెను ॥రామ॥

క. లోకభయాకరముగనిపు
డేకాకృతి లింగమొకటి ♦ యేర్పడెదీర్ఞ
బోకార్చి శుభముఁజేయుము
శ్రీకంఠా! యనఁగఁ గరుణ ♦ చేసెనంతఞ్.

వ. త్రిశూలంబుచే నామహాలింగమును బండ్రెండుభాగములుగా ఖండించిన నవి జ్యోతిర్మయంబులై ఓంకారేశ, సోమానాథ, త్ర్యంబక, మల్లికార్జున, నాగేశ, వైద్యనాథ, విశ్వనాథ, కేదారేశ,మహాకాళేశ, భీమేశ, ఘుసృణేశ, గంధమాదన, నామంబుల లింగంబులై యొప్పెనంత.

శివ-కీర్తన, కమాస్, ఆదితాళము, ఇటురమ్మా.

రఘు,వర్యా! వినుము తెల్పెదా। ఆర్యాప్రియుడని । యంతటనమ్మౌని । వర్యులునానిజ - వార్తఁదెలిసిరఘు॥వర్యా॥ క్రమ్మఱిలింగముగలుగుననుచుశా । పమ్మును దిప్పిరి, భక్తిచేతరఘు ॥వర్యా॥ అప్పుడుమొాక్షపు-రాధిపలింగము । నెప్పటివలెనే-యేర్పడెనోరఘు॥వర్యా॥

సీ. గంధమాదన మను♦కడపటిలింగంబు కనకాద్రికీశాన్య♦మునననుండి।ప్రళయవాతముచేతఁ♦బడి ప్రవాహమువల్లదక్షిణాబ్ధికిఁ జేరి♦దరిని నిలిచె।రామనిర్మిత ♦ రామేశ్వరునకును నీశాన్యమున గల♦దిదిగొా చూడు। మింతపర్యంతంబు♦నెవ్వరెఱుంగరు దీనియందలరుమ♦త్తేజమింక। రామలింగేశు నందుక♦రంబుజేర్చి । యిందువసియింతు జనులు రా♦మేశ్వరమునె । పూజసేయుచు రిది మొదల్ ♦ పూజ్యమనుచుఁ । బదియురెండవలింగమై ♦ పరఁగునిదియె.

తొా. కలశజనకునా-గ్రహత్తముజేసితి-గావునగాశినివిడిచి । మెల

మినివచ్చితి-నిందువసించెద-నీలింగంబున వెలసి.

వ. ఈస్థలమునను నేమనుష్యుఁడువచ్చి మన్మయంబగు నీ తేజో లింగంబు నర్పించుచున్నాఁడో! యతండు బ్రహ్మహత్యాది మహాపాప విముక్తుండు కాఁగలఁడు. రామా! నీవును నిమ్మహాస్థలమునకు వరంబులి య్యవలసినదని శివుండు దెలిపిన శ్రీరాముం డిట్లనుచున్నాఁడు.

రా-కీర్తన, రూపకము, మంగళమగు.

వినుశంకర-వినుశంకర-వివరించెదనెంచి। మనుజులు చ,య్యనని చ్చట-మజ్జన మొనరించి॥విను॥ సంకల్పము సలిపియిచటి-సైకతమును గొనియుఁ। బొంకంబుగ బుడ్డినిండఁ। బూరించుకజనియు॥వి॥ శ్రీయుత కా,శీస్థలమును-సేవించియుముందు।నాయిసుక(బ), యాగనుండి,యక్క రండమందు॥విను॥ గంగాంబువు గైకొనియీ-లింగమునకు జేరి। యంగం బున-నభిషేకము, నటుజేసియువారి॥విను॥ భారంబును-వారిథిలో। బడ విడిచిననంత। వారుందురు-మోక్షగుండ। వరవాసునిచెంత॥ విను॥

వ. ఇదియునుంగాక.

క. ఆయనువున సంకల్పము। జేయక రామేశ్వరంబుఁ♦ జేరదుగం గా। తోయంబది యొకవేళను। బాయక చేరినను బూర్వ♦ భవకృత మనుచున్.

వ. తెలియఁదగు నిది నిశ్చయంబనుచు రామచంద్రుండు పలు కునంతలో నచటికగస్త్యముని యేతెంచి శివరాములకు బ్రణామంబు లాచరించి.

తొ. నీకటాక్షమున- నీకాశీశుని-నేఁడుగంటిరఘురామా! నా కొఱంతలీ-నాటికిఁదీరెను- నాకేశ్వరనుత నామా! ॥ రామ॥

వ. అని పొగడి శ్రీరామశంకరులచే ననుజ్ఞాతుండయి యగస్త్యే శ్వరమనుపేర నొకలింగంబును రామేశ్వరలింగంబున కాగ్నేయదిక్కున స్థాపించి యందుఁబురాతనముగనున్న గంధమాదనలింగంబును దర్శించి సేవించి వారివీడ్కొని యగస్త్యుండు నిజాశ్రమంబునకేఁగె నంత.

క. నలుఁడును రామాజ్ఞనుదన। దలమోచియు వార్థిగట్టఁ♦ దల పడికపులి।చ్చలుదెచ్చెడు కొండలువి। చ్చలవిడనెనందిగర్వ♦ సంయుతుఁ డగుచున్.

వ. కట్టుచున్న వైఖరిజూచి. శ్రీరామచంద్రుండు దనమనంబున.

తో. తనకొఱ్ఱకై పనినియమించితి। నగర్వంబునవీడు। వనచరావళుల, గనిలక్ష్యములే, కను మెలగుచున్నాఁడు॥ రామ॥

వ. కావున నదియుచుపదగునని యెంచినంత,

చ. ఒకశిలనీటనిల్పి మఱి ♦ యొక్కటిదెచ్చెడు నాతలోన నీ
చికలఁదొద్రోయఁబోవు నిది ♦ చేతికిజిక్కక యయ్యవస్థచేఁ
గకవికనొంది యానలుఁడు ♦ గర్వము సర్వముదక్కి రాముచెం
తకుఁజని తత్పదంబులకు ♦దండమువెట్టి వినీతినిట్లనున్

నలుని కీర్తన, రూపకతాళము, బిలహరిరాగము, ఏమిసేయు.

ఏమికారణమో! కామించికట్ట బ్రేమతోఁగట్ట। స్వామి! నియమించితి॥ కే॥ శిలలిందువేసియ। అలలతాకున। నటునిటుబోవ। నలవియే! కట్టుట॥ కేమి॥ వార్ధిమోసమున। వ్యర్థపుచ్చగ। నర్ధినెంచెనో! నిర్ధారణదోచద॥ దేమి॥ తామసించకను। శ్రీమోక్షకుండ। రామ! యుపాయ। మేమైననెలవుసగుమి॥ దేమికారణమో॥

వ. అనిప్రార్థించిన సంతసించి జానకీపతి యిట్లనుచున్నాఁడు.

తో. రామనామమును రాతిరాతికిని వ్రాయుచు నతికించినను। క్షేమంబుగనవి చెదరకుండునటు చేయుమనుచు జెప్పగను॥ రా॥

వ. నలుండు రామధ్యాననిష్ఠాగరిష్ఠుండయి రామాజ్ఞపరికారముండెనంత నంగద హనుమంత నీలసుషేణ మైందద్వివిధ శరభశతబలి తార గజగవయ గవాక్ష గంధమాదన దధిముఖజాంబవంతాదులు లగ్గకెక్కినట్లు చెలఁరేగి.

రగడ.

వారిధిగట్టగను బూనిరి। వానరులందరును॥ వింధ్యపర్వతము వేదాచలమును, గంధమాదనము గరుడాచలమును। గాంచన శైలము కైలాసంబును; క్రౌంచాచలమును రైవతకంబును, శ్రీగిరివరమును సింహాచలమును, నాగోవర్ధన మస్తాచలమును। వరుణపర్వతము, నాహిమవంతము, నురగశైలమును నుదయపర్వతము। మలయపర్వతము మాల్యవంతమును నలరుచున్నదొర్రి, ణాద్రియోజనము, హేమకూటము మహేంద్రశైలమును, సామజశైలము సహ్యాభూధరము, మంధరశైలము

మాల్యాశైలమును సుందరమగునా, శోభననగమును, జిత్రికూటమును క్షీరశైలమును, జిత్రిపునీల-క్షితిధరవరమును, మొదలగుపర్వతములకే తెంచియు, వెద్దకిశిఖరములు వేపెకలించియు, గొనివచ్చిరికపి-కోటులు కొందఱు। గొనివచ్చిరిమాౘి-కులుమఱికొందరు। గొందఱుమూపులఁ-గొందఱుశిరముల, గొందఱుభుజముల-గొందఱుగరముల,। నెత్తుకనెగు ఱుచు-నెలమినిదెచ్చిరి, మొత్తములగుచును-మ్రోయుచువచ్చిరి, చేరువదిరిగియుఁ-జెచ్చెరదెచ్చిరి, దూసురమునకుఁజని - తొలగకఁదెచ్చిరి, వంతులులేక - వడిగాదెచ్చిరి, గంతులువైచుచు - గ్రక్కునదెచ్చిరి. యిటువలెతెచ్చిన - యిన్నికొండలును, నిటువలెదెచ్చిన-యిన్నిమాౘికులును, జేరినలుండును - జేతులనందుక, (శ్రీ)రామునినుతి - జేయుచుదడయక, బారావారము - పైనిపసందుగ, గూరిచికట్టఁగఁ - గూర్మినిబొందుగ, నాపనితనమును - నారసిమెల్లఁగ, జూపరులిదెమొ, చ్చుచురంజిల్లఁగ॥ వారిధిగట్టగను। బూనిరి। వానరులందఱును.

సీ. మొదటిదినంబున ♦ బదునాలుగామడ యిరువదియామడ ♦ మరుదినంబు। నిరువదియొక్కటి ♦ యొసఁగ మూడవనాఁడు పిదపదినంబి రు ♦ వదియురెండు। పంచాహ్నముననిరు ♦వదిమూఁడునిట్లు వలె శతయోజనంబులు ♦ చాపునందు। దశమాంశము వెడల్పుఁ ♦ దగియుండ సేతువుఁ గట్టెనలుండులా ♦ ఘువముమెఱియ। నంతరాఘవు డూర్మిళా ♦ కాంతరావ। ణానుజార్క్షజ వాయు ♦ సుతాంగదాదు। లనుసరింపుచురాగ ♦ హర్షాబ్ధిదేలి। గట్టపై సంచరించెను ♦ కాలమందు.

తో. ఉడుతయొకటి చిప్పునఁనే తెంచి మ-హోదధిలోపల మునిగి। తడియారకమును-బొడియిసుకనుదాఁ-బడిపొర్లాడియు జెలగి॥ రా॥

కట్టపయికిజని-గ్రక్కునరాల్చియు-గమ్మర నటులనె సలుప।నట్టె కాంచి సీ, తాధిపుడారవి-పట్టింకోడ నదిదెలుప॥ రామ॥

క. ఇంత బలవంతులకునిది । యొంతయు దుర్ఘటపుగార్య ♦ మిట్లుండగ నీ। జంతువుస్వల్పంబయ్యును। జింతింపఁగభక్తిచేతఁ ♦ జేయుచునుండెన్.

వ. అంతియేకాని యీమహాకార్యంబులో నిదిచేయుసహాయం బెంతలోది దేవరవారియందింతభక్తి దీనికిఁ గలుగుట జన్మాంతర సం

స్కారంబుగాదా! శ్రీరామభద్రా! అనంతదయాసముద్రా! యని కొని యాడిన రాముండలరి సుగ్రీవా! దానినింపుఁ గొనిరమ్మనుఁడు.

గీ. భానునందనుఁ డరుదెంచి ♦ దాని తెచ్చి । రామునకునియ్య దయఁజూచి ♦ ప్రేమతోడ । మూఁడువేళ్ళల దానిఁపునను నిముర । రమ్యముగను ద్రిలేఖలే ♦ ర్పడియెనంత.

వ. చందనమందార పనసామ్రాది దివ్య తరుశోభితంబగు నొక్క వనమధ్యంబున విడిపించునట్లాజ్ఞయిచ్చి పిమ్మట శ్రీరాముండు.

క. మునివేషమ్ముల సమర। మ్మునకరుగుట యొప్పదని స ♦ ము ద్రుఁడు, మణిహా। ర నికర మంబరములునిడ। ఘనముగనవి దాల్చి వెడ♦ లెఁ గదనంబునకున్.

సంధి-కీర్తన, కాంభోజి-రూపకతాళము, భూమిపాలనము.

దండువెడలె-లంకపయికో-దండరాముడు। సానుజుడయి॥దండు॥ నిండిడెబ్బది। రెండువెల్లల।ధండికపులు దండముగై-తనుగొల్వగ॥దండు॥ భటులచటులార్భటులకు ది-క్తటములదరగ। దశవదనుని। పుటభేదనము ననసేక । కుటిలభయో-త్కటవిపరీ, తములుగలుగ॥ దండు ॥ శరణు మోక్షగుండనిలయ! శరణురాఘవా! జయజయమని । సురకిన్నర వరు లంబర। చరులై సుమ, వర్షంబులు వర్షింపగ॥ దండు॥

వ. ఇట్లు సేతువుమీఁదుగానడిచి మనుకులుండు సువేలాద్రికిఁ జేరి సైన్యంబుల నక్కడ విడియించె.

తొ. అంతటగపుల మ, హారావముల ది,గంతంబుల భేదించెన్। బంతితలలదొర - బాగుగవినితన- మంత్రులతో యోచించెన్॥ రామ॥ కట్టా! రాముడు-గపికోటులతో-ముట్టడించె మనపురము। నెట్టులచేయు దమికననుచుండగ-నింతలోన వేగిరము॥ రామ॥

వ. రావణునిమాతయగు కైకేశి తనతండ్రియగు మాల్యవంతు నితోడఁగూడి రావణుని కొలువుకూటంబునకువచ్చి వానిచే సత్కరింపఁ బడి యుచితాసనంబునఁ గూర్చుండి యిట్లనుచున్నది.

కైకే-కీర్తన, త్రిశ్రజాతి-జంఝూటి.

నామాటమీరవద్దు। నాపట్టినచుబుద్ధి।లీమాడ్కి-దెలుపగాను। నిదెవచ్చియున్నాను। మాను। నీమేలుగోరెదను॥ నామాట॥ రామునిదేవి

దెచ్చి। కామించిచెరలోనుంచి। సామాన్యులనుచునెంచి। సాధింపగన్ను దలచి। నావు। నీమదియోచించి॥ నామాట॥ రాముడు మోక్షగుండ। శ్రీమాధవుడుగాడా ! భూమిజకమలగాడా ! యేమీయెరుక లేదా ! నాదా! భామనువిడరాదా !॥ నామాట॥

క. నీదాడికోర్వఁజాలక। యాదేవతలాశ్రయింపక భయకరంబా। శ్రీదయితుఁడౌనఁగి న్మర్త్యుండై। మేదినిజన్మించెనన్న ♦మ్మతినొందింపక.

వ. జగదీశుని యానతిచేత దేవతాంశంబుల కపిసైన్యంబులు గలిగె లేకున్న నింత బలపరాక్రంబులు గల కోఁతుల నెన్నఁడయినఁ గంటివా! కుమారా!

తో. మనుజుడనుచునీ, మదినిర్లక్ష్యముగను భావించకు వినుము। నినుగెల్చిన వా,లినిజంపిన శూ,రునిగామది గనుఁగొనుము॥ రా॥

వ. ఆమేటిసామర్థ్యంబునకన్న నీమ గంటిమే ! యెక్కుడయిన నామనుజుని భామినిని దెచ్చుటకు నెదిరించి పోకూడదా ! యేమ రించి తెచ్చుట భయపడికాదా! పుత్రా! దేవతామిత్రా! రాక్షసకుల పవిత్రా !

తో. ఏటికజెడియెద వికనయినా నా, మాటనుద్రోయకు నేడు। తాటకహరునకు-దరుణినొసంగుము-దయతోఁ బ్రోచునుజూడు.

వ. ఆదయానిధి శరణాగతులఁగాపాడు బిరుదుగలవాఁడు. గాన నీయందసూయనొందక జేరఁదీయు నతనిసేవకన్న శుభస్కరములొం డులేవు. భామ్మనుడు నవ్వి యతండిట్లనియె.

రావ-కీర్తన, కమాస్, రూపకతాళము.

మాటాడకుము। నాతో॥మాటా॥ హాటకచేలుడు రాముం, డ య్యేను సేవింపుమనుచు। మాటికిబోధించెదు నీమాత్రిమునే నెఱుఁగనే మొ!॥మాటా॥ హేయంబగు సీతనువున। నాయనసర్పింపజాల। బాయక యనిచేసియెదలు। వాసిపరమునందుగోలుతు॥ మాట॥ ధారుణిలో మో క్షగుండ, శ్రీరాముని నీపిన్నకు, మారుతో జేరికొలిచి-మనియుండుడు చిరకాలము॥ మాటాడ॥

వ. దిగ్విజయుండనయి బహుకాలం బిహలోకసౌఖ్యంబు లను భవించితి నొకరికి వెరచి శరణుజొచ్చుటలేదు. దూరంబున నతనిఁబొరిగొన

క్షేకున్న నాశరీరంబు దొఱఁగి పరంబు గాంచెద స్థిరంబుగ ధరాతలంబు విభీషణునిచేత నేలింపుము తల్లీ! తెలుపకు నాతో మఱిమఱి.

తో. అనప్రుడువిధికృత-మనుభవింపుమని-చనెగైకేశియధేచ్ఛన్। మనుమనిగనియ-మ్మాల్యవంతుడి-ట్లనిబోధింపగజొచ్చెన్॥ రా॥ సామాన్యునిగా, రామునిగనిత-ద్భామినిజరబట్టితివి। నేమముగలరజనిచరకుల మును, నీనుచేయబూనితివి॥ రామ॥

క. శ్రీరాముఁడు నారాయణుఁ। డారమ సీతాంబ యగుచు ♦ నసురుల నడపన్। ధారుణి జన్మించిరిగద। యారామునిపైని క్రోధ ♦ మది చేయుసుమీ!

మాల్య-కీర్తన, ఏకతాళము.

నిర్నిమిత్తవైరమేల-నీకు రావణా! దుర్నిమిత్తములు జార, దోచె రావణా! ॥నిర్ని॥ సామజాశ్వసత్వములు, సమసె రావణా! హోమధూమములు గ్రుంగె-నేమొ రావణా! ॥నిర్ని॥ గూఁపులై వరల్లుకవిసి, కూసె రావణా సొంపుపెంపులడఁగె రాక్ష, సులకు రావణా! ॥ నిర్నిమి॥ వేడిమి నెత్తురులు గురిసె-వేగ రావణా! చూడనుల్క-లెల్ల రాల, జొచ్చె రావణా! నిర్ని॥ మోక్షుగుండ శౌరిమీద ముట్టి రావణా! రాక్షసులు జెడుదురు ది,రంబు రావణా! ॥నిర్ని॥

గీ. సీతనర్పించి రాముని ♦ సేవ జేసి। లంక బాలింపు మెల్లకా♦లంబుఁ జెలఁగి। యనిన నమ్మాల్యవంతుపై ♦ నాగ్రహించి। పటుభయంకర వాక్కులఁ ♦ బలికె నిట్లు.

రావ-కీర్తన, ఆదితాళము.

మాతామహుడనినన్ను। మర్యాదగ జూచుచుండ। నీతిమాలి మాటలాడేవు॥ ఓమాల్యవంత॥ భీతిదెల్పి బెదరించేవు॥ హీనమానవుని సేవ। కేనుపోవుదునె కుల, స్థాన పౌరుషములనెంచవు॥ ఓమాల్యవంత॥ కానిపోనివెల్లనెంచేవు॥ నన్నుజంపమోక్షుగుండ। నాథుఁడవతరించి శర, ణన్న నెటుల జంప కుండునూ॥ నో మాల్యవంత॥ ఉన్న కర్మ మెటుల మానును॥

వ. కాఁబోవునది కాకమానదు. క్షణభంగురదేహమును శాశ్వతముగానమ్మి కానిపోనిపనులకు నేనేల చొత్తు! జ్ఞానహీనవు. బలుకు

లుడుగుతాతా! దానవకుల ప్రసూతా! అనుచుండ.

క. దానవపతి యానతిచే। భానుజుకడకేగి శుకుఁడు ♦ పరువడి మగుడన్। దానరుగుదెంచి మ్రొక్కెద। శాసనుతోఁ బలెఁ బలికెఁ ♦ నతి మోదమునన్.

తో. వినురావణనే-జనిన విభీషణు, డనువుగ దెలుపుటచేత। ననుజంపగవా-నరులుయత్నపడ-మనుకులుండు దయచేత॥ రామ॥ దూత నుజంపిన-దోషనుంచు న, న్నాతరి విడిపించగరు। భీతిలేకనే, నే తెంచి తిగడు-నీతితోడ నినుగనను॥ రామ॥

వ. అనంతసత్వసంపన్నులగు కపిసైన్యంబులచే వారధిగట్టించి దాని మీఁదుగావచ్చి సువేలాద్రిమీఁద రాముండు సేనాపరివృతుం డై యున్నవాఁడనిన నాశ్చర్యపడి రావణుండు.

క. శుకుఁడును సచివులుగొలువగ। నొగప్రాసాదాగ్రి మెక్కి ♦ యురువడిగని యో! శుక! నీవెఱుఁగుదువుగదా!। ప్రకటంబుగ దెలుపు శత్రు ♦ బలములవరుసన్.

రావణ శుకసంవాదము, కీర్తన.

రా॥ మేలైన చూపుల-మిరుమిట్లుగొలుపునా। నీలాంగుడెవరు శుకా! శు॥ ఆలలితాంగుడే! యసురేంద్ర! రామభూపాలుడగును దేవరా!॥ రా॥ పొందుగానాతని-ముందర నిలిచిన-మగురెవ్వరో యి శుకా! శు॥ విందుగ వినురవి, నందనలక్ష్మణ విభీషణులు దేవరా! రా॥ మోతుగుండేశుని-మొనలను పేర్కొని-ముదమునఁ జూపుశుకా! శు॥ అక్షయమైనట్టి-యవియన్నదరమె। బ్రహ్మాదులకును దేవరా!.

వ. అయిన నేనెఱిఁగినమట్టుకుఁ బ్రధానకపులవివరించెదరావణా!

గీ. లక్ష, మర్కటులెపుడుఁ జెలంగికొలువ। ఘనపుళిందా నదీతీర ♦ మున వసించి। యుండుమేటి బలుండు నీ ♦ లుండతండె। యనఘదళ వాయిమానవా ♦ శన వరేణ్యా.

తో. వేయికోట్లకపి - వీరులుగొలువగ - వేగవంతుడనువాడు। పాయకయుద్ధము-చేయనుద్యముండై యున్నాఁడదెచూడు॥ రామ॥

క. గురుతరవింధ్య సుదర్శన। గిరులకునాథుండు ఘనుఁడు ♦ గిరీశ సఖుం। డురురణ కౌతుకవిపులో। గ్రరసనమూరంభుఁ డతఁడు ♦ రంభుఁ

డుగనుమా!.

శు-కీర్తన, అటతాళము, రామునంపిన, హిం, కాపి.

వాడేకనుమంగషుడు। వాలినందనుడల్ల। వాడే॥ వీడు వాలికన్న మొన,గాడు పనివాడుగద ॥వాడే॥ ఏకాదశ శతపద్మ- ప్రాకటమర్కటు లతిభీకరముగనుగొల్వ, దోకగదిలింపుచున్న॥వాడే॥తానొక్కడె మోక్షు గుండ-ధాముకార్యము దీర్చు। వానివలె నుత్సాహము। బూనియు పొంగుచున్న॥ వాడే॥

చ. ఘనముగఁజందనాద్రికిని ♦ గాంతుఁడనందగివేయుకోట్లపై
నెనుబదిలక్ష సంఖ్యగల ♦ యెల్లకపుల్ దనునాశ్రయింపఁగాఁ
దనరి ఖరారియానతిని ♦ దాఁదగఁగట్టెను నిన్న సేతువున్
గనుఁగొనమాతఁడే! నలుడ ♦ ఖండబలుండు సురారిశేఖరా!

తొ. నలుబదిలక్షుల-నాల్గువేలవా-నరులు గొల్వగాఁ దెంపు। బలమును జూపుచు-బరగెనుశరభుం-డలవాడే! పరికింపు॥ రామ॥

క. కుముదుని శాత్రవమానస। కుముదుని దశకోటిప్లవగ ♦ గురుసరసనరః। కుముదుని రాఘవకార్య। ప్రమదుని సంకోచనాద్రి ♦ పతినిం గనుమా!

తొ. కోరియొపుడుబడి, కోట్లమర్కటులు। గొలుచుచుండగా। నెగడు। పారియాత్రగిరి-భర్త యగునునా। పనసునిగనుమల్లతడు॥రా॥

గీ. కోటిభల్లుకవర్యులుఁ ♦ గొలుచుచుండఁ। దమ్ముఁడగుధూమ్రుఁడత్యంత ♦ ధైర్యశాలి। తనకుఁ దోడ్పడమనదిక్కు- ♦ గనుచునుండి। జాంబవంతుని జూడు రా ♦ క్షసవరేణ్యా!

క. డెబ్బదిడెబ్బదిలక్షుల। నిబ్బరపుంగపులుగొలువ ♦ నేర్పరులై తా। ముబ్బెడు కోర్థినగవయుల। నబ్బా! కనుగొంటె! రాక్ష ♦ సాధిప! వారిక.

వ. మఱియునింద్రజాల, గజ, గంధమాదన, గవాక్ష, శతబలి, మైందం, ద్వివిద,సుషేణ, దధిముఖ, సుముఖ, విముఖులు లోనుగాఁగల కపీంద్రు లనంత బల సమన్వితులగు మర్కటబలంబుల సంఖ్యాతంబుగాఁగొలువ యుద్ధసన్నద్ధులయి కాలుద్రవ్వుచున్నారు. చూడుము నిశాచరేంద్ర!

శు-కీర్తన, కేదారరాగము, ఆదితాళము, కోరియు.

చూడుమాతసీ! దనుజేశా! చూడుమాతసీ! నాకులాకజొచ్చి। నాడునగరముగాల్చి నాడు యోడకదిరిగి, నాడుచనినా ం-మొనగాడు, గదనేడు॥చూడు॥ మేరుభూధరసమధీరుఙ్ మాటంతవరకుఘూరుఙ్ సారపి శంగాకారుఙ్, రణశూరున్, మణిహారుఙ్, గపివీరుఙ్ ॥జూడుమా॥ మోతుకుండపురాధ్యక్షుఙ్ దీక్షుతో గొలుచుపక్షుఙ్- యక్షగజహర్య క్షుఙ్ బ్రధువక్షుఙ్ రిపుశిక్షుఙ్ ఫలభక్షుఙ్ ॥చూడు॥

సీ. వేయికోట్లసంఖ్య ♦ వెలయఁగనవిలక్ష కోట్లుమహాసంఖ్య♦ కొమరుమిగులు। నవిలక్షయగు బృంద ♦ మవిలక్షయగుపద్మ మవిమ హాపద్మాఖ్య ♦ యగునులక్ష। యవిలక్షయగుఖర్వ♦మవిలక్షయగు మ హాఖర్వ మవియులక్ష ♦ కడుసముద్రి। మవిలక్షయయినమ ♦ హాసము ద్రింబగునవిలక్షయగు మహ ♦ దాఖ్యయవియు। మారులక్షలుగలవ్ర భా ♦ నుజునిముఖ్య।సేనకడమవిచెప్పఁగాఁ♦పెతగాద।ఇట్టిసేనలఁగూడు చు♦వినకులుండు। లంకపయిదండు వెడలెని ♦ శ్శంకతోడ.

వ. ఇంకొక విధంబు వినుము.

సీ. పదివేలకోట్లప్ల ♦ వంగములొకగింతు గతులుసాహస్రి ♦ గణనముగమి। యాగమికోటి కో ♦ ట్లగునొక మొత్తంబు శతకోట్ల మొ త్తంబు ♦ జగతివీడు। వెలయలక్షక్షోణి ♦ వీడులైనను సాదు సాదుద్వి సప్త ♦ సంఖ్యమూక। శతకోటిమూకలు ♦ సంగడినాఁజెల్లున♦ వియును నూరుకో ♦ట్లగునుదట్ట। దట్టలొకయారుగూడినఁ ♦ దగును వెల్వ। నిండి వెల్వలుడెబ్బది♦రెండుగొల్వ। రామచంద్రునిదునీకడ ♦ రణమొనర్ప। నరుగుదెంచిసువేలాద్రి ♦ యందువిడిసె.

తొ. కావున నాతని, గదిసిపోరకో, క్యముగాదోయసురేంద్రా! నావచనమ్మును నమ్మితివేనిఘు, న్నంబుగమనెదుజితేంద్రా!॥రా॥ శ్రీరా ముడురా, జీవాత్ముండగు-సీతలక్ష్మియనినమ్ము। వారివలనస్థా, వరజంగ మహూపకజగములునగుజుమ్ము॥రామ॥

క. జగములకుఁ దల్లిదండ్రుల, నగఁదగువారిపయినలుగ-న్యా యంబగునా! జగతీతనూజనొసఁగియుఁ। దగ రాముని శరణుఁజొరుము దయమన్నించున్.

౫౯-కీర్తన, జంఝూటి, అటతాళము.

దినదినభంగురదేహా, మునునమ్మబోకు। మనమునింక యే-మఱి యుండవాకు॥దిన॥ మలమూత్రములకొంప। మలినయుత-బు। మజ్జాస్థి శోణిత మాంసపూరంబు ॥దిన॥ మఱియిట్టి దేహాభి, మానమేటికి। మఱచియుం దెలుగక। మురిసేవిప్పటికి ॥దిన॥ ధరమోక్షుగుండేశు। దరిజేరితేను బరమపదంబిచ్చి- భయముదీర్చును ॥దిన॥

వ. అని శుకచారుండు బోధించినఁ గుపితస్వాంతుండయి చుఱచుఱఁజూచుచు.

శ్లో॥ ఓకరితాత్మక-చారుడవనినిను- కోరినేనుపంపగను। బారముగా బర, పక్షపాతములు వలుకుచు వచ్చితివగుదు ॥ రా॥ నిన్నిప్పుడు మన్నించక జంపగ।నేడుమదిని దలచియును।గ్రిష్నన సీపూర్వస్థితిని దెలియుదు। గానవిడచితిని నేను॥రామ॥

వ. ఇంక బొమ్మనుడు నతండు చనియె. పూర్వంబున శుకుండను నుర్వీసురుండు గీర్వాణులు వృద్ధియగుటకుఁ బూర్వ గీర్వాణుల గర్వంబు నశించుటకు సంకల్పించి పెక్కు క్రతువులు చేయుచున్నంత.

తో. వచ్చెరాక్షసుడు-వజ్రదంష్ట్రుడను వాడుమోసగించగను। విచ్చలవిడిగా - విహరింపుచుదరి - వేచియుండుముదముననను ॥రామ॥

వ. కుంభసంభవుండు సనుదెంచియున్నంబడిగి స్నానంబునకరిగిన రాక్షసుం డగస్త్యుసిరూపంబునవచ్చి.

మత్తకోకిల. మేకమాంసము బెట్టునాకును ♦ మేదినీసురయన్నవాఁ। గాకనాశుక భార్యరూపము ♦ గ్రక్కున౯ ధరియించియుఁ౯।బాక మొప్పఁగఁజేసియమ్మని ♦ వచ్చినాతనె పెట్టెదా। జోకతో౯ నరమాంసమన్నము ♦ సూపశాక పదార్థముల్.

వ. భుజించి శుకునిపైఁగసలి యయోగ్యంబగు నరమాంసంబు నాకుఁబెట్టించితివి నీవురాక్షసుండవు కమ్మని శపించిన నతండు నేనునిరపరాధినని వేడిన దివ్యదృష్టిచేత నదిరాక్షసకృత్యంబని తెలిసి.

౬౦-కీర్తన, సురటరాగము, ఆదితాళము.

నకేసరేనిను-శపించితినినిర-పరాధి వనుకోక। మదిలో। బరంబె

రుగలేక॥ మదియ్యవాక్యము - వృథాపోదు నెమ్మదిఁ దెలుసుకొమ్మ ఇదితప్పదంచుననుకొమ్మ॥

సురారిరూపము। ధరించిదశకం। ధరుఁగొలుచుచుండు మిక ముందరన్। మేలుగూడు। ధరన్ మోతుకుం, డరాఘవునిసో, దరాన్వితంబుగను-గాంచిన హరించుశాపమును॥

ఉ. వానరసేనఁగూడిరఘు♦ వర్యుఁడు తమ్మునితోడ లంకపైఁ। దానరుదెంచినట్టి వ్య సము ♦ దారతవారినిజూచివచ్చి యా। దానవభర్తకుఁ దెలిపి♦ తత్త్వవిచారము బోధచేసినఁ। బోనుద్వదీయశాపమి కఁ♦ బొమ్మని కుంభజుఁడానతిచ్చినన్.

వ. అప్రకారమాచరించి శుకుండు శాపవిముక్తుండై చనియెఁ బార్వతీ! యంతరావణుం డెప్పటిచోటఁ గొలువుదీరియుండె నక్కడరాముండు లంకచతుర్ద్వారంబులఁ గపులు ముట్టడించునట్లుచేసి యుద్ధమునకు ముందొక్క బుద్ధిమంతుని సంధికిఁబంపిన బాగనియెంచి నీతికుశలుండగు నంగదుని గని యందఱువిన నిట్లనియె.

క. అంగదరయమున రావణు। చెంగటికేఁగెంచి ఖ్యాతి ♦ చెందక నీవు। పొంగుచునుగొన్నికొన్ని పల్కి। సంగంబులు జేసిరమ్ము♦ సత్వరతోడన్.

రా-కీర్తన, అటతాళము, హిం, కాఫి.

ఇనకులుండగు రాముండిదెదం - డెత్తినాడనుమంగదా ! నిను సుతామాత్యాళితోడను- దునుమఁగలడనుమంగదా! ॥ఇన॥

ధాతచేఁగొన్నట్టివరములు- దప్పెననుమోయంగదా ! సీతనిచ్చియు శరణుజొచ్చిన-జెరుపులేదనుమంగదా! ॥ఇనకు॥

పోరితరుమగ దేవమానులు- గారటంచనుమంగదా! గారవించి విభీషణునకు- గట్టెలంకనుమంగదా! ॥ఇనకు॥

మోతుగుండపురీశుతో బ్రితి, కక్షవద్దనుమంగదా! దీక్షతోఁగార్యాంతమునఁ జుతించవద్దనుమంగదా॥ ఇనకు॥

అంగద రాయభారము.

వ. ఇట్లు తెల్పిన నంగదు డత్యానందభరితుండయి శ్రీరామునకు నమస్కరించి సుగ్రీవాదుల యనుమతంబు వడసి పర్వతాకారుండై

లంకఁబ్రవేశించి పురశృంగారంబు దిలకింపుచుఁబోయిపోయి రావణుని గొలువుకూటంబుఁ జేరినఁగాంచి.

క. ఎవ్వరివాడవు వానర। యెవ్వరుపంపంగవచ్చి ♦ తిప్పొషుసీవిం। దెవ్వరితోఁబనియున్నది। యెవ్వరుసీతల్లిదండ్రు ♦ లెఱిగింపుతగన్.

వ. అనిన నతండిట్లనియె.

అంగ, కీర్తన, కళ్యాణిరాగము, రూపకతాళము.

వినరారావణా ! రఘు-వీరుఁడంపినట్టి। భటుడనే॥ వినర॥ నినుఁ జలంబుమీరవాల మునను గట్టి వార్ధులందు। ఘనతముంచినట్టివాలి, కిని సుతుండనాదు। నంగదుడను॥ వినర॥ గట్టిగానిన్ జయించి-నట్టి కార్త వీర్యజంపి। నట్టి పరశురాముఁగెల్చి। నట్టిమేటి-శూరు, డగు రఘుపతి॥ వినర॥ మోక్షగుండదేవునాజ్ఞ। దీక్షనీకో మాటలాడ। రాక్షసుండ వచ్చినాడ। రాజసంబుకోడ॥ దెలుపుమసిక॥ వినర॥

వ. అని పలికిన విని రావణుఁడు దుర్వాగ్రహ విగ్రహుండై యిట్లనియె.

చ. మునుపొక కోఁతివచ్చి తన ♦ ముచ్చట లెల్లనుజూపి తాను న। మ్మనుకులదూతనంచు హను ♦ మంతుఁడనంచు వచించిమేముదం। డన మొనరింప సిగ్గువడి ♦ నాటికిఁబోయెను నేఁడు నీవురా। మునకును దూతనం చు ఘన ♦ మ్మును దలపోయుచువచ్చితో ! బళీ.

క. ఆకోఁతికిశుభ-మే! కద! నీకథ లేమో! వచింపు ♦ నేర్పుగనిచ టన్। జేకొనిదూతలఁజంపగ। రాకునికిన్ బ్రేలెదరు ప ♦ రాకునమీరల్.

వ. అనిన నవ్వి యంగదుండిట్లనియె.

తో. రావణునకు నోడి-రయమునవచ్చితి- వీవనికపులందరును। నావనచరునని-యవమానించిన। వతఁడుచనియెఁబంపకును॥ రా॥ వానిని నన్నును, భానువంశజుని-సేనలలోనినజుండు, హీనబలులమని, యెంచి యిట్టిపను, లైనఁజేయుడనుచుండు॥

వ. కాబట్టివచ్చుచున్నాము. తక్కి-నవిషయము నీకేల ! వచ్చిన ముచ్చట యుచ్చరించెదఁ జెచ్చెరవినరా! రావణా!

అంగ-కీర్తన, తోడిరా, ఆదితాళము.

ఓరిరావణా! చూడుమురా। ప్రియమునవాలించరా॥ మోరి॥ శ్రీరాముడు లో, కారాధ్యుండగు। నాయకుండని యాదిలక్ష్మి సీ। తారా

మామణియంచు నీమదిని - సారెసారెకును దలచగదోచదో॥ యోరి॥ లోకంబులకును దల్లిజనకసుత-నీకుదల్లిగాదటర దురాత్మక ! - ప్రాకటముగ నీకులముజెఱుటకయి- చేకొనివచ్చియు చెరలోనుంచితి॥ ఓరి॥నీదు పుత్రమిత్రాదిరాక్షసులు। నీల్గకముందే! నెరుకకలిగియ। మ్మేదినిసుత నిడిమోక్షగుండపతి। పాదపద్మముల ప్రాపునజేరుము॥ ఓ॥

తో. బలవద్వైరము, బాగుగాదుచలపాదిలితనంబును మాను। మలవిభీషణుని-వలెనేరాముని- నాశ్రయించుపుమేలౌను॥ రామ॥వినునాబుద్ధిని- వినకుండిననీవు-మనుటయబద్ధముధరను। గనుగొనునీసుత కాంతాదులనిక-గనజాలవు ముందరను॥ రామ॥

వ. శ్రీరాముని కోపాగ్నికి నెదురు లేదు. నిర్భయంబున నుండకు రా దార్యాభగ్యా! కార్యాంతమునఁ జింతించిప్రయోజనములేదు. అని నుడివిన నాగదునిపయి నలిగి రావణుండిట్లనియె.

రావ కీర్తన, అటతాళము, కలియాణ.

త్రిజగద్భయంకరుడని, తెలియవేమిరనన్ను ॥త్రిజగ॥
నిజముగ నిర్భయముగ, నిలిచిమాట్లాడెదవు ॥త్రిజగ॥
కైలాసమగలించితి ది, క్పాలకుల జయించితి।
పాలించితి లంకబహు, కాలమెదురేమిలేక ॥త్రిజగ॥
వేధోదత్తవరమున, సాధించితిలోకములు।
బాధించితి మునుల, న, రాధములెంతటివారు ॥త్రిజగ॥
ఔనునీతండ్రిపగి, మైనదలపకనీవు।
వానిగూడినావునిను, నేనటులచేయుదునె ! ॥త్రిజగ॥
అంగదుడ నాముందర, బొంగిమోక్షగుండరఘు
పుంగవుని భట్టువలె, పొగడెదేవు సిగ్గుమాలి ॥త్రిజగ॥

క. పగవాడు దండువెడలిన
జగడముఁ జేయంగఁబోవ ♦ జనుగాకటులన్
జగతీశులెల్ల నవ్వఁగ
మగటిమిచెడ సంధిచేయ ♦ మతికార్యంబే!

తో. నగుబాటని యెన్నకనాతమ్ముఁడు-నాతో నలిగియుఁబోయి। జగతినిరాముని, శరణుజొచ్చెనే।జనుదునె! యికబోవోయి!॥రా॥ అనిన.

## అంగదరావణ సంవాదము.

### కీర్తన, సురటరాగము, అటతాళము.

అం-రామప్రతాపము। రాక్షస యిసుమంత, నీనుది। దెలియ। వేమదీ॥
రా-రాముసామర్థ్యము- నాముందు వర్ణింపరాకుము-పలుకబోకుము॥
అం-వేడుకతో చిన్న - నాడే తాటకజంపి - నాడురా! విడువబోడురా॥
రా-ఆడుదానినిజంపి - నట్టిశూరత్వము - లాడకూ । యిచట వేడకూ॥
అం-నీవెత్తలేనట్టి - నిటలాక్షు విలువిరించె - నేర్పుగ । కడునోర్పుగ॥
రా-ఆవిల్లుమోపెట్టు, టదియెంత । పాతదది । యౌనుగా-విరిగిపోనుగా॥
అం-పరశురాముని-బాహు-బలమడగించిన-బంటురా! యేలకంటురా॥
రా-ధరణీసురునిదురించు-దర్పముజెప్పకు-తాళురా । యికజాలురా॥
అం-మోక్షగుండేశుండై-ముదముననినుజంప । బుట్టెను-బడగొట్టును॥
రా-ఈక్షితినటులైన- మోక్షము దప్పడిం- కేటికి- దెలుపమాటకి॥

క. బలవంతుడైనవాలికిఁ
గలిగిననీయంతవాఁడు ♦ కడునీచముగా
బలహీనులయిన నరులను
గొలువఁగఫలమేదిరోరి ♦ కులనాశకుఁడా!

తో. వైరిదప్ప నె, వ్వారు దొరలుభువి-లేరా! కొలువొనరింప। నేరవు రాముని-నేడు విడచియిఁక-రారా ననుసేవింప ॥రామ॥ వచ్చిన నీకును-వానరరాజ్యం। బిచ్చెద వాలినిగెలిచి । ఇచ్చగసుఖముగ । నిరువురముందము। యెరిగించితి దయ దలిచి ॥రామ॥

వ. అనిన నంగదుండు.

### అం-కీర్తన, అటతాళము, రామక్రి.

చాలురచాలుర। చాలుర రావణ। మేలుగ నీయను, కూలము నాకిక ॥జా॥ కాలముదీరెను-గావుననీవిటు, పేలెదుపిన్నని-పెద్దనుకొనకజాలుర॥ తల్లియుతండ్రియు, దాతయుదైవము, నెల్లరుశ్రీరఘు। వల్లభుఁడేయగు॥జా॥ మోక్షగుండేశుని । చేక్షణమందున । రాక్షసచెడెదవు । రాముమ్మాటికి ॥జాలుర॥

వ. అనిన రావణుండు కోపోద్దీపిత మానసుండయి రాక్షసులం గని యీపరపక్షపాతిని నీక్షణంబున, బట్టికట్టుండనియానతిచ్చిన వారు

జలరేగి మూఁగిన దనలావు గనబఱచుటకయి యంగనుండు జిక్కి పిమ్మట.

తో. ఆకాశంబున, కప్పుడె మెగసియు-నటునిటు విదలించగను। వేకతాలిరి పది, వేల రాక్షసులు-విగతాసుప్రులై ధరను ॥ రామ॥

గీ. పిదప రావణుకొలువు చా ♦ విడినిగూలఁ। దన్ననది చూర్ణ మైకూలె ♦ ధరణిమీఁద । నలిగిదశకంఠుఁడంపఁగా ♦ నసురవరులు।నగ ణితంబుగముట్టిన ♦ నద్భుతముగ.

వ. వారినందఱిని గ్రిమంబుగ జముమందిరమునకుఁజేర్చి వేగం బున రామచంద్రునింజేరి నమస్కరించి యిట్లనియె.

కీర్తన, ఆదితాళము, బేహాగ్ రాగము.

రఘువంశశేఖరా! రణరంగభీకరా! యఘుదూర! శ్రీకరా!యమి తకృపాకరా! ॥ర॥ మీయాజ్ఞచేతను। బోయితినాతఁడు। వేయేలసంధి॥ చే య నేననను॥ర॥ చాపుకుదెంపు-గావించిసొంపు। జేవయుజెడడు। చెప్పిన వినఁడు॥ర॥ శ్రీమోక్షగుండ। ధామకోదండ। రామాయఁతండు। రాజికి రాఁడు॥రఘు॥

వ. కావున యుద్ధసన్నాహంబుఁ జేయుచుండ నిక్కడ రాక్షస భటులు రావణునిజూచి.

ఉ. దేవ! పరాకువానరుఁడు ♦ తెంపుగ దానవసేవఁ ద్రుంచితాఁ
బోవఁగనూరకుండితిరి ♦ పొమ్మనిమాకు ననుజ్ఞయిచ్చినన్
లావుజవంబు మీఱఁగపు ♦ లన్ మనువంశ్యులఁగూల్చి వత్తుమో
రావణ! పంపుమంచు వివ ♦ రంబుగఁ బల్కిన నాతఁడంతటన్.

వ. తనవైభవంబు రామునకుఁ గనపరచఁదలఁచి దివ్యవస్త్రాభర ణంబులు ధరించి సమస్తపరిచారకు లుపచరించి రాక్షసగణపరివృతుండై చనియుత్తరగోపురంబునఁ గొలువుదీరినఁగాంచి విభీషణునివల్ల రావణుఁ గానెఱిఁగి రాముండు వానిగర్వంబడంచువాఁడై.

తో. అనుజునిచే వి, ల్లంది దానియం, దర్ధచంద్రబాణమ్ము । ఘనముగ దొడిగియు । గడగివిడువనది । చనికిరీటదశకమ్ము ॥రా॥ క్షితి గూల్చియు బొది- జేరరావణుఁడు-సిగ్గుబొందికడుసోలి। యతివేగంబున- నాత్మభవనమున-కప్పుడెచనె ధృతిదూలి ॥ రామ॥

వ. ఇట్లింటికిఁబోయి రావణుండు దిరిగి కొలువుఁదీరి రాక్షసు లంగని రామునిబలంబులు నాల్గుద్వారంబులఁగవిసి పురంబులోఁ బ్రవేశించుచున్నవి కాఁబట్టి యీక్షణంబున.

రావ-కీర్తన, పూరికళ్యాణి, ఏకతాళము, అమితోగ్ర.

అసురేంద్రులారా! యాజికిమీర।లతివేడ్కమీర। నరుగిడింపార జేర॥నసు॥ అరులనుముట్టి యరికినబట్టి।ధరబడగొట్టి। నురుముడుమట్టిమట్టి॥యసు॥ పగవారిమూక। భయమేమిలేక । దగవచ్చెగాక, తరుమనాగాకవీక ॥యసు॥ ధరమోక్షగుండ। వరుసికోదండ। హరుని రాకుండ, నాగుడులెండపొండ ॥యసు॥

వ. అని పురికొలిపిన నవక్రపరాక్రమంబులు మీఱవీరావేశంనఁ గ్రూరరాక్షసులు లెక్కకుమిక్కుటంబుగా సమరసన్నాహకుతూహలులయి భేరీభాంకారరవంబులుఁ గరులఘీంకారంబులు, ధనుష్టంకారంబులు దిగంతంబులు ప్రతిధ్వనులీయగదిలి భుజాస్ఫాలనంబులు చేయుచు

## యుద్ధారంభము.

తో. నాలుగువాకిం, డ్లను మూగినయా, నగచరసేనల దగిలి। చాలగయుద్ధము-సలుపగబూనిరి - సమరశూరులైమిగిలి॥రా॥

వ. మేఘనాథుఁ డంగదుని, బ్రజంఘుఁడు సంపాతిని, అతికాయుండువినతరంభులను, మహోదరుఁడు సుషేణుని,మకరాక్షుండుజాంబవంతుని, విద్యుజ్జిహ్వుండు శతబలిని, విక్రమధనుండు గజుని, గుంభుండు ధూమ్రుని, దేవాంతకుండు గవాక్షుని, సారణుండు ఋషభుని, ద్రిశిరుండు శరభుని, నరాంతకుండు పనసుని, అకంపనుండు గుముదుని, ధూమ్రాక్షుండు కేసరిని, మహాపార్శ్వుండు గంధమాదనుని, కంపనుండు నలుని, జంబుమాలి హనుమంతుని, మిత్రఘ్నుఁడు విభీషణుని, ప్రహస్తుండు సుగ్రీవుని, వజ్రముష్టి మైందుని, అశనిప్రభుండు ద్వివిదుని, నికుంభుండు నీలుని, విరూపాక్షుండు లక్ష్మణుని, సుప్తఘ్న రశ్మికేతువు లునగ్ని కోపాగ్ని కేతువులు నలుగురు శ్రీరామునిని, మఱియు ననేకవానరయోధులతో ననేకదానవదళంబులు దగులువడి ప్రథమయుద్ధంబున శరవర్షంబులు గురిపించుచుఁ దరుశైలపాషాణాదులు వైచికొనుచుఁ

ముష్టియుద్ధంబులకుఁజొచ్చుచు ముసల, ముద్గర, ప్రాస, పరశు, భిండి వాలత్తో మరంబులచేత నడచికొనుచు సంకులయుద్ధంబునకుఁ దగుల్పడి నఁ బోరుఘోరంబయ్యె నప్పుడు.

తో. రామునిభటుల ప, రాక్రమమునకును-రావణసైన్యములా గి। యేమాత్రము సహి, యింపగజాలక - భూమిని గూలిరిలోగి ॥రా॥ కొందఱుదగ్గిరి-కొందఱుఁజచ్చిరి-కొందఱుభయపడిచసిరి । కొందఱుసందుల గొందులదూరిరి - కొందరెదురలేమనిరి॥ రా॥

వ. తనబలంబులు నశించి పర బలంబులకు జయము గలుగుటఁ గాంచి యింద్రజిత్తు యుద్ధంబునుమాని సవనశాలకరిగి హోమంబుజేసి యజ్ఞేశ్వరునివలన దివ్యరథరథ్యంబులును దివ్యాస్త్రకవచ కిరీటాదులును గ్రహించి యుద్ధమునకు వెడలుచుండె నిక్కడ రాక్షసకాంతలు.

రాక్షసస్త్రీల-కీర్తన, జంఝూటిరాగము, త్రిశ్రజాతి.

ఇఁక యేమిచేతామమ్మ । యి । దేమికాలమమ్మ।యీపోరుమానరైరి యిలమీఁద మనవారి, బ్రతుకు। లేమోనిజముశేను । ఎవరుదెలిపిన। నెంతమాత్రమెఱుగజాలడే ! యెంతమూర్ఖుఁడే !॥ యి॥ చలపాది దశకంఠుఁడు గెలువగదలచినాఁడు । అలమోక్షగుండ విభుఁడు । బలవంతుడనుకోఁడు। అకటా ! కులనాశకుడు వీఁడు । నిలుపరైరిగా। జలజమిత్రుఁడ స్తమించిన । గానిమానరు॥ యి॥

వ. ఇట్లు చింతించునంతలో న స్తమించి చీకట్లుగ్రమ్మిన నింద్రజిత్తు మేఘంబుల చాటుననిలచి మాయాయుద్ధంబుఁ జేయుచు నెరులకగపడకుండనున్న నతనిఁగనుఁగొని యుద్ధంబుజేయ వానరులు సమర్థులు గారైరి.

గీ. వానరులనెల్లఁ బటుబాణ ♦ వర్షమునను । ముంచినాగపాశముల బం ♦ ధించెనపుడు । రామలక్ష్మణులను బరా ♦ క్రమముమెఱయ నింద్రజిత్తుమహాగ్రహం ♦ బినుమడింప.

వ. శరీరంబుధరించినపుడు హరిహరాదులకయినఁ బురాకృతంబనుభవింపపోవునా । మును బలిని బంధించిన కారణంబున రాముండు నాగపాశబద్ధుండయ్యె. అంత నింద్రజిత్తు తనవిజయంబుఁ దండ్రికెఱిగించిన సంతసించి రావణుండు త్రిజటను బిలిపించి.

రావ-కీర్తన, త్రిశ్రజాతి, వనమును.

సమరముజూపూరమణీ! కమలాక్షి! సీతకునేడు॥సమర॥ క్రమముగఁగపులు। రాక్షసానీకముచేయు॥ సమరము॥ ఒడబడదాయెఁదరుణి। గను వేడ్క నాశోడగూడ। నెడబడ॥ వడినాగపాశ। బద్ధుడై శ్రీరాముడున్న॥ సమ॥ ధరమోక్షుగుడవిభుడు। దనుజులగెల్వలేడు। ధరమో॥ విరిబోణీయాస। విడుమంచుబోధింపుము॥ సమరము॥

వ. అంతట.

గీ. త్రిజటలోనగు రాక్షస ♦ స్త్రీలుసీత। నెక్కపుష్పక మెక్కించి ♦ యుక్కమెఱసి। సంగరస్థలిఁజేర్చి ప్లవంగవిభుల। రామలక్ష్మణులనుజూప ♦ రమశిగాంచి.

సీత కీర్తన, ముఖారిరాగము, ఆదితాళము.

నీకుబ్రహ్మ యిటులవ్రాసెనేమో! శోకమునిలుపజాలను॥ రాఘవ! ॥నీకు॥ పారికటతల్పము-పాపమనియందురు। నీకుబంధకమాయెను। రాఘువ! ॥నీకుబ్ర॥ వెలయగగార్య్మకి। విద్యయేమాయెదై। త్యులకులోబడవలసెను। రాఘున! ॥నీకు॥ దనుజులజంపియు। ననుజెరబాపెద। వనియుంటినదితప్పెను। రాఘువ! ॥నీకు॥ అండయెవరుమోక్షు। గుండనాయక! నే। వకటా! దురదృష్టరాలను। రాఘువ॥ నీకుబ్రహ్మ॥

స-వ. అని బహుభంగుల విలపించు సీతనుగాంచి త్రిజట యిట్లనియె.

చ. భయపడనేల నీపతికిఁ ♦ బ్రాణభయంబిసుమంత లేదు ని
శ్చయముగ రాక్షసాధములఁ ♦ జంపఁగఁ బుట్టినమేటినెక్క రెం
తయుఁ జెనకంగనోపుదురె! ♦ దానవమాయలు మాపినిన్ను నీ
ప్రియుఁడతివేగఁ జేర్చెడిని ♦ బ్రేమనయోధ్యకు మేలుగల్గెడున్.

వ. ప్రాణంబులువాసిన వనచరులింత చింతదక్కియుందురా! కర్మసంచితనిట్లొండె కొంచెము చిక్కువడిరే కాని యన్యముకాదు. వెఱవవలదనిచెప్పి సీత నశోకవనమునఁ జేర్చె. నిక్కడ రామునంత గొంతవడికు గన్నులుదెఱచి పాశబద్ధుఁడయియున్న తమ్మునివిగతజీవునిగానెంచి.

రా-కీర్తన, అటతాళము, అసావేరిరాగము.

కొమ్మనుసాధించు-కొనివచ్చిసుగ్రీవ! తమ్మునిగోల్పోయితికటా! నేనిచట। సమ్మతినాసేవ। సలుపుచుజనుదెంచె। సౌమిత్రిగుణమెన్న। జాలాయీవేళ॥ కొమ్మను॥ తల్లిసుమిత్రనా। తనయుడేడనియున్న। నల్లననామెకే-మందునెటుగందు। నల్లమోక్షగుండ। వల్లభువాజ్ఞను। వల్లననుచు, ద్రోయు, వారుధరలేరు॥ కొమ్మను॥

తో. లక్షణయుతుడగు। లక్ష్మణుబాసియు। రక్షణముండగజాల। దాక్షిణ్యమ్మునఁ దమ్ముని వెంబడి। ధరణిజపోయెదజాల॥ రా॥

వ. అనంతరము రావణుండుమిమ్ము బాధించుఁగాన నంగదయుతంబుగా నీవుకిష్కింధకుఁ జనుముసుగ్రీవా! యనునంతలో.

తో. వానరులెల్లను - వగవవిభీషణు - డానగచరులను గాంచి। మానుగయుద్ధము। మానిచింతిలగ। నానెధైర్యమునుడించి॥ రా॥

వ. యుద్ధకాలంబుగాని శోకకాలంబుగాదు. జయాపజయంబులు దైవాధీనంబులు, లెండులెండు. మేఘనాధుండు దిరిగి యుద్ధంబునకు వచ్చి యున్నాఁడ నపుడు వాలిపుత్రుండు.

తో. ఔసుమిత్రి! నీ-వన్నమాట సత్యమ్ము రామలక్ష్మణుల। బూని యేమఱక - బోవుదునేజని - పొలియింతును రాక్షసుల॥ రా॥

వ. రాక్షసులశిక్షించి యాక్షమాపుత్రిని తత్క్షణంబున రామునకుఁదెచ్చి యిచ్చెద నటుగాదేని నాప్రాణంబులు దానవుల కెరఁజేసి లక్ష్మణునివెంటఁ బోయెదననుచుండ సుషేణుండు.

క. వెఱవకుడు నాగపాశము। లురలఁగద్రోణాద్రియందు ♦ నున్నవిమందుల్। గరువలిసుతునంపుడు వే। గిరముననవి దెచ్చుమనకు ♦ గీడుదొలంగున్.

వ. అనుచుండ నింతలో విపంచినిధరించి రామధ్యానంబుఁ జేయుచు నారదమౌనివచ్చె నెటులనిన.

కీర్తన, హంసధ్వని, ఆదితాళము.

కోదండధృతకరం భజేహం॥కో॥ వేదవేద్యం-విరాధహం శ్రీ॥ కో॥ వాగీశహృత్పంకజసదనం। వరశశాంక సన్నిభమృదు వచనం। యోగిపాలనం-భోగిశాయినం। నాగపోషణం - నతజనావనం॥కో॥ ధా

రాధరశ్యామలగాత్రం। నారాయణ కవివినుత చరిత్రం। సారసనేత్రం సజ్జనమిత్రం। ధీరస్తోత్రం-దితిసుతజైత్రం॥ కోదండ॥ పక్షీంద్రగమనం సురపాలం। మోక్షగుండసత్పురవరఖేలం-అక్షరశీలం-ఆశ్రితజాలం। అనుపమఫాలం - అబ్జాలోలం ॥కోదండ॥

ద్విపద. అనియిట్లుచనుదెంచి- యానారదుండు, మునుకులపతికి, నమస్కృతిఁజేసి, దేవరవారికి-దెలియనిదేమి, రావణుజంపుకా, రణముచధరణి, నరుఁడవైపుట్టిన-నారాయణుఁడవు, కరమర్థినజ్ఞాని, కరణిఁబల్కెదవు, లోకులచిక్కుల,లోపములమంచు, నీకుఁజిక్కుగల్గు,నే! యేటిమాట, అదెచూడనియట్ల, యవములయందు, పదునాల్గుభువనముల్-ప్రబలియున్నయవి,సర్వంబునీవే ని,శ్చయమగుసుమ్ము,పూర్వపువాహనంబునుస్మరియింపు, వైనతేయుండుదాను-వచ్చినంతటనె, యీనాగపాశంబు-లెల్లనువదలు, నటుచేయుమనిచెప్పి - యానారదుండు - పటుమతిదీవించి - పాఱెనుదివికిఁ। బిమ్మటరాముండు - వెనుకటిరూపు, నెమ్మదియోచించి-నిక్కంబు దెలిసి.

తో. గరుడునిదలచిన, క్షణమాత్రములో। నరుదెంచియువారలను। స్థిరముగబంధించిన యురగంబుల।దరిమిచసియెఁ బిమ్మటను ॥రా॥

క. అంతట వానరులెల్లను। సంతసమున నుండి రదియుఁ జారులవలనన్। వింతగ వినిదశకంఠుఁడు। పంతంబున ధూమ్రనయనుఁ బంపెను ననికిన్.

వ. రాక్షసభటులు లక్షోప లక్షలు గొలువ ధూమ్రాక్షుండు దక్షిణంబున రావణానుజ్ఞచే యుద్ధంబునకు వెడలి.

ధూమ్రాక్షయుద్ధము.

తో. పటపటార్భటులు-బటుదిక్తటములు-బెటిలిపడగనరదంబు। దటుకునఁబంపుచు। బటహాభేరిత। మ్మటమృదంగరావంబు ॥రా॥

వ. చెవులు బీటలువాఱ మ్రోయుచుండ రణభూమికిఁ జేరివానరులఁబొడివి.

ధూ-కీర్తన, ఆదితాళము, మాతాము.

మానవులగూడమీరు।మమ్ముగెలువవచ్చినారు। కానిలేచూతాము రండిక। ఓకోతులారా! మానుగినాపైకిలెండిక॥ కొండవనములను

దిరిగి పండ్లుకాయలను దిని । యుండినట్టి పనులుగావివి । ఓకోతులారా గుండెపగులు యుద్ధభూమిది॥ మోతుగుండ దేవుసైన్య । ముట్టడించగల డెమమ్ము । రాక్షసులనుచు దెలియరో । ఓకోతులారా! యీక్షితి గూలుటగానరో.

వ. అని పలికి శరపరంపరలు వఱపిన దనుచరులు సరకుగొనక దరుగిరుల చేనవి విరిగించుచు వీరువారుఁ బోరుచుండిరంత. హనుమంతుం డుభూమామ్రిక్షునిగదిసి శంకర ధనుష్టంకార మొనర్చిన పంకజాస్త్రకులు నికింకరులగు మావంకకు నిశ్శంకుండవయివచ్చి పెంకెతన పు అంకెలే లవై చెదవు ఇంకజాలు. బింకంబుమాని లంకకుఁ జేరుము. లేకవంకరటిం కరమాటలాడిన బొంకుగాదు. సీతల పెంకులుపెంకులు చేయుదునురా కుంక! యహంకారనికింతమురా. అనియొక్క మొత్తుమొత్తినఁ జిత్తంబు నఁద త్తరంబునొందక.

తో. గదచేమోదిన। జెదరకమారుతి। గరమున నొకగిరి బూని। గదిసివైవరా, తుసు మస్తకము। పిండిలికూలెధరపైని॥ రా॥

వ. అంతకుముందే! వానిభటులు వానరులచేతఁజచ్చిరి. హతశే షులవల్ల నీవార్తవిని రావణుం డకంపనుని బంపిన.

అకంపనయుద్ధము.

తో. విలయకాలుడో! యితఁడని వానర-వీరులు గనుచుండగను। బల ములగూడుక-బరతెంచెనకం,పనుడు రణముచేయగను॥ రా॥ వచ్చినవాతని భటవర్గంబులు-చచ్చిపడగ వానరులు। చచ్చెరమోచుక-వచ్చియువై చిరి- హెచ్చుగదరువులుగిరులు॥ రా॥

క. ఉప్పరవీధికి నెగసియు। నప్పు డకంపనునిపయికి ♦ హనుమం తుఁడుదా।గుప్పించినుమికిపాడిగా। గుప్పునరథ రథ్యములను ♦ గూల్చిచి పలికెన్.

వ. సిలింపులగుంపులు గుంపులుగాఁ దరిమినట్టి తెంపుఁ జూపింప అంపులుచేయుచు వచ్చితివి నీసొంపువదిలించి నిన్నుఁజంపి దక్షిణంపు సామికొంపఁ జేరఁబంపనా! నీమంపదెంపనా! యోరి యకంపనా!యని యొక్కకొండతో మోదిన గుండెపగిలి యతండుగూలె. నాసంగతి యెఱింగి దశముఖుండు.

## మహాకాయునియుద్ధము.

క. తనతనయు మహాకాయుని। ననికేగు మటంచుఁబంప ♦ నాత దురోషా। ననుఁడగుచు భటులుమంత్రులుఁ। దనవెంబడిఁగొలిచిరామ♦ దగ్రత వెడలెన్.

వ. ఇట్లు వెడలి మహాకాయుని మంత్రులగు రుధరాశన, వజ్ర నాభ, కాలదంష్ట్రి, కాలకల్ప, పావక, శతమాయు, ధూమ్రగంధర్వు లనువారు క్రమంబున బృధు, పనస, మేఘపుష్ప, గవాక్ష, ఋషభ గజ, క్రోధన, శతబలి, తారులపయిఁబోదివి.

తో. శరవర్షంబులు-గురిపించుచుభీ। కరముగ యుద్ధముజేయ। నరిముఱియవిల, క్షయముజేయకదరు, చరులు గిరులుగొని వేయ॥

వ. రాక్షసమంత్రులు భీరంబులునెడి యిలఁగూలిరి. తక్కినభ టులు వానరసేనలనెదిరించి హతులయిరి. యదిగని మహాకాయునితమ్ము డుమహానాథుఁ డట్టహాసంబుఁ జేసిన వానిదెబ్బకు వానరులు భీతిల్లిరి. యప్పు డంగదుం డెదిరించి.

అంగ-కీర్తన, కమాస్‌రాగము-రూపకతాళము, వేటాడకు.

వడిజూపకుమా। నీదు॥ వడి॥ వడిజూపకుమల్ల దేమిా। వారింగతి జూచుచుండి। మిడుతలుబావకునమిాద। నడచినగతినరుదెంచితి॥ వడి॥ శి క్షింపగనూ। మిా। చేగాదికను।మోక్షుగుండ దేవుకృపా।వీక్షణమునసంత తరణ। దక్షులమగుమముబోరగ। రాక్షసనివెంతర నీ॥ వడి॥

వ. అనిపలికి భీకరమగు నొకమాన్రికుఁజేకొని యొక్కపీకు బీక నం గెకవేసి యతండుగూలె. నంత మహాకాయుండు దమ్మునిచావు గని రోషానల జాజ్వల్యమాన మానసుండయి కపిసేనపయి రథ మును బఱపి.

పంచ॥ అరణ్యభూములందుఁ గాయ ♦ లాకు లారగింపుచున్। జరించువానరుల్ నరుల్ బ్రహ్మ శస్త్రవీరులట్లదీ। వరంబుగారణాంబుఁజేయ♦ వచ్చినారు మేలునా। శరాళికోర్చి యుంసుడంతె! ♦ చాలు మెత్తు మిమ్ములన్.

వ. అనిన వానరులు.

ఉత్సాహ. మిట్టిపడ్డసోదరుండు ♦ మృత్యువాతఁజిక్కెఁడే! వట్టిపొట్టక్రొవ్వుమాట ♦ వాఁగవీరధర్మమా ! గట్టివాఁడవయిననిలువు ♦ కదనరంగమందునన్ । మట్టివేతు మొక్కసారి ♦ మర్మములఁ గలంచుచున్.

వ. అనినవాఁడు మహాగ్రహసమగ్ర నిగ్రహుండయి పెక్కమ్ములు ప్రయోగించినఁ గొంచెము సేపోర్చియు సయిరించలేనివానరుల నిలువరించి యంగదుండొక్క గుద్దుగుద్దె.

అంగ-కీర్తన, ఆదితాళము-సవను.

నినుమడియించెద-నిలునిలుము ! ఘనముగనావశ, గనుముకనుము॥ నిను ॥ దనుజుడమితాతం, డ్రిదశమాజనకుడు। మునువార్థులలో-ముంచెనుగదరా॥ నినుమడి ॥ అటువలెనావా, లాగ్రంబునని । న్నిటుబంధించియు। నిలపయిమోది॥ నిను ॥ మోక్షగుండపతి-ముఖ్యభటులమని । లక్షింపకయే, లరచెడిపోవ॥ నిను॥

వ. అనిన దానవుండాగ్రహించి గదంగొఁబొడిచిన గదాయుద్ధంబునఁ గొంతవడికిఁ దమ లాఘవంబులు సూపి యంతటఁబోక మల్లయుద్ధంబునకుఁజొచ్చి పెనంగుచు దానవుం డెన్నిమాయలు సేసినను లోఁబడక వాలినందనుండు.

తో. కడుబెట్టిదముగ-బిడికిటిబెడతల । నడచినమాత్రమె యపుడు। దడయకదలబ, ద్దలుగాబగిలిన । బడియెను నారక్కసుడు॥ రామ॥

వ. అనంతరము వానరులు జయజయశబ్దంబుల నంగదునగ్గించి రామునిఁజేరి నమస్కరించిన రాముండు గౌఁగిలించుకొనిదీవించె. అంత హతశేషులవల్లవిని కొడుకులమరణమునకు రావణుండుఁగొంతచింతించితి ధైర్యంబుఁబూని వేగనపిదపఁ బ్రహస్తుఁ బిలిపించి యిట్లనియె.

రావ-కీర్తన, అటతాళము.

రామునిసేనల-రణమున నెదిరించి-రారైరి మనవారలు। యేమియోచించెద। నికమీద యుద్ధమున-కేతెంచే దేశూరుండు॥ కలనసీవును నేను-ఘట కర్ణునుదక్క। నిలిచేవారెవరూ సఖా! నెలకొని తమ్ముడు-నిద్రలేవడాయె। నీవు నేనున్నామికా ॥ దీక్షతో నీవేగు-దెంచెదవో ! నేనేతెంతునో! తెలుపుమిక ॥ మోక్ష గుండేశుని-మొనలతో బోనీక-శిక్షించి వత్తామిక.

## ప్రహస్తుని యుద్ధము.

వ. అనిన నతండిట్లనియె.

శా. నేనేతెంచి విరోధియోధతముల ఖం ♦ డింతుం గా విచారంబు వ
ద్దైనన్ నేనొకనీతిఁ దెల్పెదను నీ ♦ వాలింపు మేలయ్యెడిం
చోనాజానకి నిచ్చితేని గరుణిం ♦ చున్ రాముఁ డెల్లప్పుడే
నానాతం డది కాదుపొమ్మనఁ బ్రయా ♦ ణంబై ప్రహస్తుం డొగిన్.

వ. ప్రచండవేగంబున వేదండతురంగకాండంబులతోఁ గదిలి కోదండంబునఁ గాండంబులఖండంబుగాఁ దాల్చి సముద్దండ దండధరుండునుంబోలె భండనమండలంబుఁ జొచ్చి కపితండంబుల బెండుపడఁ జేయుచుండ నీదండిమగం డెవ్వండని కోదండరాముం డడుగ విభీషణుం డిట్లనియె.

తే. రావణునిమాతులుఁ-డీవచ్చెడివాఁడు। రామ! ప్రహస్తుండితఁడే। వానిదద్భట-వర్గమునకుదళ-వాయియగునుసీఘనుఁడే। రా॥

వ. అని తె వానరసేనలతోఁ మార్కొని తన మంత్రు నులిగి యాదరిపైని గ్రమం

వ. అనియిట్లు పలికి సర్వాభరణ భూషితుండయి ప్రియాణాం బగుచుండ మందోదరి కొలువుకూటంబునకువచ్చి భర్తకు నమస్కరించి యిట్లనియె.

మందో-కీర్తన, త్రిశ్రజాతి-జంఝూటి, ఏకతాళము.

నీకింతపంత మేల! నాకాంత! రఘువరుజాల! శ్రీకాంతుడనుకోవేల! యేకాంతమున మేల, జాన, కీకాంత జెరబట్టుట! యిట్టుల! నాకౌకుకులు దెల్పిరక్కటా! భూమిపై-నికనిల్వజాలగా॥నీకింత॥ ప్రకటించిచనినవారు నెకరైనదిరిగిరారు! యికబోయిబ్రతుకువారలిం దెవ్వరును లేరు! చెప్పుటకుభయపడుచుందుము! మనసు! వికలమునొందించబోకుము! తిన్నగా! యోచించిచూడుము॥ నీకింత॥ ధరమోతుకుండవిభుడు! నరుడెన్నటికిగాడు! పరమాత్ముడనుచుజూడు! ధరణిజనిడివేడు! నీవు! నిరణాన్నరక్షించును! జేసిన, తరువాత బాగానెచాలును! ...డే. శోకమార్పుము॥ నీకింత॥

వ. అని బహుభంగుల ... ంచి రావణుండు.

గీ. కోంతులనుగూ ... లువంబో

## రావణపరిఘమయుద్ధము.

క. పదితలలఁగిరీటంబులు । పదిలఁగశస్త్రాస్త్రసమితి ♦ పొందుగఁదనయి । ర్వదికరములందుఁ దాలిచి । యుదయార్కప్రభలవెలుఁగు ♦ నొకరథమెక్కెన్.

వ. ఇటులనెక్కి చతురంగబల సమన్వితుండయి చనునప్పుడు.

తో॥ కరిబృంహితములు-తురగఘోషములు-నరదంబులరావములు। మురజపటహాభీ, కరకాహళరవ-ములుసద్భటరావములు॥ రా॥కలిసి దిగంతం, బులుభేదించియు । గమలభవాండమువగిలి । చెలగరణస్థలి । జేరిరావణుడు । నిలిచెను ధైర్యముమిగిలి॥ రా॥

వ. అతని విభవంబుఁగని యాశ్చర్యంబున రాముం డెవ్వాడని యడిగిన విభీషణుం డిట్లనుచున్నాఁడు.

విభీ-కీర్తన, రూపకతాళము-హిం॥ కాపి, ఇంతిరోవిన.

రావణుఁడతఁడే! రాఘవ! మాయన్నయగున॥ రావ॥ దేవతలను బాధింపుచు-దిగ్విజయముగావించిన॥ రావ॥ పాతకుఁడతఁడు। నీతియింత యెఱుఁగలేడు। ఖ్యాతిగమిమ్మేమరించి-సీతనుచెఱబెట్టినట్టి॥రావ॥ ఈశిక్షితిపీని। శిక్షించినవెనుకనుగాని। మోక్షగుండవాసలోక। ములకుమేలుగలుగదయ్య॥ రా॥

వ. అని తెలుపుచుండుసంతలో రావణుండు వానరసైన్యంబుల పయిఁ దీక్ష్ణబాణంబులు నెడపక వేసి చిందరవందర చేయుచుండ సుగ్రీవుండు రోషించి.

క. ఒకకొండయెత్తివైచినఁ । బ్రకటితముగ దానినతఁడు ♦ బాణంబులచేఁ । శకలములుచేసిమఱివే । యొకశరమున నినజుమూర్ఛ ♦ నొందఁగఁజేసెన్.

వ. అదిగని హనుమంతుండు రోషతామ్రాక్షుండయి రథంబు పయికి లంఘించి.

పంచచామరము:-ధరాకుమారిఁజూచి కూర్మిర♦దానవాళిఁద్రుంచి నీ। పురంబుగాల్చినిన్నుఁ జంపఁ♦బూనినాఁడుమానితిన్। శిరంబులెల్లఁజిల్ల నేఁడు♦వ్రేతుబ్రహ్మదత్తమా।వరంబులెల్లనీదినంబె♦వాఁగుపాలుగావలెన్.

వ. అని బెదరించి పలుతరముష్టిచే వక్షంబున నుక్కపెట్టునఁ బొడిచిన రథంబుపయి మూర్ఛిల్లి వెంటనే తెప్పిరిల్లి చూచుచుఁజూచుచు.

తో. కడువడిమెచ్చితి,గదరా! బలవం,తుఁడవని దశముఖుఁడనవ। బెడిదంబగునా-పిడికిటిపోటుకు, బడియెనుమూర్ఛిలి గిగువ॥ రా॥

వ. హనుమంతుండు మూర్ఛబోయిన రావణుఁడు నీలునిమీఁదికి రథంబుఁబోనిచ్చి.

పంచచామరము:-తేఁగాననన్ను దాకిపోర♦దర్ప కారి కైన మ। ర్కటాధమా! తరంబుగాదు♦రమ్ము పాఱిపోక నీ।పటుత్వమెల్లగాంచి రామ♦భద్రుఁజేరఁబోయి దిక్కు తటంబులార్వనేఁడును త్ర్వ♦తౌవ మెల్లఁజూపెదన్.

వ. అనిన,

తో. నీలుఁడుగోపా, వ్రతుఁడయియొకఘన - శైలశృంగమును వేఁయఁబోలఁగనాదశ, ముఖుఁడునడుమనే। పొలియఁజేసియునుడాయ.

వ. పెల్లార్చినీలుండు రావణురథంబుపయి కెగిరి మకుటంబులు జెదరునట్లూచి ఛత్రిచామరంబులు చూర్ణంబుఁజేసి హారంబులు దెగదీసి రథంబువిఱుఁగునట్లు గదిలించి యనేక విధంబుల భంగపఱచినఁగోపించి.

తో. అనలబాణలమున-నాతనివైచిన। నదితగిలినమాత్రమున। మునుకొనినీలుడు, మూర్ఛిల్లెనునది-గని లక్ష్మణుఁడురయమున ॥రా॥

## లక్ష్మణ-రావణసంవాదము.

ల॥ నన్నుగెలిచిపోవరా.! దానవకులాధమా! పన్నగనాబాహుబలము-బరగఁజూడుమా॥ నన్ను॥

రావ॥ పిన్నవాఁడ వెమరలేవు-బీర మేలనూ। అన్నమరుగుజేరుము నీ, కంతెచాలును॥ పిన్నవాఁడ॥

ల॥ వాడిగలుగుబాణములు-వచ్చెనిలువుమా। మోడిపోకనిబ్బరముగ. నుండశక్యమా॥ నన్నుగెలిచి॥

రావ॥ నేనుమోతుకుండవిభుఁడు - గూడదా సెగా। మోడిచేసి బాణవహ్ని-ముంచివేసెదా॥

వ. అనినఁ గోపోద్దీపితుండయి లక్ష్మణుండు నిలువరింప నశక్యంబులగు బాణంబులు రావణుపయి వైచిన నతఁడు వెఱఁగంది బ్రహ్మదత్తంబయిన యొక్కబాణం బెక్కువెట్టి.

తో. ఉదరముదాకుచటు-గురిగావైచిన- నరిగితగులలక్ష్మణుండు సొరిగి లేచి బిర, బిర రావణువిలునరికి భయదమై నెగడు ॥రా॥ మూడ మ్ములుదశ-ముఖునివక్షము-గాడనేయమూర్ఛిల్లి । వాఁడు దెలిసితీ, బ్రహ్మ బునశక్తినివైచె లక్ష్మణునిమళ్ళి ॥రా॥

గీ. శక్తిదాకిమూర్ఛ ♦ సౌమిత్రిమునిఁగిన । నెత్తబూనిదనుజుఁ ♦ డెత్తలేక । యచ్ఛతంబునొందిఁ♦యటనున్న హనుమంతుఁ । డంతమూర్ఛ దెలసి ♦ యాగ్రహించి.

తో. వచ్చిరావణుని-వక్షముపగులగ-వడిగాగుద్దుటవల్ల। జెచ్చె అనటుమూ, ర్ఛిల్లిపడియె సుర, లచ్చెరువందిరిమెల్ల ॥రా॥

వ. ఆంజనేయుండు రామభక్తుండగుటంజేసి జులకనగా లక్ష్మణు నెత్తుకొనిపోయి రామునిముందటఁ బెట్టె. రాముని తేజః ప్రభావమునకు బరాజితమై శక్తిదొలంగె లక్ష్మణుఁడు మూర్ఛదేరెనంత.

క. రావణుఁడుమూర్ఛదెలిసియు । వేవేగమె కపులపైకి - వెడలఁగవారల్ । చేవచెడి యురగకని సీ । తావిభుఁడదలించి పలికె ♦ దశముఖుతోఁడన్.

## రామరావణుల ఘోరతమ యుద్ధము.

రా-కీర్తన, ఆదితాళము, భీకరగతి.

ఓరోరిరారా। కోరికదీరా। దీరుగనినుబోరా । నేరుపుమీఱగనే టికి సమకూరె! ఘోరునముట్టి। ధీరతబట్టి। సారెకుగొట్టి, చంపుదుజలపట్టి॥యో॥ భండననిపుణ కో., దండాదిదక్ష, పండితుండనుమోక్ష,గుండ విఖ్యండను, దండిగసీతలల్। ఖండింతు నసురుల। దండింతు గండలు। జెండింతు రణభూమి। నిండింతురక్తము॥ ఓరోరి॥

వ. అనుచున్న సమయంబున హనుమంతుండు గరంబులు ముకుళించి,

తో. రాఘవ! దనుజుడు, రథమునెక్కియు। రణమొనరిం గ। లాఘవమున గా[illegible]యుండుట పో, దలపు నన్నెకు,

వ [illegible] నెక్క రామరా[illegible]

ప[illegible]లఁ దమ

తో. ఒక్క బాణమున। రక్కసువిల్లు బ, టక్కునవిరువగ నత డు। దక్కకమఱియొక। ధనువున శరసం, ధానము జేసియునపుడు॥ రా॥ తటుకుననవిలజు। నిటలముదాకగ। గదవైచిన నదిగాంచి। చటులాగ్రహ। మున జానకీశుడొక-శరమును వడిసంధించి॥ రా॥

వ. రావణుకోదండంబు ఖండించి రథంబుఁ జూర్ణంబుజేసి రథ్యం బులఁజంపి సారథిని గూల్చి.

తో. అర్ధచంద్రమను-నస్త్రముచేయగ। నతనిమకుటములువిరిగి। వ్యర్థముగా ధర। బడిన ఖిన్నుడయి। వాడునిలచెమదిగిలగి॥ రా॥

వ. అప్పుడు రామచంద్రుం డనుచున్నాఁడు.

క. రావణ నీవిఁకనింటికిఁ। బోవుము వానరులతోడఁ ♦ బోరి బడలియు। న్నావటు కావునఁజంపక। వేవిడిచితినన్న నతఁడు ♦ విన్నదఁ నముననే.

వ. పాదచారియై వానరులు నవ్వుచుండఁ దలలు వంచుకొని గరుడునిచే విడువఁబడిన యురగేంద్రుని పగిది లంకలోనికిఁజని కొలువు కూటంబుఁజేరి చింతనొందుచు రాక్షసుల కిట్లనుచున్నాఁడు.

రావ-కీర్తన, రూపకతాళము, హిందూస్తానితోడి.

ఏమిచేతును। నకటా! యెటులనోర్తును! రాముని నెదిరించి గెలువ రాదు తలపను॥ యేమి॥ వన్నెగాంచితి బ్రాభ। వమున మించితి।నన్ను నెదుర లేరు త్రిభువ, నములు వెతకిన॥ యేమి॥ నాదుశౌర్యము। నేడు, నాదుధయిర్యము। మేదినిబడిపోయె దెలుప-రాదునిక్కము॥ యేమి॥ ఒక్క నరునిచే। నయ్యో! చిక్కగవలసె! నెక్కడినరుడు మోక్షగుండాధీశుడు దెలిసె। నేమి.

వ. బలవంతులయిన ప్రహస్తాదులు మడిసిరి. ఇంక నామానవుల నెదిరించువారెవ్వరు. కుంభకర్ణుండు తొమ్మిది దినంబులనాఁడు లేచినా తోఁ గొంత ప్రసంగించి తిరిగినిదురించినాఁడు. మీరతని లేపుకొనిరండు నాతమ్ముండుగాని వారలజయింపఁడు [illegible]

తో. కుంభపుకూళ్ళను। గు[illegible] దెంచి। కుంభశ్రవణుడు-గూర్కిలె [illegible] సులరు

వ. గంధపుష్పాక్షతలచే నతనిఁ బూజించి ధూప దీపంబులిచ్చి తాముగొనిపోయిన వరాహమహిషాది మాంసంబులును షడ్రసోపేతాన్నంబును రాసులుగాఁబోసి యింద్రాదులనెల్లఁ బొలియింపుచున్నట్టుగ లగని కలవరింపుచు మహత్తరమైనయుశ్వాసనిశ్వాసంబులతోడ భయంకరాకారుఁడైపడియున్న నతనిగాంచి యక్కటా! యింతబలవంతునకిట్టి నిద్రావస్థచే మునుఁగవలసినట్లు విధాతలిఖించెగదా! యెంతయన్యాయమని దూఱుచు జయజయ శబ్దంబుల నగ్గింపుచు నాద ఆొక్క పెట్టున జగంబులు దల్లడిల్లునంత ధ్వనులు గలుగ నఱచుచు.

రాక్ష-కీర్తన, ఆదితాళము, ఓ రామరామ.

లే లెమ్ముకుంభకర్ణ-లెమ్ముదేవరా! నిద్రలేలె॥ ఆలమ్మునోపల దేవ,తాళినిబట్టుకమిగుల। పోలించునంతటిమేటి,శూరవరుడవు॥ లేలెమ్ము॥ అన్న రావణుడుబిలుపు। మన్నవచ్చినాము లేచి, పన్నుగనాస్థానమునకు బనుముదేవరా!॥ లేలెమ్ము॥ మోక్షగుండ స్వామిపురము । ముట్టడించియున్నవాడు। దక్షుఁడవైపోయివాని। దరుముదేవరా! ॥ లేలెమ్ము॥

వ. అనివేఁడిన మిన్నకుండిన.

తో. సారమైన ని। స్సాణపటహములు-భేరులు గడువాఖించి। చారుతరంబగు-శంఖంబులును దు-తూరతెలబిబూరించి॥రా॥

వ. నిద్దురలేవకుండినఁ బట్టెస భిండివాలగదా ముసల ముద్గరాదులుగొనియందఱు మూఁగి యొక్కపరివిసరివ్రేయుచుఁ; బదివేలకుంతములచేతఁబరులకుబట్టించి పొడుచుచు; గొప్పకొండలనేకములుఁ దెచ్చి వైచుచు; మీఁదికెక్కి సత్వంబుమెఱయఁ గాళ్ళతోఁద్రొక్కుచు; వేధించియు మేలుకొలుపలేక పిమ్మట.

తో. సింహనాదములు, సేసిబిట్టుగాఁ జెవులుపగులగా నఱచి, సింహగజాదుల, చే ద్రొక్కించియు-జిదఱ వాదఱ బరచి॥ రా॥

వ. కోలాహలంబుగావించిననాధ్వనికి లంకగగ్గోలుపడియె. వానరులందఱదివిని భయభ్రాంతచిత్తులై యుండిరప్పటికిని లేవకుండిన.

తో. కొందరు గర్ణము,లాదదూఁరిచని-గూబలు బాడ్లనుగఱచి। కొందఱు గరముల-గురులువట్టిలా, గుచుగాల్ సేతుపులువిఱచి॥రా॥

వ అమితముగా బాధించిన నెట్టకేలకు గొంచెముకదలి యా వులించిన మహాగ్నికణంబు లపరిమితంబుగా వాగ్ద్వారంబున వెడలె. నదిగని రక్కసులొక్కరితో నొక్కరిక్కరణి ననుకొసిరి.

రా-కీర్తన, కమాస్, ఆదితాళము.

చా, లించబోకుము-సై,రించి లేపుము॥

మించిమనముబో-ర్లించి లేపికది - లించుటచే నావ-లించినాడు॥ చాలిం॥ క్రిమ్మరనిద్దుర-గ్రిమ్మిన లేపద.రమ్ముగాకుకా, ర్యమ్ముజెడును॥ జాలించ ॥ ఈతని లేపక - బోతేమనకిక-యాదానవపతి - చేతమాట॥ చాలించ॥ కదనంబుననీ- ఘనుడు మోక్షపుర । సదను నెగుర । గలఁడిది నిక్కము॥ చాలించ॥

వ. అని చెప్పుకొనుచు నలసటలేక యినుపమోకులు దెచ్చి కీళ్ళు కీళ్ళు విఱచికట్టి.

క. వేయిఘటంబుల తైలముఁ । బాయక నెగలాగఁగాచి ♦ పటుకారులచే । నాయతబలులై పట్టుక । పోయియుఁ జెవుగూబలందుఁ ♦ బోసిసరగునన్.

వ. ఇనుపగడ్డపారలు దెగఁగాలిచి ముక్కు రంధ్రింబులఁ జొప్పించి యొక్కటేరీతి ధణంధణధ్వనులతో ననేకభేరులువాయించి కల్లోలంబుగావించిన నతండు శేషాహిసమానోగ్రకరంబులు సాచి నీలిగి వికృతంబుగా నోరుఁదెఱచి యావులించి.

క. ఈనిద్రయేలరాముని । నేనెదిరించినను ధీర ♦ నిద్దురబోవా। గానగుననుకొనినాఁడే । మోనానవ్వాఁడునిదుర ♦ ముదమున లేచెన్.

వ. ఇట్లులేచి కూర్చొని ప్రళయకాలాగ్నితో సమముగా నేత్రంబులయందుఁ గెంపుగదురనిట్టూర్పులువిడుచుచు దానవులఁగాంచి.

కుం-కీర్తన, ఆదితాళము, ఏదిరాయొరివతె.

ఎవరు లేపిరి। నన్నెవరు లేపిరి । దివిభువివగుల । దిక్కులువ్రగల।జెవిగూబలగల।రవములుమిగుల॥నెవరు॥ మొన్న నేలేచి, మా,యన్ననుజూచి । మన్ననవడసి। మరినిద్రతెలిసి । పన్నుగవచ్చి-పండితినొలసి॥ యెవరు॥ ఏమికార్యము । మీ। కెంతధైర్యము । శ్రీమోక్షపుర స్వామితో వైర। మేమాయెఁజీర । నేటికిసైర॥ ఎవరు॥

వ. అనినరాక్షసు లకుంఠితరణోత్కంఠ రిపుగజ లుంఠనాద్భుత కంఠీరవుండగు దశకంఠునకు దోడుకొనిరమ్మన్న లేపితిమి, కుంభక ర్ణా! యనంతధైర్యసంపూర్ణా! యనిన మంచిదని యాహార కాంక్ష తోఁ బాఱఁజూచిన నాక్షణంబున.

క. ఎనమున్నూరజములమఱి
యెనుబదిమహిషముల వేగ ♦ నిరుపదియొకరర్క
మనుజులను వేయివరహాము
లనునాలుగు వేల శశము ♦ లను వేర్వేఱన్.

వ. ఖండించి పాకముఁజేసి తెచ్చి రాసులుగాఁబోసిన నమ్మాంసంబుఁ గడుపాఱఁదిని రెండువేలకుండల మద్యంబుఁ బానంబుజేసి.

తో. పటపటదిక్కులు, బగులునట్లుగా। పండ్లుకొఱికితీవ్రమున। దిటవుగజుట్టున, దీర్ఘమీసములు-దీటివికృతరూపమున॥ రా॥

వ. వెడలివచ్చి రావణునికొలువుకూటంబుఁ జేరిన సంతోషించి హేమపీఠంబునఁ గూర్చుండనియమించి యిట్లనియె.

రావ-కీర్తన, రూపకతాళము, శివశివవినుమా, హిం, కాపి.

సోదర, వినుమా। మేదినిశ్రీ। రాముండను-రాజుగలఁడు॥సోదర॥ సోదరమర్కటయుతముగ। మోదంబునమననగరము। ముట్టడి వేసెను నాతఁడు॥సోదర॥వారలనెదిరి। వారక్షనున-వారలు బహుమంది చెడిరి। వారల॥లేరుపోర నీవుదక్క। శూరులెవరు మోక్షుగుండ। శ్రీరాముని నెదిరించఁగ॥ సోదర॥

వ. కాఁబట్టి నిన్ను లేవఁగొట్టించితి యుద్ధయాత్రకు వెడలుమనుడు నవ్వి యతండిట్లనియె.

ఉ. నారదమౌని తెల్ప విని♦నాఁడ రమాపతిరాముఁడై ధరా। భారముఁబాప సూర్యకుల ♦ పావనుఁడై యుదయించు నంచునా। తీరుగఁ బుట్టియుండనగు♦దేవమయుండతనిన్ భరించు వా। రేరి! జగత్త్రయంబున జ ♦ యింపఁగ నాతరమౌనె! యగ్రజా!

తో. మనచేఁగాఁగల। పనిగాదిదినీవు। మనవలెనని తలఁచినను। జనకజనిచ్చియు। శరణుజొచ్చురా, మునికవ గనలుచున నను॥ రా॥

రా-కీర్తన, రూపకము, కన్నడరాగము.

పోరా। యీరోతకూత । లేరచాలురా! వినవోల్లర! ॥ పోరా॥ ఆరాముఁడబ్జనాభు, డైననేమి! మర్కటులను, రారులైననేమి! వారు। శూరులే ! సెబాసు । మనకన్నను॥ బోరాయీ॥ యుద్ధం బొనరింపఁగ స, న్నద్ధుడవై పోకనాకు। బుద్ధులుగిరపెద వెంతటి । బుద్ధిశాలివంచు। ననవచ్చును॥బోరా॥ ఈలాగునబగరబాగడి। బేలకీతిలోబకెదవు। నీలావు గణింపలేవు॥ నిద్రపోతుకేటి।.రణరంగము ॥ పోరా ॥ రాముడిలమోటు గుండ । ధాముడనుచునేనెఱుగనె ! నీమాత్రమువానిచేత । నీల్గితేను ముక్తి । యలవడదే ! ॥ పోరాయీ॥

వ. అనినవిని యన్నమనోదృఢంబుగాంచి యిదుగో ! చనుచున్నానని చెప్పి ప్రళయకాలాభీల విజృంభిత మహాంభోధరంబుచందంబునఁ గుంభకర్ణుఁడు గర్జింపుచు యుద్ధసన్నద్ధుండై.

## కుంభకర్ణునియుద్ధము.

క. శూలిత్రిశూలముకన్నను
మేలగు శూలంబుఁ గేల ♦ మెఱయఁగఁగీలా
భీలముగా నార్చుచు రణ
కేళికిఁదావెడలెనపుడు ♦ క్షితియదరంగన్.

తో. లెక్కకుమీరిన । రక్కసులెల్లను । నుక్కు మీరగను రాగా । జక్కగ బటుని, స్వాణ పటహావి । స్ఫారరవంబులు మోగి్గా॥ రా॥ వెడలగ బిడుగులు । బడె నుడుగణములు । బుడమిని జలజల రాలెన్। కడువడి నిప్పులు జరిగురిసెను దిక్కరులు భయంపడి పోలెన్॥ రామ॥

వ. ఇటువలెఁ ద్రిజగద్భయంకరా కారుండై యుద్ధభూమిఁ జొచ్చి వానరసైన్యంబుపైకి వచ్చుచు కుంభకర్ణుని వికృతాకృతికి నివ్వెఱఁ గందిరాముండు విభీషణునితో.

క. దేవారికేమిగావలె। నావచ్చెడి శూరుడెవ్వ ♦ డాశ్చర్యకరం బౌవాని రూపుగాంచిన। వేవేగమె తెలుపుమన వి ♦ భీషణుఁడనియెన్.

విభీ-కీర్తన, జంఝూటిరాగము, అటతాళము.

రణరంగశూరుఁడు కుంభకర్ణుఁడు-రామ! యీసునుఁడు। రఘు

రామ ! యీఘనుఁడు । నల, రావణానుజుఁడు॥రణ॥ జని, యించినప్పుడే దేవతలను జ, యించితి నెను।జయించి॥ మ, దించఁచబూనెను॥ రణరంగ॥ అది, గాంచినిద్రమునుంగునటుశపి- యించెనాయజుఁడు। శపి, యించెనాయజుఁడు।ని, ద్రించుసీతండు ॥రణ॥ శ్రీ, మోక్షుగుండపురీశ యేమర। కీక్షితినివీని । నీ । వీక్షితిని వీని । బొరియించు దయమాని ॥రణ॥

వ. రావణునికిఁగల బలంబులలో ముఖ్యుండితఁడొక్కండే! ఇతఁడునశించిన వానిబలాబర్ధాంశంబు దెగినట్లగు. నిద్రావ్యాజంబు లేనిచో! వీని దాడికి లోకంబులు భరించునా! జాగ్రత్తస్వామీ! మాని హృదంతర్యామీ!

వ. అనుచుండ,

క. రాక్షసమూకలువడిగా । వృక్షచరులముట్టడించి ♦ విపరీతముగా । లక్షింపుచు శిక్షింపుచుఁ । భక్షింపుచు బెక్కుగతుల ♦ బాధించి రొగిఁ.

వ. అప్పుడు వనచరులు తమపరితాపంబులు నెల్లివిఱియ భుజాస్ఫాలనంబులు చేయుచు.

తో. కొండలుదరువులు।గొని తెచ్చియునా। క్రూర రాక్షసులవైచి। వెడియుఁబుఱికెలు-బెంకులుగాఁగను, బిడికిటిపోటులబాడిచి॥ రామ॥

వ. మహాద్భుతంబుగాఁ బెనఁగుచుండ నప్పటిసమరంబు దేవతలకుగూడఁ దేరిచూడరాదయ్యె నప్పుడు.

తో. కూలెడునేతలు। సోలెడురాతులు । వ్రాలెడుగజతురగములు। దూలెడువీరులు। దొరలెడుశూరులు। మునిసెడురథరథ్యములు ॥రా॥

వ. ఈరీతి రభసంబయినఁ దదీయశోణిత మేదోమాంస మజ్జంబులు తృప్తిగా నారగించి భూతప్రేతపిశాచ కాకఘూకచయంబులు విఱ్ఱవీగుచుండె నంత గుంభకర్ణుండు వానరులపయికిఁగదిసి

కుం-కీర్తన, ఆదితాళము.

నన్నోర్చిననన్నోర్చి నిలుపుడి । మీరు।నన్నోర్చి । నిన్న మొన్నరక్కసుల। నిక్కితొక్కినట్లుగాదు॥నన్నోర్చి॥ అంభోజసంభవదత్త । శుంభద్వరబలముచే వి, జృంభించి జంభారిముఖులడంభము సంరంభముడిపి, కుంభిని బేర్కొన్నయట్టి । కుంభకర్ణుడనునేను ॥నన్నోర్చి॥ అక్షీణబల ద

ర్పితరణ। దక్షులౌ రాక్షసవర్యు। లక్షయముగఁ గొల్వమిమ్ము। శిక్షింప గవచ్చినాడ। మోక్షగుండస్వామికిమీ। దీక్షితిసేవకుఁడైన ॥నన్నోర్చి॥

వ. అనిన నప్పుడు వానరులు రోషానలనయనులయి.

తో॰. పటుసత్వంబున।బారివృక్షములు। పర్వతములుగొని తెచ్చి। కుటిలయుతుండగు।కుంభకర్ణుపయి। దటుకున వైచిరి హెచ్చి॥రా॥ శూల ముచేతను। సాలయకయాతడు। జూర్ణముగానొనరించి,। కేలనుగదగొని కీశవర్యులను। గీటడంచ లంఘించి ॥రామ॥

క. కోటానకోటివానర। కోటులగద చేత మోది♦కూలిచిపిదపఁ। నోటగబళించిగొందఱ। వాటంబుగ మ్రింగె దనుజ ♦ వల్లభుఁడలుకన్.

వ. ఇట్లువిజృంభించి మ్రింగుచుఁ బెల్లార్చుచుండె వానినాసాకర్ణ రంధ్రింబులనుండియు నోటినుండియు మ్రింగఁబడిన వానరులు వెడలివచ్చిరి. కూలినవానరులును మూర్ఛదేరికవిసిరి. అప్పుడు హనుమంతుండు,

తో॰. ఒకమహాద్రిగొని-యురువడివచ్చి మ, హాగ్రింబుగ వేసియగను। బ్రికటితముగ నది-పైదాకిన నిల, బడి తెప్పిరి సొంపుగను॥రా॥

వ. కోలాహలంబుగా గాలానలానేక గీలాభీలంబుచేసి తాలిమిని దానవపాళిని నవలీలఁదూలించి వాలంబు వేలాడింపుచుఁ బేరిలెదవు. చాలు చాలు; నీలావును నీలాఘువంబును గాలదండాభముగు నాశూలంబుచే నేలపాలుచేసెదరా. రావానరవీరా! యని శూలంబున మోదిన నాతాఁడునకు హనుమంతుడు మూర్ఛిల్లె. బిమ్మట నీల ద్వివిత శరభ గజగవాక్షాది ప్లవంగముల శూలంబు వేసికసిమసంగుచున్న సుగ్రీవుండు బైకొని.

సు-కీర్తన, ఏకతాళము, బ్యాండుస్వరము.

నినువధింతుదానవా! యిక, నిలుపునిలుపుదానవా! యినసుతుండదానవా! న, న్నెదుర లేవుదానవా! మునువాలిమీయన్న నొంచెగదా! నినుబట్టినేనిపుడు-విదళించెదా॥ నిను॥ శిక్షచేతుదానవా! నీ, సిగ్గుదీతుదానవా! వీక్షణమునదానవా! నీ, వింటికేగుదానవా! మోక్షగుండేశుని దయచేతను। నీక్షితిభూతాళి। కెరజేతును॥ నినువధింతుదానవా!

వ. అనినఁ గుంభకర్ణుండు.

పంచచామరము. పరాక్రమంబుజూపువారు♦ప్రాజ్ఞ లెల్లముందు

గా। మొఱాగుచుందురా! మరాత్మ♦మూర్ఖచిత్త! నాదుముం। దఱ్ఱ బురారిమైన నోర్చి ♦ దాఁక నోపుఁగాన సం। గరంబుమాని పాఱి పొమ్ము ♦ కర్మమంచిదయ్యెడున్.

వ. అనిన నాగ్రహించి సుగ్రీవుండు.

గీ. పెద్దకొండ యొకటి ♦ పెకలించుకొనివచ్చి। యెత్తివై చెద నుజు ♦ నెత్తిమీఁద। నదియువాని వక్ష ♦ మాఁదుదాఁకి చూర్ణమై। రా, లెనంత నలిగి ♦ రాక్షసుండు.

తో. శూలముగొనిచుఱ-చుఱజూచుచునా। సుగ్రీవుని వ్రేయగ ను। జాలమంటలు, జ్వాలముగఁ గ్రక్కు-చు, జనుదేరగఁగనితగను॥ రా॥

తో. హనుమంతుఁడు నడు, మనె దానిని వ్రి, య్యాలుగాదుగ్రిం చినగనలి। దనుజుఁడు మలయూ, ద్రినిగొని సుగ్రీ,వునిపై వ్రేసినదవిలి॥ రా॥

వ. ఆదెబ్బకు సొమ్మసిల్లి సుగ్రీవుండు మూర్ఛ మునింగినఁ గని కుంభకర్ణుండు రావణునకుఁ గనఁబఱచుటకు లంకలోనికిఁ గొనిపోవుచుం డ విడిపించుటకు నోపక వానరులు హాహారవంబులు చేయుచుండి రంత సుగ్రీవుండు మూర్ఛదెలిసి వానియకృత్యంబునకుఁ గోపించి.

గీ. పైకినెగబ్రాకి జీకాకు ♦ పఱచిముక్కు-। జెవ్రలు దెగఁబీఁకి రక్తంబుఁ ♦ జిల్కఁ-జేసి। వికృతరూపునిగావింప♦వీఁకనతఁడు। భానుజుని బట్టి నేలపైఁ ♦ బడఁగఁగొట్టె.

వ. అప్పుడు సుగ్రీవుండు క్రిందఁబడక లాఘవంబున రామచం ద్రునికడకు నుఱికెఁ బిమ్మట గుంభకర్ణుండు.

కుం-కీర్తన, ఫీల్ రాగము- అటతాళము.

అకటా! నేటికినింత -యాపదలాదవె। వికృతాకారముతోడ- వెలయగవలసె॥ న॥ చెలియలిగతినాకు-సిద్ధించెనౌరా। తలపబురాకృ తము, తప్పిపోదారా॥ య॥ ఈరూపమున నన్న - జేరగఁజాల, భోరికి గ్రమ్మఱఁ- బోనునీవేళ॥ నక॥ వెలయమోక్షుగుండ - విభునితోఁబోరి। తగలక దాజెడదలచెనాకారి॥

వ. ఇట్లు పరిభవపడి కుంభకర్ణుండు లంకలోనికిఁ బోనొల్లక విల యకాలమహాగ్ని చందంబున మండిపడుచు రణరంగంబునకు వచ్చి నీని దెబ్బకుఁ దబ్బిబ్బునొందుచున్న వనచరులఁజుట్టుకొని.

తో॥ కొందఱబట్టుక-గుంభిని మోదెను-గొందఱి నదులనుద్రోసె। గొందఱినీూకెను। గుధరంబులపైఁ-గొందఱబై కెగవై చె॥ రా॥

కొందఱదిక్కుల-కునుబడమీూటెను। గొందఱిలంకకుబడగ, బొందుగవై చెను। భూరిబలంబున, గొందఱ్రమింగెను జెడగ॥ రా॥

వ. ఇట్లు భయంకరంబుగా శంక లేక బనిచేయుచున్నంత.

క. కూతలుగూసెడుకపులును। భీతినిబరతెంచుకపులు ♦ భిన్నాంగులునై। రోతపడు కపులుదనుజుని। వాతనుబడు కపులునై వి ♦ పద్దశ గలిగెఁ.

తో॥ తగ్గెను నినజుఁడు-దగ్గెనంగదుఁడు, దగ్గెగవాక్షుఁడు గజుడు। దగ్గెనునీలుఁడు-దగ్గెనుశరభుడు-దగ్గెనుధూమ్రముఖనలుడు॥ రా॥

వ. తక్కిన జాంబవదాదులు భయపడి యుగుకుచుండ లక్ష్మణుండెదిరి.

తో॥ కుంభకర్ణుపై, గొన్ని బాణములు-గోపముతోడను బరప, సంభృతధీరుఁడు, సరకుగొనకదాఁ-జనుచుండగఁ బురికొలుప॥ రా॥

వ. వానరులు వానిపయికి నగణితంబుగా నెగఁబ్రాకి.

తో॥ తోకలజుట్టియు-గేకలవెట్టియు, దోలువట్టినఖములను। బీకుచుసంధులు, బిగియబట్టుచును-బీడించగజులకగను॥ రా॥

వ. వారినందఱను విదళించిన మేఘమండలమునుండి చుక్కలు రాలినట్లు గ్రిందరాలి రిట్లుసలుపు కుంభకర్ణుని పరాక్రమమునకు నద్భుతంబంది.

క. రాముఁడునిర్జితభార్గవ
రాముఁడు సద్గుణగణాభి ♦ రాముఁడనుత సు
త్రాముఁడుఁ దాటకగర్వ వి
రాముఁడు దానెదిరెనపుడు ♦ రాక్షసుపైకిఁ.

వ. ఇటువలె గదిసి రాముండు ధనుష్టంకారంబుఁ జేసిన నాధ్వనికి జతుర్దశభువనంబులు గడగడ వడంకె. అప్పుడు విభీషణుండు రామునకు ముందుగా నడిచి కుంభకర్ణుని ముందర గదాధరుండయి నిలిచినఁ గాంచి నవ్వుచు.

కుం-కీర్తన, కాపి-అటతాళము, నాయనయీ॥

ఓరివిభీషణ! యుక్తమెయాగదా! పోరానరింపగ-జేరినవాడవు॥ వ్రా॥ అన్నదమ్ములమని । యెన్నగబోలదు । నిన్నేలువానికి । నెప్పుగ నుండుము॥ వ్రా॥ చాలగనిన్నిటు । జంపినలంకను । నేలువారెవ్వరు । నికనీవుగాక॥ యో॥ మోక్షుగుండేశుని । ముదమునగొల్వుము । రాక్ష సరాజ్యము । రయమునవిచ్చును॥ఓ॥

వ. అనిన విభీషణుండు గుంభకర్ణునకు మ్రొక్కి.

తో. రామునితోనైవై, రమువలదనినే-రావణునకుం జెప్పినను! నా మాటలనుమ, నంబున నొప్పక-ననుదన్నియుం బొమ్మనెను॥రా॥ కావున రాముని-కరుణకుబాత్రుడ, నైవచ్చితినేననుచు । గేవలముగ కుః-ఖంపు చుండలగియు, నావలబోయెనుగనుచు॥ రా॥

వ. అప్పుడు రాముండు లక్ష్మణ సహితంబుగాం గుంభకర్ణుని సమీపించి యిట్లనియె.

రా-కీర్తన, సురటరాగము-ఆదితాళము.

దురంబునను నసుభరింపగనునీ । తరంబుగాగారా! యికగు-ర్తెఱింగియిటుబోరా । సరోజసంభవు । వరంబులెల్లను । దొరంగుగను గొనురా! ఇదేనా । శరాగ్ని గాల్చునురా॥ దురం॥త్రిమూర్తులును నీ । కుమేలుగానడ్డ-మైన విడచెదనా! నీవి, క్రమంబుగనుగొననా॥ దురం॥ జగంబునను మోక్షుగుండపతినేగ, రగక ఎవరికైన! బాణము, లగూడిపోనగునా!

వ. అనిన.

ఉ. అంతటవాండురౌద్రరస ♦ మావహిలంగ బ్రిళయావసానకా లాంతకుంబోలె! మండిపడి యార్చుచుం ♦ బేర్చుచు భూద్దుగీటుచుఱ!గం తులువైచి మర్కటులు ♦ గంపమునొందుచుం బారం జేసితాం ! బంత ముమీఱ రామనర ♦ పాలునిఁ గొననియెఁ జలంబునఁ.

కుం-కీర్తన, అటతాళము-మేలైన.

మాయలువన్నిన-మాయించిచంపగ! మారీచుగానుసుమా! పాయకబాహులు-భంజించికూల్పంగ-బంధుడగానుసుమా॥

పోలగవిల్లిచ్చి-భువిభంగపడభృగు-పుత్రుడగానుసుమా॥ వాలా

యముగ నొక-కోలనుగూల్పగ-వాలినిగానుసుమా॥ రాక్షసేశ్వరుడ। రావణానుజుడ । రణవిక్రముడనుసుమా । మోక్షగుండేశ్వర- ముల్లోకముల యందు-మొనగాడనౌదుసుమా!

సీ. ఘనమైనకరకు ర ♦ క్కసుల పలుకులుగాని సనకాదియోగి సం ♦ స్తవముగాదు । పటహతమ్మటభేరి ♦ భాంకారములుగాని నారద పఠితగా ♦ నంబుగాదు । ఆర్చుచుం జనుదెంచు ♦ నసురయోధులుగాని యర్చింపవచ్చు ♦ భక్తాళిగాదు। కఠినతరంబగు ♦ కదనరంగముగాని కర మొప్పుక్షీరసా ♦ గరముకాదు। అచటసుఖమును మేలునే♦ కిచటగలదె। యెందుకుజనియించితివి భూమి ♦ యందునీవు। వెఱ్ఱిబ్రహ్మయు నింద్రుండు ♦ వేడగానె। యయినననుదాకి బ్రతికిపో ♦ మ్మాంతెచాలు.

వ. అనిపలికినఁ గోదండరాముండు గోపాన్వితుండయి యనేక సహస్రకాండంబు లఖండంబులుగాఁ కోదండంబున నొక్కవెట్టి వేసిన నవి తప్పించుకొని.

తో. గదత్రిప్పుచుభీ, కరముగరాగను। గనివాయవ్యాస్త్రమున గదతోగూడ-కరమునునునిమెను। కాకుత్స్థుఁడుబీరమున॥ రా॥ కడమచేతరా, తుసుఁడువృక్షమును గైకొనిమీదికిరాగా। దడయకఁబెందాస్త్రి, స్త్రమ్మునరాముఁడు। దానినిద్రుంచెను వేగ॥ రా॥

వ. రెండుహస్తంబులు దెగి క్రిందబడిన వానిక్రిందబడి కొందరు వానరులు మడిసిరి. అనంతరంబ కుంభకర్ణుండు వికృతంబుగా నోరు దెఱచుకొని.

కుం-కీర్తన, రూపకతాళము-మంగళమగు.

నినుమ్రింగెద నినుమ్రింగెద నినుమ్రింగెదఁగనుమా ! ఘనవంశజ! యికనిల్వక। నేండైననుజనుమ॥నిను॥ నాబాహులనరుకంగనె। నేబోదునెకనుమా। నీబంటుల దాకియు నినునేనోర్తును నిలుమా॥ నిను॥ నరభోజనులకు వానర। నరులడ్డమెకనుమా। ధరణిని శ్రీ మోక్షగుండపురరాఘవ! నిలుమా॥నిను॥

వ. ముక్కు చెవులును జేతులును దెగినను సిగ్గులేక వికారంబుగా నోరుదెఱచుకొని వయికిఁ గదిసిన రాముండలుక రెట్టింప.

తో. అగణితబలుఁడై-యర్ధచంద్రశర-యుగము వింట సంధించి। తగబిగించి త, త్పదయుగ్మంబును-దెగఖండించెను మించి॥ రా॥

క. కరచరణంబులు దెగినను। ధరపైదొర్లాడుకొనుచు ♦ దైత్యుఁడు కవియుఁ౯। శరజాలంబులనోటను। జొరనైచెను రాఘవుఁడు ♦ సుర లరుదందఁ౯.

వ. సింహనాదంబుఁ జేయుటకు వీలులేక వికారముగా గేకలు వేయుచు వేడిచూపులఁజూచుచున్న దానవుని వక్షంబున గుఱిగాంచి.

తో. ఇంద్రాస్త్రము సం, ధించి వేయనది- యేగియురముభేదించి। సాంద్రంబుర భూ, స్థలిలోదూరెను। సరగరాముఁడదలించి॥ రా॥

అంతశర మ,త్యంతవేగమున-నప్పుడువేసియ బెల్లడరి। పంతము తోగుం, భకర్ణునిశిర-మంతయుద్రుంచెనుదొడరి॥రా॥

వ. ఇట్లు శ్రీరామకర నిర్ముక్త దివ్యాస్త్రంబుచేఁ గుంభకర్ణుని తలదెగి లంకలో సగంబును సముద్రంబులో సగంబును బడియె. గోపురప్రాకారాదులు చూర్ణంబులయ్యె. దానిక్రిందఁబడి పదికోట్ల వనచరులుమృతినొందిరి. జలచరంబులుమ్రగ్గె. కులగిరులుద్రుగ్గె. దేవతలానందించి రాముని,నభివందించుచు పుష్పవృష్టిఁగురిపించిరి. అనంతరంబు హతశేషులు కుంభకర్ణుని మరణవృత్తాంతంబుఁజెప్పిన రావణాసురుండు మూర్ఛఁబొంది కొంతవడికి లేచి విలపింపఁదొడంగె.

రావ-కీర్తన, ఫేలురాగము, ఆటతాళము.

అకటా! కుంభకర్ణ! యనిదెల్పినావా! యినకులుపేదినా-కేదిరతోవ॥యక॥ కులిశధారకునైన-కూలనిమేను। యిలనరునేటున, నిటు కూలెనేను॥య॥ మనవిభీషణునీ-మాటఁగైకొనక। నినుగోలుపోతిని-నీబుద్ధివినక॥యక॥ నీబలమునునమ్మి-నేజింతపనికి। నేబూనితినిక, నేర్పేదియనికి॥నక॥ మోహుకుండేశుని-ముదమున నెదుర। నీక్షితినాపని; యింతేయాగదర॥ యక॥

వ. కుంభకర్ణునిగూర్చి రావణుండటుల విలపించుచున్న నతని కుమారులగు నతికాయ, దేవాంతక, నరాంతక, త్రిశిరులును, దమ్ములగు మహోదర, మహాపార్శ్వులును రావణునితోననుచున్నారు.

క. మీరేల చింత నొందఁగ
నో రావణ మమ్ముఁ బాప ♦ నురువశిగపుల్క
శ్రీరామ లక్ష్మణులఁ గసి
దీరఁగ వధియించి మేము ♦ తిందుము వార్లి.

వ. కాలము దీరినప్పు డెంతవారయినఁ జావకుందురా! యుద్ధకాలంబున దుఃఖించుచుండిన జయము కలుగునా! లెమ్ము లెమ్ము. మమ్ము ప్రియాణమ్ము చేసి పంపుమనవుడు రావణుండు ధైర్యంబు నొంది.

## అతికాయాదులయుద్ధము.

రావ-సం, తోహ. మీకడ్డం బే! లోకత్రయమున। భీకర శస్త్రాస్త్రములు। చేకొని యుద్ధముఁ - జేయగఁ బొమ్మనఁ, జెలగి యసుర మొత్తములు॥ రామ॥

వ. అనంతంబులుగా నేలయీనినట్లు కదిలిరాఁగఁ గాంచనరథంబు లెక్కి ధనుర్బాణధరులయి భేరీభాంకారంబులు భూనభోంతరాళంబు నిండ వెడలి యుద్ధభూమికిఁ జేరి ముట్టడించిన.

తో. కపులు నుడీకొని కరములఁ బొడుచుచుఁ-గాళ్ళతో డఁ దన్నుచును। విపుల శైలములు - వృక్షచయమ్ములు - విఱిచి తెచ్చి వేయుచును॥ రా॥ తురగంబులంతో। మరగంబులరథ, కరులచేత రథకరుల। స్థిరముగ నసురుల-చేనసురుల మో, ఁదిరి పొడిపై ధరనురుల॥ రా॥

వ. మర్కటులు మాఱులేక క్రూరులహతంబు సేయుచున్న రాక్షసదళంబులు బెండువడి యుఱుకుచుండ నిలువరించి నరాంతకుండు వనచరులపయి ననేక బాణంబులు వైచి తనలావుఁ జూపు మఁజని యంగదుని దాఁకి యిట్లనుచున్నాఁడు.

నరాం-కీర్తన, కమాస్. రూపకము.

ఇంతగర్వమేల నిల్వరా। ప్లవగాధమ! స॥ కింతగర్వ॥ అంతకనిభుడను నేను న, రాంతకుఁడను మాతన్మున॥ నింత॥ దిక్కులు నేదిరిగినానురా। మానవులబట్టి। చక్కడంచి మట్టినానురా। డొక్కదరఁగఁ-ద్రొక్కెద నే, మెక్కెదనిఁక, దిక్కెవ్వరు॥ ఇంత॥ శిశు జేతునొక్క-వేటుకు। బరుగత్తుమిపుడు। మోక్షగుండ విభుని చాటుకు। అక్షయరణ, దక్షులమగు-రాక్షసులకు। రాకెదురుగ॥ నింత॥

వ. అనిననంగదుండు జానకీజాని యాతనిచే నేను వచ్చి మీనా యనతో భాషించి నానిపుణత్వంబు మెఱయ ఖరసూనుఁడు లోనగు దానవుల వేనవేలం జంపి మేనుప్రదల మానవేసుకడకుఁ బూనికతో వచ్చితి. నానాడు నీయానసమయినఁ గానరాదయ్యె. నెక్కడనుంటివిరా హీనా! యీవేళవచ్చితివా! నాపయిన నిన్ను జంపక విడిచేనా.

వ. అనిన వాఁడలిగి,

తో. గదజేకొనియుం, గదుసివేృయగాఁ-గదిసియురమ్మునుదాచి యదివిరిగిపగసి- యసురుడుబిడికిట-నడచిన మూర్ఛిలి లేచి॥ రా॥ ఒక్క గుద్దుతా, గుద్దినగ్రక్కున-నెరిగెనునాతనివాజి। చక్కగనింకొక-సారి గుద్దగను-రక్కసుడీల్గెనునాజి॥ రా॥

వ. అంతనరాంతకుని చావుగని కినిసి మహోదరదేవాంతకత్రిశిరులొక్కసారి యంగదునిపయికినడిచి యనేకశిలీముఖంబుల నొప్పించుచుండిన నతఁడును వెనుదీయక పర్వతవృక్షాదులచే మోదుచుండెనింతలో నీలుండును హనుమంతుడును నంగదునకు దోడువడిరి. అప్పుడయ్యిరువాగువారును గదిసి,

పంచచా॥ అనేకరాత్రులార! మీరిట్లాహవంబుఁ జేయఁగా।బిరానవచ్చినారమీఁదు♦బింకముల్ గలంచిస।త్వరంబుగాశిరంబులూడఁ♦దన్నిశాద్రిదేవతా। పురంబుఁ జేర్తుఁ మింకఁబాట♦ పోక యుంచునిల్వుడీ.

వ. అనినఁ గోపించి దేవాంతకుండు హనుమంతుని దూరుచు.

తో. పరిఘుద్రిప్పుచును-బైకినుమికగని - పవనజుడలిగియు హెచ్చి। శిరమునుబిడికిట-జితుకబొడువగా। క్షితిపైగూలెనుజచ్చి॥ రా॥

వ. అదిగని మహోదరుఁడొక్క మదగజము నెక్కి నీలుని జేరి యుద్ధములలో సమర్థులమని యుద్ధరిత్రిని సిద్ధంబుగఁ బ్రసిద్ధిని గన్న మాపయికినాటోపంబుఁ జూపవచ్చెదరు. నేఁటాసు- కోపాగ్ని దీపించగనీ పూట నీరూపుమాపి మాపెద్దల ఋణంబుఁ బాపెదఁ బోపోరా నీలా! నీముఖంబుఁజూడఁజాల దుర్గుణజాల యనియనేక బాణంబులు వైచిన సరకుగొనక నీలుండు.

తో. గిరిజేకొనియుం, బరమున కెగిరియు - గురిగావైచినదగిలి। కరియును రాక్షస-వరుడునొక్కపరి-ధరగూలిరి తలపగిలి॥ రా॥

వ. పిమ్మటఁ ద్రిశిరుండు హనుమంతుని పయికిఁ జనుటికి.

త్రిశిరహనుమత్సంవాదము.

కీర్తన, ఆదితాళము, అతడెవరే, కమాస్,

త్రి॥ తలగకురావనరా॥ త॥ ప్రకటితముగనా బాణాగ్నికి॥ దల॥ హ॥ పేర్చి, లకురాదానవా! పేర్చి॥ ఒకతోర్చి క్కుకునీ-యుక్కడంతు॥ బేర్చిల కురాదానవా!॥ త్రి॥ మం, చిదిరావానరా! మం॥ మెదకుసెదరమో॥ దెద గదతో॥ దలగ॥ హ॥ గె, ల్చెదవా దానవా! ॥గె॥ ఇదిగో మోతుపు, రీకునాన॥ పేర్చిలకురా॥ వ. అంతట.

క. అడిదముఁగొని త్రిశిరుఁడుపై। కడరిన హనుమంతుఁడతని ♦ యడిదంబునెత్తా। నుడిసికొనిదానిచేతనె। యడచిననసురుండువచ్చి♦ య వనింబడియెన్.

వ. అంతట మహాపార్శ్వుం డుగ్రుండయి హనుమంతుని బైకొని

భుజంగ:-మహాపార్శ్వుఁడన్ నన్ను ♦ మార్కొన్నశూరుల్ । మహిన్ లేరునీవెంత♦ మర్దింతురారా! పరిహస్తాదులన్ బట్టి♦ భంజించి నట్లు। దహింతున్ భవద్గర్వ ♦ దర్పంబులెల్లన్.

వ. అనిపలుకుచుండ ఋషభుండొక్క వృక్షంబు రాక్షసునిమీద వైచిన సరకుఁగొనక.

తో. తనగదచేతను- దనుజుడువేసిన - దప్పించుక ఋషభుండు గినిసి తనదుపిడి-కిటబొడచిన గిజగిజదన్నిక దనుజుం॥ రామ॥

చచ్చిననాతని చావుజూచిరో, షంబున నతికాయుండు। వచ్చెనువానర। వర్యులజంపెద। వడిగాననిధీరుండు॥ రామ॥

## అతికాయ యుద్ధము.

వ. సహస్రసూర్య ప్రభాభాసమానమగు రథమెక్కి మహాటోపంబునవచ్చు నతికాయునిఁగని కుంభకర్ణుండు పునర్జీవితుఁడయి వచ్చుచున్నాఁడేమో! యనివనచరులు భయభ్రాంతులయియుండఁ గని రాముండు వీఁడెవ్వడని యడుగవిభీషణుండు.

గీ. ధాన్యమాలియందు ♦ దశకంధరుఁడుగన్న । సుతుడు వీఁడు యుద్ధ ♦ శూరుఁడరయ। నతిబలాఢ్యుఁడయ్య!♦ యతికాయుడనువాఁడు వీనిఁజంపఁదగును ♦ వేగమునను.

వ. అని తెలుపుచుండెనప్పుడు.

క. హనుమంతుఁడు లోనగున। వ్వనచరు లవనీరుహములు♦వసుధాధరముల్ । గొనియెదిరించిన నప్పుడు। దనుజుండిటుబల్కె_మిగుల♦దిర్పోద్ధతుఁడై.

అఠి_॥కీర్తన॥, ఖిల్ రాగము_॥ ఆదితాళము॥తల్లిభ.

ఏడియేడి! రఘువరుడేడీ ॥ కపులార యేడీ । యినబడ। డేడీ ॥ ఏడియేడీ॥ వాడిశరంబున- వారిరాసి గ, ర్వంబును బాపియు। బంధించినవాడేడీ॥ సురరిపుతనయుడు-జులకగగట్టిన-యురగపాశముల- నూడ్చుకొన్నవా॥డేడీ॥ ఘటకర్ణునినొక-గడియలోన ది। క్తటములు చెదురఁగ-ఖండించినవా॥డేడీ॥ రావణునిక జూ,ర్ణంబు జేతునని। లావునలంకకుఁ।దావచ్చినవా॥డేడి॥ మానుగనాతని-పైనగానినా-మానితశరములు! మరివేయనురాము॥డేడీ॥ దక్షుడనై యాతనితమ్ముని శి । శిక్ష సేతునల।మోతుగుండవిభు॥డేడీ॥

వ. అని గర్వంబునఁ బలికిన యతికాయునిపైఁ గోపించి.

తో. కపులుగిరులు వృక్షంబులుగొనియతి-కాయునిపైఁ వేయగను। నపుడువాడు ది,వ్యాంబకములచే। నవియు ద్రుంచి సేర్పుగను॥రా॥ గురుతరాస్త్రముల_గుముదుడులోనగు- కోతులబిట్టుగవైచి ! స్థిరముగమూర్ఛిల- జేసిరాఘవుని- జేరినప్పుడును జూచి॥రా॥

వ. ఇట్లనుచున్నాఁడు.!

సీ. నీవెంత వాడనో ! నేనెన్నఁ ♦ డెరుగను నింతటివాఁడని ♦ యెఱుగరెవరు। దిక్పాలకులలోనఁ♦ దెలియగానగఁరావు మానాభిమానముల్ ♦ మహిని లేవు। జాతివర్ణాశ్రమా।చారనీతులు లేవు గుణహీనుడవునిల్వ ♦ గొంపలేదు। భువిలోన నొంటిగాఁ ♦ బొందలుచుండెడు నీకు గపికోటిసైన్యంబు ♦ గలిగెనిపుడు । దిక్కులేనట్టినీకును ♦ దిక్కుగాఁగ। నినజుఁడేర్పడె నాతోడ ♦ నెదుర లేవు। వనములందును గొండల♦ మునులయాశ్ర। మములవర్తింపు కాదేని ♦ మఱియువినుము.

అఠి_కీర్తన, మధ్యమావతి_ఆదితాళము.

విడిచేనా! రఘురామ! నిన్ను॥విడి॥ వేదదమీనమై, జడనిధిజొచ్చినఁ। గడుగమఠంబై_గట్టుమోచినను వడిసూకరమై_పుడమిదూరినను।

వడిగ-వెదకెదఁగాని॥విడిచేనా! ॥ పండితీకంబమునందుఁ బుట్టినను-విందు గవటువై-భిక్షుమెత్తినను। బొందుగరాజుల-మ్రింద జేసినను। నందే! కను గొందుగాని॥ విడిచే॥ రాక్షసవఖులతోఁ-గక్షకట్టుకొని। ఈ క్షితిఁబోరఁగ-నే తెంచితివిటు। మోక్షగుండస, త్పురవల్లభనిను। దీక్ష-సాధింతునుగాని॥ విడిచేనా॥

తో. అనిజేయగ రమ్మనియతికాయుం, డగ్రజుజేరఁగఁగాంచి। వినిలక్ష్మణుఁడతి-వేగగనలి యి, ట్లనిపలికెను నదలించి॥ రా॥

క. ఓరీరాక్షసరాముని। తో రణమొనరించు నంత ♦ దోర్బలు డవె నీ। శూరత్వంబును గాంచెద। రారా నేనుండ రాము ♦ రమ్మన వలెనా!.

వ. అని యుద్దండంబుగా నిలిచి గుణధ్వనిఁజేసినవాఁడు దురాగ్రహ విగ్రహుండయి యొక్క క్రూరాస్త్రంబు వింటసంధించి లక్ష్మణునిదిక్కు నభిముఖుండయి,

అతి-కీర్తన, ఆదితాళము, తాగంపాట్లు.

నీవుబాలుఁడవు నిలువగజాలవు। పోవోయిపోరుడిగి। లక్ష్మణా! నావాక్యములువిని ॥ మీయన్నరాముఁడు। మేదినిహిమగిరి। యాయమ రాద్రిదక్క। యితరులు నాయంబులకునోర్తురా! ॥నీవు॥ మోక్షగుండేశు ని।నీక్షణమున। బట్టిశిక్షింతునీకేలను।లక్ష్మణా!వీక్షింపుచునునిల్వుము॥నీ॥

వ. అని తూలనాడిన సౌమిత్రి యిట్లనియె.

తో. దురహంకారము - తో బలికినలే - దురకిర్యి-శూరుఁడ వయిన। సురలరయఁగనీ-శరలాఘవమును-జూపించరనాపైన॥ రా॥

వ. అనిపలికిన నతికాయుం డంతకాకారుండయి యత్యంతవేగంబునఁ బ్రయోగించియున్న పటుసాయకంబు వైచిన లక్ష్మణుండర్ధచంద్రబాణంబునఁ ద్రుంచి.

తో. ఆగ్నేయాస్త్రము-నసురుని వేసిన-నాతఁడు సౌరాస్త్రమున। భగ్నంబయియిలఁ-బడగావేసియు - బదపడిలక్ష్మణుతోన॥రా॥ ఐషిక బాణంబదిగో! వచ్చెను-నాగెదవా సౌమిత్రి। భాషింపఁగనిఁక-బారిపొమ్మనిను-బడగూల్చును నీధాత్రి॥ రా॥

వ. దోషాచరులపయి ద్వేషించి మానుష వేషంబున దూషింపుచు వచ్చితివి నీరోషంబునకు సమణ్యాస్త్రంబు వెలవ నైషిక బాణంబున నీభీషణంబు బాపెద సౌమిత్రీ! ఇది నిన్నుఁగూల్చును ధాత్రినని వైచినగోపించి.

తో. ఐంద్రబాణమున-నదిపొడిజేసెద-నార్భాటముఁ జాలించు। సాంద్రబలుఁడవై-శౌర్యంబుననీ-శరవిద్యనుజూపించు ॥రా॥

వ. ముమ్మ రమ్మగునైంద్రాస్త్రమ్మున నీయమ్మునమ్ము సేసెద, మమ్ము బెదిరించు సామర్థ్యమ్ము నీకుఁ గలదా! రమ్ము. నీతల దిమ్మ నీదినమ్మునఁ బాపెదనతికాయా! అనిపాని బాణంబు ద్రుంచిన నతండు మరల.

తో. యామ్యాస్త్రంబును-నదరక వైచితి-నార్పుచు నిదుగో వచ్చె! సౌమ్యంబనుచును-సరగునఁజూడకు-చంపునునీయెదజొచ్చె ॥రా॥

వ. పాత్రాపాత్రంబెఱుఁగక శాత్రవుల పయి తూత్రవంతంబుఁ జూపెదు నీగాత్రంబుధరిత్రిగూల్పఁజాలు యామ్యాస్త్రంబువైచితి. సైరించుక్షత్రియాధమా! యసురయోధులతో వాదమా!

వ. అనిన లక్ష్మణుఁడు.

తో. వచ్చెనుజూడర। వాయవ్యాస్త్రము। వశిగలయామ్యాస్త్రమును। జెచ్చెరనీక్షితి-జీలిచివేయును-జేయునుమఱియుద్ధమును॥ రా॥

వ. వాయవ్యాస్త్రమున నీయామ్యసాయకముఁ బాయఁ జేసెద నేయేయస్త్రంబులువైవగలవొ! యవియన్నియు వ్యర్థములురా. మాయకాఁడా! నీయుత్తమాంగంబు వీడఁజేసెదఁజూడరా! యీడ, అని యాబాణమ్మునునడఁకి మఱికొన్ని దివ్యాస్త్రంబులు లక్ష్మణుండు బ్రయోగించిన నవి వానికవచంబును భేదింపఁజాలకఁ జూర్ణంబులయిన సౌమిత్రి యద్భుతంబు నొందుచున్న నామర్మంబుఁ దెలుపఁగోరి వాయుదేవుండు వచ్చి.

గీ. వజ్రకవచంబుఁగొన్నాఁడు ♦ బ్రహ్మవలన। శరము లెవ్వియు భేదింపఁ ♦ జాలవయ్య। కడఁగిబ్రహ్మాస్త్రమేసిన ♦ గాసి తెగఁడు। చేయుమట్లన మోదించి ♦ శీఘ్రముగను.

సం-కీర్తన, రూపకము, పరిథనోగ్రి.

విపులాగ్రహోగ్రోదగ్రుండై బ్రహ్మాస్త్రము గొడిగి। సమరాగ్ర నిగ్రహమునవైచె-నగ్రజునడిగి॥ విపు॥ దశ, దిక్కులుక్కుదక్కి స్రుక్కి మిక్కిలిసోలెణ। సుర, లక్కజంబునొందంజుక్క-లొక్కటరాలెణ॥విపు॥ కుల,పర్వతంబులెల్లడుల్లె-వార్ధులునింకెణ। రిపు, లార్వ్వయుర్విఎల్లగిల్లె-నర్కుడుగుందెణ॥విపు॥బ్రహ్మాండమెల్ల బెంకువడిమె-నద్భుతముగను। మోక్ష। గుండశ్రీకోదండపాణి-కూర్మిజెలగును॥ విపు॥

వ. ఇట్లుప్రయోగించినబ్రహ్మాస్త్రంబును దప్పించుకొనుటకయి.

తో. పరిఘయుశూలము-బటుశక్తియుగద-సంగ బ్రయోగించి నను। సరకుగొనకనది-చనికిరీటయుత-శిరమునుదెంచియు జనెను॥ రా॥

వ. ఈలీల బ్రహ్మాస్త్రం బతికాయునివధించి పొదిజేరె. దేవత లు లక్ష్మణుని గొనియాడిరి. లక్ష్మణుండన్నను జేరి నమస్కరించిన దీవిం చి కౌగలించుకొనియె. అనంతరంబ.

క. హతశేషులు దశముఖునకు
నతికాయుండు లోనుగాంగ ♦ నాగ్రజరిచాపుల్
వెతనొందుచుఁజని తెలిపిన
ధృతిదూలియు మూర్ఛనొంది ♦ తెప్పిరివాచెణ.

రావ-కీర్తన, ఏకతాళము, నలరాజు.

అతికాయ! యేమిరా! గతియేదిచూపరా! బ్రతుకజాల॥నతికా॥ నరులనుద్మాతువు। చిరకాలముందువు। నీవనుకొంటి॥ నతి॥ భయమెట్లు దొల్గును। జయమెట్లుగల్గును। దిక్కులేదు॥ అతికా॥ కినుకవ్వదైవము మెడబాపెమనను। బలుకవేమి॥అతికా॥. అలమోక్షగుండపురా,ధ్యక్షు నితో। వైర,మింతచేసె॥ నతి॥

• క. నాముద్దుతనయుండ్రుంచిన। రాముసితమ్మునివధించు ♦ రణ శూరుండులేం। డేమందువిధికృతంబున। కీముహోం బగవారుగెల్చు ♦ టింకసంశయమే.

తో. శ్రీరామునిపటు,శూరత్వమునకు। మేగ లేచుతలపోయ।జే రిలంకనింక। జెరుతురువూమెడు। వారిగాన ననిజేయ॥ రా॥

వ. అని బహువిధ చింతాక్రాంతుండయి యున్నతండ్రిని జేరి నమస్కరించి యింద్రజిత్తు పలుకుచున్నాఁడు.

౩౦, కీర్తన, తిశ్రజాతి, నామాట, జంఝూటి.

నేనుండశంకిపగ। నీకేలశోకింపగ। మానుగననిసల్పగ। నేనేగద నువేగ।జనకి।పూనుముధృతిబాగా॥ నేనుండ॥ వానరులనగనెంత। మానవులనగనెంత। నేనరుదెంచినంత। నిలుతు రేఁచుసుమంత। చింత। బూనేవు బహువింత॥ నేనుండ॥ ననుదేఁచిమాడలేఁడు। నామునుమనిలువలేఁడు। ఘన మోక్షుగుండవిభుఁడు। గావ్రనజనినేఁ।చూడు। తునుముదునీ తోఁడు॥నేను॥

వ. అని ధుర్యంబుదెలిపి యతనియనుమతివడసి వేగంబునని౦ద్రజిత్తు ప్రయాణంబై.

ఇంద్రజిత్తు రెండవ యుద్ధము.

క. చతురంగబలములత్య। ద్భుతవిక్రమమొప్పఁగొలిచి ♦ తోన రుదేరన్ । బ్రతిపక్ష భయావహమగు । సతులితరణభేరి మొఁయ♦నని మొనఁజొచ్చెన్.

వ. ఇట్లువొచ్చి.

గీ. అగ్నిహూత్రుసిబార్చించి ♦ యతనివలనఁ । గడఁగి బ్రహ్మాస్త్రరథధనుః ♦ కవచములను । బొందియంబరమునదాగి ♦ భూరిబలుఁడు బాణవర్షంబులనుముంచె ♦ వానరులను. వ. అప్పుడు.

ఉ. మానులుపెద్దగట్టులును ♦ మానుగఁజేకొనియుగ్రమూర్తులై వానరులెల్లఁ బై కెగిరి ♦ వానిగనుంగొనలేక క్షోణికిన్ । దీనతశోడరాగఁబర ♦ తెంచెడువారి శరాళిముంచుచున్। దానవ్రఁడట్టహాసమున ♦ దర్పముఁజూపఁగ లక్ష్మణుండనేన్.

క. అన్నా! బ్రహ్మాస్త్రంబున । నిన్నిచునిద్రుంచినైతు ♦ నిమ్మానతి నాకన్నను నొక్కనికొరకయి। పన్నుగలోకములఁజెఱుపఁ ♦ బాడియె! యనుజా!

వ. బ్రహ్మాస్త్రంబువాడు కనబడకుండిన లోకంబుల భస్మంబు జేయు నొక్కనికొరకయి లోకబాధ యేలజేసెదవు మానుమని యతనియుద్యోగంబు నివారించెనంత.

గీ. ఇంద్రజిత్తుకపుల ♦ నినకులజాతుల। బ్రహ్మాస్త్రముచేతఁ ♦ బరఁగమూర్ఛ। నొందజేసెలంక ♦ కొయ్యనఁజేరెను॥ నక్కడ స్తమించె♦నంత మీద.

వ. వనచరులకు రామలక్ష్మణులకుఁ గలిగిన విపత్తును గుఱించి విభీషణుండుఁ గొంతయోజాచి యిట్లనుచున్నాఁడు.

తో. బ్రహ్మవరముచేఁ - బ్రబలిదనుజుడిటు - ప్రజ్ఞజూపరాఘవుడు। బ్రహ్మాస్త్రంబును-బరువడిమాని-పగదగునని యూఘనుడు॥ రా॥

వ. ఊరకున్నాడుగాని; లేనిచో నీసీచునికి లోఁబడునా! యనిన హనుమంతుండు బ్రహ్మాస్త్రమునఁ జెడకుండవరము గొనియున్నాఁడు. గాన మూర్ఛనొందకుండుటచే లేచి విభీషణునితోఁగలసి కొరువులుచేకొని రణమందుఁ గూలినవారినిఁగని చింతింపుచు.

హ-కీర్తన, అటతాళము, వసంతరాగము.

ఇంతవారికిని॥ నీవెతగలిగె॥ నింత॥ పంతముతో జయ। పటుసత్వవంతులై। యెంతెంతపనులైన। జింతింపకనుజేయు॥ నింత। శూరులైన నవతారములైనను। బ్రారబ్ధకర్మను-భవముదప్పిపోనె॥ ని ంత॥మోక్షగుండమందు। ముదమున వెలసిన। సాక్షాన్నారాయణ। స్వామి యీరాముడు॥ యింతవారి॥

వ. వీరికిగలుగు నాపదదీర్చు నుపాయంబు మనకు-దోఁచ లేదు. జాంబవంతుడున్న దెలుపఁగలఁడు. • చూతమురమ్మని యొక్కచో నంపశయ్యమీఁద జీవచ్ఛవముగాఁబడియున్న యతనిఁగాంచి.

తో. బ్రతికియుంటివే! భల్లుకోత్తమ।పలుకఁగలవెమాతోడ। ధృతిమీఱఁగ గుర్తించినావెమముఁ। దెలుప్పుమనగ వగతోడ॥ రా॥ ఎలుగుబట్టి నిన్నిప్పుడెరిగితి-సితెకొని నాకనులు। సలువ్పగశరములు, నాటి గానఁడ-నలసతి సంగిరఘునులు॥ రా॥

వ. రామలక్ష్మణులు వానరులు నేటికిట్లులైరి. అయిన హనుమంతుఁడు జీవములతో నున్నాఁడే! యనవుడు హనుమంతుఁడు లేచి నమస్కరించి.

తో. నేహనుమంతుడ। నీదయచేతను। నేటికిమయున్నాడ। సాహసమున నే। సలుపఁడిగినపని। సెలవిమ్మనధృతితోడ॥ రా॥

వ. జాంబవంతుఁడు కౌఁగిలించుకొని యిట్లనుచున్నాఁడు.

జాం-కీర్తన, శంకరాభరణము, ఆదితాళము, ఔనౌనుమీ.

హనుమంత నీవుదక్క। వనచరులకుదిక్కు। ఘనముగ నెవ్వారు, గలరింక బ్రతికింప॥హను॥ పాలసముద్రము, పోలఁగదాటిన। మేలుగనటు ద్రోణ। శైలమున్నది యందు॥హను॥ సంజీవవిశల్య। సంధాన సౌవర్ణ। మంజులకరణులు। మహిమంతో నున్నవి॥ హను॥ అవిదెచ్చి యీవాన రావళి కిచ్చిన। భువిమోక్షుగుండరా, ఘనప్రమోల బ్రతికేరు॥ హను॥

వ. ఇట్లుచెప్పి ద్రోణాద్రికి మార్గంబుజెప్పిన నుప్పొంగి కుప్పించి సముద్రంబుఁదాటి శీఘ్రయానంబున క్షీరాద్రికవలనున్న ద్రోణాద్రికిఁజేరి విమర్శించినఁ గామరూపులయిన యా యౌషధములు గానరాకున్నఁ బర్వతంబుఁ బెఱికి నెత్తిని బెట్టుకొని వాయువేగంబున వచ్చుచుండిన.

గీ. ఆమహౌషధముల ♦ నందుండి వెడలెడు
గాలిసోకివాన ♦ రాళిలేచి
చచ్చియున్న రాక్షస ♦ వ్రాతములఁ బట్టి
యబ్ధిబడఁగ వైచి ♦ రతిముదమున.

వ. అంతలో హనుమంతుండు మందులకొండఁదెచ్చి వానరుల నడుమనుంచె. నప్పుడు సంధానకరణివల్ల విఱిగిన యవయవము లతుకుకొనియె. విశల్యకరణివల్ల శరీరముననాటిన యస్త్రంబు లూడిపోయె. సౌవర్ణకరణిచే శరీరములు సువర్ణకాంతిచే రంజిల్లె. సంజీవకరణిచే శోషించిన ప్రాణములకు స్ఫుటంబుగలిగె. ఇట్లు వానరుల బ్రతికించి యాంజనేయుండు.

తో. సరగ రామలక్ష్మణులకు మ్రొక్కిన సంతసించి దీవించి। యురువడి గిరియెందున్నదో। యచటనె-యుంచిరమ్మనఁగమించి॥రామ॥

వ. ద్రోణాద్రి యెప్పటిచోటనుంచి వచ్చెనంత సూర్యోదయంబాయె. నప్పుడు సుగ్రీవుండు రాఘవుననుమతంబునఁ గపులనుగని.

సుగ్రీ-కీర్తన, కాఫిరాగము, ఏకతాళము, ఈశరాసనంబనా.

రావణుండు రణముజేయ। రాగజాలఁడు। లావుమీఁదలగ్గకెక్కి-లంకగాల్చుఁడు॥రావ॥అడ్డమైన దానవుల-నపుడెదుర్కొం-చుఁడు। చెడ్డకార్య

మంచిమది-జింత మానుడు॥ రావ॥ అటుల చేయకూరకున్న । నాజ్ఞగొం దును నిటులమోక్షగుండవిభుడె। యిపుడు చెప్పెను॥ రావ॥

వ. అని ఖండితంబుగా సుగ్రీవుండు పలికిన వానరులు మంచిదని సాయంకాలమువఱకు వేచియుండి. రాత్రికాలము రాఁగానే కొరుపులు సేకొని లంకకరిగి ప్రతిగృహంబును గాల్చి మసిచేసిన.

త్రో. బాలుర వృద్ధులఁబట్టి మంటలో, పల బడగా వైచుచును॥ జాలగనడ్డము, జనుదెంచినరా। క్షసులబట్టి త్రుంచుచును॥ రామ॥

వ. బహు ఘోరకృత్యంబుఁ జేసివచ్చి రణభూమిని బ్రవేసించి రంత రావణుండు కోపించి.

## కుంభనికుంభాదుల యుద్ధము.

సం-త్రో. కుంభనికుంభుల। ఘోరవిక్రములఁ। గుంభకర్ణుకొడుకు లను। గంభీరముగా। గదనమునకు దశ-కంఠుడుఁ జొమ్మనియ నెను॥ రామ॥

వ. మఱియు శోణితాక్ష, యూపాక్ష, కంపన, ప్రజంఘులను గూడ బంపిన నీయార్గురుఁ కదలి రణస్థలిఁజేరి.

దానవ వానర సంవాదము.

కీర్తన-ఆదితాళము, మాంతమ.

దా-ముదమున। మాబలముమీాదు, మదికి దెలియకనుమమ్ము। నెదురవచ్చినార మంచిది। హానరులార! గుదిమిపట్టెదము నిల్వుడి॥

రా-వదరుచు మీావలె ముందు-వచ్చిన వారొక్కరయిన। సద నములకు మరలఁ చేరిరే! దానవులారా! కదనమునఁ జావకుండిరే!

దా-వారివలె గాదు మేము। బేరుగొన్న శూరులము। బేరుమము గెలుచుధీరులు। వానరులార! దూరముగఁ బొండు మీారలు॥

వా-ధారుణిమోక్షగుండ । శ్రీరాముఁడు చూచుచుండ । మీా రూపులు నీరు జేతుము । దానవులారా! మృత్యువాత బడఁగఁ జేతుము.

వ. అని సింహనాదంబుఁ జేసి యార్చిపేర్చి రాక్షసుల లక్ష్యపెట్టక విజృంభించి క్షణమాత్రంబున నంగదుండు కంపనుని, మైందుండు ప్రజంఘయూపాక్షులను, ద్వివిదుడు శోణితాక్షుని, సుగ్రీవుండు కుంభుని, హనుమంతుండు నికుంభుని మడియించి రవ్వార్తవిని రావణుండు మక రాక్షుని బొమ్మనవాఁ డుగ్రుండయి.

## మకరాక్ష యుద్ధము.

తో. ఒక్కరథమ్మును। నెక్కియుక్కుగల। రక్కసుండుద్ధతిజూప నక్కజముగమకరాక్షుడు వెడలెను। నాజికి విధిప్రేరేప॥ రా॥

వ. ఖరాసురుని కొడుకగు మకరాక్షుండు యుద్ధభూమికి జేరి మిన్ను మన్నువగుల సింహనాద భుజాస్ఫాలనంబులుఁ జేసి యెదిరించిన వానరుల నొప్పించుచు రామమూర్తి సమీపంబునకు నరిగి.

మక-కీర్తన, త్రిశ్రజాతి-వనమూను.

రణమునుజేయుమిపుడు। రఘురామ। నాంతోడగదిసి॥ రణ॥ క్షణ ములోనిన్ను। సమయించి లంకకుఁబోదు॥రణ॥ ఖరసూనుడను గనుము। రణ॥ కరాక్షుడవినుము॥ ఖర॥ పరగమాతండ్రి। పగదీర్ప నేటికిగలిగె॥ రథమకరవాలమునయిన। గదనైన విలుబూనియైన॥ గర॥ వర మోక్షు గుండ। వాసుడ యేలీలనయిన॥ రణమును॥

వ. అనిన రాముండు గోపంబు దీపింప.

తో. దబ్బరగాకుర। దైత్యాధమనా। దెబ్బతగిలినంతటను। నిబ్బరమెడలియు। దబ్బిబ్బునమా। యబ్బకడకు జనవలెను॥ రా॥

వ. అనిన,

క. మకరాక్షుఁడరిగిపటు సా। యకములుసైగాడనేయ ♦ నవి నడుమనె తె। ప్పకదునిమిచ్ఛారిరథర। థ్య కేతుచాపములఁదుంచె♦డాశరథితగన్.

వ. అప్పుడు.

క. విరథుండయి శూలముగొని। వెఱవక దనుజుండు వేయ ♦ వేగమెదానిన్। విరుగంగఁ జేయనాతఁడు। కఱకగు పిడికిటను బొడువఁ♦గానే తేరన్.

తో. అనలాస్త్రంబున-నతనియురమ్మున। నారాముడు వేయగను ననిమొన నమ్మక। రాక్షసుడు దెళ్లెను। నమరులెల్లఁ జెలగఁగను॥ రా॥

వ. అంత సూర్యోదయంబాయె. మకరాక్షుని మరణవార్త రావణుండు విని దుఃఖకోపంబులు తననుముంప నింద్రజిత్తును బిలిచి యిట్లనియె.

రావ-కీర్తన, కేదారగౌళ-ఆదితాళము.

కుమారకా! వినరా! అయ్యో!విమర్శగనునే-వివరించెదనో॥కు॥ అతికాయుడు మొదలైనవీరులు। ధృతిగూలిరి యుద్ధములోన। గతి నీవె! యిఁక। గదనము జేయఁగ॥కుమా॥సురలనుదరిమిన జోదువునీకీ। నగరులగెలుచు టెంతపనియరా। దురమునందునీ-తోసరిగలరా॥ కుమా॥ మోక్షగుండరాముని లక్ష్మణుని। లక్షింపుచుఁ గెల్వగనీవు। ఈక్షణమునరథ, మెక్కికదులుము॥ కుమారకా॥

ఇంద్రజిత్తు మూడవసారి యుద్ధము.

వ. అని వీడ్కొలిపిన నత్యుగ్రమూర్తియై లేచి కాంచన రథారూఢుండయి.

క. అరదములరువదికోట్లును। గరులునుబదమూఁడుకోట్లు♦ కడు వడివడిచే। దురగములు నూఱుకోట్లును। వరభటు లగణితముగాగ♦ వచ్చుచునుండఁగ.

వ. మఱియు నొక్కకోటి చతుర్దంతదంతావళములు నాలుగుకోట్ల చిలుకవన్నెగల గుఱ్ఱములును బలిసి యేతేఱ నిస్సాణాది బహువిధ వాద్యంబులు మ్రోయ నుత్తరద్వారంబున వెడలి యుద్ధభూమిం బ్రవేశించి.

గీ. రథముడిగ్గిచుట్టు♦ రాక్షస దళములఁ। గాపువెట్టి యపుడు గాటినిప్పు। దెచ్చి వేదియొకటి♦ దీర్పించి యందుంచి। ప్రజ్వలింప జేసి పావకునకు.

వ. సమంత్రపూర్వకంబుగా హోమంబుఁ జేసిన నా యగ్ని లోనుండి.

సంధికీర్తన, అఠాణరాగము- ఆదితాళము.

కృత్తియవతరించెను। పెద్ద। సత్తియవతరించెను। కృత్తియనెడు పెద్దసత్తిలోకములకు। మిత్తియనగమీర। యెత్తియార్భటింపుచు॥కృ॥ చాలభయదమౌ క। పాలపాత్రయునస్థి। మాలలు భీకర క। రాలకేశము లలర॥ కృ॥ మోక్షగుండేశునిపై। గక్షగట్టినయట్టి। రాక్షసవరునకు ప్ర। త్యక్షమై పనులుసేయ॥ కృ॥

వ. ఇట్లు ప్రసన్నయయి కృత్తి యింద్రజిత్తుం గాంచి.

తో. పంపుమునన్నే - పనికైననునా । తెంపు బెంపుజూపెదను । సొంపుగననుచును - రంపులు జేయగ । చూచి సంతసింపుచును.

వ. అకృత్తినడిగి దివ్యశస్త్రాస్త్ర రథరక్ష్యంబులు గయికొని కృత్తి సహితంబుగా నంబరంబున కెగిరి కృత్తిమహత్తుచే నెవరికిం గానరాకుండ నదృశ్యుండయి.

తో. ఉగ్రబాణముల। నురువడివానర। యోధులపయిం బరపుచును। నాగ్రహమునబె। ల్లార్చుచుమెలగెను। నంబరమండలమునను॥ రా॥

వ. పిమ్మట వాని సైన్యంబును దిరిగి లంకలోనికి జనియె నక్కడ.

తో. గజుఁడుగవాక్షుఁడు। గంధమాదనుఁడు। విజయుఁడులోనగుకపులు। గజిబిజినొందుచు-గదియుచువైచిరి। కడగి గిరులువృక్షములు॥ రా॥

సంకీర్తన, సురటరాగము - ఆదితాళము.

వలీముఖులపయి। శిలీముఖంబులు। జలాయించివేసెన్। వారల। బలాయనులజేసెన్॥ వలీ॥ పటుత్వమొప్పగ। బదికోటులమర్కటోత్తములఁగూల్చెన్। గడుమిక్కుటంబుగానార్చెన్॥ వలీ॥ అనంతరమునె। మ్మనంబులనుభయ। మునన్ వడంకుచును। గపులెల్ల నిక్కిచూచుచును॥ వలీ॥ మొరోయటంచును। మోక్షగుంపతి, మరుంగునకుజనిరి, మమ్మున్ధరింపుమనియనిరి॥ వలీ॥

వ. అప్పుడు లక్ష్మణుం డన్నకు నమస్కరించి.

ఉ. రాముఁడుదేమి చూచెదరు ♦ రావణిమర్కటసేనఁదున్మిపగా
నేమనకూరకున్న మన ♦ నిచ్చనె! కార్యము తప్పివచ్చెడున్
భీమబలంబుతోనతని ♦ బిట్టుగఁదాఁకి శరాగ్నిఁ గాల్చెదన్
వేమరునాజ్ఞయిమ్మనుచు ♦ వేడినఁ దమ్మునితోడ నిట్లనెన్.

తో. వినుమిదెలక్ష్మణ! పీడసాధ్యుడగు। వనజభవుని వరముననుఘనముగఁ బ్రబలియు। గనబడకనురణ। మొనరించును నేర్పునను.

వ. కావుట్టి వీనిమీఁద బాణంబులువైచిన నాయమ్ములు చెడిపోవునుగాని నిలువవు సైరింపుమనుచుండ నగ్నిహోత్రుండు వచ్చి.

తో. కననాగ్నేయం। బనుమంత్రంబును। మనుకులజపియించుచును। ఘనబాణంబా, క్కటిప్రేసనదను-జునిబాయును కృత్తియును॥ రా॥

వ. అప్పుడు వాఁడగపడఁ నని చెప్పి యగ్నిభట్టారకుండదృశ్యుం

డయిన రాముండు శీఘ్రంబున.

గీ. అగ్నిమంత్రంబు జపియించి ♦ యంబువైవఁ । గృత్తియెడ వాసివోయినఁ ♦ దత్తఱమున। మేఘనాథుండు పుడమికి ♦ మెఱయవచ్చి। సింహనాదంబుఁ జేయుచుఁ ♦ జెలఁగియార్చె.

తో॥ వానరులప్పుడు-నడిగాదరువులు-వసుధాధరములుగొనుచు। వానిపైనబడ-వైచిరొక్కసరి। దానవ చావరయనుచు॥ రా॥ రాముఁడు నూరు శరంబులుమఱియా। రామునితమ్ముఁడుమూఁడు। భీమశరంబులు వేయఁగనన్నియు-బిండిజేసియనెవాఁడు॥ రా॥

ఇందు-కీర్తన, ఏకతాళము-పూర్వకళ్యాణి.

ఎదిరించలేరు। ఇంకఁజాలుపోరు । అదిలించలేరు। సంతటివారుగారు॥ యెది॥ అనిమిషులను। అనిగెల్చినాను। ననుగెల్వగాను। నరులౌతమానుడౌను॥ యె॥ బలవద్విరోధ। మిలజేటుగాదా! తెలియఁగలేదా! తలగగరాదవాద॥ యె॥ మురిసేరుకాండ।ములమోతుగుండ। వరు దూరుచుండ। బరపెదనుండకుండ॥ నె॥

వ. అనిపలికి చండకాండంబు లెక్కపెట్టి స్వాతిగత శుక్రుండు వర్షించిన చందంబునఁ గపిప్రవరుపై యెడములేక ప్రయోగించి నొప్పించి లక్ష్మణుని విల్లువిఱచి రామునకభిముఖుండయి యనుచున్నాఁడు.

క. నీకుసహాయమువచ్చిన। యీకపులనుగెల్చినాఁడ ♦ నింకననెన్నెటులర్ । దాఁకిజయింతువు తొలఁగుము। నాకడ్డముగలదె త్రిభువ ♦ నంబులలోనర్.

వ. అనిపలికి మఱియు ననేక సాయకంబు లందఱపయి వైచుచుఁ దాను గెలిచినట్లూహించి వేగంబున లంకకరిగి యావార్త దండ్రికిఁ దెల్పిన సంతోషించి.

రావ-కీర్తన, త్రిశ్రజాతి-ఇంగ్లీషు.

నీవంటికొడుకుండఁగ। నావారిపగదీర్పగ। నివేళకొనగూడెగా। నికమర్కజనువడిగ। నవనిలో। నీవిక్రమముసరగ। కీవిగుల్కగ। దేవపాళి-బెదరిచూడఁగ। జూపిరమ్మిక॥ నీవంటి॥ శ్రీమోతుగుండవిభుని। రాముని లక్ష్మణుని। నామర్కటులనుబూని। యందున్నసోదరుని। ధరణి। మోమా॥ లటమునుమాని। తామసంబునఁ। దలలుద్రుంచి వేసిరమ్మిక। సీతయబ్బును॥ నీ

వ. అనిన దాశరథికిఁ బీడ్కొని మహోత్సాహంబునఁ బురోహిత యుతంబుగా రణభూమిఁ జేరి యొక్క హోమంబుఁ జేసి హోమాంతంబున నగ్నిదేవుని సహాయంబువలన నాలుగుగుఱ్ఱముల రథమును నమోఘాస్త్రంబులుఁ గైకొని.

—* ఇంద్రజిత్తు నాల్గవయుద్ధము. *—

క. రథమెక్కి యాతడంబర । పథమునకును నెగిరి కానఁ ♦ బడక యొకపుడున్ । వధియించుచు సాయకముల । వ్యథనొందఁగ జేయుచును భ ♦ యంకరుడగుచున్.

దక్షిణదిక్కునకువచ్చి యిట్లనుచున్నాఁడు.

౩౦-కీర్తన, ఆదితాళము, శివనువా.

రణమొనరింపుము । రామా రామా। రయమునగూల్చెద, రమ్మా రామా॥ అణుమాత్రంబున । నసురులమ్రించిన । రణశూరుడవుగా । రామా రామా! ॥రణమొ॥ కోతులబలగము । గూడివచ్చితివి।యాతుధానులకు మేతగు రామా! ॥రణ॥ మోక్షగుండవర। ముఖ్యంబగునీ। వీక్షితి నన్ను జయింపుము రామా ! ॥రణ॥

వ. అని పలికి.

తో. పడమటిదిక్కున । బలికెనువిూరె, క్కడ బోనురుదిక్కున ను । కనుపడిజిక్కితి । రెడపకమిమ్ముజ। క్కడతు లేను నాకెదురు ॥రామ॥

వ. అని కొన్ని బాణంబులువైచి యింతలో.

తో. ఉత్తరదిక్కున। గురికిపలికెమి, మ్ముక్కడించి విూదటను। ఉత్తదియనకు డ-యోధ్యకుజనమిా। కున్న వారిజాపెదను॥ రా॥

వ. అని కొన్నిశరంబులు పఱపి వారినేమరించి తూర్పుదిక్కున కరిగి.

తో. మదినివిభీషణు। మాటలునమ్మియు। మరియేటికి జెడియెదరు పొదలుచువిూరి, ప్పుడెయొటకఁగినను । బోయినమనియుండెదరు॥ రా॥

వ. ఈప్రకారంబుగ జతుర్దిక్కులయందుఁ దిరిగి ప్రగల్భంబు లాడుచు నదృశ్యంబుగా బహుబాణంబులు ప్రయోగించి వానరుల నశింపజేయుచుండినఁ గాంచి కోపించి లక్ష్మణుండు రాముసకిట్లనియె.

ల-కీర్తన కేదార, రూపకతాళము, సాటి.

వీరిపైన-గోపమ్ము। రాని హేతు। వేమొ! రఘుకులవర ! వీని॥ వానరాళినెల్ల బొలియుంచగ। దీనతతో। నీనామము-నేదలతురు॥ వీని॥ మేనులు దాచకవీరు। నీనిమిత్త, మింత-పనిచేయగ। దానవపు। వాత, దగ ద్రోయగ। నౌనెయిది। మానవపతులకు ధర్మమె॥ వీని॥ దాడిగ మధ్యం దిన। చండకిరణు, రీతి-వడిజూపుచు। నుండువీని ॥ మోక్ష, గుండాధిప। కండలుగా। జెండగినాకు- సెలవ్వసగుము॥ వీని॥

వ. అనిన శ్రీరాండిట్లనియె.

చ. కనఁబడకుండయుద్ధమును ♦ గ్రక్కున వీఁడొనరింపవీనికై
కినిసిన లోకముల్ చెడవె ♦ గీష్పతిరుద్రసురారులైన సి
తనిజెనకంగఁ జాలరటుఁ ♦ దాఁగొనినాఁడు వరంబుబ్రహ్మచేఁ
గనుకసహించినాఁడనికఁ ♦ గాతునె! కాలముఁగూడివచ్చెడిన్.

తో. నేనల్గినయెడ - వీనిప్రతాపము । నీరుగఁజేయ నెవినుమా! మానుగహరబ్రహ్మాదులుగాచిన । నైనవిడుతునే! కనుమా॥ రా॥

వ. అనిపలికిన రామునకుఁ గలిగినయాగ్రహంబు వాఁడెఱిఁగి యుద్ధంబుఁజేయఁజాలక లంకలోనికిఁజని తండ్రితో నిట్లనియె.

క. కట్టల్కతోడ నేఁజని। మట్టితిఁగపికోటినెల్ల ♦ మనుకులవరులన్। ధట్టించిమానములుగొని। నెట్టినఁజనుదెంచితి నిట ♦ నీకెరిగింపన్.

వ. అని యధికప్రసంగంబుఁ జేసిన నింద్రజిత్తుపై రావణుండు గోపించి.

శావ-కీర్తన, జంఝూటి, అటతాళము.

ఇదియేమిటిపోక। యిదియేమిరాక। యదరియె తెంచియిట్లాడెదు గాక॥యిక॥ పగవారినెదరించ। పగఁజేతగాక। మగటిమి జెప్పెదు। మతి సిగ్గులేక॥ యి॥ దిక్కులజయించి, తిరిగియీదినము, దక్కక నరులకు, డాగుటే! ఘనము॥యిది॥ మోక్షగుండేశు ద, య్యునితోడబట్టి। శిక్షింపకికనన్ను। జేరకుపట్టి॥ యి॥

వ. అనిన మంచిదని వాఁడు సీతవంటి యాకృతిగల నాతినొక తెను దన మాయచేత నిర్మించి రథంబుపయిన నుంచుకొని పడమటి దెసను వచ్చుచుండె నప్పుడు.

## ఇంద్రజిత్తు పంచమయుద్ధము.

క. ఏతట్టువచ్చునో! యని। నాతని దశదిక్కులందు ♦ నరయుచుఁ గపులుర్। భీతాత్ములగుచునుండఁగ। నాతఁడువాతూల తనయుఁ ♦ డదిశిఖరముఁ.

వ. నెత్తిన మోచుకొని పడమటిదిక్కుగాఁ బోవుచు.

తో. అరదముపై మా-యాసీతనుగని-యకటా! పాపాత్ముండు-ధరణిజదెచ్చెను। దానెటుచేయునో! తగవిధికృతమగుజుండు॥ రా॥

వ. దైవమా! యిట్టిదీనదశఁజూడఁగలిగె-నయ్యో! వీనినేమిచేయుదు. నెటులనోర్తుఁనని కపికోటులఁ గూర్చుకొని యట్టహాసంబునఁ బయికడరిన హనుమంతునితో నింద్రజిత్తు పలుకుచున్నాఁడు.

తో. ఏటికివచ్చెద। వీసేనలతో। నిదిగో! సీతనుగనరా! ధాటిగనీసతి, తలదరిగెద ము, వ్గ్మాటికి నిజమికజనరా! ॥రా॥

వ. ఈసీతకొఱకేకదా! మీరింతశ్రమించుట మీశ్రమ నివారించితిఁబోరా! వాయుకుమారా! అనిన నాంజనేయుండిట్లనియె.

తో. దనుజుఁడ నయినను। ధరణి విశ్రవసు। మనుమఁడవగు నీకు దగునా! మునుకొనిసీతను। ముందలబట్టుక। ఘనముగనీడువనగునా!॥ రా॥

వ. అనిపలుకుచుండ వాఁడత్యుగ్రకర్మమునకు లోఁబడి.

క. మాయాసీతనుబట్టుక। కో యనియార్చిననువిడక ♦ కోపముతోఁడఁ। ఆమెడఁగరవాలంబునఁ। బాయకఁ దలదిరిగియతఁడు♦పలికెన్ గడిమిఁ.

ఇం-కీర్తన, రూపకము, వేటాడు.

ఇం కేటికిరా! రణము। యిం॥ పంకజగంధినిసీతను। బట్టుకగరవాలంబున। శంకింపక దలద్రుంచితి। బింకంబులుబొంకంబులు॥ నిం కే॥ ఈ జానకికొఱకేగద!యాజికిమీరేతెంచుట। మీజాడలు నాముందఱగాజాలవు॥ యిం కే॥ ఈసంగతి మోక్షుగుండ। వాసునితో నెఱిగించియు, నాసలుడిగి పొండుండిన। రోషంబునమోసంబగు॥నిం కేటికిరా॥

ద్విపద. వాఁడిట్లుపలికిన-వాయుసుతుండు। పోడిమిచెడిదుఃఖ, పూరితుండగుచు। వనచరులార దైవ, వముదప్పదీసె। మనయుద్యమా బేడి, మఱిసాగదయ్యె, నేమఱియుండకుఁ-డీతనిమీరు। రాముని కీవార్త -

రయమునఁజెప్పి । యమ్మహనీయుని-యాజ్ఞానుసరణి॥ నెమ్మదితోవత్తు, నేఁడంచుఁగదిలి । పోయెనాపిదప ను, ప్పొంగుచుదనుజ । నాయక సుతుఁడుమ, నంబునఁదలఁచె.

క. ఇక్కడహనుమంతుడు లేఁ। డొక్కంపును జెరుప లేరు♦ హెూమమొనర్తు౯ । గ్రక్కునననుచుని కుంభిళ । దిక్కునకరుదెంచి యతఁడు దృఢనిశ్చయుఁడై.

తొ॰. కల్లుబాలుర, క్తంబు దేన ఱెం, కాయలు గంధసుమములు । బల్లులు బిల్లులు-బాములు మొదలుగ । బహుమృగాళిమాంసములు॥ రా॥

వ. అమితంబుగా దెప్పించి కాత్యాయనీదేవిని నిలిపి పై వస్తువులచే మంత్ర పూర్వకంబుగా నగ్నియందు హోమంబుఁ జేసె తనుపుచుండె. నిక్కడ హనుమంతుండు శోకాతురుండగుచు వచ్చి రాఘవునకు నమస్కరించి యిట్లనుచున్నాఁడు.

హ॥ కీర్తన॥ ఆదితాళము॥ ఫీల్ రాగము॥ గురుమహ.

మనుకులవర్యా! మనుకులవర్యా! మనకార్యముజెడె॥ మనుకులవ॥రామ!మీరామను। రావణిదెచ్చియు। గోమలిశిరమును। గోసినాడ కట!॥ మనుకుల॥ ఒప్పగనందర। ముండియుసీతను। దప్పించగ శ । క్తత లేదాయెను॥ మ॥ తక్కకసీసిన। దాకగ్గాపాడియు। నక్కకిచ్చిన-చం,దంబుగనాయెను॥ మ॥ మోతుగుండాధిప। ముందుగమీకును। నీక్షణమున దెల్ప-నే తెంచితిని॥ మనుకుల॥

వ. అని వచించిన హనుమంతుని పలుకులు ములుకులై చెవిసోఁకిన నిశ్చేష్టితుండై॥

క. జనకజనుమదిని దలఁచుచుఁ। బెనుగాలిని నేలఁగూలు♦వృక్షమురీతిః। ఇనకులుఁడుమూర్ఛనొందినఁ। గనివగచిరిచుట్టునున్న♦కపిపుంగవులు౯.

వ. అప్పుడు.

తొ॥ కన్నీరేరుగ। గారగలక్ష్మణు, డన్నకడకుదానరిగి । పన్నుగనూరుల। పయికిజేర్చుకొని। మన్నుదుడిచి మదిగరగి॥ రా॥

ల॥ కీర్తన॥ ముఖారి॥ అటతాళము.

అకటా! రఘువీరా! జానకికింత। యడలవలసెనారా॥ ప్రకటముగ దశకంఠుగూల్పఁగ। రాజ్యమును విడనాడివచ్చితి। మొకటిమనమెంచినను దైవంబొకటి నెంచెను విధికృతంబగు॥ నకటా॥ రణశూరుడగునీవు, గలిగియుద్ధ। రాకుమారికిజావు। క్షణములోపలవచ్చెనీ శో। కమునకెయ్యది మేర! సుర రక్ష ణమునకు జనియించితిమిమో। క్షపురనాథ। యదెట్లు జేసెద॥ మకటా!॥

తో. జానకిమరణము- సైచజాలనే। శరవహ్నుల ముంచెదను। దానవులను లం। కా నగరంబును దగ్ధము గావించెదను॥ రా॥

వ. అని లక్ష్మణుండు శోకింపుచుఁ బలుకు పలుకులువిని విభీషణుండిట్లనియె.

తో. ఎక్కడిమాటలు - ఇంద్రజిత్తుదా। నిక్కడ గపటముచేత। గ్రిక్కునసీతను, గావించియుమఱి, చక్కానెను గసిచేత॥ రా॥

వ. ఇందులకు వగవవలదు. నేనురామునకు సీత నిమ్మనిచెప్పిన విననిరావణుండు కొడుకు సీతనుజంపఁబోయిన జంపనిచ్చునా! అమ్మహాపతివ్రతచచ్చిన లోకంబులు నిలిచియుండునా! నేనునిజమునాంచివచ్చెదనని చెప్పి యింతలో రాముండు మూర్ఛఁదేరియున్న.

గీ. రామునాజ్ఞనుగైకొని ♦ భ్రమరమగుచు। రావణోద్యాన। వనముఁజే ♦ రంగబోయి। శింశుపయుక్రింద నున్నట్టిసీతగాంచి। మరలి యేతెంచి తెలిపెను ♦ మనుకులులకు.

వ. ఇట్లుసీతాదేవి క్షేమవార్త రామలక్ష్మణులకుఁ దెలిపి విభీషణుండిట్లనుచున్నాఁడు.

తో. రామనికుంభిళ, హోమముజేసె శె, రంబులురథమునుబడయ। దామదియొంచియు। దరుచరు లదియెం, తయుఁజెరుతురో! యని తెలియ॥ రా॥

వ. ఇంద్రజిత్తుకపటంబున నదియొక సందడిచేసియందఱు నిర్విణ్ణులయి యుండ నెమ్మదిగా నికుంభిళకుఁ బోయి హోమంబుఁ జేయుచున్నాఁడు.

క. హోమముసాంగంబయినను। నామేటిని గెలువలేరు ♦ హరిహరులయినన్ । ధీమతితోఁగపియుతముగ । సౌమిత్రిసిబంపుమతనిఁ ♦ జంపుటకొఱకై.

వ. పదునాలుగుసంవత్సరములు నిద్రాహారములు వర్జించినవానిచేఁ జచ్చునట్లతనికి వరమున్నది. అట్టి వ్రతమునలక్ష్మణుండాచరించి యున్నవాఁడు గావునవానింజంపును. వాఁడుమడిసిన రావణుడును జచ్చినట్లుగా తలంచుఁ డనిన రాముం డాశ్చర్య చిత్తుండై లక్ష్మణునిఁ జూచి.

రా-కీర్తన, త్రిశ్రిజాతి, జంఝూటి, ఏక్వాదు.

సౌమిత్రియికను లెమ్ము । సమరముజేయబొమ్ము। ఆమేఘనాథుగమ్ము । అమ్ములబడగుర్రిమ్ము । గెలిచి । క్షేమముగను జేరుము । వాని। హోమము విఘ్నము జేయుము। ఆజిలో। మోమోట ముడుగుము॥సౌ॥ మదిమోతుగుండవిభుని। మరువక దలచుకొని । పద జయమయ్యెడిని। భల్లూక వల్లభుని। వేగ । బవమాన వరపుత్రుని । వెంట, బదిలముగాగొల్చి రమ్మని । ప్రీతితో । ధనురస్త్రములబూని ॥సౌమిత్రి॥

వ. అని యిట్లు తెలిపి సముద్రుండిచ్చిన వజ్రకవచంబును ఖడ్గంబును ధనుర్బాణంబులును నిచ్చి దీవించిపంపిన రామునకు నమస్కరించి జాంబవంతుండు కోట్లకొలఁది భల్లూకంబులతోడ వెడలి వెంటరాఁగ విభీషణ యుతంబుగా హనుమంతుని నారోహించి యిరువంకల గపిసేనలు గలిసి యేతేరఁ గదిలి.

తో. ముప్పదియోజన, ముల దూరంబున-నొప్పు నికుంభిళకేగి। గొప్పబలంబులు - గోట్లర్బుదములు । గూడిచుట్టుననుమూగి ॥రామ॥

వ. సందడిలేక నిస్తరంగ సముద్రంబుబోలె నలరుచున్న మేఘనాథునిసేనలంగాంచి లక్ష్మణుడాశ్చర్యంబు నొందె నప్పుడు విభీషణుండు.

వి-కీర్తన, అటతాళము, గౌళబంగా.

చూడుమా సేనల। రామానుజ ! చూడు॥ ఏడజూచినగాని। యెడమసందు లేదు ॥చూడు। సేనలద్రుంచిన, గాని లేవదు వాడు॥చూ॥ హోమవిఘ్నము జేయ-నురుబలములబంపు ॥చూడు॥ బాణపరంపర-బఱపి చంపుము వాని ॥జూడు॥ మోతుగుండేశుని । ముద్దుల-తమ్ముడ ॥చూడు॥

వ. అనిన నప్పుడు లక్ష్మణుండు రాక్షసదళంబుల రూక్షేక్షణంబుల వీక్షించి బ్రహ్మాండమదరునట్లు జ్యానినదంబుఁ జేసి శరవర్షణంబులు గురిపించుచుండిన నలిగి.

తో. రాక్షససేనలు - నాక్షణమున నా । రామసోదరునిగదిసి । యక్షీణంబుగ । నలజడిబెట్టిరి । యాంబులు బెక్కులువేసి ॥రామ॥

వ. అదిగని మహాగ్రహ సమగ్రులై.

క. భల్లూకవరులుమర్కట। వల్లభులును గిరులు దరులు ♦ వడివైచుచురం। జిల్లగరాక్షససేనల। నెల్లనుభంజింపుచుండి♦ రెంతయుదెగువన్.

వ. లక్ష్మణుండును బాణప్రయోగంబుల ననేకుల మడియింపుచుండ దదీయ్యాటోపంబునకు సైరింపనోపక రక్కసులుర్కుచెడిహోమంబుచేయు నింద్రజిత్తు మఱుఁగునకుజని బహువిధంబుల మొఱపెట్టుకొనిన నప్పుడు.

క. ఇన్నాటపదియునాహుతు । లున్నతమతివేల్వవలసి ♦ యుండియునందుర్ । బన్నగనునూటతొమ్మిది। యెన్నికతో వేల్చియుండ♦ నింతటిలోనన్.

క. దనుజులు హాహారవములఁ । దనమరుగునఁ జేరుటయును ♦ దరుచరులెల్లన్ । వెనుకొని తరుముచువచ్చుట । యునుగని సవనంబుమాని ♦ యుగ్రుండగుచున్.

గీ. చేతబట్టినయాహుత్తుల్ ♦ క్షితినివైచి । రథముపైనెక్కి చాపశ ♦ రంబులూని। దండధరుడునుబోలె ను ♦ ద్దండుడగుచు। బాణములువేసితోలెను ♦ వానరులను.

వ. ఇట్లతండు వానరుల నొప్పించుచుండిన విభీషణుండు లక్ష్మణునిజూచి యిట్లనియె.

విభీ-కీర్తన, కాంభోజి, అటతాళము, నిన్నునమ్మి.

దానవుని చేత-గానవచ్చెగదా! వానరులగెల్చి । వచ్చును గ్రమ్మర ॥దాన॥ మానుగనామఱ్ఱి, మానుక్రింద హోమ, మానందముగ జేయ, బూనునుసత్యము॥దా॥ హోమసాంగమైన । నామేటిగెల్వను । త్రిమాదులయినను । దామోపజాలరు॥దా॥ దండిగ శ్రీమోక్షగుండేశు సోదర, చెండుము వాడింక । జేరకమునుపే ! ॥దాన॥

వ. అనియిట్లు ప్రేరేప లక్ష్మణుండతివేగంబున వానరుల గసిమసంగు నింద్రజిత్తునకు నభిముఖుండయిచని యంభోధర సమాన గంభీర వాక్యంబుల నిట్లనియె.

తో. మాయలుచేసిన। మాటిక్రియ లేమర । మగవాఁడవు నీవయిన । నాయెదుటికి డి, న్నగ జేరియు గద । నముజేయుమురబిరాన॥ రా॥ ఆలములో నీ-సందఱుఁజూడఁగ। నసురాధమ నినుజంపి । చాలగనిప్పుడె। జయముగొందునిను। గాలునిపోలుకుబంపి॥

వ. అనిన వాఁడదరిపడి యిట్లనుచున్నాఁడు.

ఇం-కీర్తన, కళ్యాణి, రూపకము.

అంతవాఁడవా। నా, యంతవాని, శోడ । ననిసలిపెదు ॥నంత॥ అంతకాభుఁడంచునన్ను। గాంతురాశా కాంతులుగ । వింతగా నిసుంత లేవు। పంతగించివచ్చి। బెదరించెదు ॥నంత॥ మున్ను నాగపాశములనిన్ను గట్టివచ్చితిగ। నన్నునింతలోనే మరచి। నావెమాన, వుండ । ననుమాలొ్కను ॥నంత॥ మోక్షగుండవాసుశిత-మ్మ్ముండనయిననేమిసి । న్నీక్షణమ్మ్మశిక్షజేతు । రాక్షసాళి-పైన । వడిజూపెదు॥ నంత॥

వ. అని రోషకషాయితాక్షుండయి విభీషణుని గని యిట్లనియె.

తో. పిన్నతండ్రివని। నిన్నుఁజూడఁదగ । దన్నిటరోఁతివీవు । బన్నగశత్రుల, పంచగాచుకొని । తిన్నగఁబడియున్నావు॥ రా॥ ధర్మహీనమా, మర్మంబులు శా । త్రవులకుఁ బ్రచురించితివి। దుర్మతి స్వకుల। ద్రోహముజేయగ । గూర్మిలోఁడఁదలచితివి॥ రా॥

వ. ఎంత నీచుండయినను నెంత మాటవచ్చినను బంధువుల విడనాడి పగవారి శరణుజొచ్చువారు గలరా! నీసహాయంబుచేతనే! రావణుండు దేవతలగెలిచెనా! ఇప్పుడు నీవుతలఁగిన మాకులోపమా! యని తూలనాడినఁ గలుషించి విభీషణుం డనుచున్నాఁడు.

విభీ-కీర్తన, దర్బారురాగము, రూపకము, వీరినం.

మీమేలు। చాల్ చాలు । నాముందరబలుకకునిలు। మీమేలు॥ నామాటలువినరై తిరి,యీమాన్కి-ని- మీమూర్ఖమె-మిము జెరచెను॥ మీ॥ నోరున్నదనుచుజాల। దూరకుదుశ్చారిత్రుల। గూరిమిబంధువులైనను। సారజ్ఞులు। దూరముగాదోలగందగు॥మీ॥ నీతండ్రియునునీవు। నీతి

లేనినీవారలు। బాతకవినుమోతుగుండ । నేతచేత। భూతలమునఁ బొలిఁ యఁగలరు॥ మీామేలు॥

వ. అని విభీషణుండు పలికిన నతండు ప్రళయకాల రుద్రునిభం గి రౌద్రాకారుండయి హనుమంతునిపయి నెక్కివచ్చుచున్న లక్ష్మణుని దిక్కుఁ దనరథంబు బోనిచ్చి పలుకుచున్నాఁడు.

పంచచా. వనాంతరంబులందునుండి ♦ వంటకంబుగాన కే। ఘనం బుగాఁగృశించినావు ♦ గానమానవాధమా!ఘనాంగులన్ మముఁ జయిం పఁ ♦ గాఁదరంబెఁ యోనదీ । ర నాజిమానిలేచిపొమ్ము ♦ రాముఁ జే రనుర్వడిన్.

వ. అటులపోక నెదిరించితివేని వినుము.

తో. పటువిశిఖంబుల పాలుజేసినిను । బడద్రోతునుభూస్థలిని । గటకటపడి రా, ఘవుఁడు బడీననిను। గనునటు జేతునులలిని॥ రా॥

వ. అనిన లక్ష్మణుండిట్లనియె.

పంచచా. అలంచనిర్జరాళిఁ దోలి ♦ నట్టుఁగాదు నిల్చి దో । ర్బ లంబుచూపునిన్ను నీవె ♦ ప్రస్తుతించుకొంటచే। ఫలంబులేదు నాదుబా ణ♦పంక్తికోర్చినిల్చినన్ । బలాబలంబు తెల్లగాన♦వచ్చు జూచువారికిన్.

వ. అనిన వాఁడు రోషించి.

ఇంద్రజిత్తు లక్ష్మణ సంవాదము.

౩౦-కీర్తన, ఝంఝుటి, రూపకము.

వచ్చెనునాబాణముల। వాడిజూడుమా!॥వచ్చె॥ చెచ్చెరనీరొమ్ము వియగ-గ్రుచ్చునులో । జొచ్చును మెర । మెచ్చులుగా । విచ్చలుగను॥ వచ్చె॥

వ. అని పెక్కుసాయకమ్ములెక్కువెట్టి పుంఖానుపుంఖంబుగా లక్ష్మణుని ముంచి యార్చిన నతండు లక్ష్యపెట్టక.

౩౧-కీర్తన, ఝంఝుటి, రూపకము.

ముచ్చిలియీవరకుబోతి-మూడుసాములు। వచ్చితివీసారిమిడుతో। జిచ్చునబడి-చచ్చినగతి-జచ్చెదవిపు-డిచ్చటనే॥ ముచ్చి॥

వ. అని పలికి యాశరంబులు తననిశిత సాయకమ్ములచే రూపుమాపిన వాఁడు గ్రూరనారాచంబులు దొడిగి.

౩౦-కీర్తన, జం, రూపకము.

వక్షములక్షించినాను - వ్రియ్యాలయ్యొ హర్ | ఈక్షితిబ్రతుకంగ దరమె! యక్షయరణ! దక్షునిగా! సీక్షణమున-వీక్షింపుము॥ వచ్చెనునాబా॥

వ. లక్ష్మణునియురంబు గుఱిజూచివైచిన నవి దునిమివైచి సౌమిత్రికోపోద్రేకంబున భయంకరమగు నొక్క బాణంబుం గార్ముకం బున నెక్కువెట్టి.

౮-కీర్తన, జంఝూటి, రూపకము.

మోక్షగుండ దేవ్రసిక-టాక్షమున్నను | దీక్షతో ఏబాణమునబ, రీక్షగనో! రాక్షసప్ర, త్యక్షంబుగ| శిక్షించెద॥ పుత్రిచ్ఛిలియా॥

వ. అని యాకర్ణాంతముం దిగిచివైచినం నాయేటునకు రాక్ష సుండు మూర్ఛిల్లి మరలలేచి యెదిరించినం గాలూన నియ్యకుండ లక్ష్మ ణుండు బాణంబులు వేయుచుండం దనమనంబున.

తో. అబ్బా! దేవత, లందరిగెల్చితి| నాయాసము లేదాయె! గొ బ్బుననరుచే| గూలుకాల మొన | గూడెనేమొ నడిబోయె ॥రామ॥

వ. పరాక్రమవంతులగు దానవులందఱు వీరిచేత మడిసిరి. నేను బ్రదికి ప్రయోజనమేమి. శరీరమును దాఁచక యుద్ధంబుఁ జేయుదమని యెంచి భూకంపంబు గలుగఁగ సింహనాదంబుఁ జేసి.

తో. పిన్నతండ్రిపై-గొన్ని బాణములు-భీకరముగ లక్ష్మణుని|గొ న్నిబాణములు| గురుతుగవాయుజు| గొన్నిబాణములు వడిసి॥ రా॥

వ. వేసినొప్పించిన రోషించి విభీషణుండు.

తో. విల్లుగుణధ్వని-వేగచేసిపటు-విశిఖంబులు సంధించి| కొల్లగ నగ్రజు-కొడుకుమేనిపై| గోపంబునద్రాముంచి॥ రామ॥

వ. మఱియు ననేకమార్గణంబులు రాక్షసానీకంబుపై వైచి బాధింపుచు వానరసేనలంగాంచి విభీషణుం డిట్లనియె.

౯-కీర్తన, ఆదితాళము-బేహాగ్, పోనివ్వ.

మీరు| దగ్గకదగ్గక|గమ్ముపు॥ మీరుదగ్గ॥ నిగ్గుగ బగవారిమూక మొగ్గివచ్చెలగ్గకెక్కి॥ త॥ దీక్షలక్ష్మణునిచేత|| నీక్షణమె చంపించెద | రాక్షసమూకల మీరు శిక్షింపుడు పిమ్మటను| మోక్షగుండవాసునిచే రక్షోవిభుడీల్గినట్టు॥ తగ్గక॥

వ. అని కవియించిన మహత్తర రోషాయత్తచిత్తులై జాంబవంతాదివీరులు పర్వత వృక్షాదులచేత మోదుచు.

అర్థకందము. వ్రేటుకువ్రేటుకురాక్షస। కోటులఁబెక్కండ్రిన వని ♦ గూల్చిరికడిమిన్॥

వ. ఇంతలో హనుమంతుండు లక్ష్మణుని దించివచ్చి రాక్షసుల పైబడి.

అర్థకందము. వాటుకువాటుకునొక్కొక। మాటసురుల బెక్కుమంది ♦ మహిపయిఁగూల్చెన్.

వ. ఇట్లుపోరు ఘోరంబయిన సహింపలేక ఇంద్రజిత్తుప్రతాపంబిగురొత్త విభీషణుండు లోనగువీరులపయి దారుణాస్త్రంబులు వేయుచుండఁగని లక్ష్మణుండు గోపించి యాంజనేయునెక్కి యొక్క యర్ధచంద్రబాణంబున.

తో॰. సారథిగూల్చిన-సారథికమురా। క్షసుఁడుండా నెసల్పుచును। బోరొనరింప గ-పులుగొందరువాని-తేరుహరులఁగూర్పగను॥ రా॥

వ. విరథుండయ్యువాఁడు వడిచెడక సింహనాదంబుసేసి.

తో॰. అడరుచునాగ్నే - యాస్త్రము వింటను- దొడగి విభీషణు వ్రేయ నడుమవరుణ బాణమునలక్ష్మణుడు। నరికితుంపులుగజేయ॥ రా॥

వ. రాక్షసుండు లక్ష్మణునకు నభిముఖుండయ్యె నప్పుడు.

సం-కీర్తన, అటతాళము-భైరవి-నమిూలాంవాం.

వారు బ్రయోగసం, హారములతోఁబోర। బోరు ఘోరంబాయెను। శూరుడురావణ। సుతుడుమోక్షుగుండే, శుని ప్రియసోదరుడు॥ జూడజూడ॥ వా॥ ఘననాగశరమురా - వణివేయసౌమిత్రి। గరుడాస్త్రమున దుంచెను। ధనదాస్త్రమువాఁడు। ద్ధతివేయలక్ష్మణుడును యామ్యమునద్రుంచెను। జూడజూడ ॥ వారు॥ అరసివాయువ్యాస్త్ర। మతడేయ సౌమిత్రి। మైంద్రాస్త్రమునఁద్రుంచెను। సురవైరిగంధర్వ। శరమేయ రామాను, జుడురౌద్రమునఁద్రుంచెను। చూడచూడ॥ వారు॥

వ. ఇట్లు గొంతవరకుఁ బోరిన పిమ్మట లక్ష్మణుండింక వీనిఁ బరిమార్చుట కర్తవ్యంబని యెంచి దిశాభాగంబులువగులఁ గార్ముకజ్యానాదంబొనర్చి యుగ్రదృష్టిచేత నింద్రజిత్తు నీక్షించి.

## ఇంద్రజిత్తు మరణము.

తో. ఇంద్రాస్త్రంబును-వింటదొడగిరాము। చంద్రుడు ధార్మికు డైన। నింద్రాదులకిది। హితవైననునా యిలసుతపతి హితమైన॥రా॥ ఈయస్త్రముజని। యింద్రజిత్తుతల, యిలగూల్చునుగాకనుచు। నాయెడ నాక, న్నాంతముదిగిచిర। యంబున వేయగనలుచు॥రా॥ ప్రళయకాలవై శ్వానరుగతి దా। బ్రబలుచునదియేతెంచెన్। వలనొసిమంశికుం-డలయుత ముగరా-వణిమస్తకమును దుంచెన్॥ రా॥

వ. అప్పుడు.

క. తుంబురులు పాడిరచ్చర। లంబరమున నిలిచి వేడ్క-♦ నాడిరి సుమవ। ర్షంబులు గురిపించిరిమో। దంబున లక్ష్మణుపైన ♦ దగ నిర్జరుల్.

వ. ఇంద్రజిత్తుమరణంబుగాంచి లక్ష్మణుండు శంఖంబు పూరించి సింహనాదంబు జేసెనప్పుడు విభీషణుండు లక్ష్మణుని గౌగలించుకొని యగ్గించె. వానరులు జయజయశబ్దంబులు బొగడిరి. తరువాతరాము డున్నయెడకందఱుం జేరి మ్రొక్కిన నింద్రజిత్తు మరణవార్త రాముండు విని సంతోషించుచు.

రాముని-కీర్తన, ఆదితాళము.

భయముదొలగెను। మనకు, జయముగల్గెను। రయమునసాయింద్ర జిత్తురణమున దెగెను॥ భయ॥ కొడుకులీల్గిరి। హితులు, గూలిపోయిరి। కడకురావణుండునచ్చు-గదనమునకును॥భయ॥ శిక్షబూనెద। వాని,శిక్ష జేసెద మోక్షగుండమందువెలసి॥ మోదమందెద॥ భయ॥

వ. అనిపలుకుచు బహుభంగుల దమ్ముసిశ్లాఘించె ననంతరంబు.

ద్వి. ఇంద్రజిత్తిటువలె-నిలగూలుటయును, దంద్రనొందుచులేచి దానవభటులు, దరుచరుల్ దమ్మును, దగ్గులైదరుమ, బహువడినురుకుచు బలహీనులగుచు। గొందరుపారికిరి - గొండలపంక్తి। గొందరుదూరిరి-గుహలలోపలికి। గొందఱువనధిలో-గొబ్బునబడిరి। గొ దఱులంకగ్ర-క్కునఁబ్రవేశించి। వదనంబులనుదీన - భావంబుదోప, బదములగడు ద్రొట్రు-పాటుజనింప। రావణుకొలువుచే-రగవచ్చిమ్రొక్కి। దేవపరాకు తా-దిగ్విజయంబు। చేసినమనయింద్ర, జిత్తుయుద్ధంబు। చేసిరామానుజు,

చేతనుగూలె। నని తెల్పనాలించి, యధికశోకమున। మునిఁగి కొండొక సేపు-మూర్ఛిల్లి తెలిసి.

రావణ-కీర్తన, హిం-తోడి-అటతాళము, దేహికే.

హాకుమార ! గుణాకరా ! వీర। హాకదనపటుభీకరా! నాకుది క్కికనెవరురా। యీశోకమార్పగజాలరా॥ హా ॥ గరుడ ఖేచరకిన్నరా ప్సర । సురగణంబులగెలిచిన । వరబలంబేమాయెనో ! యొక-నరుని చే బడుటాయెనా॥ హా ॥ మోక్షగుండపు కీశుని వెను - ముట్టిచంపు మనను కొనీ। యీక్షణంబున బాపితినది। యాతపోయెను జెసితిని॥ హాకుమార॥

తేవారము. కొడుకు లందరిని బాసికడ నిన్నుజూచి। మొదల బ్రాణములునిలిచియున్నవిపుడీప్రు బోలిసి। తిమములకు నేనుఁగోగితికను బ్రతికేమిసాగి। చెడెను నాకీర్తియెల్ల, జిక్కితినినరులవల్ల.

తో. నాకునీవు పర - లోకకృత్యములు । నయముగ చేయగవల యు । నోకుమార ! యది - వ్రాయి నేనుదగ - నీకు జేయగావలయు॥ రా॥

వ. ఇట్టి కాలవిపర్యాసమున కేమిచేయుదురా ! కుమారా ! కుమారా ! యని బహుభంగులవగచి యెట్టకేలకు ధైర్యంబునొంది కోపాగ్ని మానసంబున అవులుకొని వృద్ధిపొంద.

తో. అటునిటుజూచుచు, నగ్నికణంబులు । జొటపొటగన్నులగా ల । బటపటబటపట-బండ్లుదీటుచు, బలికెమ్మాతులకుజాల॥ రా॥ మున్ను బ్రహ్మవర । మున నేగొన్నమ, హాన్నతధనురస్త్రముల, బన్నుగ నెడిశి, బవరమునకుజని - పరిమార్తునే శత్రువుల ॥ రా॥

వ. అనిపలికి బ్రహ్మాండంబుఁబగుల భుజాస్ఫాలనంబుచేసి.

తో. నాతమ్ములబాంధవులభటులమరి-నాతనయుల రాముంపు। సీతకొరకుగద - చీల్చెను నేజని - సీతనుజంపెదనుంను॥ రా॥

వ. అని కరవాలంబుఁగొని కోలాహలంబుగా నార్చుచుఁ ద్రిపు రంబులు గాల్పంబోవు శంకరునివలెఁ దీవ్రింబుఁచూపుచు నశోకవనం బుఁజేరి చంపఁబైకొనివచ్చు రావణుని తెంపుఁగని కింపంబు నొందుచు సీత విలపించుచున్నది.

సీత-కీర్తన, హిందూస్తానరాగము-అటతాళము, ప్రాణనాథు నెట్టు.

పీసిచేతఁజావునాకు । విధిలిఖించెనేమొకో! పాపీ-యుంపుఁ-గత్తిం బూని-పయికివచ్చెనేమొకో॥ పీసి॥ ఇంద్రజిత్తుచచ్చియున్న-యీసుచేతి

నూ। ఇంద్రవైరినన్ను జంప। నిపుడువచ్చెనేమొకో॥పీని॥ మోక్షగుండేశు నిజయించి। మోదమందుచు। నీక్షణంబునన్ను జంప-నిటకువచ్చె నేమొకో ॥పీని॥

వ. అని విలపించి రామమూర్తిని తన హృదయారవిందంబున నిలుపుకొని మూర్ఛిల్లి ధరణిజ ధరణిపయినొరిగె. అప్పుడతని రౌద్రిర సంబునుగని సుపార్శ్వుండనువాఁడు హితంబుఁ దెలుపఁగోరి.

క. నీపైకినెత్తివచ్చిన। యాపగతురజంపుటహా ♦ మగునదిగాకీ। పాపమునకునొడిగట్టుక। యీపడతినిజంపుటహా ♦ మే! దనుజేశా.

వ. బ్రహ్మవంశభవుండవయి నీతివిడిచి స్త్రీహత్యచేయ నుచితం బేనా! చేతనయిన రామలక్ష్మణులంజంపు పొమ్మన నియ్యకొని తిరిగి వచ్చి యాస్థానంబు జేరి కొలువుదీరి.

తో. తనయునిశౌర్యము-తన్మృతివిధమును। దనవారికిఁజెప్పుచును। మనమునశోకస, మగ్నుండైయా। దనుజుడుండె నంతటను॥ రామా రామాయనవే శ్రీరామాయణకథవినవే॥ పార్వతి॥

వ. ఇంద్రజిత్తు మరణసమాచార మంతఃపురకాంతలు చింతతోడఁ జెప్పుకొనుచుండవిని యతనిభార్యసులోచన లోచనంబుల నీరుగార మూర్ఛనొంది చెలులుబోధింపఁ గొంతవడికిఁదెలిసి నాథునిఁగూర్చి.

సులో-కీర్తన, ఆదితాళము-ముఖారిరాగము.

నాకునీకు ఋణముదీరెగదా! ప్రాకటముగ నేటితోఁ। బ్రాణేశ! నాకులగెలిచిన। భీకరశాలివి। నరుఁడెటుగూల్చె నయ్యయ్యో! ప్రాణేశ। నాకునీకు॥ ఎప్పటికినాతో। జెప్పిపోవుదునేను। చెప్పకపోతివయ్యయ్యో! ప్రాణేశ॥నాకునీకు॥ కొడుకులగాకుల। కొల్లజేసియునీవు। విడిచిపోతివయ్యయ్యో! ప్రాణేశ॥ నాకు॥ ఈక్షితిమోక్షగుం। డేశుఁడుమనపై। నిటు దయతప్పెనయ్యయో! ప్రాణేశ॥నాకు॥

క. ఉరగేశుఁడు మజ్జనకుఁడు। సరగున నన్నిచ్చిపెండ్లి ♦ సలిపెడివేళన్। వరరత్న మొకటి ప్రాణే। శ్వరనాకిడి యిట్లు పలికెఁ ♦ బ్రాభవమొప్పన్.

తో. జయకాంక్షనుని, ప్రియుఁడనికేగెడు। సమయంబునఁ దలయందు। నయముగనీరత్నమును నివాళిం-చియుఁబంపుము జయమొం

దు॥ రా॥ మఱువకుమనుచును । మఱేసీతోనవె । దురమున కేగెడువేళ । స్థిరముగ భార్యకుఁ । జెప్పిపొమ్మనుచు । జెప్పియుండెనావేళ ॥ రా॥

వ. మీామామమాటలు మఱచితివే! నాతోఁజెప్పిపోయిననిట్టి మరణంబు సంభవించునా! మనోనాయకా! అనికొంతవడికు దుఃఖించి పిమ్మటఁ దనతనయులఁజూచి యిట్లనియె.

సులోచన సహగమనము.

సులో-కీర్తన, ముఖారి-అటతాళము.

ఏలయీాలీలవగవ । దనయులారా!॥ యేలా॥ ఏలవగచిఫల । మే మీా! కాలముగడవ । నెంతవారికిజాలును । దనయులారా!॥ ఏల॥ భీతి నొందకుఁడు విభీషణుఁడున్నాఁడు । ప్రీతితో మన్నించును । దనయులారా॥ యేల॥ ఘనమోక్షుగుండేసు । కరుణచేనేసహ । గమనము జేసె దను దనయులారా!॥ యేల॥

వ. అనియూరార్చి విన్నదనంబుతో దశకంఠుని యాస్థానంబునకుఁజేరి పతివియోగదుఃఖంబునఁ గన్నిరుమున్నీరుగాఁగార వగచిమామగారితో నిట్లనియె.

తేవారము పతివియోగంబుగలిగె♦బ్రతికియింకేమిఫలము । పతి నివెన్నంటిచనుట ♦ పరమధర్మంబుగాన। బతిశరీరంబుమామా!♦పరగదెప్పించి యిమ్మా । సతులుమెచ్చంగ వేగ ♦ సహగమన మేను జేతు.

వ. అనిన నతండు దుఃఖాక్రాంతుండై.

తో. ఆహానమునఁబడినాసనిమగని యడిగినవారిచ్చెద్రరా । ఆహా నాచే-నదిగాదనఁగా- నామెవలికెమది చెదర॥ రా॥

సులో-కీర్తన, హిం, తోడిరాగము, అటతాళము.

ఎక్కడికాలము । ద్రక్కనవచ్చెను । నక్కట ! నామది। కద్భుతమాయెను ॥యె॥ గాలినిమట్టిన । కీలికిగొట్టిన । కైలాసమెత్తిన, నీలాపుదూలెన ॥యె॥ సురపతిగెల్చిన । శూరునకిప్పుడు, నరులకు వానర, వరులకులోగుట ॥కె॥ మోక్షుగుండేసుని । మ్రొలకునేనేగి దీక్షతో నావిభుదెచ్చు కొనెదనికి॥ నెక్క॥

వ. అనినిశ్చయించి మామకునమస్కరించి యతనిసమ్మతంబున.

చ. అరదమునెక్కి-యోడి చెలు ♦ లందఱు నచ్చటమంచుచుండఁగా। బరువడి దీనభావమున ♦ భండనభూమికిఁ జేరితీరుడి । వరమునసిగ్గి♦

కాల్నడను ♦ వచ్చిమహాభయభక్తిదోఁపవా। నరులరుదంది చూడరఘు నందనుజేరి నమస్కరింపుచుర్.

వ. సులోచన కరకమలంబులు ముకుళించి వినుతింపు చున్నది.

సులో, కీర్తన, శంకరాభరణము, రూపకతాళము.

రామ! కదనభీమా! జయ॥ రామ॥ ప్రేమశో॥ నామనంబు-నం దుగొలుతు॥ రా॥ సామనుత । స్మరారిహిత। సురారిహత॥ రామకదన॥ కామస మాంచిత కాయా ! సామజసన్నుతభార్గవ । రామగర్వభంగ! పూర్ణ, సోమదివ్యవదనా! తామసాదిగుణవర్జిత । భూమిజవర! మోతు గుండ । ధామ! శుభదనారాయణ - నామకవిస్తుత! సుందర॥ రామ॥

వ. అనిపొగడిన రామునానతిచే సుగ్రీవుం డత్తరుణింగాంచి.

తో. ఎవ్వరిదానవు ! యెవరు తండ్రి నీ, వెందుకువచ్చితివిపుడు। ఎవ్వఁడునీపతి-యెఱిగింపుముమా । కవ్విధమనన నెనపుడు॥ రా॥ వెలయ సులోచన-నింద్రజిత్తునా। విభుడగు శేషునిసుతను। నలరగ రావణు-నను గుగోడలను నవిరామునితో ననెను॥ రా॥

క. రామదయాకరపటురణ। భీముండగునా పుమగని ♦ బృధివిని గూల్పం । గామంచిదగునె! యకటా! భూమినివైధవ్య మేను ♦ బొందగ గలనే.

సులో-కీర్తన, ఏకతాళము,పున్నాగవరాళి.

రఘురామచంద్రమా! యఘహర! బోప్రమా! మొక్కెదను॥ ర॥ పతిభిక్షబెట్టుమా! వెతలెల్లబాపుమా!పరమపురుష!॥ ర॥ నీపాప్రపు జొచ్చితి-గాపాడ వేడితి।దీనురాల॥ ర॥ విడనాడబోకుము । చెడజూడబో కుము। మోతుగుండ॥ రఘురామ॥

వ. అనిప్రార్థించిన రాముండు ♦ పరమదయాపర మూర్తిగానఁ గరుణించి తిరుగమేఘనాథుని బ్రతికించ మనంబున నెంచె నదియూహిం చిహనుమంతుం డిట్లనియె.

తో. ఏమిరామమిా-రెఱుగనికున్నదె । హేమగర్భ వరములను। నీమదిలోమా, నింపదగదెయన - నెలతకు రాముండనెను॥ రా॥

క. భామినియిుంకొక భవమున । నీమగఁడును నీవుఁగలిసి ♦ నిత్య సుఖంబుల్ । ధీమతులై భోగింతురు । కామింతురు మత్పదంబు ♦ గాం తురు పిదపన్.

వ. అనిపలికిన నానందించి యాకొయిట్లనియె.

తో. దీనదయాపర దేవదేవ! యట్లైనను నాపతి మేను| బూనిక నిప్పింపుము నేఁ జేతును | మానుగ సహగమనమును॥ రా॥

వ. అనునంతలో సుగ్రీవుండు నీవు పతివ్రతవేని నీపతితోఁ గొంత ముచ్చటింపుమన మంచిదని రణమధ్యమునఁ బడియున్న యధిపతి శరీరంబును చూచి దుఃఖించి.

తో. పతియదైవమని - ప్రతిదినమును నే | వ్రతముగ సలుపుదు నేని| క్షితిపయి నాపతి| జీవసహితుఁడై చెలగి పలికెడును బూని॥ రా॥

వ. అమ్మహా పతివ్రత యిట్లనఁగనె యింద్రజిత్తు గనులువిచ్చి చూచి యందఱువిన సులోచనకిట్లనియె.

ఇం-కీర్తన, ఆదితాళము, కరిరాజ, హిం, తోడి.

అనబోణి! వగవగను | బనిలేదుపోగదే, ననుదాకి పోరువాడు| నహిజగమున చూడు॥ మన॥ అతండు శేషుడగు! సీతాద్రి యగునుగాన| నాతోడ గెల్చినాడు| నాతిరో| యిచట నేడు॥ ననబో॥ వడిగను మోక్షగుండ, వరపుత్రి నానతి| గడువగ శక్యమె! కాలముదీరెను॥ ననబోణి॥

వ. ఇట్లుపలికి యింద్రజిత్తు కనులుమూసి పలుకకున్న దుఃఖించి లేచివచ్చి రాముని కెఱఁగిన సంతసించి రాముం డానతియ్య నంగదుం డింద్రజిత్తు కళేబరంబు సులోచనకుఁ దెచ్చియిచ్చిన నది తేరిమీఁదనుంచుకొని రామునివీడ్కొని కదిలి.

తో. కాంచనాంగి లంకాపురికిని వేగంబున నపుడరుదెంచి | యుంచదగిన తావున బతిదేహమునుంచి భటులగావుంచి॥ రా॥

ఉ. మామను జేరి మ్రొక్కి రణ ♦ మధ్యముఁ జేరఁగ వేగఁబోయి శ్రీ
రాముని నాశ్రయించి సుక♦ రంబుగ భర్తృకళేబరంబు దా
ధీమతిఁ దెచ్చుకొన్న యది ♦ తెల్లముగా వివరించి నేఁడు నే
నామగడేగుచోఁ జనుదు ♦ నంబగు నేగుదు నాజ్ఞ యిమ్మనన్.

వ. రావణుండు మిగులఁ జింతాక్రాంతుండై కోడలి ధైర్యసుగుణంబులకు నద్భుతంబంది కొండొకకాలంబునకు నిట్లనియె.

క. భామిని నీవెఱుఁగనిపని | యేమున్నది దుఃఖవర్ధి నీ ♦ గెడునార్కు| ఏమిపమును దోఁచదాయెను| నీమదిదోచినటు చేయు ♦ నీరజగంధీ!.

వ. అనిన నతనివీడ్కొని స్వగృహంబునకరిగి చింతఁగూరియున్న తన తనయులంగుఱిచ్చి లేవనెత్తి శిరంబు మూర్కొని యిట్లనుచున్నది.

సులో-కీర్తన, ఫీల్ రాగము, అటతాళము.

నాముద్దుసుతులార! నాయన్నలారా! భూమిని నాకేల । బుట్టితి రార॥నా॥ మీముద్దుజూడనే। నోమగనైతి । నేనుఁ విధికృత । మెఱుఁగక పోతి॥నా॥ మహిమీదనుండ - ధర్మముగాదు నేను। సహగమనముచేతు, క్షణమాత్రమునను॥ నా॥ ఇందుండకనుమీర, తిప్పుడే లెండు। ముందుగ బాతాళ। మునకునుబొండు॥ నా॥ వాసిమోక్షగుండ । వాసునిదయను। శేషునియింటను జేరుండుతగను॥ నా॥

వ. ఇట్లు కుమారులను శేషునియింటికిఁబంపి సులోచన యిహ విషయములయందు విరక్తిఁజెంది.

ఉ. తానునుభర్తృదేహ సహి ♦ తంబుగ స్నానమొనర్చి నిత్యక
ళ్యాణముగా నలంకరణ ♦ మప్పుడొనర్చి విమానమందునా
సీనునిజేసియుత్సవముఁ ♦ జేసిసువాద్యము లుప్పతిల్లఁగా
దానములిచ్చుచుర్వ జనియు ♦ దచ్చితియందున నిల్చియంతటన్.

తో. చితిబేర్పించియు- జితిపయినాథుని జేర్చి కౌగిలించుకొని। సతితనపతితో। సహగమనంబును। సలిపెఱుగను సమ్మతిని॥ రా॥

వ. అంత దానవులనలంబు రవులుకొలిపి యిండ్లకుఁజనిరి. తద నంతరంబ.

తో. సతిపతులిద్దరు। సంతోషముతో। సౌరవిమానము నెక్కి-యతులితముగ సద్గతికిజేరి సౌఖ్యంబుగనుండిరి -నొక్కి॥ రామ॥

## మూ ల బ ల యు ద్ధ ము

ద్విపద-అప్పుడు రావణు - డతికరోషమున నిప్పులుగన్నుల-ని, లువకరాల। మూలబలంబుల-ముదమునఁబిలిచి । యాలంబునకు నేగి-య గచరాధముల। రామలక్ష్మణులను- రయమునజంపి। ధీమతిఁదోడమీ, తె గువనుచూపి। వేగంబుననురండు-వెడలిపొండనిన । రాగంబుననుబొంగి-రాక్షసభటులు। పరిఘన కేళికి నేగఁ-బాతంబు మెఱసి। రథములుఁదురగవా-రణములుభటులు। లెక్కకుమీరిబ-ల్మిని కేకలిడుచు। ఢక్కాదివాద్యము ల్దనిమ్మమ్రోగి। సింహనాదంబులు- సేయుచు వెడలి। రంహాసరంభులై, రణభూమి జేరి.

క. కేకలగొట్టుచువానర। మూకలపై బెల్లుగవిసి ♦ మూలబలంబుల్। లోకంబులుఁగంపింపఁగ॥ జీకాకుగ నంపవాన♦ చేముంచిరొగిన్.

తో. అప్పుడువానరు-లధికాగ్రహమున-నద్రులు మ్రాకులుగొనుచు। గుప్పలుగా ధర-గూలునట్లుగా-గ్రుమ్మిరి యసురులగనుచు॥ రా॥

వ. ఇట్లిరువాగువారును బౌరుషంబుచే పెల్లురేఁగి విడువక పోరుచుండిరప్పుడు. వానరబలంబులు రాక్షసబలంబుల లక్ష్యపెట్టక.

తో. కరులనుదోలిన - గరులచేతనే। గరులమోదిచంపుచును। దురగంబులపై-దోల వానిచేఁ-దురగంబుల మోఁకుచును॥ రామ॥ పటుతరరథములు, నరబవానిచే - బటురథములు గూల్చుచును। భటులుగదిసినను-భటులచేతనే॥ భటులమోది చంపుచును॥ రా॥ కాలఁగొందఱిని, గేలఁగొందఱిని-వాలంబులఁగొందఱిని। కూలిచివేసిరి-కోయని దనుజులు-గూలితలిడఁగ నత్తఱిని॥ రా॥

వ. ఇట్టిభయంకరరణంబునఁ బెక్కండ్రురక్కసుల నోర్చి వానరులు పేర్చియార్చుచుండిన నారభసంబు గని సహింపక.

రగడ. మూలబలములడరి। కోతుల। మూలపయినఁబడిరి॥ వికృతగాత్రులును, వికృతనేత్రులును, వికృతహాసులును। వికృతనాసులును, వికృతపక్షులును-వికృతకర్ణులును, వికృతపాదులును॥ వికృతనాదులును, వికృతపుకరులును, వికృతాధరులును॥మూ॥ కరపత్రంబులు-గ్రకచ ముసలములు। గరవాలంబులు,. గదలుజక్రములు। పరిఘలుశూలలు - బ్రాసపట్టసలు। పరశుముద్గరలు-బటుతోమరములు। మొదలగు నాయుధ-ములుగడుబూనుచు। నదరక బెదరక-ననికినిమూఁకకై॥ మూ॥కడువడి జగములు, గడగడవణకఁగ।, సుడివడిజలజల- జుక్కలురాలగ। జలనిధులింకగఁ-గులగిరులదరగ। గలవరమున ది-గ్గజములుబెదరగ। బలువడి శేషుడు-ఫణములుముడువగ। బలుమఱుగ్రహములుఁ- బథములు దప్పగ॥ మూలబలంబుల, డరి, కోతుల మూకపయినబడిరి॥

వ. ఇట్లుకమ్ముకొని నిలుపోవనీక వానరుల జెల్లాచెదరు చేసిన వారిదాడికి భయభ్రాంతులై వానరులుఁ దరులుగిరులుఁ గ్రిందవైచి తముఁగోఁ దామిట్లనుకొనిరి.

వానర-కీర్తన, చాపుతాళము, సీతగా.

రాము, డేలా! యనుజు, డేలా! యుద్ధమేల! జాలును । ఆలమును మానిపోవు-టదియెపోలును॥ రాము॥ కడుపు, నిండగాయ-పండాకులు గొండవలముల । దండిగదినుచుండక -దరలిరానేల॥ రాము ॥ పెక్కు, రాక్షసులు యీక్షణమె-శిక్షసేయగ । మోతుగుండా । ధ్యక్షుడిదియే-మోకనడామెగా॥ రాము॥

వ. అప్పుడు వీరిచేత జావనేల? నూపిరియుండిన నుప్పమ్ముకొని బ్రతుకుడుము రండని సేతువుమీఁదుగాఁబోవు కపులనడ్డగించి నీలహనుమంతాంగదులు మరలించిన వచ్చి భయభ్రాంతచిత్తులై రాముని మఱుఁగునకుఁ జనినఁ దయారసంబునఁ గని రాముండు.

తో. దానవులడరగ-వానరులలరగ । ధనువుగుణధ్వని జేసి। బాణ వర్షమున-బరువడివసురుల- పయిగురిపించెనుడాసి॥ రా॥ దనుజులువ్రావ గదారిగానకను-రణములోన దిరుగుచును । వెనుకొనిరాముడు- విశిఖంబులువడి-వ్రేయదాకి కూలుచును॥ రామ॥

వ. ఉండుటగని రాముండు మఱియు.

క. చరణంబులు వదనంబులు । గరములు శిరములునువ్రేళ్లు♦గాత్రంబులునె। త్తురులురులఁగఁదెగ్రవేసిన। ధరఁదుల్లిరి పెక్కుమంది ♦ దానవవీరుల్.

వ. అంతమిగిలిన రక్కసులు భయభ్రాంతులయి.

తో. అదిగోరాముం। డదిగోవ్రేసెను । యిదిగోరాముడువ్రేసె। నదిగోవ్రేసెను। నిదిగోవ్రేసెను। యదెపాసెనునిదెడాసె॥ రా॥

వ. అని తిరిగితిరిగి చూచుచుఁ బాఱుచుండిన నప్పుడు రాముం డలుకరెట్టింప.

తో. సమ్మోహనమను, శరమునుధనువున-సంధించియు వ్రేయ ఁదను। దమ్ముదామెఱుఁగక। దనుజులుభ్రమపడి। తబ్బిబ్బుగదిరుగగను॥ రా॥ ఒక్కరాముఁడే, పెక్కురాములయి-యెక్కడఁజూచినఁదోఁచి। అక్కజముగఁగన; నంతారామమమ, యంబైయుండెను వేచి॥ రామ॥

వ. ఇట్లాజిమధ్యంబున ననంతరూపులుగాఁదోఁచి రాముండు గసిమసంగిన నెక్కడివారక్కడనే సొలసిరి. చావఁగాఁజిక్కినవారు తప్పిం

చుకొని లంకలోనికరిగెరి.

క. పదివేలుగరులుహయలిరు
పదివేలును భటులుసెక్క ♦ పద్మమురథముల్
బదిపదులుఁగూలెనేనియుఁ
బదపడిమొకయట్టలేచి ♦ పరువడినాడున్.

ఉ. అట్టులు నూరుకోట్లుగసి ♦ యాడినమస్తక మొండునార్చుచున్
దట్టునలేచుఁ గోటియువి ♦ తప్పకలేచిన రామువింటికిన్
గట్టినగంట మ్రోగుఁబదు ♦ నాలుగుగంటలు నర్ధయామమున్
గట్టిగమ్రోగెనార దశ ♦ కంఠుని మూలబలంబుగూలఁగన్.

వ. ఇట్లు కోదండ దీక్షాగురుండగు రాముండు దేవతల కభేద్యం బగున రావణుమూలబలంబుల భేదించి సుగ్రీవవిభీషణుల దిక్కుజూచి యిట్లనియె.

రా-కీర్తన-ఆదితాళము-కనలి.

ఇలలోఁ, గలబాణ, ములకిదిమేటిగా। అలగాధినందనుఁడు। దెలియనాకిచ్చినాడు। బలమైన, కలహమున। బరపమేలౌనుగా॥ యిల॥ రిపులనుద్రేయ। నుపశాంతిజేయ। ద్రిపురారినేనుదక్కఁ। దెలియరన్యులునిక్క। మిపుడెం, తనిపుణత్వ-మిదిజూపెఁగంటిరే॥ యిల॥ సమ్మోహనమను। శరమిదియౌను। అమ్మోఘుగుండపతి-నైననాయనుమతి-సమ్మోహి, తులజేసె-నిమ్మూలబలమును॥ యిల॥

వ. అనిన వారు సంతోషించి శ్రీరాముని గీర్తించి రపుడు విభీషణుండు.

త్రో. దేవతలనుదోలి, దేవతలనుభే, దింపలేనిసైన్యమును। దేవదేవసా, ధించితివికవెగు। రావణుండురణమునను॥ రా॥

వ. అనిపొగడుచుండె నవంతరము మూలబలంబు మ్రగ్గినవార్త విని రావణుండు.

క. కోపాగ్ని జ్వాలలకడు
దీపించఁగ గోలుపుసెదర ♦ దీక్షబలంబుం
జూపుచుయుద్ధోన్మత్త వి
రూపాక్షాదులకునసియె ♦ రోషముతోడన్.

రావ-కీర్తన, బేహాగ్-ఆదితాళము, పోనివ్వ.

పోదముపోదమురండికి। మనముబోదము॥ మోదమునఁగపులన్నపుల। ముట్టడించిచంపఁగను॥ బోదము ॥ అక్షయరణదక్షులయా। పాక్షశోణితాక్షమక। రాక్షవరధూమ్రాక్షముఖ। రాక్షసయోధులబట్టి। శిక్షజేసి వెలయుచున్న। మోక్షగుండనిలయుపయికి॥ బోదము॥

రావణుని రెండవసారియుద్ధము.

వ. అని వారినిగూడుకొని రథారూఢుండయి యుత్తరద్వారంబునఁజని యుద్ధభూమికి జేరినపిమ్మట ముందు విరూపాక్ష యుద్ధోన్మత్తసుపార్శ్వులు బహురాక్షసానీకంబులతో నార్భటింపుచు వానరానీకంబులపయికిఁ దొడరి.

తో. పరిఘఖడ్గగద। పరశుకుంతతో, మరముసలాదులచేత। నరిమురిమోదుచు। నార్భటించవా । నరులతికోపముచేత॥ రా॥ క్షితిజాతంబులు । క్షితిధరంబులును, సిరములమోసుకవచ్చి । ధృతితోవైచుచు। దేవారులబా, ధింపఁదొడగిరటుహెచ్చి॥ రామ॥

వ. ఇట్లుక్షణమాత్రంబున సుగ్రీవాది వానరయోధులువిరూపాక్షాద్య సురయోధులఁ బిలుకుమార్చిన నదిగని రావణుండు గోపోద్దీపితుండయి సారథికియిట్లనియె.

రావ-కీర్తన, ఆదితాళము-మాతామ.

రామలక్ష్మణులపయికి-రథమునుబోనిమ్ము నేను, భీమశరము వెడదగుగ్రిచ్చెద। సారథివినర। బిలుకుమార్చి మరలివచ్చెద॥రా॥ వారుగాలినంతమీద। వానరులుచెల్లపాలై। పారిపోదురింకదప్పదు । సారథివినర। వీరితిప్పలిపుడెచెప్పదు॥ రా ॥ రాక్షసాద్యక్షులనెల్ల। శిక్ష జేసియుప్పొంగెడు । మోక్షగుండేశుల ముట్టుదు । సారథివినరా । యీక్షితినిబడగొట్టుదు॥రా॥

వ. అనిపలికి తేరుఁబరిపించి గుణధ్వనిజేసి తనపయి నెదిరించిన కపిపుంగవులం బరీకించి.

తో. అవలీలగసా, యకవృష్టినియా। ప్లవగవల్లభులముంచి। దివిభువియదురగ। దినకరకులుపై। దేరు వేగఁబఱపించి॥రా॥

వ. రావణుండుఁ దనయుద్దండంబు జూపుచుఁ గోదండపాణితో

భండనంబొనర్ప నెదిరిన యడ్డంబుదూరి లక్ష్మణుండు.

క. కొన్నిశరంబులువైచిన । నన్నియుఁదనబాణ నిహతి ♦ నడరించియుదాఁ । గొన్నిశరంబులనాతని। బన్నుగఁజిక్కంగఁజేసి ♦ పంక్తిగళుండున్.

వ. రామునిపైకి నెదిరిన రాముండును నెదిరించి,

తో॥ రామలక్ష్మణులు । రయమునునుభయులు । రణరంగంబున దగిలి। భీమబలంబుల। బెనగజొచ్చిరు, ధామప్రజ్ఞలనుమిగిలి॥ రా॥ కరలాఘవమున, శరలాఘవమున । సరిసమానముగఁబెనగ । సురలెల్లనునం, బరముననిలిచియుఁ-జూచుచుండిరదిసరగ॥ రా॥

సం-కీర్తన, అటతాళము, మేళైన.

రౌద్రిబాణంబును। రావణుఁడేయగ। రయమునబైకిరాగ। కాద్రబాణముచేత। రాముడుదానిని, రంజిల్లద్రుంచె వేగ॥ రా॥ ఘనతమస్రబాణమునదశకంఠుఁడు। గడుజీకటులుజేయగ। గనుగొనిరాముఁడు। గరముగ్రమగుబాణ। గణములచేబాపెగా॥ రా॥ అక్షయబలుడగు-నసురవల్లభుడు నహిశరములువేయగా। మోక్షగుండేశుఁడొ, ప్పుగఁ బెక్కుశరముల, దీక్షతోద్రుంచెగద॥ రా॥

తో॥ అసురసాయక-మసురుడువేయగ-నదియునుష్ట్రి శార్దూల। కేసరికిటికరి। గృధోరగసమ। భాసురముఖములజాల॥ రా॥

వ. బహుసాయకంబులయి కవిసిన రాముండలుకరెట్టింపఁ దన విలువిద్యా ఘోషిమచేఁ బటాపంచలు సేసి.

తో॥ దహనాస్త్రము భూధవుడేయ రవి, గ్రహతటిదుల్కలభాతి బహుబాణములయి। పయికిరాగవే। భంజించెనురారాతి॥ రా॥

తో॥ మయదత్తంబగు। మాయాశరమును । మఱియురావణుఁడు బరప। రయమున గాంధ, ర్వాంబనుశరమున। రాముడుదానినిజెరుప॥ రా॥

వ. ఇట్లు లతిప్రౌక యిరువురుఁ బోరునవసరంబున లక్ష్మణుండె డఁజొచ్చి.

తో॥ ఏడమ్ములదను। జేశునిపడగయు। విల్లునుసారథినడచి। వాడిగల్గుశర। పంచకమాతని। వక్షమునొవ్వగవిడిచి॥ రా॥

వ. సింహనాదంబుజేసిన నంతలో విభీషణుండు.

తో. తురగంబులదు, త్తునియలుసేయన । విరథుండై రావణుడు। ధరణికి దుమికియుఁ-దగశక్తినిగొని-తమ్మునిపై చెను నపుడు॥ రామ॥

గీ. నడుమదాని లక్ష్మ ♦ ణస్వామి మూడమ్ము। లేసితుంచెదాన ♦ వేసుఁడంత। మయునిచేతఁగొన్న ♦ మహితశక్తిఁ భీమ। ణాఖ్యమీఁదవైవ ♦ నడరుటయును.

తో. రామునితమ్ముడు, రావణుతమ్ముని । ప్రేమతో వెనుకకు ద్రోసి । తాముందరబా । తమునసిలువనగి - దశకంఠుండ నెడాసి ॥రా॥

రావ-కీర్తన, అటతాళము, బాళాబా.

ఓర్చియుండుమిక వచ్చెనుశక్తి ॥యో॥ కార్చిచ్చువలెమంట గ్రక్కుచువచ్చెను ॥యో॥ విభీషణునినీవు-వెనుకనుంచుకొంటి ॥వ్రా॥ మయునిచేగొన్నట్టి - మహానియ్యశక్తిది ॥యో॥ ఉరగేంద్రనిభమైన-యుగ్రంపుశక్తిది ॥యో॥ మోక్షగుండేశుడు । ముదమునమెచ్చును ॥నోర్చి॥

—♦ ల క్ష్మ ణు ని మూ ర్ఛ . ♦—

సం-తో. ఘనముగనడిచిరు-గంటలచప్పుడు । గణగణయని మొరయగను। వనధులుగలగగ। వడిగగులాద్రులు। వడకగ దిశలార్వగను॥రా॥ పిడుగులు రాలగఁ-బుడమిజలింపగ । నుడుపంక్తులు జెదరగను । గడువడిజనిల, క్ష్మణునివక్షమున । గాడినధరపయి బడెను ॥రామ॥

వ. కాలావసాన సమయంబున్నఁ బెంపుదక్కి- కూలుమహామేరువుచందంబున రావణప్రయోగ శక్తిచే లక్ష్మణుండిలఁ బడియున్నఁగాంచి శోకవ్యాకులిత చిత్తుండయ్యెను.

క. సౌమిత్రియురము గాడియు । భూమికిదిగియున్నశక్తి ♦ బుచ్చగఁగపులుర్। దామోపవైరి యొకరును । రాముండును బెరికెఁగఁబ ♦ రాక్రమ మొదవన్.

వ. ఇట్లు పెరికివైచి సుగ్రీవ హనుమంతాది కపులను గాంచి రాముండిట్లనియె.

రా-కీర్తన, అటతాళము, కాఫి.

ఈదశకంఠుని-నేనునుమూడను-గాదెజనించుట । కష్టములొందుట। మేదినిపుత్రిని। నేదగబాయుట। గాదిలితమ్ముని। గడకుగోల్పోవుట॥ ఈ॥ చాలబరాక్రమ, శాలినివాలిని। గూలిచియీకపి, కోట్లనుగూడుట।

యాలవణాంబుధి। నటువలెగట్టుట । పోలగమోక్షుగుండ । పురపతినగు నాకు ॥సీద॥

తో. శౌర్యముజూపెను-సమయముగానిది- కార్యముజెడవగచు చును । ధైర్యముదూలెను-తరిగాదికనా । తమ్ముని గాపాడుచును ॥రా॥

వ. మీరేమరక యుండుడింకఁ దెలిపెద.

రాము-కీర్తన, త్రిశ్రజాతి, వనమును.

ప్రతినదప్పకువినుడు । ప్రతిలేదుకపులార నేడు॥ప్రతిన॥ క్షితిబం ర్తికంఠు । బ్రతుకుతోఁబోసెనునేను ॥బ్రతి॥ సురవైరిపోకనిలిచి।సరిగను బోరినజాలు ॥సుర॥ యిరువురుతెంపు। నెరిగేరుచూచేటివారు ॥బ్రతి॥ ధర ణిదూరినవిడువ దగవార్ధిజొచ్చినవిడువ॥ ధర॥ సురులచాటుకు-జొరభా ణిదాగినవిడువ ॥బ్రతిన॥ తరణివంశజుడునేని । దశరథతనయుడనేని। తరు ణి॥ వరమోక్షుగుండ । వాసుదనేనైతినేని ॥ప్రతిన॥

వ. అని ప్రతిజ్ఞగాఁబలికి కనుల గెంపులొలుక ధనుష్టంకారంబుఁ జేసి రావణుదిక్కున కభిముఖుండయి తండోపతండంబులుగాఁ గాండం బులు పఱపిన.

క. ప్రతిసాయకంబులేయుచు। నతులితగతిఁగొంతవఱకు ♦ నసు రేశ్వరుఁడు। ధ్ధతిబోరిరామబాణ। క్షతుఁడయి సమరంబుమాని ♦ చయ్యా నబాసెన్॥.

వ. సింగంబునుగని మాతంగంబు పరుంగుపాఱుభంగి. రాముని చే భంగపడి యసురపుంగవుండు సంగరరంగంబుమాని ప్లవంగవిభులుం దఱుమలంకజొచ్చి యంతఃపురికిఁ జేరి మందోదరింజూచి నిట్లనియె.

రావ, కీర్తన, హిం, తోడి, అటతాళము .

రామునివిక్రమము । రమణిరో! నిర్వక్రము । ఏమిచెప్పుదుభామి నీ! యెటులగెలుతునుగామినీ!॥రాముని॥ నామదినిభావించిన। రామరూ పమే! తోచును। లేమరో యెందున్నది । రామమయముగనున్నది ॥రాము ని॥ మోక్షుగుండేశ్వరుని। ముట్టడింపగజాలను।దక్షుని సేవింతును,దప్ప క జయమొందును ॥రాముని॥

వ. అనిపలికి తత్క్షణంబున.

క. మానుగస్వాతికవృత్తిని। బూనిశివాలయముఁజేరి ♦ పూజించి

మర్ది। ధ్యానముఁ జేయుచునుండిన। దానవపతిఁ జేరిపలికెఁ ♦ దత్సతి తెగువర్

తో. ఇదివరకందరి-నెదిరిజయించితి-వెనలేరెవ్వరునీకు । దుదకిటు మగటిమిదూలిపలుకుటిది-ద్రోవయూ నెయనబోకు ॥రామ॥

మ, కీర్తన, కళ్యాణి-ఆదితాళము.

నీ. కింతభయమునే, డేలను॥నీకు॥పంతముజెడిభయ-పడు వాడవు పర। కాంతనపుడు దేనేలను। దేనేలను, దేనేలను॥నీకింత॥తాతయుదమ్ములు। దల్లియునేనును। నీతిదెలుపవిన గూడదా । విన ॥ నీకిం ॥ పుత్రులు మిత్రులు, బాలిసిసపిమ్మట। శత్రులకునులొంగవచ్చునా॥ ॥లో॥ ఈక్షితి శూరుఁడ। వేనిమోక్షగుం,డేసుని నెదురుము చాలును॥అంతేచాలు॥నీ॥

వ. అనితూలనాడిన సిగ్గునఁదలలువంచుకొని కొంతవడికి భార్య దిక్కుఁజూచి నిట్టూర్పుఁబుచ్చుచు నిటులనుచున్నాఁడు.

తో. అలివేణిరో! నీవన్నదినిజమే ! యయినరామునకు వెరువ। జెలగిహోమమును। జేసిపోయినే, గెలిచెదఁబొమ్మిఁక తెరువ॥ రామ॥

అనియిట్లు ధయిర్యంబుగఁబలికి మందోదరినిబంపి తానునుహోమంబుఁజాలించి గృహంబుకరిగి శయనించె నిక్కడ రాముండు.

క. నెత్తుటదోఁగినతనువున । నొత్తిగిలంబడినతమ్ము ♦ నురువడిఁ గని। తా, జిత్తంబుగఅగికన్నుల । నత్తరిభాష్పములుదొరఁగ ♦ హాయ నియేడ్చెన్.

రా-కీర్తన, అటతాళము, ఫిల్ రాగము.

అయ్యోనాతమ్ముఁడ! యయ్యో! లక్ష్మణ! చయ్యననుబాసి-చనినావ దివికి॥న॥ అడవులమాతోడ। నిద్రములుగుడిచి। కడకుదైత్యునిచేత। బడితివియిచట॥న॥ కావలెనన్నరాఁ-గలదట్టిభార్య। నీవంటితమ్ముని। నేనెందుఁదెత్తు। నయ్యో॥ అ॥ పలుమాఱునేనింత। పలవించిపిలువ। నెలుగెత్తియో! యన। వేమిరాయనుజా!॥ అ ॥ ఎలమినిమోక్షగుం, డేశుడ వనుచు। బలుకుచుసేవలు సలుపుదునాకు॥ నయ్యో॥

తేవారము. నాకుయుద్ధంబింకేల! ♦నాకు రాజ్యంబింకేల! నాకు జయమింకనేల! ♦ నాకుసీతయేల ! నాకునీసౌఖ్యమేల! ♦ నాకుప్రాణంబులేల! నాకునీతోడిదైవ ♦ లోకమేయగును జాల.

తో. నాతోఁగూడి వ, నంబులకును దిన్నగవచ్చితివీవపుడు। నీతోఁగూడా। నేనుదివంబున। కేతెంచెదమతియిపుడు॥ రా॥ ఇంతె! కాని నిన్నెడబాసియునే। నెంతయునుండఁగఁజాల। బంతంబుననికఁ బ్రత్యర్థులపై। బడిచంపుట నాకేల॥ రా॥

వ. అని యనేకవిధంబుల సౌమిత్రి సుగుణంబులు దలఁచుకొని శోకింపుచున్న రామచంద్రునిఁ జేరఁబోయి సుషేణుండు ధయిర్యవచనంబులాడుచు నిట్లనియె.

సుషేణ-కీర్తన, కళ్యాణి, రూపకతాళము.

శోకమేలనయ్యా! నిను। నీకుమేలుగాదుమాను ప్రాకటముగసీతనికి। బ్రాణభయము లేదికను॥ శోక॥ మేనునఁబ్రాణముఁబాసిన। నాననమునఁగళలున్నె! మానుగనిందీవరముల। మాడ్కిఁగనులు జెన్నొందునె॥ శోక॥ అందములై యరచేతులు। గెందామరటులున్నె! తొందరేల! మోహముగుండమందిర! నీడెందంబున॥ శోక॥

వ. అనిపలికి రాముని శోకంబాపి హనుమంతునిఁజూచి సుషేణుండిట్లనియె.

క. మునుజాంబవంతువల్లను। వినియుంటివి మూలికలను ♦ వివరింపంగా। హనుమంత ద్రోణగిరి ద। క్షిణపుశిఖరంబునందుఁ ♦ గేవలరుచులన్.

వ. ఒప్పియున్న విశల్యకరణి, సౌవర్ణ్యకరణి, సంధానకరణి, సంజీవకరణి, యనునాలుగౌషధ లతలుగలవవి వెదకితీసుకొని వచ్చితివయిన నీలక్ష్మణుని ప్రాణంబులు మరలింపవచ్చును. లేకున్న నొండుసదుపాయంబులేదు.

సుషేణ-కీర్తన, కేదార, చాపుతాళము, కోరియం.

పోయిరమ్మికఁ। హనుమంత॥ పోయి॥ వాయునందన లేవ, వ్రాయి వేగముతోఁబో। వ్రాయి మందులుగొనిరా। వ్రాయి తేవ్రాయీ యీ, వ్రా యీకావ్రాయీ॥ పోయి॥ మించిద్రోణాద్రినిశో- ధించి గంధర్వులజ, యించి రాక్షసులను, దృంచిసా, ధించి లక్షించి కుప్పించి॥ పో॥ చండకిరణుఁడు పొడువ, కుండరావలె మోహగుండరఘుపతిగను। చుండప్రాణ, ద్దుండమే-దండ నిల, కుండ॥ పోయి॥

వ. ఇక్కడికి నాలులక్షల యిరువదివేల యిన్నూటపది యోజనంబుల దూరమున్నది. సూర్యుండు పొడవకముందురమ్ము. పొద్దుపొడిచిన నౌషధములుం బనిజేయఁజాలవు. క్షీరాద్రినిదాఁటి జవంబునఁజేరుమనిన హనుమంతుం డోడఁబడియె. నప్పుడు రాముండు.

క. ఈతమ్మునిబ్రతికించియు। భూతలముననీప్రకీర్తిఁ ♦ బొందుమువత్సా! సీతంగూడఁగ నలువురు। నాతమ్ములటంచు వాయు ♦ నందన దలతున్.

వ. అనిన విజృంభించి మహానందంబున నాంజనేయుం డిట్లనుచున్నాఁడు.

హను-కీర్తన, శంకరాభరణము, ఏకతాళము, అమ్మయ్య:

నావంటిబంటుండ। నీవేలవెరగంద। వేవేగమందులు। వెతకినేఁ దెచ్చెద॥ నా॥ ఆయేడుదీవుల। కావలనుండిన। నాయద్రివేగెడు। నంతలోనేదెత్తు॥ నా॥ ఆమిత్తినదలించి। యవనిపై బొలియించి। సౌమిత్రిప్రాణపంచకమును మరలింతు॥నా॥ ఈలోకమునగాదు। యేలోకముననున్న। నాలక్ష్మణుని దెచ్చి। యర్పించనా! మీకు॥నా॥ మోక్షగుండేశ్వర। మొక్కెదదీవించి। యీక్షణమేపంపు। మేతెంతుఁదడయక॥ నా॥

వ. అని మ్రొక్కి దీవనలంది సుగ్రీవాంగదజాంబవంత విభీషణులవీడ్కొని పర్వతాగ్రంబునెక్కి లంకాపుర గోపురంబుఁ గూలునట్లుఁ గుప్పించి యెగసి వియన్మార్గంబున నదీనద పర్వతారణ్య పురంబులఁ బరికింపుచుఁ బోవుచుండె నిక్కడ.

క. వేగులవారలు తెలుపఁగ। వేగంబున రావణుండు ♦ వినివిహ్వలుడై। భోగీంద్రుపగిదిఁ గనలుచు। నేగెను నాకాలనేమి ♦ యింటికిఁ జేరన్.

వ. ఇట్లువచ్చిన రావణునిసత్కరించి కాలనేమియిట్లనుచున్నాడు.

సం-తొ. ఏమిపనికినా, యింటికివచ్చితి-రీనిశీపొద్దుననఁగా। వేమరుదెలిపెద। వినుమొకపని కాల, నేమిచేయవలయునుగా॥ రామ॥

క. అదియేమియన్న నుడివెద। ముదమునమచ్ఛత్తిమూంచన్ ♦ మునిగినయనుజున్। వదలక బ్రతికించుకొనన్। మదిలోపల రాముడెంచి ♦ మారుతసుతునిన్.

క. సంజీవకరణికొఱకై । రంజిల్లఁగ బంపెనతఁడు ♦ రయమున నేగెన్ । భంజింపుమునీవడ్డము । గంజనియటు చేయఁ జేత ♦ గాకుండి నచ్చోన్.

వ. మాయోపాయంబుచేత వానిప్రయాణంబు సాగకుండనయినఁ జేయుము. ద్రోణగిరిసమీపంబున నొక్క సరోవరమున్నది దానియందొక్కమకరియున్నది.

తో. అదిదేవాంగన, నై ననుమ్రింగును । నగచరుఁడనఁగా నెంత వదలకయచటికి వాయుజుఁడేగెడుపగిది జేయుమిదివింత॥ రా॥

వ. వేగంబునబొమ్మన విని కాలనేమి యిట్లనుచున్నాడు.

కాల-కీర్తన, శంకరాభరణము-ఆదితాళము, మేలైన.

మాయామృగాకృతి। మారీచుఁడేగియు। మాయమైపోడేమును గోయనియార్పుచు-గుంభకర్ణాదులు గూలరెచూడుమును । లంకనీతమ్ముఁడేలగగట్టిసీతమ్మ, నింకరామునకునిడి। శంకరుగూర్చిని। శ్చయముగ దపమును। సలుపుమేలుగలిగెడి॥ అదికానిచోఁబోయి। యలమోక్షుగుండేను, నెదిరించి వడిపోరుము । కదనరంగమునందు । గడితేరివైకుంఠ, పదమునకును జేరుము ॥మా॥

వ. అంతేకాని యీమాయలవల్లఁ బ్రయోజనంబేమనఁ గోపించి చంద్రహాసంబునఁ గాలనేమితలతెగ వ్రేయఁబోయిన నది యెఱింగి.

తో. ఇదుగోపోయెద । నేటికిగనలెదు । యింటికిజనుమనిపలికి । తుదయిదియనుకొని । తూర్ణంబునవా । తూలసుతునిపైనలిగి ॥ రా॥

వ. కపటముని వేషంబున ననేకశిష్యగణ సహితుండయి మనోవేగంబున ద్రోణాద్రిసమీపమందున్న దివ్యవృక్షసహితంబయిన యొక్క వనంబుఁజేరి యాశ్రమంబేర్పఱచుకొని.

సం-తో. మునివలెగన్నులు, మూయుచుగొణుగుచు। బూసలు ద్రిప్పుచునుండ । ననిలజుఁడంబర, మునఁ బోవుచునది । గని యాశ్చర్యమునిండ ॥ రా॥

స్రగ్విణి. ముందుద్రోణాద్రికిన్ ♦ బోవునాడీవనం । బిందులేదింత లో ♦ నెట్టులన్ వచ్చెనో! తందరన్ వచ్చుచో ♦ దారినేదప్పితిన్ । విందుగా నీమునిన్ ♦ వేడియోచింతుగాదన్.

వ. అనియోచి తత్క్షణంబునఁ గ్రిందికిఁజనుదెంచి మునికినమస్కరించి యిట్లనుచున్నాఁడు.

తో. రామునికార్య్యార్థంబుగజనియెద। నేమారుతతనయుఁడను। ఓమునివరనా-కొదవెనుదాహము। ఉదకముజూపుముతగను ॥రా॥

వ. అనిన నక్కపటమునీద్రుం డిట్లనియె.

కా-కం. మావనమునఁగలఫలములు। దీవరమునవారగించితృష్ణయడంగన్। ద్రాపుకమండలజలములు। యావత్కార్యములు దీరునటు తర్వాతన్.

వ. మాకాగతానాగతవర్తమానములు దెలియునుజెప్పెదవినుము.

కా-కీర్తన, అటతాళము, శంకరశం.

వేమఱుదెలిపెద। వినవోయీ। నామాటలుమదినమ్మోయీ। రాముసభామిని। రావణాసురుడు। నేమరించుకొని। యేగెనులంకకు॥ వేమ॥ అదిగనిరాముం-డలిగికపులతో।గదలివచ్చిలం-కకుజేరి।ముదమున రావణు, పుత్రమిత్రులను। జదిపిననాదశ। వదనుడుగనలుచు ॥వేమ॥ మోక్షపురవరాధ్య,క్షుని యనుజుని। దీక్షమీఱశ-క్తినివైచి। యీక్షితిగూల్చిన నిపుడుద్రోణగిరి। కక్షయోషధుల-కై వచ్చితివిటు ॥వేమ॥

క. రాముఁడు లోకహితార్థము। గామహిజన్మించినాఁడు గానసహాయం। బేమును జేయుటిధర్మం। బోమారుతి! మంత్రితతుల నుపదేశింతున్.

వ. అమ్మహామంత్రి పునశ్చరణవల్ల సమస్తకార్య సిద్ధులొదవునిదియునుం గాక.

తో. సంజీవనిముఖ-సకలౌషధములు - రంజిలుమావనమందు। నాంజనేయనే - నర్కుడువుడిచిన - నవితెచ్చిచ్చెద నిందు ॥రామ॥

వ. నామంత్రసామర్థ్యంబునఁ గనుఱెప్ప వేయునంతలో లంకకుఁ జేరఁగలవు. లక్ష్మణునకు బాధలేకుండుననిన హనుమంతుండిట్లనియె.

హ-తో. అక్కడ లక్ష్మణు,డట్టుల నుండగ। నిక్కడ దడయుట తగదు।అక్కర లేదు ఫ,లాదులు జలములు-జిక్కెనఁద్రావియుజనదు॥రా॥

వ. మీకమండలోదకమ్ములు నాదాహంబుదీరునన్ని లేవు. కొలనుగాని, నదిగాని, యుండినఁదెలుపుఁడు నేఁబోయెద నీరుద్రావెదననిన.

కా. తో. ఉన్నదిచేరువ- నొకకొలనచటికి - జన్నయుదకములు గలవు। పన్నగశిష్యులఁ, బంపెద వెంబడి-బదులుచూపెదరు నెళవు॥ రా॥

వ. ఇట్లు పలికి తనశిష్యులఁగూడ నిచ్చిపంపిన హనుమంతుండుఁ జని కలహంస, కారండవ, చక్రవాక, బక, ప్రతతులచేనొప్పి కమల కల్హారసహితంబయి మీన, మకర, కర్కట, జలూక, గ్రాహ, సమన్వి తంబయి యలరారు సరోవరంబు మనోహరంబుగాఁ గనుపట్టిన యందు దిగి యుదకంబులు గ్రోలుచుండ నప్పుడు.

తో. ఒక్క-మకరితన-యుగ్రపుకోరల-నొడిసి కాలునమలగను। జక్క-గ రౌద్రర,సంబొలుకగ గద,ద్రొక్కి- పండ్లురాలగను॥ రా॥

వ. ఇట్లు పండ్లూడఁ దన్నిన బోక యది మహారోషంబున నాం జనేయుని మ్రింగఁదలపడిన నదిగని తనమనంబున.

హ-కీర్తన, ఏకతాళము, కాలికి.

అకటా! శ్రీరామకార్య-మట్టెనిల్చెను। జిక్కి-నాడ దీనిచేత-జి క్కి-బట్టెను॥ న॥ త్రాణలేదుచత్తునేమొ। దైవమా! యిక। ద్రోణశైల మెట్లుఁదెత్తు-దోవలేదిక ॥ న॥ నన్నునమ్మి మోహగుండ - నాథుడంపె ను। బన్నుగా నక్రంబుమధ్య, పట్టిజంపెను॥ నక్కటా॥

వ. ఈవిధంబున డోలాయమాన మానసుండయి యున్నహను మంతుని మకరిమ్రింగినఁ దిన్నఁగాఁ గడుపులోఁ బ్రవేశించి.

తో. దానికడుపు, బద్దలుజేసియు బవ,మానసుతుడు వెలిరాగ। ఘూనుగనదిసుర। మానినియగుచు వి,మానమెక్కి పయికేగ॥ రా॥

వ. ఆంజనేయు డాశ్చర్యకలితచిత్తుండయి వియత్తలంబున నున్న యమ్మత్తకాశినిగనుంగొని ఇంతకుముందఱ నంతబలాక్రాంత నక్రంబవై పంతంబుననన్ను వంతనొందించితివి. ఇంతలో దేవకాంతవయి యంత రిక్షమున కెగిరితివి. మంతనంబునకు వింతగానున్న దదియంతయు సంత సంబున దెలుపవేయింతీ! గమననిర్జితదంతీ! చేమంతివిరులబంతీ! యని ననాపె యిట్లనియె.

ధా, కీర్తన, కేదార, రూపకతా, సాటి.

నేనుధాన్య-మాలియను। దాననుగం,ధర్వ శశివదనను॥ నే॥పూ నిష్ఠాణుచెంత, నేబాడగ। మానించి-తానిచ్చె వి-మానంబును॥నే॥ ఈవి

మాన-మెక్కి-సత్య, మీకొలంకు। జేరి, క్రీడింపుచు । బోవనెక్క-నాడు, శాండిల్యుడు । భావమునఁ - గేవలముగఁ - దావలచెను॥ నేను॥ కోరి మోక్షగుండవిభుని- కొడుకు కేళి, గూడు మని వేడిన । నేరజస్వాలనైతి-మూఁడహములు, దీరినను । గూరిమితో । గూడుమంటి॥ నేను॥

ఉ. అంతట గంధమాదనము ♦ నందు మునీంద్రుని యింటనుండఁగా। నెంతయురావణుండు విజ ♦ యేచ్చను గ్రుమ్మరుచుంటినాటిసా। యంతనమందుఁ దావిడిసి ♦ యచ్చటబాడెదు నన్నుఁజేరియా। కంతుని కేళిఁగూడుమనఁ ♦ గా ననుముట్టగరాదు పొమ్మనన్.

తో. వినకనన్నుబై,కొని రమియించిన-దనుజుం డతికాయుండు। ఘనముగగలిగిన - గైకొనిలంకకు - జనిమెను దశకంఠుండు ॥రామ॥

గీ. స్నానమాడి నంతఁ ♦ జని మానితోనను । గూడుమన్న నతఁడు ♦ గోపగించి । నాకుమాటయిచ్చి ♦ నాయింటిలోనుండి। యన్యు గూడినావు ♦ హరిణనయన.

తో. కావుననినునే, గలయమకరినై-నీవీకొలకున నిలుము।పోవు నుజెడినిను - బొందినయాతఁడు, పుత్రమిత్రులతో నిజము ॥రా॥

వ. అనిశాపంబిచ్చిన నేనుభయపడి శాండిల్యమహాముని పాదంబులకు నమస్కరించి శాపంబుబాపుమని బహుభంగులఁ బ్రార్థించిన నఁ గరుణించి.

తో. కొంత కాలమున,కును రాముని పని,కొఅకువచ్చుబవనజుడు। చింతలకాతని,చే శాపముచను-జెలి యనె యమ్మునివరుఁడు॥ రా॥

వ. గంగాయాత్రకుఁ జనియెద నేనీకొలనిలో మకరినయి పడియుండి బహుకాలంబయ్యె.

ధా, కీర్తన, జంఝూటి, అటతాళము, పాలించరా.

నేటికిశాపముదీరె । బోటినై యిచ్చగ బోవజేకూరే। మాటికి జిక్కులుబారె। బాటిగదాపసి। పలికినవిధమున। నీటికివచ్చిన-నిను బట్టగానే। నినిను॥ నేటికి॥ మోక్షగుండేశునిపనికి । దీక్షతోఁ జవరు-దెంచితి ప్పటికి। రక్షించితివి నన్నింతటికి। వృక్షచరాధీశ । వెడలుము ద్రోణాద్రి। కక్షయముగదారి। యదియేనువినుము। దారియది॥ నేటికి॥

తో. నినుగొలనుకుబొమ్మనిపంచిన యా। తని మునియనినమ్మకుము। నినుజంపదశా।ననుడంపగ వచ్చిన దానవుడనికనుము॥ రా॥

వ. ఆకపటాత్ముని శీఘ్రింబున రూపుమాపి ద్రోణాద్రికిబొమ్మని తెలివుఁజూపిదీవించి హనుమంతునిప్పిడ్కొనిధాన్యమాలి దివికిఁజనియె. నంతహనుమంతుండు గాలనేమియున్న కడకు శీఘ్రింబున వచ్చినిలిచిన.

క. కపటాత్ముఁడతఁడుఁ గదలక। జపతత్పరుఁ డయినవాని ♦ చందముదోఁపఁగ। దప మొనరింపుచుబిమ్మట। నిపుణతతోఁ గనులుదెఱచి ♦ నేర్పునబలికెఁ.

గీ. ఎంత సేపాయెనీవేగి ♦ యింతతడవ। యేమిచేయుచునుంటివి ♦ యెఱుఁగఁబలుకు। మఱియు నుపదేశ మొనరింతు ♦ మంత్రములను। దెలియగురుపూజకేమైనఁ♦ గలదెతెమ్ము.

వ. అనిన నాంజనేయుండు గుపితుండయి.

తో. ఇదిగో! దక్షిణ, యిచ్చెద గురువర। ముదమునగైకొమ్మనుచు। వదలకబిడికిట। వక్షముబొడిచిన వాఁడుబక్షియైతెరుచు॥ రా॥ కవిసిననెరకలు, గడువడివిరచిన। గంధరవమైతగుల। దివిరిబిట్టుతలఁ- దెగబొడిచిననా। దేహముమాఱియు మరల॥ రా॥

వ. సుగ్రీవునిరూపుధరించి ఎదుటనిలిచి యిట్లనుచున్నాఁడు.

కీర్తన, పూరికళ్యాణి, చాపుతాళము.

ఇదియేమిసేపు। యిచటనేయున్నావు। మది తెలియలేవు। మరలియునచటికిరావు॥ ఇది॥ మనలక్ష్మణుడు। మఱిలేచినాఁడు। మన కేలజూడు, మందులు గిందులు నేడు॥ ఇ॥ మందులకొండ। మహిమోక్షగుండ। మందిరుడుండ। నెందుకునో వాయిజొండ ॥యిది॥

వ. అని పలికిన సుగ్రీవుండని భ్రమచెందియుఁ దిరిగి కాఁడని నిశ్చయించి కోపంబునిగుడ విజృంభించి.

తో. బెట్టిదమగుతన। పిడికిటిపోటుల। భీమంబగుపదహతుల। మట్టివాని క్షణ, మాత్రింబున నిల, మ్రింద జేసెబహుగతుల॥ రా॥

వ. ఇట్లు గాలనేమిసఁజంపి హనుమంతుడు వేగంబున ద్రోణగిరి కరిగి యొతపరిశీలించినను మందులు దొరకకున్న నిట్లనియె.

తేవారము. రాముడౌషధములకును♦ రయమునను బంపగాను। నోమహీంధరమ! నేను♦ బ్రేమతోవచ్చినాను। ఆమహామహునిపనికి♦నర పు జేయంగవలదు। క్షేమముగ మందులిచ్చి ♦ శీఘ్రమున బంపుమెచ్చి.

వ. అనిననతండు వినకున్నఁ గోపించి.

తో. రాలకుగకుదయ-రమ్మనవచ్చునె ! చాలునసీతోజెలిమి। కేలబట్టియవలీలగనే బెరి, కై దనుజుండునాబలిమి॥ రా॥

వ. అని కోపాగ్నులడరవిజృంభించి వాలముంకించి దశయోజన విస్తీర్ణంబును బంచదశ యోజనోన్నతంబును నగు పర్వతంబుఁ బెల్ల గించి నెత్తినఁ బెట్టుకొనిపోన నుద్యుక్తుఁడయిన నాయోషధులఁగాపా డుచుండు చిత్రసేనాది గంధర్వులు బహుమూఁకకోట్లమంది బయిఁబడి పోనీయక యెదిరిన.

తో. వాలపాశమున। వారినిజుట్టియు। వడిగాగిరిగిరద్రిప్పి। వాలా యంబుగ। వార్ధినిబడగా । వైచె గొందరినిగుప్పి॥ రా॥ కొందరినేలను। గూలిచెనలుకను। గొందరినొవ్వగజేసె। గొందరుబెమ్మటఁ- గోపముడిగి గిరి। గొనిపొమ్మనగాసైచె॥

వ. గంధర్వుల నిటులజియించి ధరాధరంబు నెత్తినఁ బెట్టుకొని మారుతివచ్చుచుండె నిక్కడ నందిగ్రామంబున నామధ్యరాత్రియందు భరతునకుఁ గొన్ని దుస్స్వప్నంబులుఁ దోఁచినలేచి మోము వెలవెలఁ బాఱదిక్కులు సూచుచు.

భర-కీర్తన-హిం-తోడి-రూపకము.

ఆహాదైవమా! మమ్మాదరింపుమా ! దేహముగంపించెనేమో! దిగులుదోచెను॥ ఆహా॥ రామలక్ష్మణు, లడవి, లోమెలంగుచు। నేమిదైరో! భూమిజాత। యెటులనున్నదో॥ఆహా॥ దుర్నిమిత్తము, లిపుడు-దో చెసత్యము॥ కర్ణగోచరంబుఁ జేయు, ఘనులుగలుగరు। ఆహా॥ దీక్షితో వారి।గనుపుదీరవచ్చెను।మోక్షగుండవిభునిజూచు-పుణ్యమెప్పుడో॥ఆహా

వ. అని విలపించుచు వేదపారగులగు బ్రాహ్మణులఁ బిలిపించి యప్పుడు హోమాదిశాంతులు చేయించి దానంబులిచ్చియుండె నింతలో.

సం-తో. హనుమంతుడుబా। లార్కునివిధమున । నంబరవీధినివ చ్చి। ఘనముగనంది-గ్రామమ్మునభర - తునిగనితలచెను హెచ్చి॥ రామ॥

క. రామునివలె నున్నాఁడితఁ
డేమీ! యీనిశిని నిటకు ♦ నేటికివచ్చెఁ
సౌమిత్రిమృతుండైనను
భూమిజనటు విడిచిరాగఁ ♦ బోలునుసుమ్మా!

వ. అయినఁ జెంతకుఁబోయి యడుగుదునా! వలదా! యని కొంతవడికుఁ జింతించి యంతలోఁ దనమనంబున నిట్లనితలంచె,

హ-కీర్త, అటతాళము, హిం, కాపీ.

రణనిపుణుండగు। రాముఁడువచ్చునె। యనుబుద్ధిచేతని-ట్లనుకొంటి నక్కట! ॥రణ॥ ప్రాణములతో। రావణుఁవిడచి॥ క్షోణిజసుమిత్రాసూనులవిడచి॥రణ॥ మోక్షుగుండాధిపు। మొక్కటులుండఁగ। వీక్షించిభ్రమసితి వెఱ్ఱితనంబున ॥రణ॥

వ. తనబుద్ధిభ్రమణమునకుఁ దానే నిందించుకొనుచు వియన్మార్గంబున వచ్చుచుండఁగని భరతుండు.

భ-తో. నేఁడుస్వప్నము-నేఁడుగాంచిమది। ఖేదమొందుచుండగను। ఈదుర్గ్రహమిటు-లేటికివచ్చెనొ। యిపుడేచంపఁగఁదగును॥ రా॥

వ. అని కోపాటోపంబున శరచాపంబులం గేలధరించి లేచిన భరతునకు నాకాశవాణియిట్లనియె.

తో. మీకార్యంబులు। మేకొనిచేసెడి। మీ బంధుం డితఁడగును। బ్రాకటముగగో-పముఁ జేయకుడన । భరతుఁడూరకుండగను॥ రా॥

వ. హనుమంతుండంత శీఘ్రయానంబున దక్షిణాంబోనిధిసమీపంబునకువచ్చిన రావణుపనుపున మాల్యవంతుండుఁ బదివేల కోట్లరాక్షసులలోఁగూడ దారికడ్డగించి,

మా-కీర్తన, అటతాళము, రామక్రి.

పోకురపోకుర।పోకురవానర।నీకునునాయువు, నేటితోదీరెను॥బో॥ ఒక్కరిద్దఱిని, నొంచుటగాదిది। పెక్కురచేతను। జిక్కితి వెక్కడ॥ బో॥ మమ్మెదురంగను। మాటలేయాకుధ। రమ్మటువేసియు। రమ్ముమరమ్మన॥పో॥ రాక్షసుగుండేశుని। మోహాపుతమ్ముల్ కీక్షితిఁబ్రాణము। లివ్వగ బోదువు!॥పోకుర॥

వ. అని భుజబలదర్పితులయి తాఁకి పరశు, తోమర, ప్రాసప

రిఘూదులచే నడంచిన సరకుఁగొనక శైలంబునెత్తిన దృఢముగా నిలుపుకొని.

సం, తో॥ కొందరవేసెను। గొందరద్రోసెను। గొందఱజురచురజూచెఁ। గొందఱిదోకను గ్రుమ్మించం పెమఱి,కొందరకాళ్ళనుదాచెన్॥

వ. ఇట్లు తనవారందఱు మడిసిన మాల్యవంతుఁడుగినిసి యాంజనేయుని కిట్లనియె.

క. వననిధిమధ్యంబునను। వినతాత్మజునెక్కివచ్చి ♦ విష్ణుడుపూర్వం। బునదాకి యోడిపోయెను । నినునోర్చుటయెంతనాకు ♦ నిలువరయనిలోఁ॥

వ. అని ఖడ్గంబుచేత మోదిన హనుమంతుని వక్షంబుదాఁకి విఱిఁగెనప్పుడు హనుమంతుండునొచ్చి.

హ, తో. ముదిమివాఁడవని వదలినమానక । గదిసితి మంచిదియనుచు। జదుమకవాలము,చేజుట్టియువాని, జిరజిరద్రిప్పుచునగుచు॥ రా॥

వ. వనధిలోఁ బడవయిచిన వాఁడు తిన్నగా నా మార్గంబునఁ బాతాళవివరంబుఁ జొచ్చె. హతశేషులు దిక్కులకుం బాఱిరి. అంత హనుమంతుఁడు సముద్రంబుఁదాఁటి వచ్చుచున్నాఁడీ క్షితిగని ప్రభాతంబుగావచ్చెనని శంకించి యిక్కడరాముండు విలపింపఁదొడంగె.

రా-కీర్తనే, ముఖారి, ఆదితాళము.

తోడునీడవనుచు నుంటినయో! నేడదియెల్లదీరెను।సోదర!॥తోడు॥ చూడగమారుతి। రాడుమందులుఁగొని। వేడివెలుఁగుపొడిచెను।సోదర ॥తోడు॥ భామసుమిత్రికు। భరతశత్రుఘ్నుల। కేమనితెలుపువాఁడను॥సో॥ అడవులలోపల। నాలిగోల్పోయితి। యని నినుగోలుపోతినిసోదర॥తోడు॥ ఈక్షితి మోక్షగుం, డేశ్వరనీసేవ।యెపుడుఁ జేసెదనందువు॥ సోదర॥

తో. దేనికినే జిం, తింపను మఱియొక । దానికిజింతించెదను । మానుగననుమగ-వానిగనెంచెను । దానవానుజుండెదను ॥రా॥ తనవారలనం, దరినివిడిచినా। దాపుజేరినాడితడు। నినులంకకు రా, జును జేసెదనని । నేనంటిని గదయపుడు ॥రా॥

వ. సూర్యోదయంబుగావచ్చె నింక నాతమ్ముఁడు జీవింపఁడు.

పిమ్మట నాప్రాణంబులు నిలువవు. నేనితనితోఁగూడ దివంబునకరగిన విభీషణునకిచ్చిన యభయహస్తంబు దీర్చువారెవ్వరుదైవమా!

తో. శరణార్థులర-క్షణజేసెదనను- బిరుదుపోయెనేడకట! తరణి వంశజులు - ధర్మచరితులను । దారిఁదొలఁగెనేఁడిచట ॥రా॥

వ. కాఁబట్టి యీవిభీషణుని యయోధ్యకుఁ గొనిపోయి భరతునకు నొప్పగించి యొక్క-యుపకారంబుఁ గట్టుకొమ్ముసుగ్రీవా!

రా-తో. నేజెప్పితినని- నేడుభరతునికి-నీవుచెప్పియీతనికి। నోజనుగట్టుమ, యొధ్యనుదొలఁగకు । వేజనుమిపుడీపనికి ॥రామ॥

వ. పిమ్మట నీవును గపిసైన్యంబులతోఁగలిసి కిష్కింధఁజేరుము. నాతమ్మునితోడ నేనుఁబోయెదననుజా! సుగ్రీవా! అని దైన్యంబున వగచుచుండిన రాముని గని వగపుఁజెందుచు సుగ్రీవుండిట్లనియె.

సుగ్రీ-కీర్తన, ఆదితాళము, శుద్ధకాంభోజి.

వగవవలదుదేవరా! యజ్ఞునిరీతి ॥వగవ॥ తెగువకార్యములందు। దిగులు జెందగనగునా ॥వగవ॥ ధైర్యమేసర్వసాధన।మని తెలుపుచుందు। రార్యులు వైరిసూదన। సూర్యుడువొడుచువేళ। చూడఁగా లేదీవేళ॥ వగవవలదుదేవరా॥ మూడవజామమిాఱఁగ। శ్రీమోతుగుండ। పోడ! మారుతి సేరఁగ। వేమకళ డవచ్చు । విమతౌషధములుఁదెచ్చు ॥వగవ॥

వ. అనిధయిర్యవచనంబు లాడుచున్ననుదేరక రాముండు గ్రమ్మ అనిట్లనుచున్నాఁడు.

తేవారమ-తమ్ముడా! తండ్రినన్ను♦దండకాటవులకంపెఁ। బొమ్మనెనె నిన్నుగూడఁ♦బూర్ణమగుఁభక్తితోడఁ। గ్రిమ్మరించినను వినకఁ♦గదలివచ్చితివిగాక । నెమ్మదిని మోసపోతి ♦ నిన్ను నేఁగోలుపోతి.

తో. నన్ననా ! యనీ-యెన్నడుబిలుతువు । యెన్నడువిందును జెవుల । జెన్నుగనాకును-సేవలు జేయగ । నెన్నడుగందునుగనుల॥రా॥

రా-కీర్తన, యదుకులకాంభోజి, అటతాళము.

సీతనుజెరగొన్న । యాతుధానులఁదుంచిఁదుంచి। వేతునందువు తమ్ముడా!॥ నిద్రకన్నెఱుఁగని-నీకు నేటికిదీర్ఘ।నిద్రవచ్చెనె! తమ్ముడా!॥ సీత॥ కారడవులనన్నుఁ । గాపాడివిడిచితి । ఘోరాజిలోఁదమ్ముడా ! మోతుగుండేశ్వర ముందుగరిపుల॥ దు, న్నుమనందువురతమ్ముడా! ॥సీ॥

వ. అని యిట్లు మితిమీరినదుఃఖంబుచే వగచిరాముండు మూర్ఛిల్లిన వనచరులు దేర్చిరి. ఇంతలో హనుమంతుండు సమీపించివచ్చిన నదిసూర్యోదయంబని కపులుఁ దహతహపడిరి. రాముండుఁ గన్నులుఁ దెఱచిచూచి.

తో. పగవారికిదో। డ్పడుచునుసూర్యుడు । తెగువతోఁ డబొడిచె డిని। తగవాయితనకి। దనకులజులపయి । దయజూపకవచ్చెడిని ॥రామ॥

వ. అయిన నేమి యీచండకిరణుని మక్క దండ చండకాండంబుల పాలుసేసెదఁజూడుండని కనుకొలుకులఁ గోపాగ్ని కణంబులు పొటపొట రాల.

తో. బ్రహ్మాండంబులు। బ్రద్దలుఁజేసెదు। ప్రళయకాలశివుభంగి। బ్రహ్మాది దిశాపతులువెరచి కం, పంబునొంద నుప్పొంగి ॥రామ॥ కోదండముచే-కొనిరాదాస్త్రము। గురుతుగసంధింపగను। నా దాశరథికి-నని యెఱుఁగుపతి। యతివినయముదోపగను॥ రా॥

జాం-కీర్తన, నవరోజు, ఆదితాళము.

పగగొనసేటికిరాఘవా ! నీకు॥ బగగొన॥ జగములునీశర, సంధానమునకు। గడగడవడకెనుగాదె ! ॥ పగ॥ హనుమంతుఁడుద్రో-ణాద్రినిదెచ్చెడు। గనుగొనుమర్కుఁడుగాడు॥ పగ॥ ఓషధధీధితు। లొప్పఁగ నెమ్మది, బూఘుండనుకోనేల॥ బగ॥ మోక్షగుండవర ! యీక్షణమున గపి। ముఖ్యులనెదురుగబంపు॥ పగ॥

వ. అనియిట్లు చెప్పుచున్నంతలో.

క. హనుమంతుఁడు ద్రోణాద్రిని। గొనివచ్చియుఁగ్రింద నిలిపి♦ శూరిమితోడన్। జననాథుఁజేరి । మ్రొక్కియు। వినయంబుననిట్లు పలికె ♦ విశదముఁగాఁగన్.

తో. పోవునప్పుడును-పోయివచ్చుతరి-తోవను బహువిఘ్నములు। దావచ్చుటచేఁ-దడసితిదప్పను। గావవలయు దండములు॥ రా॥

వ. అనిపలికిన రాముండానందంబున నిట్లనియె.

క. నీకేటితప్పులున్నవి । కాకుత్స్థకులాభివృద్ధి ♦ గలిగెనునీచే నీకార్యమెవరొనర్తురు । నాకూర్మిభటుండవీవు ♦ నగచరసర్యా !.

వ. అనికొనియాశెనంత సుగ్రీవుండు సుషేణునిఁజూచి.

గీ. ఇంకజాగేల గపులుని ♦ విన్నగంబు। నెక్కిదివ్యౌషధంబుల ♦ నెత్తితెచ్చి। లక్ష్మణునకిచ్చి ప్రాణము ♦ ల్బడయఁజేయు। మనఁగ నాతండు గపులతో ♦ నద్రినెక్కి.

వ. కలయందిరుగుచు నాయాస్థల విశేషంబు లగచరులకుఁ దెలుపుచు శీఘ్రంబున సుషేణుండు.

తొ. స్వచ్ఛౌషధములు-దెచ్చిలక్ష్మణున-కిచ్చఁబ్రయోగింపఁగ ను, తచ్ఛక్తిచిన-త్తరిని బ్రాణములు-దనరవచ్చెగమ్మరను॥ రామ॥ అప్పుడువానరు,లందఱుగొలువఁగ-నాలక్ష్మణుడటు లేచి। తప్పకరామునిడగ్గరి మ్రొక్కిన-దమ్ముని గరములుసాచి॥ రా॥

వ. లేవనెత్తి యాలింగనముజేసికొని కన్నుల నానందబాష్పంబులుదొరంగ చెంతనున్న హనుమంతునకు శ్రీరాముండిట్లనియె.

రా-కీర్తన, ఆదితాళము, గౌతమ.

పావనమూర్తివి। పరమబంధుడవు। పవనితమ్ముని। బ్రతికించి। కేవలసుకృతము। గీర్తియుగంటివి। నేవెలసితిధర-నిన్నుంచి॥ పావన॥ పాయకనీవలెఁ, బరహితకార్యము। జేయగనొరులకు। జేతగాదు, నీయుపకృతికిని। నే బ్రత్యుపకృతి। జేయుటకేదియు। క్షితిలేదు॥ పావ॥ మోక్షపురవరా, ధ్యక్షునికరుణా। వీక్షణగలుగఁగ। వెలసెదవు। ఈక్షితినాపద। లేమియులేక సు, రక్షితముగనిక। బ్రబలెదవు॥ పావ॥

వ. అనిశ్లాఘించి యిప్పర్వతంబెప్పటిచోటఁ బెట్టిరమ్మని చెప్పిన మంచిదని పవమానానందనుండు దక్షిణంబునఁ గొనిపోవుచుండ జలధి మధ్యంబున రాక్షసులుచూచిపోయి చెప్పిన రావణుండుఁగోపించి శంకుకర్ణ, హస్తికర్ణ, స్థూలజంఘ, మహానాద, మహావక్త్ర, చతుర్వక్త్రముఖ రాక్షసులఁబంపిన వారు గదా ముసలాది సాధనంబులతో నడ్డగించి యిట్లనుచున్నారు.

తొ. ఎక్కడికేగెద। నీకొండనుగొని। యీవార్ధినిబడవేసియు। చిక్కితివటువలెఁ - జేయకున్ననిను। జీల్తుముయుద్ధముచేయు॥ రా॥

వ. అని బహువిధంబుల ముసరి నొప్పించినఁ గోపించి యుగాంతకారుండయి.



తో. కాలదన్నుచును । నేలగుద్దుచును । వాలముతో విసరుచును । వేలసంఖ్యలగు । వీరరాక్షసుల । నేలగూల్చి నవ్వుచును ॥ రా॥

వ. కొండ, గొనిపోయి యెప్పటితావున నుంచివచ్చి రామునకు నమస్కరించి తానుంబోయివచ్చినసంగతియు రెండుసారులు నుదనకుం గలిగినయాటంకములు విన్నవించె. పిమ్మట వానరులందఱు లంకలోనికి జని సింహనాదంబులు చేసిరి. అంత సూర్యోదయంబాయెనప్పుడు, రాముండు లక్ష్మణున కిట్లనియె.

తో. అనుజనాదుభాగ్యంబున జేసియు। నిను గమ్మఱం బడసితిని। యనిలజుండనుఘున। మైననావచే। నాపదబ్ధిగడచితిం ॥రామ॥

వ. అనిన లక్ష్మణుండిట్లనియె.

ల-కీర్తన, హిం, భైరవి, అటతాళము, నమిలాం

ఇక నేటికిజాల। మినకులతిలక! మీ। శేలయోచింపగను ॥రామ రామ!॥ఇ॥ సకలముదెలిసిన, స్వామిమీకుదెల్ప, టకునుశక్తుడనాను నే॥ రామ ॥ఇ॥ మనుజావతార మెత్తినకారణంబును। మదియోచింపదగును। మునుదండకవన- మునులకిడిన యభయ । మునుదీర్పగాందగును ॥ రామరా॥ఇ॥ ఆక్షీరాబ్ధికడ। నమరులతోడమీ। రన్నమాటదీర్పుము। మోక్షగుండేశ్వర । దీక్షతోనీవేళ । రాక్షసేశ్వరు దునింపుము॥ రామరా॥ ఇ॥

——— మైరావణునికథ. ———

వ. ఇట్లుపలికిన లక్ష్మణుని వాక్యంబులకు రాముండుసమ్మతించి యుండె నిక్కడ రావణుండుం జారులవల్ల నావార్త విని నివ్వెఱగంది సభాసదుల కిట్లనియె.

క. మూలబలంబు నశించె। సమూలంబుగ నింద్రజిత్తు ♦ మొదలగుశూరుల్। గూలిరిచిక్కితినొక్కండ నేలీల జయింపనగును ♦ నినకులునింకన్.

వ. మయదత్తంబగు మదీయ యమోఘశక్తిచేత లక్ష్మణునిపడవైచిన సంజీవని సహాయముచేం బునర్జీవితుని జేసికొనిరి. నాచేయు యత్నంబులు విఫలంబులగుచున్నవి మంత్రులారా!

తో. ఐరావణుడన-మైరావణుడన-నారసాతలమునందు। ధీరులు గలరుమ, దేయబంధువులు-వారుశూరులై యుండ్రి ॥రా॥

వ. వారుసహాయపడిన రామలక్ష్మణుల నిరాటంకముగా జయింపవచ్చునని యోచించి తగినదూతనేర్పరచి.

రావ-కీర్తన-ఏకితాళము, కమాను, గంగా.

మైరావణా! మావార్త-మఱివినదగు॥మైరావణా॥ ధారుణిని రాముడనగను। దగునొకఃపనుజుడు॥మైరావణా॥ పూని, వాని। చెలిదెచ్చితిని ॥మైరా॥ కపుల గలిసి సా, గరము ద్దాటి లం, కను జేరిరి ॥మైరా॥ నా కన్న సుతుల। నాకన్న హితుల। జేకొన్నధృతుల। భీకార్చియతుల। భీకర గతులను। బీరములాడుచు। బెదరక నిలిచిరి ॥మైరా॥ బెదిరించి-దుపులముంచి, విదళించి। యెదురించుధీరు, లిందెవరులేరు ॥మై॥ వైరుల గెలువగ-వశముగాదు ముద। మారమోక్షపుర। శ్రీరామునితో।బోరాడగనో। శూరాగ్రేసర! చేరితోడుపడి।పోరిగెల్చికడ, తేర జేయు॥మైరా॥

వ. అని సమాచారంబువ్రాసి యాపత్రిక నిచ్చి దూత నొకనిం బాతాళలంకకనిపిన వాండుజని మైరావణ యైరావణులం గని నమస్కరించి యుత్తరంబిచ్చిన జదువుకొని యాశ్చర్యంబునొంది ప్రత్యుత్తరం బిట్లని యిచ్చిరి.

క. శ్రీరామలక్ష్మణులనే। నీరాత్రికిం బట్టి తెచ్చి ♦ యిచ్చెద బలిదుర్గారంబుగం గామాక్షికి ♦ నోరావణ ! వెరపుమాని ♦ యుండుము కడిమిన్॥

వ. అని వార్తవ్రాసి పంపినం జూచుకొని యానందించి రావణుండుండె. నిక్కడ విభీషణాప్తులు.

క. సౌమిత్రిమూర్ఛ వోయిన। రామునిచేగొట్టబడియు ♦ రావణుడరిగెన్। ఏమో ! క్రమ్మరరాలే। దేమాయకుం జొచ్చినాడొ ♦ యెఱుకపడదహా!॥

అయిన నేటిరాత్రి జాగరూకులమై యుండందగునని యెంచి.

తో. హనుమంతుండు దో, కనునాకాశము-దనుకగోటగాగట్టి। యినకులవర్యుల - వనచరులనునం, దునిచి తానుగనిపెట్టి॥రా॥

వ. జాగరూకుడై యుండ విభీషణుండును జుట్టు తిరుగుచుండె

నిక్కడ నపరరాత్రియందు మైరావణుండు ధనపానుపుపయిం గూర్చుం డియోచింపుచుండిన వానిభార్యయగు మాతంగియిట్లనుచున్నది.

మా, కీర్తన, ఏకతా, సతతం.

ఏమియోచనా। యేదైనదోచెనా ॥యేమి॥ స్వామి! సురతముల, సరసముఖములను-దనిసితిరిది ॥యేమి॥ అర్ధమరాత్రిః।ఘోరమాఃమిా। రెద్దియో! యోచించు-చీరీతినున్నార ॥దేమి॥ ప్రాణపదంబైన।భార్యకు నెఱిగింప రానిరహస్యమె। ద్దేనియున్న దేయి ॥దేమి॥ మోక్షగుండేశుని। సాక్షిగసంకల్ప, మిాక్షణమునదెల్పు। డేమిసందేహమి ॥దే॥

వ. అని వేడినభార్యకు మైరావణుండిట్లనియె.

సీ. రామచంద్రుండను ♦ రాజుభార్యయుండాను దండకావన ములం దుండెనొకట। దశకంఠుడేగియా ♦ తని మోసపుచ్చితదీయ భా ర్యను వేగం ♦ దెచ్చిలంకం। జేర్చెనంతటంగని సేనతోందమ్మునితో గూడిరాముండు ♦ సాగరమును। గట్టిలంకకుంజొచ్చి♦ముట్టితదామాత్య పుత్రమిత్రులనెల్లం ♦ బొలియజేయ। నొక్కరుండుచిక్కి రావణుం ♦ డు కృదక్కి। నాకుంబుత్తెంచెగానమా ♦ నకనుబోయి। రామలక్ష్మణులను బట్టి ♦ రమణిదెచ్చి। కాళికాంబకు బలియిత్తుం ♦ గంజనయన॥

వ. అనవిని యమ్మానిసీరత్నం బిట్లనియె.

మా-కీర్తన, కమాస్, ఆదితాళము, లేరైరే.

ఇది-యేమిపైనము। హృద। యేశామానుము ॥ఇది॥ రాముండన నా-రాయణుండు ద। ద్భామసీతయగు। ధరబుట్టెనుయివి ॥ ఇదియే॥ ద నుజకులాంతకుం, డని తెలియకయూ, తని బైకొనిచెడె, దశకంధరుండిది॥ యే॥ తననుగట్టుటకు దార్కుడాసచే-కొనివచ్చినరీ,తనినున్న దియిది॥ యే॥ ముందుగజనినీవు। మోక్షగుండరఘు। నందనుమనపురి। కిందేనేలని॥ దేమి॥

వ. అని ప్రార్థించిన నతండువినక భార్యకిట్లనియె.

క. బోటీ! శ్రీరాములకే। నాటికినేవెఱవ నతండు ♦ నన్నెదిరిం చే। పాటిబలిష్ఠుండుగాండు। కేటికినగ చెదపు పోయి ♦ యిపుడే తెత్తున్.

వ. అనివీరసాహసంబున లేచి తత్క్షణమే లంకాపురమున యు ద్ధభూమికిం జేరి విభీషణ వేషంబున హనుమంతునితోం గొంత ముచ్చటిం చి పిమ్మట హనుమద్వాల నిర్మితమగుకోటలోంజొచ్చి.

తో. అచ్చటనుకశిల, యందు బాఁడి యు, న్నట్టి రామలక్ష్మ
ణుల। మ్రిచ్చిలిశిలతో। మోసుకనిద్రిల-మునిగియున్న యాఘనుల॥ రా॥

వ. కైకొనిబయటవచ్చి యాంజనేయుఁడు మాటలాడి యతి
వేగంబున రసాతలంబుననున్న తనమాదిరంబున నాశిల యుంచెఁ దద
నంతరంబ.

తో. మరల విభీషణుఁ, డరుదెంచియు హను। మంతహెచ్చరిక
యనఁగ। ద్వరగాఁగ్రిమ్మర, వచ్చితివేమన। దనుజుఁడుగోజనికనగ ॥ రా॥

వ. రామలక్ష్మణులు లేకున్న సుగ్రీవాదికపులను లేపి యందఱు
గలిసి వెలుపటికి వచ్చి హనుమంతునిజూచి హాహాకారంబులు చేయుచు.

వాన-కీర్తన, వసంతరాగము, అటతాళము, మేర లేదు.

లేరు లేరకటా! మనసాములు॥ లేరు॥ లేరెవ్వరును బవ,ళించినచో
టికి॥ రారనుకొంటిమి॥ రామలక్ష్మణులు ॥ లేరు॥ మనముజాగ్రతగానె॥ కని
పెట్టియుండిన। మనలమాయముంచి। కొనిపోయెనెవ్వఁడో ॥ లేరు॥ అడు
గులజాడవెం, బడి నీప్రజసిన నిప్పుడేదాపులోగను। పడగలరుదొరలు ॥
లేరు॥ రాక్షసేశ్వరుడు। రావణాసురుఁడు। మోక్షుగుండేనుని। మోస
పుచ్చియుండు॥ లేరు॥

వ. కాబట్టి త్వరగానీవుచని జయముఁబొంది మనప్రభువులగొని
రావలసినది యని హెచ్చరికచేసి సుగ్రీవ జాంబవంతాదులు ప్రేరేప
తత్క్షణంబున.

క. హనుమంతుండుత్సాహముఁ। దనరఁగనాజాడవెంట ♦ దక్షి
ణదిశకుర్గా। జనఁగ నికుంభిళకును జ। య్యనజేరిన నచట నిలిచి ♦ యా
రయుచుండెర్గా.

అంత నక్కడ గర్భవతిగానుండిన కబోతపక్షి పురుషపక్షి కిట్లనియె.

తో. నరమాంసముఁదిన। నాకుఁగోర్కెయు,న్నది దెచ్చిమ్మనియ
డుగ॥ బురుషపక్షి యు, ప్పుడుముదమునదన॥ పొలఁతికిట్లనియెవడిగ॥ రా॥

ఉ. రావణుతోడఁబోరు రఘు ♦ రామునిలక్ష్మణు మోసపుచ్చి॥
మైరావణుఁడారసాతలము ♦ రంజిలఁజేరెను రేపు గాళికా॥ దేవి సమీప
మందుఁ దెగ ♦ దీసిసమర్పణఁజేయువారలర్గా। గావున నేనుబోయి యది ♦
గైకొనివచ్చి యొసంగెదన్నుమా!

వ. అనిచెప్పెడు కపోతవాక్యంబులువిని యలరారి హనుమంతుండు రసాతలమునకుఁబోవ యత్నించి యుదకమందుఁ దిగఁ బోయిన దత్పాలకుండగు మకరధ్వజుండిట్లనియె.

మకరధ్వజ హనుమత్సంవాదము-కీర్తన, ఆటతా॥ మేలయినవలె.

మ-ఏమిరపోయెద । వెక్కడవిూయునికి । యెవ్వరివాఁడవురా.
హ-రామునిదూతను। లంకాపురమునుంచి। రానామెనిసుబోదురా!
మ-ఇక్కడనీకిపు-డెవ్వారితోఁబని-యెఱిగింపు నాకొడను.
హ-రక్కసుఁడైన మైరావణుఁగనుగొన-జక్కఁగ బోయెదను.
మ-వానితోనేపని-వచ్చెనువెనుకొన । వానర తెలుపునన.
హ-మానుగమా రాము-మాయచేఁ గొనిపోయె । గాన వెదుకబోదును.
మ-శ్రీమోక్షగుండేశు-సేవించుమాతండ్రి-క్షేమమెవాయుజుండు.
హ-ఆమారుతికి భార్య-యవనిలో లేదునీ-వాత్మజుఁడెట్లయితివి.

వ. అనిన మకరధ్వజుం డిట్లనుచున్నాఁడు.

ద్విపద. శ్రీరామునాజ్ఞచే-సీతనుజూడ । మారుతిలంకకు-మఱిపోయినపుడు। వాలంబుదానవ-వరులుగాల్పంగ। దాలంకఁగాలించి-తద్దయుదోఁకఁ । జల్లార్చుకొనివార్ధిజలమందునోటి । కళ్ళైవిసర్జించెఁ-గడుకేకరించి । యాకళ్ళభక్షించె-నందొక్కమకరి । యేకటిదానికి-యేర్పడెబిడప। మకరధ్వజుండన-మహినీబుట్టితిప। మకరంబునాతల్లి-మారుతితండ్రి మైరావణునియాజ్ఞ-మకరాలయమున । నారసాతలమున-కన్యులఁబోవ । నీకనాగుచునుండు-నిచ్చటనేను । నాకన్నతండ్రీయు-న్నాఁడెక్షేమముగ॥

వ. అనిన సంతోషించి యాంజనేయుం డిట్లనియె.

హ-కీర్తన, కళ్యాణి, ఆదితాళము, మనవిని.

నేనేనకోరా! హనుమంతుండ॥ నేనే॥ మానసముననను। మానముపలర్ధిఁక। మకరధ్వజకసరా! హనుమంతుఁడ॥ నే॥ ఘనముగనీ, చెప్పిన చొప్పున నే। మునుపొనరించితిరా! హనుమంతుడ॥ నే॥ నాకొమరుడవైనను మంచిది యిక। నాకు దెరువుజూపు॥ హనుమం॥ నే॥ మోక్షగుండరాముని గొనిపోయిన । రాక్షసుగనబోదు॥ హనుమం॥ నే॥

వ. అని తెలిపిన సంతసించి మకరధ్వజుండు దండ్రికి నమస్కరించి యిట్లనుచున్నాఁడు.

మక-తో. జనకా! మైరా-వణుడు రామలక్ష్మణులనిటులఁగొనిపో యెద । దననగరంబున, కును జేర్చెనువా, రిని దేవికిబలిదీయగ ॥ రామ॥

వ. సంకల్పించియున్నాఁడు. కాఁబట్టి యీమార్గంబునఁ సూక్ష్మ రూపంబుగ నీవేగి కామాక్షి దేవాలయంబునఁ జేరుము. సర్వంబును దెలియఁగలదని తెరువుసూపిన.

క. త్రిసరేణుమాత్రుఁడై సం । తసమున నాదారిదూరి ♦ త్వర గాఁజని వా। యుసుతుండుచేరెఁ గామా । క్షీసదన మసదృశ వివేక ♦ శేముషిదనరన్.

వ. ఇట్లు కామాక్ష్యంబ దేవాలయంబునఁ గవాటంబు బిగించి ధైర్యంబుననుండె నిక్కడ మైరావణుండు దనసతితో నిట్లనుచున్నాఁడు.

మై-తో భామా! వద్దని-పలికితివిగదా! రామలక్ష్మణులజూడు । కామాక్షికిబలి-గావించెదనా-సామర్థ్యముగను నేను॥ రామ॥

వ. అనిపలికి చూపించిన నామె కటకటపడుచు నడ్డముగావచ్చి యిట్లనుచున్నది.

మాతం-కీర్తన, ఆదితాళము, ఆహాబాల.

ఈయన్యాయ। మిటుల జేయ-నేలదో చెన్ను పాయకనే-జేయుమన వి-ద్రోయనేలను॥ యీాయ॥ నీకేమైన। యపకారము। నేనుచేసిరే। చేకొ నిశీ, క్షింపనీచే-జిక్కువారలే॥ ఈయన్యా॥ •రావణునిరీ-తిగను-నీవు జెడగ। లావునవీరిని దెచ్చి, నావువడిగ॥ •యీాయ॥ జీవితేశమోక్షుగుండ । దేవ్రుడ నుచు । భావమున నెంచివిడుమీ । బ్రితుకునిలునౌ ॥యీాయ॥

వ. అని విశేషంబుగాఁ బ్రార్థించిన నామాటనిరాకరించి యనే కరాక్షసదళంబు లాయుధధరులయి కొలువనై రావణునితోఁగూడి శ్రీ రామలక్ష్మణులున్న శిలయెత్తుకొని కామాక్షిగుడిసన్నిధికివచ్చి నిలిచి.

మై-తో. రామలక్ష్మణుల-రయమునబలియిడఁ-గామాక్షీ జగదం బ! మేముదెచ్చితిమి - మేకొనివీరిని - మ్రింగిపోవుమమ్మంబ! ॥ రా॥

వ. అనువాక్యంబులు విని హనుమంతుండు దేవి పలికినట్లుగా సూక్ష్మస్వరంబున నిట్లనియె.

క. దేవాలయంబులోపల । రావలదావలనెయుండి♦ రాక్షసులా రా! యావత్పూజనివేదన। సేవగవాక్షములగుండఁ♦జేయుఁడు భక్తిన్.

దేవి-కీర్తన, ఏకతాళము, రామచంద్రిక.

రాక్షసేంద్రులారా మనో, రంజనంబు జేయుడికను। అక్షయబలములు।నన్నమాంసములు। దీక్ష వేయుడు గ। వాక్షంబుల నే॥రా॥ రామ-లక్ష్మణులక।సుమముల। నేమయినను బూ-జించి ధనుర్ధరు-లై మెరయంగనయంబున దెండిటు॥రాక్షసేం॥ ద్వార,ముక్త సగముక్త- దెఱచియు। వారు మోక్షపుర। వరులయిననునను। జేరద్రోసి తుష్టిని చేయగదగు॥రా॥

వ. అనంతరము కవాటంబు మూసికొని మీరు దూరంబున నుండుఁడు. సమస్తకార్యంబులుఁ జక్కపడునని చెప్పిన వారు హర్షించి తత్క్షణంబున.

క. పూజాద్రవ్యంబులు గొని। పూజించి చతుర్విధాన్న ♦ ములు రాసులుగా। నోజగ వాక్షంబుల నే। యాజగధీశ్వరికి నిడిరి ♦ యసుర వరేణ్యుల్.

సం-తొ॥ అతులితపంచా, మృతకలశంబులు-నర్పించిరి యొకకోటి। యతిశయమధుర ఫలాంచిత పేటిక-లర్పించిరి యొకకోటి॥రా॥

వ. ఇట్లువైచిన నవియన్నియు నాంజనేయుఁడు క్షణమాత్రంబున భక్షించి తిరిగి యిట్లనుచున్నాఁడు.

దేవి-తొ॥ ఏమియొసంగుట। ఈగ్రాసంబులు। యేమిత్రృప్తియగు మాకు। మామదియలరఁగ।మరిసలుపుటధ-ర్మముగాదే!యికమీకు॥రా॥

వ. అనిన నాశ్చర్యకలితచిత్తులై దానవపుంగవులు భటులంగాంచి.

మై-కీర్తన, పూరికళ్యాణి, ఆదితా, అమిత్రాగ్రి.

భటులార! లెండి। బరువడిపొండి! ధృటిలో నడిండి। దేవికి వండి తెండి॥భటు॥ ఆలశ్యమైన। నలుగుబిరాన। నేలీలనైన। నీవలెగానదాన॥భ॥ మనయిండ్లయందు। గసియున్నదందు। కొనిరండియిందు। దినితృప్తి జెందుముందు॥భటు॥ పోలపుగ మోక్ష। పుర రామలక్ష్మ, ణులదిని రాక్ష। సులబాధించు నేకదీక్ష॥భటు॥

వ. అని వేగంబునఁ దఱిమిన రాక్షసదూతలు మహాట్టహాసంబునఁ జని రాజగృహము మొదలు ప్రతిగేహంబును బరిశోధించి.

సం-తొ॥ మిగిలినవస్తువు। లెగబెట్టినయవి। మెతుకును బోసీకుండ। దగిలి వెతికి సత్వరగాఁ గొనిచని। దను జేసుడు గనుచుండ॥రా॥

వ. కొండలపొడవు రాసులుగాఁబోసిన భోజన పదార్థంబులు పోరణగండ్లగుండ దేవికి రాక్షసు లర్పించుచుండిన నవి హనుమంతుం డు మెక్కుచుండె, ఇక్కడ నగరంబునఁ బ్రతిగృహంబునఁ గలకల ధ్వనులు మొదయ్యె నంతఁ గొందఱు నారీరత్నంబులు గుమిగూడి యిట్లనుకొనుచున్నారు.

కీర్తన-హిం, కాపి, అటతాళము, ఏలాగుతా.

ఇయ్యాగడంబున। కెంతనివగతునె! నేడి॥ య్యాగ॥ నెయ్యిపాల్ పెరుగులు। బొయ్యమని బాధించిరి॥ నేడియ్యాగ॥ తట్టెడతిరసములు।జు ట్లాలవిందుకు జేసి। యుట్టిమీఁదదాచిపిరి। పొట్టన బెట్టితిగదె॥ నేడియ్యాగ॥ అమ్మిసమర్తకు జేసి।చిమ్మిలియుండలునాదు। జిమ్మమీద వేసికొన,నమ్మ కొనిపోయినారు॥ నేడియ్యాగ॥ తెల్లవారి యేడిచేటి,పిల్ల కొక్క మెతుకైన । గల్లగాదులేకుండగ। గొల్ల వెట్టిరిల్లుసొచ్చి॥ నేడి॥ పెండ్లికని జేసినట్టి,పిం డ్లుమాపిల్లవాండ్రడ। కండ్లబడకుండ దాచి। వీండ్లకర్పించితిని॥ నేడి॥ ఈపగి దిమనగీములు। దోపించిన పాపాత్ముల రూపుమాప మోకుగుండ। శ్రీ పతిని వేడరమ్మ॥ నేడియ్యాగ॥

వ. అని వేవిధంబులుగా నాక్రందింపుచుండి రంతట హనుమం తుండు రాక్షస దత్తపదార్థంబులఁ గడుపార భుజించి సంతుష్టుడై దను జుల కిట్లనియె.

తొ. భక్ష్యభోజ్యములు • గుక్షినిండనే భక్షించితి నికజాలు। భక్షించెద రామ, లక్ష్మణులను•లో, పలికి పంపుడిదిమేలు॥ రామ॥

వ. అనిన వారానందించి.

తొ. శరచాపంబులు, ధరియించినరామ-చంద్రలక్ష్మణుల లేపి। సరగున సుమభూ, షణభూషితులుగ-సలిపిలోపలికిఁ బంపి॥ రా॥

వ. తలుపుబిగించిరంత హనుమంతుండు నమస్కరించిన రామ లక్ష్మణు లాలింగనంబుఁ జేసికొని రామీఁదఁ దలుపుదీసికొని వెలుప టికివచ్చి గుణధ్వనిచేసిన.

తొ. దిక్కులయందుఁ బ్రతిధ్వనులొదవెను। దిగ్దంతులుభయపడెను। జుక్కలురాలెను। శూరులగుండెలు। బక్కనబగిలెను దగను॥ రా॥

వ. ఆధ్వనికడలి సేనలు భయభ్రాంతులయి యురుకుచుండ నై రావణుండు వారలకిట్లనియె.

ద్వై-కీర్తన, కన్నడరాగము, రూపకము, సరియేమె.

పో, నేలసేనలార। భయపడి॥ పో॥ అవ, లీలవారిముట్టి। రణ, కేళియందుఁబో కార్పక॥ పో ॥ మను, జాశనులకుమనకు। మను, జేసుల నఁగ నెంత, రణ, కౌశలంబుజూపి। యిల, నాశమొంద పో, రాడఁగ॥ పో॥ పరిపంథులను వధించిమన, బంధువైనయట్టి। దశ, కంధరునకుఁబ్రీతి, శుభ-మొందనేనుగా, వింపక॥ పో ॥ ధర, మోక్షగుండవిభుల। వడి, శిక్షజేయలేని। మన, రాక్షసత్వమేల। యొక, దీక్షగాను పో,రాడక॥ పో॥

వ. అని వారిని బురికొల్పిన నమ్ముర్వారిపయి నిశితసాయకమ్ములు గురిమ్మిన నన్నేటిబలులు వెనుదీయక.

క. ఒక్కొక్కశరము ధనువున
నెక్కిడి తెగనిండ దిగిచి ♦ యెడఁదగులఁగ దా
గ్రిక్కున నందఱవైచుచు
నొక్కుమ్మడి ద్రుంచె నసుర ♦ యోధులనెల్లన్.

సం-వ. ఇట్లు క్షణంబులో వారిని మడియించినఁ గని మైరావణుండు మేఘవల్లభ, ఘటక, సంచర్మక, భైరవముఖ, సింహాముఖ, సర్పముఖ-కర్కోటకముఖ- పంచముఖాది ప్రధానుల యుద్ధంబునకుఁ బురికొలుప వారు సింహనాద భుజాస్ఫాలనంబులుఁ జేయుచు ననేకకోట్ల రాక్షసదళంబులతో వచ్చి తాకి.

రాక్ష-కీర్తన, రూపకతాళము, జనకనామ.

భళిరెమాతోడ। కలిసిపోరాడ। గలరెమూపోరిడ। గడువడిజూడ। బలువైనబాణములు। బరపమీప్రాణములు। నిలువన్। గలవే। కాయంబులలోనిలలోశూరులె॥ భళిరె॥ ఆరావణాసుర। ఉవనిజనే తెచ్చె। మైరావణుడన్న। మరిమిమ్మే తెచ్చె। యీరసాతలము। జేరితిరిటనుండి, మీకేరీతిన్ మహిఁకిన్। జేరన్ నేరుతురింకన్॥ భళిరె। మాయలునేర్చిన। మాతోడడికొన। మీయబ్బతరమౌన, మిమ్ముమిపుతుమా ! కోయని శ్రీమోక్షగుండేశరణములో। గూయన్ జయన్ హాయన్ దోయన్, బాయన్, దరమే॥ భళిరే॥

వ. అని ప్రసంగంబులు జేయుచున్న దానవమంత్రిలను గద్దించి మరున్నందనుండుద్దండంబుగా నడ్డంబువచ్చి.

తో. శ్రీరామునితో। బోరుశక్తిగల, వారా! దానవులారా! మారాడక మీ, నోరులు మూసుక। మరలిరండనను జేర॥ రా॥ ఒక్కతొక్కకే! యుక్కుదక్కి మీ, రుర్విని గూలగ జేసి। యిక్కడనే దే, వికిఁ బలియిచ్చెద। మక్కుమారుగా గోసి॥ రా॥

వ. అనిన వారిలో వారు నవ్వుకొనుచు నిట్లనుచున్నారు.

రాక్ష-కీర్తన, పీలురాగము, ఆదితాళము, తల్లి.

అబ్బా। యబ్బా। కోతిగదబ్బా। పైబడు। నబ్బా తిను నిపుడబ్బా॥ దెబ్బలివలెబడ। బొబ్బలిడుచునా। దెబ్బజూడుమని। గొబ్బున వచ్చెగ॥ దబ్బా॥ కోతితో డమా, ర్కొని పోరాడగ। యాతుధానులకు। జేతనౌనెపదు॥ డబ్బా॥ తీయసిఫలములు। గాయలు బెట్టుదు। పాయక నిదిమనపైకి రాదుపదు॥ డ॥ ఘనమోక్షపురీ, శుసిదన వెనుకను। నును చుకమనపై కురువడివచ్చెగ॥ దబ్బా॥

వ. అని యుపహాస్యంబులాడుచు లెక్కపెట్టక ముసలముద్గర ప్రాసత్రిశూల భిండివాలాది సాధనంబులు పైఁబరపి సింహనాదంబుఁ జేసిన యాంజనేయుండుప్పొంగి.

ఉ. కొందఱఁ బాదఘట్టనలఁ ♦ గొందఱ వాలముఁ జుట్టి వేయుటన్ గొందఱ ముష్టిఘాతముల ♦ గొందఱ జానులఁ ద్రోడఁ గుమ్ముటన్ । గొందఱ దంతఘాతములఁ ♦ గోయని కూయుచు నుండ వారలన్ । మ్రందఁగ జేసె నొక్కక్షణ ♦ మాత్రమునన్ హనుమంతుఁ డయ్యెడన్.

వ. ఇట్లు హనుమంతునిచేతం దనమంత్రులు సేనాధిపతులు సైన్యంబులు నశించిన నలిగి మైరావణుండై రావణసహితంబుగా సహస్ర తురంగవిరాజిత దివ్యకనకస్యందనం బెక్కివచ్చి నారిసారించి మారుతి కిట్లనియె.

మై-కీర్తన, కమాసు, ఏకతాళము. రామాభూ.

రారా! మాపయిన్ బోరగ। నేరాశూరుండవయిన॥ రారా॥ వారుపీరనక। బేరుపెంపులేక। మారుతిమాటి తి వారీతిగారింపగను॥ రారా॥ తోకద్రిప్పుచును। గేకవెట్టుచును। డీకొనిచేకొని। పైకొనిపోకార్చితివి॥ రా॥ మోక్షుగుండధవు। ముఖ్యభక్తుండవు। రక్షింతు-శిక్షింతు-భక్షింతు వృక్షాటవర॥ రా॥

వ. అని దట్టించిపలికి కొన్ని బాణంబులు వయిచిన నవిరాముండు నడుమనే త్రుంచి యిట్లనియె.

క. నన్నుంగదా ! కొనితెచ్చితి । విన్నగచగుపయిసిశరము ♦ లేయంగనేలా! నన్నే వ్రేయుము వగార్కాని । వన్నెయుబాసియును దెలియ ♦ వచ్చునుబిదపన్.

వ. అనిన వాండు రోషించి నిశితాస్త్రంబులు గణనాతీతంబు గాం బ్రయోగించిన రాముండవి తనశరంబులచే వారించి యొక్క య మోఘాస్త్రంబు వింటసంధించి విడిచిన.

సం-తో. అదిచనియాతని। రథరథ్యంబులు। నవసబడగవడిద్రోసె। వదలక మరియొక। కదుపునువ్రేయగ । వారిప్రాణములుదీసె ॥రా॥

వ. ఇట్లు ప్రాణంబులువాసి యవనింబడి యాతలోం బునర్జీవి తులై కదిసి.

మై-కీర్తన, ఆదితాళము, ఏదిరా.

మమ్ముగెలుతురా । సమ, రమ్ముజేతురా॥ అమ్ములముంచి । రొమ్ముగలించి। మిమ్ములదున్మించి । మ్రింగుదుమెంచి॥ మమ్ము॥ తుక్క దైత్యుల, బడ-గ్రుక్కినట్టుల। మక్కువయుంచి-మమ్మెదిరించి। త్రొక్క దలంచి। సిక్కురుమించి॥ మమ్ము॥ మోక్షపురవర। యిక। శిక్షయగుధర। రాక్షసులందు లక్ష్యములేక । యీక్షణమందు । నిలగూల్తుమిందు ॥ మమ్ముగె॥

వ. అని చెప్పుచుం గొన్ని మార్గణంబులు వైచిన రాముండు లక్ష్మణునితో:

క. మృతులైవీరుపునర్జీ । వితులయి మనమీందికిపుడు ♦ వెడలె దరిది య। ద్భుతముగనున్నది సోదర। బ్రతుకున కేదయిన మందుం ♦ బడయంగంబోలున్.

వ. ఐనం జూతమని యెంచి.

తో. పటుసాయకమొ, క్కటియెక్కిడిత, ♦ ప్పకలక్షించియు వ్రేయ। గుటిలరాక్షసులు-గూలిలేచియె-ప్పటివలె దమపయిడాయ॥రా॥

వ. రాముండాశ్చర్యపడి మగుడయుద్ధంబునం దగులువడియె నిట్లనూనపర్యాయములు విసుకులేక రాముండుహతంబు చేసినను పునర్జీవితులై వచ్చుచుండి రిదిగని యా రహస్యం బెఱుంగంగోరి.

సం-తో. హనుమంతుఁడు బత్తనములోనికిఁజని- యందొకనాతిని గాంచి। వినయంబుననా। మెనులాలింపుచు। దనముచ్చట వివరించి ॥రా॥

వ. ఇట్లని యడుగుచున్నాఁడు.

హ-కీర్తన-ఆదితాళము, కమాస్, ఇటురమ్మా.

ఏ, మమ్మాకుటిలకుంతలీ। అన్నెరావణ। మైరావణుల। నమ్మల గూల్చిన-నపుడులేతురే ॥మమ్మా॥ మృతులగువారు । బ్రతుకుటగలదే క్షితిలోమాక, ద్భుతమగునిదియే ॥మమ్మా॥ వారుమగుడలే-వకయుండు టకుఁ। గారణమెఱిఁగినఁ । జేరితెలుపుమా॥ మోక్షుగుండరా, ముందు నీకోరిక । యీక్షణమున నెర-వేర్పఁగలడదే॥మ॥

వ. అనియడిగిన నామెసంతసించి యిట్లనుచున్నది.

సీ. నాగకన్యనునేను ♦ నన్నుభోగించుటకై రావణుఁడు దెచ్చె నయ్యెయిటకు । మైరావణుండును ♦ మారుకేళినిగూడవచ్చు నిత్యంబును ♦ వలపుగదుర । వానితోఁగూడిన ♦ వీనికిఁగోపంబు వీనితోఁ గూడిన ♦ వానికలుక। యిద్దరితోఁగూడి ♦ యేచుఁగృశించితి జవసత్వములు జోయెఁ ♦ జాలువీడుచు॥ జచ్చిపోవుట నాకును ♦ సమ్మతంబె। వైన శ్రీరామచంద్రుండు ♦ హర్నిశంబు। నన్నుఁగూడుటకొప్పిన ♦ నగచరేంద్ర। వాండ్రమర్మంబుజెప్పు దవశ్యముగను.

వ. అనిన నాంజనేయుండు.

హ-తో. రాముని కడు, భారంబుచేతఁదగ-నీమంచము విఱుఁగ కను। భామినియుండిన-భ్రాంతిదీరనినుఁ-బరగఁగూడు దప్పకను॥రా॥

వ. ఇందుకు సందియంబు లేకఁ దెలుపుమని యడిగిన నామె యిట్లనియె.

నాగ-కీర్తన, శహనరాగము, ఏకతాళము, ఎంతసినే.

హనుమంతా। గుణవంతా। వినుపించెదనంత।మైరా। వణుమర్మంబును॥హ॥ మునుపుడుమ్మెదల। ముంటఁగ్రుచ్చుచుం । డినఁగని బాలకులనువీరుడిపిరి ॥హను॥ భ్రమరంబుల్ । తమచాన్పుల్ । బాపినవారిఁగని సమరంబునమీరు। జావొదవితఁజె ॥భ్రమ॥ అమృతంబును గా, యములఁదెచ్చియిడి। మిముఁబ్రతికింతుము । మేమనియనెనవి ॥హనుమంతా॥ అదిమొదలుగా। యెదబొదలగ। యాపత్పదగనులు । వదలకయున్నవి-

వారిపడకలను । అదిమె। వెదకియువాటిని జహపమోక్షపుర । సదనుని చేతను । జచ్చెదరసురులు ॥ హనుమంతా ॥

వ. అని తెలిపిన నానందించి హనుమంతుండుఁ దక్షిణంబునవారి నిద్రాస్థానంబునకుఁజని పానుపునాశ్రయించియున్న తుమ్మెదలనుగాంచి.

గీ. కోటికోటానుసంఖ్యలఁ ♦ గూడియున్న । తుమ్మెదలనెల్లఁ బట్టివా ♦ తూలసుతుఁడు । పరగ మర్దింపుచుండిన ♦ భయమునొంది । యొక్కతుమ్మెదయతనికి ♦ మ్రొక్కిపలికె.

భ్రమర-కీర్తన, ఆదితాళము, కనలి.

శరణు-తరుచర-వరనన్ను బ్రోవవే । బరువడిమమ్ముఁజంపు । పని మాని కరుణింపు। వెరచెసీ। మరుగున, జోరితిని, గావవే॥శరణు॥ అమృతమువల్ల । నసురులనెల్ల । నమృతులజేయుచుంటి । మదియిఁకఁజేయ మంటి । నమరారులడగేరు । సమకూరు । శుభము ॥శర॥ వరమోక్షగుండ । వాసుడునిశిత । శరములువేయువారుఁ । జత్తురు లేవబోరు । మరిమీరు । ధరజేరు, దురుధీరు, లగుచు ॥శరణు॥

వ. అని బహువిధంబులఁ బ్రార్థించిన నాభ్రమరంబును గటాక్షదృష్టి నవలోకించి చంపుటుడిగి హనుమంతుండిట్లనియె.

హ-తో. భ్రమరమ! నీయి, ష్టముచొప్పుననిను-సమయింపకనే విడుతుఁ। గ్రమమునబ్రత్యుప - కారమొకటిచే, యుము లేకున్నను నడతు ॥రా॥

వ. అది యేదియనిన వినుము.

క. ఐరావణభోగాంగన । యారూఢిని బవ్వళించు నా ♦ మంచంబుల్ । జేరియది తొలిచివేయుము । వారణభక్షిత కపిత్థ ♦ ఫలభంగిననల్.

వ. ఆతుమ్మెద తమజాతిజంతువుల ననంతంబుగాఁ దోడితెచ్చి నాగకన్యయొక్క మంచమును క్షణమాత్రములోఁ దొలిచి తొర్రజేసి యథేచ్ఛంజనియెఁ. బిమ్మటహనుమంతుండు రాముని జేరె నంతలో.

సం-తో. రాముడుదివ్యశ, రంబొక్కటి బీ, రంబున నెక్కిడివైవ। నామైరావణ । మైరావణులటు । హతులయి పడిరాదిగువ ॥రా॥

వ. అంత జయజయ శబ్దంబుల దేవతలు రాముని యగ్గించిరి. పిదప హనుమంతునితో స్వామియిట్లనియె.

రా-తో. ఈరాజ్యంబును-నెవరికిఁగట్టుదు మెవరయినను నున్నా రా! మారుతి! యెరిగిన-మజీరప్పింపుము-వారికిత్తునింపారా ‖రా‖

వ. అనిన హనుమంతుండు.

హను-కీర్తన, హంసధ్వని, ఆదితాళము, సదావే.

భ, జేరామచంద్రప్రభో। యవ, ధారు జగద్విభో‖భజే‖శూరుఁడుభక్తుఁడొకఁడు । సుగుణుడుఁ గలఁడిచ్చట ‖భజే‖ వాఁడెవఁడన్నను నాడులంకకే। నోడకజనినపుడు। నొకచిత్రిముజరిగెను ‖భజే‖ లంకఁగాల్చినా। లముఁజల్లార్పఁగఁ। లవణాబ్ధికిఁజేరి । యంచుమిళితిఁగక్లెను‖భ‖ మకరముమిృంగిన। మరిగర్భంబై । మకరధ్వజుఁడనఁగ। నొకఁడుద్భవమయ్యెను ‖భ‖ మైరావణుకడఁ। జేరియున్నవాఁ। డీరాజ్యంబిడుము। వరమోక్షపురీశ్వర ‖భ‖

వ. అని వేడిన నందుకు సమ్మతించి మకరధ్వజుని బిలిపించి యతనికి రసాతల లంకారాజ్యంబిచ్చి యభిషేకంబుఁజేయించె। తర్వాత హనుమంతుండను చున్నాఁడు.

హ-తో. ఐరావణుభో-గాంగనగలదా। యమ్మో నేనపుడచుగ। వారికిఁగలయా। వన్మర్మంబులు। వాకుచ్చెనుదావశిగా ‖రా‖ చెప్పెనునప్పుడు। మెప్పుగఁదనతోఁ। జెలఁగి నీపుగూడఁగను। దప్పకఁగోరినఁ, దగనందుకునే। నొప్పితినొకమరతుగను ‖రా‖

వ. అదియేది! యనిన దేవరవారి భారంబుచేనామె మంచంబు విఱుఁగక భరించినయెడలఁ గూడు న్నొప్పించినాఁడఁగాన, నావడంబడిక ప్రకారమామె యింటికిఁబోయిరావలె మహాప్రభో! అని ప్రార్థించిన సమ్మతించి.

గీ. నాగకన్య గృహంబున ♦ కేఁగియామె। చేత సత్కృతుఁడై తన ♦ చేతఁదత్క। రంబుస్పృశియించి యెక్కమం ♦ చంబుపైకి। నది పట్టుకక్కన విఱిగె మో ♦ యంగలేక.

వ. అప్పుడురాముండు మద్భారంబునకు నీమంచం బోర్వలేదయ్యె. నింకనిన్నుఁ గలయుటలేదు. అని లేచిన రామునకు నమస్కరించి చేతులుజోడించి యిట్లనియె.

నాగ-కీర్తన, జోగి, ఏకతాళము, పరమేశ్వరా.

రఘు, నాయకా! శుభదాయకా! నినుబాయలేనిఁక। నన్నుఁ,

ద్రోయధర్మమా ! నేఁ, జేయుకర్మమా ! వృ, థాయెగామదీప్సితంబ-హా తలంపుమా ॥రఘు॥ రతి, కేళిగోరితీ । బ్రతిహాలిదీరితి॥ మొ, రాలకింప వైతివీ వి, రాళిద్రోచితి ॥రఘు॥ నీ, చాత్ములంటిన। పా, పాత్మగాపున। మ, హాత్మయంటఁగూడదంచు-నాత్మదోచెనా! ॥రఘు॥ పరి, శుద్ధచేయుమా। న, నుద్ధరింపుమా! జ, గద్ధితా ! శ్రీమోక్షగుండకాంతఁ ! బ్రోవుమా !॥ రఘు॥

వ. అని యనేకవిధంబులఁ బ్రార్థించినఁ గరుణాకలితహృదయుం డయి రాముండు.

సీ. భామిని నేనేక ♦ పత్నీవ్రతుండను గావున నిన్ను నేఁ ♦ గల యనిపుడు । దేహంబువాసి పృ ♦ థ్విని విప్రకన్యవై కన్యాకుమారినా♦ గనుదపంబుఁ। జేయుచుంబుధిదరిఁ♦ జిరకాలముండుము కృష్ణావతార మం♦ గీకరింతు । ద్వాపరాంతంబున ♦ ద్వారకయందేను జాంబవంతునకుద♦ యంబునొంది। జాంబవతి యనమూఁడవ ♦ జన్మమందుఁ। బరఁగునావునీ వుఁ గైకొందుఁ ♦ బత్నిగాగ। నపుడు బహుకాలమఖిల సౌ ♦ ఖ్యంబు లందఁ। గలవు పొమ్మనిపలికి రా♦ఘవుఁడులేచి.

వ. ఆమెచే వీడ్కొని లంకాప్రయాణోన్ముఖుండయి హనుమం తునకిట్లనియె.

తో. రావణాసురుని. లంకాపురమా-ర్గము దుర్గమమటుగాన। నేవిధమునమన-మేఁగగవలెనో! యెఱుఁగుదువే నీవనిన॥రా॥

వ. ఆంజనేయుం డిట్లనియె.

హ-కీర్తన, కేదారరాగము, రూపకతాళము, ఆదుదమా.

శ్రీరఘుకులతిలకా! మీరిపుడు। దీరనిసు-ప్తినియుండినఁ। గార ణమునఁ-దారెరుఁగరు॥ శ్రీరఘు ॥ నేనెఱుఁగుదుగాన । యానము । యీనిమిషము-లోనచటికి। మానుగమిము-మఱ్ సేర్తును॥ శ్రీరఘు॥ మ నమకరధ్వజుని। ఘనముగమీ। యనుజుఁడెక్కు-ననునీవె, క్కినపుడే। కొనిపోదుము॥శ్రీ॥ ఈక్షణమునసరిగి। రాక్షసుల । వీక్షింతువు శిక్షిం తువు మోక్షపురాధ్యక్ష! లెమ్ము॥ శ్రీరఘు॥

వ. అనిపలికిన నానందించిరి. హనుమంతుండు రాముని, మకర ధ్వజుండు లక్ష్మణుని, మూపుల నెక్కించుకొని వచ్చిన మార్గంబుననే

క్షణకాలంబులో లంకానగరంబుఁ జేర్చిరి. మకరధ్వజుండును స్వరాజ్యభారనిర్వహణంబు కొఱకుఁ జనియె నంత.

క. శ్రీరామలక్ష్మణులఁగని । యారవినందనవిభీష♦ణాదుల మందా । పారమహానందంబునఁ దేరి విశేషముగ సన్ను ♦ తించిరిభక్తిన్.

వ. రాముండును వారిని మిగులసన్మానించి యిట్లనియె.

రాము-కీర్తన, ఆదితాళము, కమాస్, కరుణాల.

విని, నాకేమీారు। వినినాకేమీారు। ఘనులైనవారు। ననుఁ-జేరి నారుకొనిపోయినారు॥ వినినాకే॥ మైరావణుండు మఱుమాయకాఁడు। నైరావణుండు। నతివిక్రముండు॥విని॥ మాతోడబోరి। మముజంపఁగోరి। యేతెంచిస్వపురి । నెత్తుకొనిచనిరి॥ విని ॥ ఘనమోక్షుగుండ-మునసిల్చి యుండ-నొకగూఢెనండ-హనుమంతుఁడుండ॥ విని॥

వ. లేకున్న దుర్గమమైన పాతాళలంకనుండి యాపద్గ్రస్తుల నిగ్రహించి క్రిమ్మర రాఁగలుగుదుమా ! అని నాగకన్యా వృత్తాంతము మొదలు యావద్వృత్తాంతములు వివరించినవారందఱు రాముని గొనియాడి హనుమంతుని శ్లాఘించి రప్పుడు హనుమంతుండు.

తో. అమరులబ్రోవగ, నసురులద్రుంపఁగ। నవతరించిరిస్వామీా! తమకెపరడ్డము-దాకినవిసుతురె। దాసుఁడు సేసినదేమి॥ రా॥

వ. ఆరావణద్వయమును సంహరించినరీతిగానే యిఁకనీరావణాసురుని రూపుమాపి లోకంబులుద్ధరింపుము, మహాప్రభో!

క. మైరావణు నైరావణు। శ్రీరాముడుచంపిమరలఁ ♦ జేరెనని సమా। చారముజారులుదెలిపిన। నారావణుడరిగెశుక్రు♦నారాధింపన్.

వ. దీనాననుండగుచు రావణుండు, కులాచార్యుఁడగు శుక్రుని చెంతఁజేరి నమస్కరించి యన్నచున్నాఁడు.

తో. ఒకదుఃఖమునా-కొదవెనుమునివర। ప్రకటంబుగరఘువరుచే। సకలబాంధవులు- సచివులుఁబుత్రులు-సమసిరిబలహీనతచే॥రా॥

క. కావుననాకుజయంబిం। కేవిధమునఁ గలుగుఁజెప్ప ♦ వే ! గురువర్యా! నాపుడుశుక్రాచార్యుఁడు। రావణువీక్షించికసక ♦ రంబున బలికెన్.

శు-కీర్తన, జంఝూటి, ఆదితాళము.

హోమముఁ। జేయఁగినవిపు। డోమనుజాశన-యురువడిఁబూను

ము। నీమముతో। క్షేమముతో। నేమంత్రములుపదేశింతు । సామగ్రి
లన్నియుఁగూర్చి॥ హో॥ దివ్యమా। రథరథ్యంబులు । దివ్యచాపమును।
దృఢసాయకములు। సవ్యముగా। సాఁగినను। హవ్యవాహనుఁడుమెచ్చి-
భవ్యముగనిచ్చునీకు॥ హోమము॥ అంతట। నిన్నెదిరించెడు । నంతవారు
జగమందెవరుండరు । పంతమున । బవరమునఁ । దృంతువు శ్రీమోహ
కుండ। కాంతుని లక్ష్మణుఁగపుల॥ హో॥

వ. అని తెలిపి హోమమంత్రంబు లుపదేశించి చేయవలసిన విధులు దెలిపి శుక్రుండు వెన్మన రావణుండుఁ ద్వరగావచ్చి లంకాద్వారంబులు దిట్టంబుగ మూయించి.

తో. పాతాళంబును। బరువడిఁబోలిన। లోఁతుగంగ్గ మందిరము।
యాతుధానపతి। యటునిర్మించి। నందుజేరెఁ। దాఁగరము॥ రా॥

వ. ఇట్లు చేరి గుహాద్వారంబున కొక్కరాయి యడ్డంబువేయించి లోపల నిష్ఠాగరిష్ఠుండై వేదోక్తవిధిగా ననలుఁ బ్రతిష్ఠించి మధుమాంసాజ్యాది ద్రవ్యములుచేకొని వేల్చుచుండె. నాధూమంబు దివినిండినఁగని విభీషణుండు రామునిజూచి.

తో. స్వామిరావణుఁడు। హోమముఁజేసెడు వ్యోమవీథినాలీల।
ధూమములేచెను। దురముననాతని। దొరరారెవ్వరుఁజాల॥ రా॥

వ. కాఁబట్టి యది సాంగంబుగాకముందే వానరులచేత హోమంబుఁ జెఱిపింపుమన రాముండు మంచిదని యాజ్ఞవెట్టిన.

క. పదికోట్లవానరులుస । ముద్రమున నటులంకచేరి ♦ మూసిన
తలుపుల్ । బదములను బగులఁదన్నియు । వదలక లోపలికినేఁగి♦వారని
యలుకన్.

తో. తురగశాలలకు। దూరికూర్చిరా । తులనుగుఱ్ఱములఁ బొ
డిచి। కరిశాలలకును। నరిగిమావటులఁ। గరులనుక్షణముననడఁచి॥ రా॥

వ. ఇట్లు కపులు లంకాపురంబునఁ దిరిగి బహుభంగుల భంగపఱచుచు వెదకుచున్న రావణుని పోఁబడి దొరకకున్న విభీషణుని భార్య సరమ హస్తసంజ్ఞ చేఁజూపినఁ దత్ప్రదేశంబెఱిఁగి యంగదుండు.

తో. గుహాకడ్డముగాఁ । గూడియున్నశిలఁ। గూలదన్నెచూర్ణము
గ। బహువేగంబున। వానరాళిలో। పలఁజొచ్చిరి మొత్తముగ॥ రా॥

వ. ఇట్లు గుహలోఁ బ్రవేశించి కన్నులుమూసికొని హోమంబు

ప్రేల్చుచున్న రావణుంగని యంగదుని యుత్తర్వుప్రకారము వానరులుం జెలరేఁగి.

సం-కీర్తన, ఏకతాళము, బేగడరాగము.

చెఱిచివేసిరి । చెలఁగి హోమమును॥ జెఱిచి॥ తరుచరులందరు దానవేంద్రుముట్టి॥ చెఱిచి ॥ రావణాసురుడు । రయమున వేల్వఁగ । నావేళఁ జేకొన్న- యాహుతులనులాగి॥ చెఱిచి॥ హోమగుండమున । నున్న యజ్ఞేశుని దామసమునవేరే- తలగించి చల్లార్చి॥ చెఱిచి ॥ ధర మోకుగుండేసు । దాసులురావణు । కరములు గ్రుద్దుచు । గాళ్ళతో దన్నుచు॥ జెఱిచి॥

వ. బహుప్రయత్నంబులు జేసినను వాఁడుజెలింపక నిష్ఠాగరిష్ఠుఁడై యున్న నంగదుండప్పుడు.

తో. మందోదరివర- మందిరమునకు బు-రందరుమనముఁడునేఁగి। తందరనొందుచు- సూదరివగవగ- ముందలబట్టుకలాగి॥ రా॥

వ. రాక్షసస్త్రీలందఱుఁ బెల్లుగానేడ్చుచు మొఱపెట్టుకొనినను బోనీక మహాట్టహాసంబున గుహాలోపలి కీడిచికొనిపోయి రావణుని ముందరఁ జేర్చి యిట్లనుచున్నారు.

ఉ. రావణనీవుపోయి మును ♦ రాముని మోసముజేసి జానకీ। దేవినిబట్టిచెచ్చెరను ♦ దెచ్చితి లంకకునీదినంబు నే। నావిధినీదుభార్యను ర ♦ యంబుననిడ్చుక వచ్చినాడనే। లావునుజూపుమన్నును జె ♦ లంగుచుఁదాకుముఁ దాగనేటికిఁ.

వ. అని తూలనాడిపలుకుచు మందోదరిని విడువక వేధింపుచున్న నామెభర్తను నాలింగనంబుఁ జేసికొని.

మందో-కీర్తన-తోడిరాగము-ఆదితాళము.

దనుజేంద్ర దిక్కులేని । దానవేనైతిని । వనచరు డీడ్చువఁగ। వానిసె నానుదుట్టబహ్మా॥ దను॥ నాకూర్మి సుతుడుండిన । నాకింతవెత గల్గునా । నాకేశవైరిమనల । లోకులునవ్వనామె॥ దనుజేంద్ర॥

చిచ్చోడిగట్టుకొన్న । చెలువునసీతసటు । దెచ్చిన పాపమురక। దీరునె కాల్పకను॥దను ॥ శ్రీమోకుగుండదేవు । చేతనునోడినీవు। హోమముజేసిగెల్వ । గామించివచ్చినావా ॥దనుజేంద్ర॥

తో. మాయలుమంత్రము । లాయగ్రజుం ? । బోయెనుసాగ ప్ర చాలు । నీయుపాయములు-నిలిపిరణంబును-జేయఁగొమ్ముకపమేలు॥ రా॥

క. ఈహోమమేలయిఁకఁజని । యాహవమున రామసాయ కా♦ గ్నులకును బూ ర్ణాహుతివగు కాదనవై । దేహి నొసఁగి శరణుజొరుము♦ దినకరకులునిన్.

వ. అని కఠోరంబుగాబలికినవిని దశాననుండు రోషదందహ్యమానదేహుండయి దీర్ఘనిశ్వాసంబులు వెడలఁగన్నులుదెఱచి భార్యపడిన పరిభవంబుజూచి చేతి యాహుతులుఁ గ్రిందవైచి ఖడ్గంబుబూని.

తో. అట్టహాసమున-నంగదు హస్తము-దరంటఁగ వ్రేయఁగను। దట్టునమందో-దరిని విడిచియా-తఁడు।మూర్ఛిలిఖలఁబడెను॥ రా॥

వ. అంత హనుమంతుఁడు గోపాగ్నులొలుక లేచి.

తో. కులిశనిభంబగు-బలుముష్టినిపది-తలలునొవ్వబొడువఁగను। అలిగివాడుఁబయి-కడరునంతలోఁ నంగదుండుదెలి, పియును॥ రావణుతలలద-రఁగబొడువఁగబీ-రమునవాఁడు ఖడ్గమున। నావాయుజుమఱి యంగదుగదతో । నపుడుమోఁదె రోషమున ॥ రా॥

వ. నల, నీల, గజ, శతబలి, మైంద, ద్వివిద, గవాక్ష, గంధమాదనాదుల బరిఘ, ముసలాంకుశ, శక్తి, ముద్గర, తోమర, గదా, కుంతాదిసాధనంబులఁ బొడువ వారును రోషతామ్రాక్షులయి కాళ్ళ దన్ని బిడికిళ్ళఁబొడిచి పండ్లఁగఱచి గోళ్ళతోఁ వాలంబుతో విసరి వ్రేసి వానిని నొప్పించి వేగంబున రాముని జేరి యీవార్తదెలిపిరంత.

క. భార్యకునను దశకంఠుఁడు। శౌర్యంబున నేను బోయి ♦ సమరములోనన్ । సూర్యకులులఁబ్లవగేంద్రుల ॥ గాంభీర్యంబునజంపి వత్తుఁ ♦ గమలదళాక్షీ !

అట్లుకాదేని.

త్రో. రామునిచేతను । రణమునహతమై । రాజితకైవల్యమును। వేమఱుఁగాంచెద। వెలఁదిరో నీమది। వెరవకు మాపింపుటను॥ రామ॥

వ. సీతను బారిగొని నీవగ్ని ప్రవేశంబుఁచే యుమనినమందోదరి యిట్లనియె.

మం-కీర్తన, త్రిశ్రజాతి-జంఝూటి.

బలవద్విరోధ మేలఁ। బయిబడిపోవ మేల। బాలిసిరిపుత్రులెల్లఁ। బాలిసిరి హితులెల్లఁ। గల్ల। గెలుపొందుటెక్కఁ జెల్ల॥ బలవద్వి॥ శ్రీమోక్షగుండ విభుఁడు। శ్రీపతియగునుజూడు। మామేటితోడ సూడు। వేయుఁగనుగీడు। మూడు। నామాటవినునేఁడు॥ బల॥

తో. ఆరాముఁడుహూ, నాకారంబున! నవతరించి సోమకుని। ధారుణిఁగూల్చియుఁ, దగ బ్రహ్మకువే, దములిచ్చెను మునుధృతిని॥ రా॥ కమఠంబయిమరి, కవ్వపుగొండను। క్రిందమున మూపునమోచి। అమరుల కెల్లను। నమృతమొసంగెను। నమితకృపామతిఁజూచి॥ రా॥ వరహారూపమై। వసుధనుజట్టిన। వరహిరణ్యాలోచనుని। బోరిగొనిలోకంబులను శుభంబుగ। బ్రోచెనుగదుసమ్మతిని॥ రా॥ అలరుచునరసిం, హాకారముతో। నాహిరణ్యకశ్యపుని। బలిమినిగూలిచి బ్రహ్లాదునిగా। పాడినాఁడునెమ్మదిని॥ రా॥ వటురూపంబున వంచనచేతను। బలిగర్వం బడగించి। పటుతరముగదివి। వము సురపతికె। ప్పటివలెనిచ్చెను మించి॥ రా॥ పరశురాముఁడై। పరశుప్రగొనిభూ। పతులనందఱినిదునిమి। సరగునఁ దద్రాజ్యంబులుగొని కశ్యపునకిచ్చెనిఁక వినుమీ॥ రా॥

వ. నిన్ను వధించునిమిత్తమై యిప్పుడు దశరథ సుతుఁడయి యయోధ్యయందు శ్రీరాముఁడన నవతరించె నిది నిశ్చయంబు-కావున త్రిలోకవాసుల నొక్క-పెట్టున హూరొ్క-నఁజాలిన యింద్రజిత్తు లోనగు శూరులజయింపఁగలుగునా! నీకును జయింపరాదువినుము.

మం-కీర్తన, తోడిరాగము, ఆదితాళము, ఫరజు.

శ్రీరామునితో సరి, వారెవ్వరు ధర॥ శ్రీ॥ సారెకుఁ దాటకి। చచ్చెవిరాధుఁడు। మారీచుండును। భ్రమగ్గిరిగాక్షర॥ శ్రీ॥ ఖరదూషణులే। గతిఁబట్టిరో సో। దరిపరిభవమును। బరికింపు ధర॥ శ్రీ॥ అతికాయుఁడు మొదలైనకుమారుల। గతియేమైనది, కనుపడదా! ధర॥ శ్రీ॥ ఎవరినిబెట్టుక। యేగెదవనికిఁక। నవనిమోక్షగుం। డాధిపుపైధర॥ శ్రీ॥

వ. ఈ సారిపోయిననీకు మరణంబుదప్పదు. జరామరణంబులు లేకుండ మాతండ్రినాకు వరంబిచ్చెనుగాన నేను సహగమనంబుఁ జేయుటకు వల్లలేదు. వ్యర్థముగాఁ బగఁబూనిచచ్చుటకంటె.

తో. మనవిభీషణుని। మర్యాదగర। మ్మనినీరాజ్యముగట్టు। చనువునసీతను। సంగిరాఘవుని। శరణుజొరుము చేపట్టు॥ రా॥

వ. ఆమహనీయుని కొలువుచేయుటకంటె పరంబేమియు లేదు. నిరుపాధిక శాశ్వత వైకుంఠపద సామ్రాజ్యంబేల వచ్చునని బోధించిన భామినికి రావణుండిట్లనియె.

క. నాకొడుకులెల్లఁగూలిరి। నాకీరాజ్యంబికేల ♦ నగరంబేల। రాకొమరు శరణుజొచ్చిన। నాకాదులునన్నుజూచి ♦ నవ్వరెచెలియా!

వ. కాఁబట్టి నేనుసీతనిచ్చి శరణుఁజొచ్చుటలేదు. యుద్ధంబుఁ జేసి గెలిచెదఁగెలుపులేకున్న రాముని చేఁజచ్చి ముక్తినిబడసెద! నీవు జింతింపకు తలఁగుమని చెప్పి రావణుండు యుద్ధసన్నద్ధుఁడయి.

## రావణుని మూడవయుద్ధము.

తో. ఇరువదికన్నుల। నురుకోపాగ్నుల। నేకకణములైరాల। చరణ ఘట్టనను-ధరణియదర ది-క్కరులు బెదరి కదుసోల॥ రా॥

వ. ప్రస్థాన భేరివేయించి సకలాభరణ భూషితుఁడయి కోటి ద్వయ ఘంటికాసంభరిత దివ్యస్యందనారూఢుండయి పరశుముద్గర ప్రాస భిండివాలగదాపరిఘాది సాధనంబులు ధరియించి యసంఖ్యాత రాక్షస దళంబులు నేలయీనినట్లు భయపార్శ్వంబుల నడువఁగదిలి రణభూమిఁ బ్రవేశించె నయ్యవసరంబున.

తో. భూమీధ్రంబులు - భూమీరుహములు - బూనివానరులు దెచ్చి। తామసమునదా - దానవసేనలి - తలలువగులఁగా వైచి॥ రా॥

వ. గద్దించి మిన్నుబ్రద్దలగునట్లు కేకలువేయుచున్న వానరుల పయికిఁగదిసి ఖడ్గరోమ, సర్పరోమ, వృశ్చికరోమా, గ్ని వర్ణులను రాక్షసులు నలుగురు భీకరంబుగా మా[illegible]ని.

రాక్ష-కీర్తన, కమాసురాగము, రూపకతాళము.

• ఎందుఁబోక నిందునిల్వఁడీ। ముందరరిపు - సందోహము - లం దోలిన, చందముగా॥ దెందు॥ పొందుగమాముందరమీ। పందెంబులు పనికిరావు। చిందనందర జేసిపు। రందరముఖు-లాదలుఁగ। మ్రిందింతుము నిందింతుము॥ ఎందు॥ మోక్షుగుండపతితోఁడను। రాక్షసులు గెల్చుటకై। యీక్షణమునవచ్చినార! రూక్షాక్షుల - వీక్షింతుము - శిక్షింతుము - భక్షింతుము॥ యెందు॥

వ. అనిపలికి గదాముసలముద్గర ప్రాసాదులచేఁ గసిమసఁగి బాధింపుచుండిన నాంజనేయుండు ఖడ్గరోముని-నంగదుండు సర్పరోముని-నీలుండు వృశ్చికరోమునిం దాఁకి.

తో. కడుభయంకరము- గాయుద్ధంబును- గావించియనంతరము। వడిఁ జెడఁ జేసి ధృ, వంబుగ దనుజుల, మడియించిరి తీవరము॥ రా॥

వ. తదనంతరము పంద్రెండుమూర్తుల్ లేకీభవించిన మార్తాండుభంగి మండిపడుచు నగ్నివర్ణుండు నిజశరీర జనితాగ్ని కణంబులచే వానరాటవుల దహించిమట్టాడుచుండినఁ గోపించి రాముఁడు.

తో. వరుణబాణమును- వడిగావైచిన- వాడిమారి దానవుఁడు। ధరణినిగూలెను - దానిఁగనుంగొని - తామసమున రావణుఁడు॥ రా ॥ దశవదనస్థిత- దంతఘట్టనముఁ- దగసలిపినమాత్రమున। దశదిశలు ప్రతి, ధ్వనులిచ్చె వసుం, ధర గంపించెభయమున॥ రామ ॥

వ. ఇట్లుతన ప్రతాపంబుజూపి సింహనాదంబుఁ జేయుచు రాముసకభిముఖంబుగాఁ దనరథంబును బఱపించి రావణుండిట్లనుచున్నాఁడు.

రావ-కీర్తన, రూపకతాళము, వేటాడు.

నాసరిమెవరు।పోర। నాసరి॥ నాసరివారెవ్వరువిను-నాకమర్త్యపాతాళము। లీసునసే విహరించితి। వేసరకనుపేక్షించితి ॥నాసరి॥ గరుడోరక విద్యాధర। గంధర్వాప్సరచారణ । సురగుహ్యక యక్షనిశా। చరకిన్నరవరులందును ॥నాసరి॥ కైలాసాచలమె త్తితి- శూలినినేమెప్పించితి। పాలించితి లంకనుబహు । కాలంబజు వరబలమున ॥నాసరి॥ మానవమాత్రుఁడవీవన। మానబలుని నన్నెదురఁగ।బూనుదువే! మోతుగుండ పురవల్లభ వివరించిన ॥నాసరి॥

వ. అనిన వానియవలక్షణ ప్రసంగంబునకు రాముండసహ్యంబునొంది నవ్వుచు నిట్లనియె.

క. నేవినియే! యుంటినిమును । నావాలిని గార్తవీర్యు♦ నాహవమందుల్ । నీవెదిరినట్టివిధమును । రావణచెప్పంగ వలెనె ♦ రమ్మెంక ననిక్కిన్.

వ. అనిన మాటలకు రావణుం డత్యంత రోష సంభరిత స్వాంతుండయి.

తో॥ భానుపయికిజను-స్వర్భానునిగతి-భానుకులుని పయికడరి। దానవనాథుఁడు - పగ్రిబాణములుఁ - దలఁగక వైచెను దొడరి ॥రా॥ అందుకుఁ బ్రతిసా, యకములు శ్రీరఘు। నందనుడటు వేసియఁగనుజిం దరవందరఁ జేయుచుదనుజుఁడుఁ జెలగుచు బైకొనఁదగను ॥రా॥

వ. అప్పుడు దేవసారథియగు మాతలినిఁజూచి దేవేంద్రుండిట్లనుచున్నాఁడు.

దేవేం-కీర్తన, రూపకము, హిం, కాపి, శివశివవి.

మాతలి ! గనుమా ! సీతాపతి ! యాతుధాన పతిపోరుట ॥ మాతలి ॥ భూతలమున రాముడుండ ॥ నాతఁడురథమందుండుట । నీతి గాదు నిశ్చయముగ॥ మాతలి॥ కనుకనువినుమా ! మనమలరగ-మనరథ మును గొనిచనుమా ! మనుకులుఁడగు మోతుకుండ। ఘనుఁడల్లదెమ నకొఅకై। దనుజేంద్రుని-దాఁకిపోరె॥ మాతలి॥

అని తెలిపిన మంచిదని యతండు దివ్యరథం బాయత్తంబుచేసి కొని వాయువేగంబులు గల తురంగంబులఁ గట్టుకొని శీఘ్రంబున భూస్థలికి వచ్చి రాముఁజేరి రథంబుదిగినమస్కరించియిట్లనుచున్నాఁడు.

తొ. దేవరథంబిది-దేవరమీకై। దేవేంద్రుఁడుబంపగను । దీవర ముననే-దెచ్చితినిప్పుడె। దీనినెక్కుడింపుగను॥ రా॥

వ. దానవాధముండు రథస్థుడైయుండ దేవరవారు దిగువనుండ ధర్మంబుగాదు. నేసారథినయ్యెద దయచేసి యీరథంబెక్కి యాదు ర్మార్గుని దెగటార్చి లోకంబులుద్ధరింపుము దేవా ! మహానుభావా ! అని వేడిన శ్రీరాముండు.

తొ. అలవిభీషణుని-యనుమతిచేతను-వలగొని యారథమెక్కెన్। జెలగుచు నుదయా, చలమెక్కిన రవి, వలెనే కడు బెంపెక్కె॥

వ. ఇట్లు దేవేంద్రప్రేరితరథంబుపై శ్రీరాముండెక్కి యుద్ధారం భకుతూహలచేతస్కుండయి విల్లుగుణధ్వనిచేసిన నాదవంబునకు జగం బులు గంపంబునొందె నంతరామరావణ సంగ్రామరంగంబుఁ దిలకించు తలంపున దేవగంధర్వ కిన్నరాప్సరపన్నగచారణ విద్యాధర కింపురుష యక్షగణంబులు విమానారూఢులయి విలోకింపుచుండిరయ్యవసరంబున.

క. కరియును గరియును వడికే। సరియును గేసరియు జలధి ♦ జలధియు మఱియుర్। గిరియును గిరియును దాఁకిన। కరణినసమగాక పోరఁ ♦ గడఁగిరిబలిమిర్.

సం-కీర్తన, రూపకతాళము, వినుడిభూప.

రామరావణుల। రణముభీమమై। వేమఱుజూపట్టి। వీక్షింపనట్టి। తామసములను సి-ద్ధరసమబలముల। నేమరిజయ కాంక్షులతో-జెలఁగర్ నిలువకిఁ బెనఁగర్॥ రామ॥

రాక్షసాస్త్రము- రావణుఁడు వేయ। రామునినది- రయమునఁ గదియ। నక్షయమగువైష్ణ- వాస్త్రముచేదాని। దక్షుణమందుర్ ద్రుంచెర్ - దశరథతనయుఁడు మించెర్॥ రామరా॥ అంతవాఁ డుర-గాస్త్రముఁదొడిగి-పంతమున నేయ। బరువడిఁగదియ। వింతగ శ్రీరఘు-వీరుఁడు గరుడాస్త్ర। మెంతయు నెక్కుడివేసినదించెర్ బీరమడంచెర్॥ రామరా॥ కరముఖాస్త్రమా। సురుఁడుసంధించి। కరమొప్పవేయఁ। గానది గదియఁ వరమోక్షగుండని- వాసుఁడు రాముఁడు। నరసింహాశరంబును దాఁ। బరపెర్ దానినిజిదిపెర్॥ రామరావణుల॥

వ. కల్పాంతసమయ మహాగ్ని చందంబున మంటలు మండుచు భయంకరా కారంబుగా దనరు శూలంబుఁ గేల ధరించి గిరగిరఁ ద్రిప్పి రాముని జుఱజుఱజూచుచు.

తో. శూలము వైచితి - జూడుము వచ్చెను। గాలాగ్నులు గ్రక్కుచును। యాలములోని - యనుజుని నిన్నును - నేలగూల్చుదు నికను॥ రా॥

వ. అని పలికి శూలంబువేసి, సింహనాదంబుసేసె. నంత నా శూలంబగ్ని కీలల జిల్కరింపుచుఁ బైకి వచ్చుటగాంచి రాఘవుం డఖండ రణపాండిత్యంబు మెఱయ.

తో. పాకశాసనుఁడుఁ - బంపినశక్తిని - భీకరముగ వేయఁగను। బ్రాకటముగఁజని- పట శూలంబును-బద్దలుసేసెను దగను॥ రా॥

వ. అప్పుడు రావణుండు గనులయందు విస్ఫులింగంబులు రాల వింశతిభుజంబులుఁ జఱుచుచు మహోగ్రనాయకంబులు బెక్కులువైచి సారథిని హయంబుల నొప్పించి కేతనంబు ఖండించి మఱికొన్ని శరాం

బులు రాముని పయిన్వైచిన వానివిలువిద్యా సామర్థ్యం బునకు రాముం డచ్చెరువందుచుండ నింతలో నగస్త్యమహాముని వచ్చె నెటులనిన.

సం-కీర్తన, సురటరాగము, ఆదితాళము.

భజామిశ్రీరామం। మనసా। భజామిరామం। భండనభీమం।భజా॥ నిజదాసమనోం । బుజవరధామం। సుజనజపితభా। సునామం। అజరు దార్చిత- మసురవిరామం ॥భజా॥ అక్షయమమలమ- నాద్యం నారా; యణకవిరక్షమ్। యతిపక్షం। మోక్షగుండసత్పురవరదక్షం ॥భజామి॥

వ. ఇట్లరుదెంచి యగస్త్యుండు శ్రీరాముని గాంచి యిట్లను చున్నాఁడు.

క. విజయార్థియైనమనుజుఁడు । నిజముగ నాదిత్యహృదయ ♦ నిర్మలమంత్రం। బు జపించి యసియొనర్చిన। సుజనావన జయముగల్గు ♦ సూనిక్కముగన్.

తో॥ కావునసీవటుఁ - గావించినయెడ, రావణుఁ డనిలోఁ దెగును । ఆవలకార్యము । లన్నిదీరుభువ । నావళికిని మేలగును ॥ రామ ॥

వ. అనిపలికి శ్రీరామమూర్తికి సారమంత్ర బుపదేశించి తద నుష్ఠాన విధానంబులన్ని బోధించి కుంభజుండు యథేచ్ఛంజనియెనంత.

తో. ఆయగస్త్యముని। యనుమతిచేతను। నర్కమంత్రరాజమును। బాయకమదిని జ । పంబుఁజేసిరామ । భద్రుఁడొందె దేజమును ॥రా॥

వ. అంతరాముం డత్యంత ప్రీతాంబుగలిగి ప్రళయకాలాభీల జాజ్వల్యమాన మహానలంబు చందంబున వేఁడి చూపుచుఁ బ్రచండ మార్తాండమండల మయూఖ కాండోపమ కాండమ్ము లఖండమ్ము గా బఱపినఁ బ్రతివేయనోపక నిర్విణ్ణుండయియున్న రావణుంగాంచి రాముండిట్లనియె.

రాము-కీర్తన, బేహాగ్, ఆదితాళము, పోనివ్వ.

• చూపుము చూపుము నీవడి। యింకఁ। జూపుము॥ ఓపికతో ఘోర రణ। నైపుణిగలవాఁడ వయినఁ ॥జూపుము॥ బాపురె నీపురాకృత-పాప ము నాదృష్టిపథము। దాపునజేరిచెనిన్నుఁ। బాపము వేవేగ సత్పా।తాప ము గోపమునీదు। రూపమమాపెదఁగాక ॥చూపుము॥ బెండువడి చేష్ట లుడిగియుండనేల। గుండెగలమ । గండవయినరమ్మతీవ్ర । కాండములుఁ వరపితల పండుదుల్చుకున్న మోక్ష । గుండవాసుడనుగాను ॥ జూపుము ॥

తో. వారిని వీరిని-వడిగెల్చితినని । వాగుచునుంటివి గదరా !
యూరికనిటు ని, ట్టూర్పులుబుచ్చుచు - నుండనేలబైకొనరా ॥రా॥

క. మముడాగురించి సీతను । బ్రిమదాబునఁదెచ్చినట్టి ♦ పందెం
బులుని । త్యము బచరించిన ఫలమే ! సమయాబిది చూపుసీమ ♦ శౌ
ర్యమునాపై.

రాము-కీర్తన, శంకరాభరణము, చాపుతాళము, మేలైన.

ఉండుమనీకండలుఁ-జెండిభూతగులకు-బందుగ జేసెదను। నండగఁ
ద్రిమూర్తు - లడ్డమైనిలిచిన - నైనవిడువనునిను॥ ఉం॥ ఆయజుమెప్పించి।
యధికమాబలమును । నాయుప్రఁబడసినాను । మాయాపిధంబులు । మ
హినేర్చిదిక్కులు-మరివేగగెలిచినాను॥ ఉం॥ రమ్ముమోతుగుండ । రమ
ణుఁడనగునేను। రణముననినుదుర్గింతును। సమ్మతిగాకున్న। జనకజఁదెచ్చి
చ్చి శరణుజొరుము కాతును॥ ఉం॥

వ. యుద్ధంబుజేసి జయించుటయుండె- లేకఁజచ్చుటయుండె-కాక
యిట్లలతింబోలె నిర్వీర్ణుఁడవయియుంటుట రణధర్మంబా ! ప్రాణంబుల
పయియాసయున్న త్వరగాసీతనుదెచ్చినాకిచ్చి శరణుజొచ్చుము. రక్షిం
చెద. ననిపలికినవాక్యము లగ్నిసమంబులై తననుగాల్చిన మహాగ్రి
హంబునొంది పదఘట్టనంబుఁజేసి యపుడుఁగరచుచు రావణుఁడిట్లనియె.

రావ-కీర్తన, ఆదితాళము, మతామహు.

బలహీనులరాకుసులఁ-బట్టికొందరినిద్రుంచి - గెలిచితిననుకోబో
కుము। ఘోరారామచంద్ర। తెలిసివచ్చినన్నుఁదాకుము ॥బల॥ లావునగంధ
ర్వయక్షు । దేవతదిక్పాలకుల । జేవజెడఁగొట్టినాఁడను। ఓరామచంద్ర।
నీవనఁగనెంతనాకు ॥బల॥ మోతుగుండవాసనిత। మ్మునినిన్నుజంపి గాన
దీక్షతోలంకకుఁజేరను। వ్రాద్రామచంద్ర। యీక్షితిఁగూల్పకమానను॥
బల॥

వ. అనిపలికి దిగంతంబు లల్లాడునట్లు పెల్లునార్చి పెద్ద-నా
యకమ్ముల రఘురాముని బొదివిన రాముండుఁ గోపించి.

పంచచా. సురాదులన్ జయించినట్టి ♦ వొప్పు గానునిన్ననీ ।
ధరిత్రిఁగూల్పఁబుట్టినాఁడ ♦ ధాతయిచ్చియున్నయా । వరంబులెల్లనీరో
నర్తు ♦ వచ్చెనాడుబాణముల్ । భరించినిల్వుపారిపోకఁ ♦ బంక్తికంఠ
మెచ్చెదన్.

వ. అనిపలికి తాటక మథనకాలమందు విశ్వామిత్రుండిచ్చిన సాయకంబులు దలంచి పుంఖానుఁ పుంఖంబులుగాఁ బ్రయోగించిన నిలువరించలేక రావణుండు మూర్ఛిల్లినఁగని.

తొ. వారకసురలం- బరమునసవ్వుచు - సారెకుహేళన జేయఁగ।
సారథిరథమును-సమరభూమికిని-దూరముఁగాఁగొనిపోయెఁగ॥రాము॥

వ. అంత గొంతవడికి రావణుండు మూర్ఛదేరి సారథింగని యిట్లనియె.

తొ. ఓరీ! రాముం-డురువడినవ్వఁగ-సారయశము జెడఁగాను।
తేరుదూరముగఁ। దెత్తురె! యనప్రుఁడు- తెలిపెనతఁడుఁగ్రిమ్మరను ॥రా॥

క. రథిసంకటంబుఁగనిసా। రథిరథముమరల్చు టెల్ల ♦ రణధర్మం
బా। విధమును జేసితిఁగానిఁక । నధిసారిపుపక్షపాతి ♦ నై రామసుమా.

వ. అనిన వాని వివేకంబునకు సంతసించి మెచ్చి తిరిగి రథంబును రామునిపైకిఁ బఱపించి త్రిలోకకంటకుండు విశేష భయంకరంబుగ.

సంధి-కీర్తన, ఆరభిరాగము, ఆదితాళము, కొలువైయు.

విడిచేబాణములు। శ్రీరామునిపయి ॥విడిచే। కడుఁకోపాగ్నులు। వెడలిజగంబుల। కుఱుకుబుట్టి పఁగఁ। జిఱిముడిపాటుతో ॥విడిచే॥ ప్రధన రంగమునబలమునుగణియించి। వివిధంబునయిన। పృథుశరములు ధనువున సంధించి। యాకర్ణాంతం। బధికబలంబున నపుడుఁగిగించి। పేరుగ్గడించి। రథహయసారథులను గురిగాంచి । క్రోధముమించి॥ విడిచే॥ కెవినిదిశలుఁ బ్రతిధ్వనులివ్వ। సంతరుఁడో! యనఁ। దావెలసియుఁ గోదండముద్రెవ్వ। శ్రీమోక్షగుండ । దేవుని దేహము గడువడినొవ్వఁ। దనసారథియు। రావణ సైయని రయమునసవ్వఁ। బగనారుగవ్వ ॥ విడిచే ॥

వ. ఇట్లు విజృంభించు రావణుండు బాణవృష్టిని ముంచిన రాముండతిరోష తామ్రితుండయి.

తొ. ఇంద్రుఁడుపంపిన - వింటసాయకము - లెక్క-వెట్టివేసియు
చును। నిద్రవైరియే- పెల్లనడఁచెనా। యినకులుండుఁ బిమ్మటను॥రా॥

వ. వీరరసావేశంబు వెల్లివిరియ రావణుండిట్లనియె.

పంచచా. పరాక్రమంబుఁజూపునంత ♦ బాటువా ! నిలింపులన్
దురంబులందుఁదోలినట్టి ♦ దోర్బలుండ రావణా ! సురుండనన్నెరుంగవే

మొ ! చూపిచెప్పినాఁడనీ । తరంబుగాదు యుద్ధమాదుఁ ♦ దాఁకలేవు మానుమా !

వ. అనిపలికి.

తో. కరవాలంబులు-గదలుఁజక్రములుఁ - బరిఘలు. బ్రాసంబులును। వరశక్తులురా। వణుఁడువైవఁగా। వచ్చుచుండరాముఁడును ॥రా॥ అర్ధచంద్రసాయకమునవానిని-నతివేగమెఖండించి । పార్థివోత్తముఁడు-బటుకోపాగ్నులు - బ్రజ్వరింపగాఁమించి ॥రా॥

రామరావణ సంవాదము.

కీర్తన-జంఝూటి, రూపకతాళము.

రాము. అర్ధచంద్రబాణమిదో- వ్యర్థముగాదు । సార్థకంబుగాను నిన్నుఁ-జంపకపోదు॥ అర్థ॥

వ. అని ప్రయోగించిన యర్ధచంద్ర బాణంబుజని రావణుని రథకేతు విలఁగూలిచెనంత రావణుండు గనలి.

రావ-కీర్తన, పై మెట్టువలె.

పార్థివేశనాదుబాణ-పఙ్క్తి-కోర్వుమా। స్పర్థమాని యొచటికయిన - సరగబారుమా ! ॥పార్థి॥

వ. అనిపలికి కొన్ని ఘోరనారాచంబుల రథరథ్యసారథుల వైచిన నవి ప్రయోజనంబులు గాకపోయె నప్పుడు రాముండిట్లనియె.

రాము-కీర్తన, పైతరహా.

రాక్షసేంద్ర ! ప్రజ్ఞలాడ । రాదుముందుగా। కక్షమాని శరణుజొరుము। కాతుఁబొంగుగ ॥రాక్ష॥

రావ-కీర్తన, పైవలె.

మోక్షగుండనగరవాస। ముదముతోడను । యీక్షితిపైనిన్నుఁగూల్ప । కేనుపీకను ॥మోక్షగుండ॥

వ. అనిపలికి రావణుండుద్దండ కాండంబు లఖండంబుగాఁ బఱపినఁ జూచువారికి నద్భుతంబుగాఁ దోఁచెనంత రాముం డలుకరెట్టింప బ్రళయ కాలార్క-నిభంగి పొంగి యానీచుని దెగటార్చువాఁడై.

తో. నిశితసాయకము-నేర్పుననటుసం- ధించివేడ్క- గుఱిగాంచి। దశకంఠంబులుఁ- దగవింశతిహ- స్తములుద్రుంచె మోదించి॥ రా॥

క. శరచాపముసలముద్గర। కరవాలచయంబు లమరఁ ♦ గా న
టువింశ। త్కరములు గిరీటయుతముగ। శిరములు పది మొలిచె నుగుడఁ ♦
జిత్రముగాఁగన్.

వ. అప్పుడు రాముం డద్భుత వీరరసంబులు వెల్లుబ్బిపార శర
సంధానంబుఁజేసి మరలఁ గరశిరంబులు ద్రుంచిన నవి క్రమ్మర మొలిచె
నంతట రాముండు గోపించి నిలుపోపనిక.

తో. కరములు శిరములు-గదుదీప్రభయం- శరముగనగణితముగ
ను। నరిముర్ద్రుంచిన, నవిమెప్పటివలె। మరల మొలుచుచుండఁగను॥ రా

వ. రావణుని కరశిరంబులు మొండుగా భూనభోమధ్యభాగంబు
నిండె నప్పుడు.

తో. రామబాణహతి-రాలుతలలు-బీరము విడవలయవు చెడవు।
వేమరువాడవు-విన్న వ్రొవుకడు-విలసింపవు వెతపడవు॥ రా॥

వ. ఇట్లు శరపరంపరలువరపి రాముండు గరశిరంబులు దెగ వ్రే
యుటయు నవి క్రమ్మర మొలచుటయు, నేర్పరింపగాకఁ జూపరుల చూ
పులు మిరుమిట్లు గొలుపుచుండె. రామ రావణయుద్ధంబునకు రామ
రావణయుద్ధంబే! సమంబుకాని యన్యంబు సరిపోలదని దేవతలు ఆనం
దించిరంత రాముండు రణంబునిలిపి తనమనంబున.

గీ. ఏడహో రాములువీని ♦ కోడఁగదిసి। యుద్ధమొనరించినాడఁ
బ్ర ♦ సిద్ధముగను। జావఁడేయుక్తిచేతను ♦ జేవ జెడడు। తలలుద్రుంచినఁ
గ్రమ్మర ♦ మొలచునకట!.

రాముని కీర్తన-రూపకము, కాలికి.

ఈతనిఖండించు మార్గ-మేదితోఁచదు। యీతఁడెంత-శూరుడో
యి। కేమిచేయుదు॥ నీతని॥ చేతులుఖండంబులుగఁ-జేసికోసితిఁ। గోతగా
శిరంబులెల్లఁ। గోసిరోసితి॥ నీతని॥ ఈసుతో మర్మంబులెల్ల-నేసి రోసితి।
గాసినొందబాణపజ్క్తు-లేసిరోసితి॥నీతని॥ మోతుకుండ నేతనయ్యో। రా
క్షసేంద్రుని। కతుకగట్టిత్రుంపఁజేతఁ-గాకయుంటిని॥ యీతని॥

అని తలపోయుచుండిన రాముపేంద్రునిగని విభీషణుం డిట్లనియె.

తో. నలినగర్భువర - బలమునసీతని- నాభియందు నమృతంబు।
గలదుకుండలా। కారంబుగనది - పొలియకున్న నిక్కంబు॥ రా॥

విభీ-క. రావణుఁడుబొలియకుండును। గావున దన్నాభియందు గలయమృతంబుల్। బావకశరమునఁగొట్టుము। తీవరమున నతఁడుజిక్కి-తెగుఁదర్వాతన్.

విభీషణ-కీర్తన, శహాన-ఆదితాళము, తలపైని.

మనుకులాంబుధిసోమ! రణరంగభీమ! పా। వన సుర వినుతనామ! రామరామ! దనుజగర్వవిరామ! అనలాస్త్రముననాభి। యమృతంబుఖండించి। వెనుకనాతనికరములు। రామరామ! దునుము వానిశిరములు॥ మను॥ పదపిదీ నూటతొమ్మిది మారులారీతిఁ। జదిమి వేసిన మీఁదను। రామరామ! యుదయుంచకనుమానును॥ మను॥ పిదప మోక్షగుం, సదన! నీచేదశ! వదనుఁడు ధరగూలును। రామరామ! ఇదివాని మర్మమగును॥ మనుకులాంబుధి॥

వ. అని తెలిపిన రాముండు దేజి విభీషణుని వినయవిజ్ఞాన విశ్వాస భక్తిభావంబులకు నాత్మమెచ్చి విల్లుసారించి.

తో. అడరుచునాగ్నే-యాస్త్రమువింటను। దొడిగిలాగివిడువగను। గడువడినాభిని। గలయమృతంబును। గ్రాగించెను మేలుగను॥ రా॥ పిదప నూటతొమ్మిది సారులుగా। జదిమెనుగరశిరములను। తదనంతర మొక, తలయు రెండుహ, స్తములుఁ దక్కనన్నియును॥ రా॥

వ. మరల మొలవకుండ నీలచిపోయెఁ దెగిన తలలనుంచి కాఱు రక్తంబుచేఁదడిసి రక్తశరీరుండగుచు రావణుండలరారె. అరుణుని యరుణచ్ఛాయచే నావరింపఁబడిన యస్తాద్రిపయిఁదోఁచు భాను బింబంబురీతి రావణదేహంబుమీఁద యొంటితలయొప్పె. నిట్లుండి రావణుండు రోష విభీషణుండయి విభీషణునిజూచి యిట్లనియె.

రావ-కీర్తన, నాటకురంజి-రూపకము, సీతజాడ

ఓరిదోహీ! యోరిపాపి! యోరినీచాత్మక! యేరా! ॥ యో ॥ కూరకర్మజేయుటకు। ధారుణిబుట్టితివిర॥ యో॥ కోరిపగ। వారిమరుగుఁ। జేరికొల్చుచుంటివధమ! యేరికెరుక-లేనిమర్మ। మెఱుగఁజేయ। నిదిఘనమ॥ యో॥ మంచిది శ్రీమోక్షగుండ। మాధవునితో నూనినను। ద్రుంచివేతు। రణములోన। దోర్బలంబునెల్లనుగను॥ యోరీ॥

వ. అని నిష్ఠూరంబులాడి భయంకరాకారంబగు శక్తిని విభీష

ణునిపయి వయిచిననదియుఁ గాలాగ్ని చందంబున మంటలు గ్రక్కుచు వచ్చుచున్నఁగని రాఘవుండు.

తో. నడుమనెబహుబా, ణములనేసితా-నరికెనురఘు రాముం డు। గడువడినదిగని। కనలుచునార్చుచు। గదిసెను దశకంఠుండు॥ రా॥

వ. అన్ని కరశిరంబులుగల లావెల్ల రెండుకరంబులు నొక్క శిరంబునందు నిండి తనరారఁబ్రళయకాల విజృంభిత విలయకాలుండును బోలె మండిపడుచు రామునిపైకిగవిసి.

క. శరములఁ బ్రాసంబులము। ద్గరముల ముసలములఁగదల ♦ ఖడ్గంబులఁదో। మరముల శక్తులఁ బరిఘుల। నురుముచు వ్రేయుచును గొడుచు ♦ చౌప్పగనడరెన్.

వ. ఇట్లడరి రామలక్ష్మణ విభీషణులను దోఁకమూఁకలనుబహు విధంబులగారింపుచు నసాధ్యుండయియున్న రావణునియాటోపంబునకు భయపడి మాతలి రామున కిట్లనియె.

మాత-కీర్తన, కాపి, ఏకతాళము, ఈశరాసనంబసా.

ఇంతసేపు వీనినిల్ప-నేల రాఘవా! పంతమున జంపివేయు-పరిగ రాఘవా! ॥ఇంత॥ మొలచునేమొ మగుడవీని, తలలురాఘవా! చలమున నీవంతలోనె-చంపురాఘవా!॥ఇంత॥ఈక్రూరాతకుండు దెగిన-నింక రాఘవా! లోకములకు మేలుగలుగుగాక- రాఘవా! ॥ఇంత॥ చెండుము బ్రహ్మాస్త్రమేసి-చెలగి రాఘవా! యుండదగదు వీడు మోక్ష-గుండరాఘవా!॥ ఇంతసేపు॥

వ. అని మాతలిపలికిన జగదభి రాముండగు రాముండు శస్త్రాస్త్రవిద్యా విశారదుండు కావున బ్రహ్మాస్త్రంబు సంధించుట కిదియ సమయంబని తలఁచి గాధేయ సవన సంరక్షణ కాలంబున నతండిచ్చిన యక్షయ బ్రహ్మాస్త్రంబును దలంచి స్వాగతంబు జేసికొని మంత్ర పూర్వకంబుగా వింటనుసంధించి ప్రత్యాలీఢ పాదుండయినిలిచి నిండా రదిగిచి విడిచిన నదిచని.

సం-కీర్తన, ఆదితాళము- సురటరాగము.

స్ఫుటంబుగిను-బెట-బెటార్భటులది। క్తటంబు లార్వగఁను। దన యు। త్కటంబుజూపుచును। ॥స్ఫు॥ కులాచలంబులు-జలింపజలధులు।

గలంగికడుసోలఁ । దహన, స్ఫులింగములురాలఁ ॥స్ఫు॥ మహోల్కా-లొదవఁగ। గ్రహంబులురులఁగ । విహాయసమువగులఁ। బెల్లుగ। మహీతలంబగలఁ ॥ స్ఫు ॥ జగద్కంటకుని । దెగించుమునిసుర । లగణ్యముగ వేడఁ శ్రీమో, క్షగుండపతిసూడఁ॥ స్ఫు॥

తో. రావణాసురుని । ప్రాణంబులుగొని । రయమున భూమికిఁ జొచ్చి । శ్రీవెలయఁగరం జల్లిరాముపొదిఁ । జేరెనుగ్రమ్మరవచ్చి ॥ రా॥

వ. ఈ ప్రకారంబున శ్రీరామకర నిర్ముక్తామోఘ బ్రహ్మాస్త్రంబు శచీపతి యమవరుణ కుబేరాదులకైన భేదింపరాని రావణుని మర్మంబులు భేదించి ప్రాణంబు లాహుతివేసికొని సీకూతుఁ జెఱఁగొన్న వానిఁ జంపినానని భూదేవికి చెప్పఁబోవుచున్నదేమో ! యనునట్లు భూమిందూరి తిరిగివచ్చి రాముని తూణీరంబుఁజొచ్చె నిల్లు కులిశధారాహతిఁగూలు కులశైలంబుంబోలె రావణుని దేహంబు భూమిపయిఁ బడిన మాత్రంబున.

తో. క్రుంగెదిక్కరులు। గ్రుంగెఁగూర్మపతి। గ్రుంగెభుజంగవిభుఁడు । గ్రుంగెఁజరాచర । కోట్లతోడనీ । కుంభినియెల్లనుమెండు ॥ రా ॥

వ. అంతట.

సం-కీర్తన, ఏకతాళము-ముసుకు.

రావణుండు రణములోన రహినిగూలిన । దేవతూర్య రవములలరె। దెసలభోరున॥ రావ ॥ అసహ్యగాక రాముమీఁద - నతిప్రియంబున గుసుమవర్షములు సురలు-గురిసెరింపున ॥ రావ॥ తెలివినొంది దిక్కులెల్లఁ జెలఁగుచుండెను । మలయవాయువీచెను బరి-మళమునిండను ॥ రావ ॥ దీక్షతోఁ ద్రిలోకవాసు- లక్షయముగను ! మోక్షగుండవాసునకును-మ్రొక్కిరపుడును ॥ రావ ॥

వ. అంత శ్రీరాముండు విల్లెక్కుడించి సౌమిత్రిచేతికిచ్చి దేహపరిశ్రాంతికొఱకు నొక్కచో విశ్రమించెనప్పుడు రణభూమినిబడియున్న రావణుని కళేబరంబుఁగని విభీషణుండు డగ్గరి చింతాక్రాంతుండగుచు.

తో. ఆహవములదే-హారులకునుభయ । మావహింపుచునుండు। బాహులు వాయస-పటుఘూకంబుల-పాలాయెనుగా నేఁడు॥రా॥ కుసుమతల్పమున- గూర్కినిబుండెడు । కోమలమగుదేహంబు । యిసుక

రాళ్ళుగల - యీరణభూమిని - యిటులఁ బడెనె నిక్కంబు ॥ రా ॥

క. నవరత్నస్థాపితమై। రవికోటిసమప్రభావి ♦ రాజితమగుచున్.
రవణించు దశకిరీటము, లవనీతలమందుబడఁగ ♦ నాయనయారే.

విభీ-కీర్తన, ముఖారి, అటతాళము, అయ్యామీ.

అన్నా ! వినవైతివన్నా ! నాహితములు ॥అన్నా ! వినవైతివి॥ యెన్నోవిధములనే। విన్నవింపుచునుండిన। నాహితములు, అన్నా॥ సీతనుదెచ్చుట,చేటెరుపగునని। నీతోను వివరించిన। నాహితములు॥అన్నా వలదురాముని తోడ। వైరమనుచుమును। పలుమారుబోధించిన। నాహితములు ॥ అన్నా ॥ నీమనోగర్వంబు। నిన్నింతిజేసెను। యేమనిశోకింతును। నాహితములు ॥అ॥ మోతుకుండేశుఁడు। సాక్షాద్విష్ణుండగు। వీక్షింపుమని తెల్పిన । నాహితములు ॥అన్నా॥

వ. ఇట్లు విభీషణుండు శోకింపుచుండ హతశేష రాక్షసులవలన నీవార్త దెలిసి మందోదరి మొదలగు దనుజకాంతలు శోకావేశంబులు వెల్లివిరియ వేగంబునఁ బానుపుపయినుండి దుమికి.

తో. అడుగులుదడబడ । హారములూడఁగ । నడుములువడినసియాడ । జడలూడిశిరో - జములుమూపుపయిఁ - బడియటునిటువేర్లాడ ॥రా॥

వ. కిరమ్ముల రొమ్ముమోదుకొనుచు నేడ్పుల రవంబులునింగి ముట్ట లంకాపురంబె వెడలి శకలంబులైయిన రథంబులును, భిన్నంబులయిపడిన మదదంతావళంబులును, దెగిపడిన తురంగంబులును, జూర్ణంబులయిన గదాముసల ముద్గరప్రాసాది యాయుధచయంబులును, తెగినచేతులునూ, నెగిలిన మూతులును, ఖండంబులయిన శిరంబులును, దునకలయిన పదంబులును, దుండెంబులయిన మాంసపిండంబులును, గలిగి త్రొలఁగఁ దోయరాకుండ భూత, భేతాళ, ప్రేత, పిశాచ, శాకినీ, ఢాకిని, కాక, ఘూక, శ్వాన, జంబుకాదులు, రక్త, మాంస మేదో, మజ్జాదులు, నిండారయారగించి తృప్తిబొంది రాముననగ్గింపుచు నృత్యంబొనర్చుచుండ, నొప్పి, భయావహంబైయున్న రణరంగంబుఁ జొచ్చి; క్రమంబున రావణుండున్న దెసకుఁ జేరి; నిశ్చేష్టితుండై యిలగూలియున్న జీవితేశ్వరుపై పయిఁబడి.

మం-కీర్తన, పీలు, అటతాళము.

హా! రాక్షసేశ్వర! హాజీవితేశా! హా! రణాలంకార! హా! వీర వర్యా! ॥హా॥ గడగడ నినుఁజూచి। వడకుదిశాపతు। లుడువీధినుబ్బుచు। నున్నారునేఁడు ॥హా॥ కట్టా! యుద్ధములకు। గాలుదువ్వెదునీ। కిట్టిమూర్ఛ వచ్చె। నేమందువిధిని॥హా॥ అతులితభోగము-లందించియిపుడు। వెతల పాలుజేసి-విడిచిపోయితివా ॥హా॥ మోక్షగుండేశుని-ముట్టడింపకుము। కక్షవద్దనితెల్పఁ, గాలేదా! నేను ॥హా॥

తొ. నరుఁడుగాఁడు శ్రీ-ధరుఁడురాముఁడని।నయముగఁ దెలిపిన వినక। దురమునవాతని। తోఁబోరియు నీ। ధరణిఁగూలితివిగాక ॥రా॥

వ. సురలకయినఁ దేరిచూడరానిలంకకు హనుమంతుండొక్కఁ డు ప్రవేశించి జనకజనుగాంచి వనంబువెఱికి; లంకఁగాలిచి, చనుచున్న నేమీచేయనేరకపోతివే! యంతటనైనఁ దెలియవయితివిగదా! ప్రాణే శ్వరా!

క. ఖరదూషణాది రాక్షస। వరులనుఖండించినట్టి ♦ వార్తదెలి సినే। వెఱతునదిమొదలుగాఁగను। వెఱవకనిలఁ గూలితీవు ♦ విక్రమ ధుర్యా!

వ. పతివ్రతాశిరోమణియగు సీతను జెఱదెచ్చినపాపంబు నిన్నింత చేసెఁ. జేసినకర్మమనుభవింపక నెంతవారికయినఁదప్పునా! మనో హరా!

మం-కీర్తన, ముఖారి, ఆదితాళము, నేమము.

దిక్కులేనిదాననైతినిహా! యెక్కడఁబోదు నింకను। రావణ!॥ దిక్కు॥ అక్కట! పుత్రకులందఱుదెల్పిరి। గ్రక్కునసీవ్రఁబడితివి। రావ ణ! ॥దిక్కు॥ మయుఁడునాజనకుఁడు। మగడవునీవని। మదిగర్వమొందు చుంటిని। రావణ! ॥దిక్కులేని॥ మృత్యువునకునీవు। మృత్యువైయుండి యిపుడు। మృత్యువువాతఁబడితివి! రావణ! ॥దిక్కు॥ ధారుణిమోక్ష గుండ। ధాముని పైనఁగొన్న। వైరమింతకుఁదెచ్చెను। రావణ! ॥దిక్కు॥

తొ. అతిసతిపరుం-డగువిభీషణునని। కతుల సౌఖ్యములు గలిగె। నతిపాపాత్ముఁడ। వైననీకు ని-ట్లవని ద్రోళ్ళఁగాఁ గలిగె ॥రా॥

వ. నీ కామాంధకారంబు నీ కన్నులకుఁ గప్పి నిన్ను గట్టుటకుఁ

దార్లు నీవే తెచ్చుకొన్నట్టు సీతను దెచ్చితివే! కాని కులదాక్షిణ్యరూప గుణగణాతిశయంబులచేత సీతనాతో సరిబోలునా! ప్రాణనాయకా! అనిబహుభంగుల విలపించువదినె పదంబులపయివ్రాలి కన్నీరుమున్నీరుగాఁ గారనేడ్చుచు విభీషణుండు.

విభీ-కీర్తన, హిం, తోడి, రూపకము.

కామినీమణి! కాల! కర్మ కేమని। వేమరుదుఃఖితునింక-వెలసెం బైకొని॥కా॥ ఎన్నిగతులను। జెప్ప! నెఱుఁగఁడాయెను। నన్ను గారులాడి సభలోఁ-దన్నిపంపెను॥ గామినీ॥ దండివీరుఁడై। రణోద్దండ। శూరుడై యుండువాఁడుగూలె మోక్షగుండదేవుచే॥ గామినీ॥

వ. అని బహువిధంబుల దుఃఖింపుచున్న విభీషణునకు రాముం డిట్లనియె.

తొ. వలదువిభీషణ। నిలుపుముదుఃఖము, వనితలశోకముమాన్పు। పలవించుటచే। ఫలమేమున్నది। తలఁపున ధైర్యముజొనుపు॥ రా॥

వ. రావణుండు సామాన్యుండుగాఁడు. సురాసురుల కజేయుండై సమస్తసుఖంబులు బహుకాలంబనుభవించె. గొదవయేమి! కర్మశరీరంబు స్థిరంబుగానుండునా! యతండు కృతార్థుండుగాన ధైర్యంబవలంభించి యతనికొమారులందరు నశించిరిగాన నీవే! యగ్నిసంస్కారాదివిధు లాచరింపుమన, విభీషణుండదరిపడి యిట్లనుచున్నాఁడు.

తొ. ఈకష్టాత్మం-డెక్కడియగ్రజుఁ। డెక్కడితమ్ముఁడనేను। ఈకలుషాత్ముని-కేటివిధులువీనిఁ। దాఁకినదోషంబగును॥ రా॥

వ. మీభార్యను జెఱదెచ్చిన దుర్మార్గునకు సంస్కారంబుగావలెనా! కంకగృధ్రాదులు బీకి భక్షింపుఁ యే! సంస్కారమనిన రాముండు నవ్వి యిట్లనియె.

తొ. పూర్వవైరమును, బొలిసినపిమ్మటఁ। బూనదగదు రణమందు। నుర్విని గూలుట। నొప్పెననఘుఁడై। గొనరఁ జేయువిధులిందు॥ రా॥

వ. అని యాజ్ఞాపించినఁ జిత్తమని లేచి విభీషణుండు వనితల నూరడించి యగ్రజాదుల కగ్నిసంస్కారంబులుసేసి, స్నానంబాడి; తిలోదకంబులు విడిచి; శుద్ధుండైవచ్చిన నలరిరాముండు లక్ష్మణున కిట్లనియె.

రా-కీర్తన, ఏకతాళము, రామమంత్ర.

వినుముసోదరా! నీవు। జనుముసోదరా! ఘనవిభీషణునకుల కం, గట్టుసోదరా! ॥ విను॥ అన్నతరిమిన। నితఁడు। నన్నుఁజేరినఁ। బన్నగ నభయ స్తమిచ్చి-యున్న విధమున॥విను॥ సరసుఁడగుటను, మన। శరణు జొరుటను। ధరనుమోక్షగుండ దేవు। కరుణగలిగెను॥ వినుము॥

అని రాముఁ డనుజ్ఞ యిచ్చిన మంచిదని లక్ష్మణుఁడు విభీష ణునిఁదోడ్కొని లంకలోకిఁజని వనచరులచేత సముద్రోదకంబుఁ దెప్పించి శుభకాలంబున.

విభీషణపట్టాభిషేకము.

తో॥ వారిమంత్రులును। వారిబంధులును। వారి పురోహితవరుఁ లు। జేరిచూడ నభిషేకము జేయిం, చెను విభీషణునకపుడు॥ రా॥

వ. ఇట్లభిషేకము జేయించి సింహాసనాసీనుం జేసి లక్ష్మణుండు.

క. ఎందాక రవిసుధాకరు
లుందురో! యందాఁక రాము ♦ నురుచారిత్రం
బెందాక నుండునో ! ధర
నందాకను రాజ్యమేలు ♦ మనిదీవించెన్.

వ. అనంతరంబు విభీషణుం డమందానంద కందళిత హృదయా రవిందుండై లక్ష్మణునకు సభవారికి నమస్కరించి దివ్యాంబరాభరణ కుసుమ తాంబూలాది బహుమానంబులుగొని లక్ష్మణుని వెంటవచ్చి రామునిం జేరి సమర్పించి నమస్కరించిన.

తో. అవిమాతలికిడి-యటువీడ్కొలిపిన, నారాముని యనుమతి చే। దివమునకునునా-తేరున్గొని యే-తెంచెనతఁడు సమ్మతిచే॥ రా॥

వ. పిమ్మట రాముండు హనుమంతునిఁగాంచి యిట్లనియె.

రా-కీర్తన, బేహాగ్ రాగము, అటతాళము, రాజరంజేల.

లంకకు నేతెంచుమా। కేసరీపుత్ర! ॥లంకకు॥ శంకలుదీరె। జానకి నెమ్మది। సంకటములు దీర్చఁగఁ। గేసరిపుత్ర! ॥లంకకు॥ మనవిజయంబు। జనకతనూజకు। వినిపించిముదము జేయ। కేసరీ ! ॥లంక॥ ఇప్పటిరాజగు, విభీషణునకు। జెప్పివానియనుమతిఁ। కేసరిపుత్ర! ॥లం॥ శ్రీమోక్షగుండు। స్వామికార్యంబు। చేయుభక్తుఁడవీవగు। కేసరీపుత్ర! ॥ లం॥

వ. అనిపలికిన రామునివీడ్కొని హనుమంతుండు వేగంబున నశోకవనంబున కరిగి జానకీదేవినిగని నమస్కరించి.

తో. తల్లి ! నీమనో, ధవుఁడు రాఘవుఁడు । దశకంఠుని దునుమాడె । నెల్లకష్టములు, డుల్లెనేటితో నీప్సితములు జేకూరె ॥ రా॥

వ. రాముని విజయప్రభావంబు నీకుఁజెప్పవచ్చితి నేమియాజ్ఞ యనవుఁడు నామె యానందబాష్పంబులు రాల నిట్లనియె.

క. జగదీశ్వరుడగు రాముఁడు । మగఁడై యుండగను సుగుణ ♦ మాన్యులుమీరల్ । దగినట్టిభక్తులై యుం। డఁగలోపముగలదె పవన♦ నందననార్యా.

వ. ఆపన్నివారకమగు నిట్టిమేలువార్త నాకెఱిఁగించి నందుకు నేనేమిచ్చి నీఋణంబుఁ దీర్చుకొందు నాంజనేయా ! రామకార్య సహాయా !

వ. అనిన నతండిట్లనియె.

గీ. అమ ! మీకృపయుండిన ♦ నంతె ! చాలుఁ
గడమవస్తువులిచ్చినఁ ♦ గార్యమేమి !
యనినదీవించి పలికెనా ♦ యన్న ! రామఁ
జూతునట్లుగఁ జేయుము ♦ శుభములొందవ.

వ. అనిన మంచిదని మహానంద భరితుఁడయి పునఃపున రభివందనంబు లాచరించి కదలివచ్చి రామునకు సర్వంబు నెఱిఁగించిన రాముండు విభీషణు నవలోకించి.

రా-కీర్తన, బేహాగ్, ఆదితాళము.

దనుజాధినాయక. తడవును జేయక। జనకజఁబాయక । చనికొనిరాయిఁక ॥ దను॥ వడిజలకమార్చి । వలువలొదాల్చి । తొడవులుదీర్చి। తోడ్తెమ్ముమెచ్చి॥ దను॥ తగమోతుకుండ। నగరేశ్వరుండ । నగునాదు దండ। కలిభక్తినిండ ॥ దను ॥

వ. అని యనుజ్ఞ యిచ్చిన సంతసించి హనుమంత యుతంబుగా విభీషణుండుసని జనకజాతకు.

తో. సరమమొదలు రాక్షసకాంతలచే-స్నానముచేయించి। సురుచిరదివ్యాంబరభూషణములు - సరగునఁ గైసేయించి ॥ రా ॥

క. బంగరుపల్లకిలోసీ। తాంగన నెక్కించుకొని మ ♦ హాగోప్య ముగా। గంగంచుకంబుగప్పి కు। రంగాక్షులుఁ గొల్వఁ జేర్చి ♦ రాముని కడకున్.

వ. ఇట్లు రామునకుఁ గొంతదూరము బల్లకి యుండగానే వాన రు లత్యంత కుతూహలంబున సీతాన్వేషణంబు చేయంగోరి చుట్టుకొనిన బెత్తముచేమోది యందఱిని తరుముచుండిన నదిగని రాముఁడు విభీ షణున కిట్లనియె.

రా-కీర్తన, శంకరాభరణము, ఆదితాళము, తాపసేం.

వలదునిలుపు విభీషణ । వానరులఁ దఱుమఁగ । ఫలమేమి మన వారిమీఁద। బంటుతనముఁజూపఁగ॥ వలదు॥ ధారుణీసుతజూడఁ । గోరి చేరినారుగ । వారిలోప మేమున్నది । నేరములుగొనఁగ ॥ వలదు ॥ అల్ల మోఁకుగుండ విభుఁడ । నైన హాయిల్లాలిని । దల్లిగాభావించిచూడ - దాపుఁజేరి రోలిని ॥ వలదు ॥

వ. వివాహ, రణరంగ, మహోత్సవ, దుఃఖకాలంబులయందు రాణివాసంబుతో నవశ్యంబు లేదు. ఇది రణరంగమైయుండి పతినైన నేను సమీపమందున్నప్పుడు లోపంబు లేదు. కాన సీతను శిబికనుంచి దించి యందఱుఁ జూచుచుండఁ గాలినడకతో నాసన్నిధికి వచ్చునట్లుఁ జేయుమన నతండుజని యామెకుఁ దెలిపిన సిబికలోనుండిదిగి.

తే. నలిననయన కాల్నడకతోడఁ దిన్నగఁ రాముని జేరఁగను। చెలియగ్నినిదాఁచిన నిజరూపము। చేకొనుమని తెలుపఁగను ॥రామ॥

వ. లక్ష్మణునిఁగని రామున కపవాదము లేకుండునట్లు వహ్ని యందుఁ జొచ్చివచ్చెద, జితిఁబేర్చి యగ్నిరవులు కొలుపుమనిన లక్ష్మ ణుండట్లఁ జేసెనంత.

ఉ. రాముని నెమ్మదిన్ నిలిపి ♦ రాక్షసకాంతలు వానరుల్ సుర। స్తోమములెల్లఁ జోద్యముగఁ ♦ జూడధరామర దేవపాళికిన్। వేమ రుమ్రొక్కి పావకుని ♦ వేఁడిహుతాశన! రామునిన్ సదా। నామదిఁ గొల్చుదాననయి ♦ నన్ ద్రిజగంబులవారుఁజూడ న। న్నిమహిఁబ్రోతుగాక! యని ♦ యేర్పడఁజొచ్చెను నగ్నిలోపలన్.

వ. ఇట్లగ్నింబ్రవేశంచిన నందఱు నద్భుతంబందిరంతఁ గమలా

సన గౌరీశ్వర దిక్పాలకాదులు విమానారూఢులయి వచ్చి జయజయశ బ్దంబుల రాముని గొనియాడి రింతలో రక్తమాల్యాంబరాభరణ భూషిత యగు సీత స్వాంకతలంబున వెలయ నగ్నిహోత్రుండుం బ్రసన్నుండయి రామున కిట్లనియె.

అగ్ని-కీర్తన, ఆదితాళము, నీవను.

జయజయరఘురామ! జయజయ రామ! జయజయశాంకరీ! జప వరనామ! ॥జయ॥ నియతురాలుమా। నింపగదగుసీ। ప్రియురాలినిగొను । రయమున రామ ॥జయ॥మునునాలోదా। చిననిజరూపము। గొని వచ్చితిగ్గై । కొనుమిదెరామ॥జయ॥ డంబంబగుప్రీతి, బింబమడఁగెనిజ- బింబంబిదిగొని । జంబుగ రామ ॥జయ॥ తవిలిచతుర్దశ-భువనము లేలితి, వవని మోటుగుండాధిప ! రామ ॥జయ॥

వ. అనియొప్పగించి సీతను రాముని యంకతలంబున వసింపఁ జేసెనప్పుడు శంకరుండు రామునకిట్లనియె.

తొ. శ్రీరామా ! శ్రీ, మీరనయోధ్యకుఁ । జేరిరాజ్యమును జేయు। కోరినకార్యము। కొనసాగెనునిఁక। గొదవలేదుదయచేయు ॥రా॥

వ. అనునంతలో విమానారూఢుండయి స్వర్గంబుననుండి దశ రథుండువచ్చినఁ గాంచి సీతారామలక్ష్మణులు మ్రొక్కిన దీవించి యా లింగనంబుజేసికొని యిట్లనియె.

తొ. నినునమ్మినవా - రినిసంస్కారా । భీసిదరింపఁ జేయుదువు । తనయయయోధ్యకుఁ । జనిరాజ్యముగొని । తగఁ బాలింపుమునీవు॥రా॥

వ. వంశాభివృద్ధియగునని దీవించి వీడ్కొనియెనంత రాముండిం ద్రునిజూచి.

తొ. నాకృతముగఁపడి-నారగణితముగ । నగచరులోసురవీరా ! చేకొని యమృతము । చేతవారిని స । జీవులఁ జేయుముధీరా ! ॥రా॥

వ. అనిన నతండమృతంబుఁ దెప్పించిపోసి మృతు లయిన వాన రులజీవింపఁజేసె. నప్పుడు విభీషణుండు రామునకు నమస్కరించి యిట్ల నియె.

గీ. అంగనయు లక్ష్మణుండుమీరు ♦ నతిముదమున
మంగళస్నానమొనరించి ♦ మాల్యగంధ

భూషణాంబరములుఁదాల్చి ♦ పోవుటొప్పు
భర్తుఁడ ద్రోయవలదు నా ♦ ప్రార్థనంబు.

వ. అనిన రాముండు.

రామ-కీర్తన, అటతాళము, వినుఁడిది.

వరసుకుమారులు-సరసలుదమ్ములుఁ- బొరిజటావల్కలములు ధరియించి। సరగుననందుండ। మరియు నేనిచ్చట। సరియగునా! యలం। కరణముఁ జేయఁగ ॥వర॥ గనమోక్షుగుండేను। కరుణావిభీషణా! వనచరులకు నిదె। సలుపుసత్కృతులు। మనమున సంతోష-మగ్నుఁడనౌదును। ననుమానముంచకు। మటుఁజేయఁగాఁదగు ॥వరసు॥

వ. అనిన రాముండు నియమించిన మంచిదని విభీషణుండు.

తో. నవరత్నాభర, ణములువస్త్రములు। బ్రవిమలముగఁ దెప్పించి। రవిజాదులకును, రాక్షసవర్యుఁడు, రమ్యంబుగనర్పించి ॥రామ॥

వ. అనంతరంబు విమానంబుఁ దెప్పించినిలిపిన రాముండుసీతా। లక్ష్మణయుతంబుగా నారోహించి యందఱినిగాంచి యిట్లనియె.

రామ-కీర్తన, జంఝూటి, అటతాళము, ఒకదివ్య.

పోయివచ్చెదమేను। పుణ్యాత్ములారా! మాయయోధ్యకుఁజేర। మర్యాదమీర! ॥కపులనుదోడ్కొని। కదలి సుగ్రీవా! యిపుడేకిష్కింధకు। నేగుమిత్రోవా॥బో॥ దేవతలనుగూడి। దేవతావర్య! యీవేళ దివమున! కేఁగుగుణధుర్య! ॥పో॥ రాక్షసేశ్వర! లంకా। రాజ్యంబు నేలు మోక్షుగుండేనునకు - మొక్కుచుజాలు ॥పోయి॥

వ. అని పలికిన రాముని గనుంగొని దనుజవర వనచరు లిట్లను చున్నారు.

తో. మేమయోధ్యకున్ను-మీతో గూఁడా। మిత్రకులజ! వచ్చెదము! క్షేమంబుగమీకుఁ-జేసెడిపట్టాభి। షేకోత్సవమరసెదము॥రా॥

వ. భరతశత్రుఘ్నులను, కౌసల్యాది మాతలను, చూచివత్తుము. దయానిధీ! నిరాకరింపవలదు. వచ్చుట కంగీకరింపవలయు. నని వేఁడిన సమ్మతించె. నందుమీఁద.

తో. వానరులందఱు - దానవులందఱు - మానితపుష్పకమెక్కి- మానవనాథుని, యానతిచేతను। మఱికదలిరి పెంపెక్కి ॥రా॥

వ. ఇట్లుకదలి వియన్మార్గంబున పుష్పకంబుఁ బఱపి దృష్టిగోచరంబులగు విషయంబులు రాముండు సీత కెఱింగింపుచుఁ బోవుచు సేతువు జేరవచ్చి.

రా-కీర్తన, మధ్యమావతి, రూపక.

సేతుబంధనంబుఁజూడు । ప్రీతితోడ, సీతనేఁడు । ఖ్యాతిగఁ గపి నిర్మితమిది । పాతకంబులెల్లవీడు ॥ సేతుబం॥ రామేశ్వరుడనులింగము-నేమునుస్థాపించితిందు। భామ సేతుదర్శనంబు । గామించినయామనుజుం-డీమహిజనియించఁబోడు ॥ సేతు॥ ఇందుఁబితృతర్పణంబు - విడచువారుఁ బితృయుతము। గందగ శ్రీమోక్షగుండ । మందిరు కరుణను ముక్తిని । బొందుదు రానందంబుగ॥ సేతు॥

వ. ఇట్లు సేతుమహాత్మ్యంబు సీతకుఁ జెప్పి యనంతరము విమానంబు నడిపించుచు శీఘ్రంబునఁ గిష్కింధా సమీపంబునకు వచ్చిరంత రాముని యాజ్ఞానుసారంబుగా.

తో. తారాముఖగాం। తలు వేగంబునఁ। దరలివచ్చిజానకిని। సారెకుఁగనుగొని। సలిపిరిసకలోప। చారమ్ములునెమ్మదిని ॥ రా॥

వ. పిమ్మట వారింగూడ విమానంబెక్కించుకొని క్రమంబున బంచవటి, దండకావనంబులు, గడిచి శరభంగా, గస్త్య, సుతీక్ష్ణా, త్రి, వాల్మీకాద్యాశ్రమంబులు గనుచుఁబద్నాలుగు సంవత్సరములు పూర్తియయిన పంచమీదివసంబున భరద్వాజాశ్రమంబుఁ జేరి యాతనిచే సత్కరింపఁబడి రాముండిట్లనుచున్నాఁడు.

తో. భరతునకునుగడ। పటితమ్మునకును। భద్రంబే! మునివర్యా! స్థిరముగ రాజ్యముఁ-జేయుచుఁదల్లుల। సేవింతురె! యోయార్యా!॥ రా॥

వ. అనిన మునివర్యుండిట్లనియె.

•తో. మీరాకనుమదిఁ-గోరుచుజడలును- నారచీరలుధరించి।ధారుణిభారము। దమపాదుకలం-దారోహించిసహించి. ॥ రా॥

వ. నందిగ్రామంబున సుఖంబుగనున్నారు తాముగ రావణాది రాక్షసకాననంబులు గాల్చి సుఖంబుగవచ్చినవార్త తమకటాక్షంబునఁ గలిగిన దివ్యజ్ఞానంబున నెఱుంగుదు రామా! త్రిలోకాభిరామా !

భరద్వా-కీర్తన, ఆదితాళము, ఓరామ॥

ఓదేవదేవ! నిన్ను-యోగులందఱు। నాదిమధ్యాంత రహితుఁ, డనుచుఁ గందురు। ఆదివిష్ణుఁడవునీవె। శ్రీదేవిజానకిదేవి। యాది శేషుఁడా లక్ష్మణుఁ, డగునుసత్యము ॥ఓదేవ॥ నీమాయచేఁదిగుణములు-నెగడిసృష్టిస్థితిలయో। ద్ధామక్రియలుఁ జేయుచుండు। దమకునంటవు ॥ఓదేవ॥ అజ్ఞులకువ్వైరై యుండు। వరయమోక్షగుండమందు।విజ్ఞులకుదోఁచి చాల-వెలుగుచుందువు॥ఓదేవ॥ నారాయణశర్మవినుత ! నాయింట నీనాఁడు నిలిచి। నన్ను ధన్యుఁజేయఁగదవే! నతజనావన! ॥ఓదేవ॥

వ. అనివేఁడిన సమ్మతించి యందువసించి హనుమంతుం జూచి రాముండిట్లనియె.

తో. గంగాతటమునఁ। గలదొకనగరము। శృంగిబేరమననందు। రంగుగఁజెంచుల। రాజుగుహుండను। రానుభక్తుడింపొందు ॥రామ॥

వ. అతనితో మదాగమనవార్త యెఱింగించి పిమ్మట నయోధ్యకుఁ గ్రోశమాత్రదూరంబున నందిగ్రామ మనునగరము గల దందు.

క. భరతుండున్నాఁడాతని। సరసకుఁజని జనకజాత ♦ సౌమిత్రులతో। నరుదెంచెరాముఁడని సు। స్థిరముగ మత్కుశలవార్త ♦ దెలుపుము వేగఁ.

వ. అతండు మునింబోలె జటావల్కల ధారుఁడయి నావలె నే! యున్నాఁడు. రయంబునఁ బోయిరమ్మన నుప్పొంగి మనుష్యాకారంబున బయలుదేరి వాయునందనుండు వాయువేగంబునఁజని.

తో. గుహునిగనుంగొని। కుశలంబుగనిన। కులుకు వచ్చుచున్నాఁడు। సహసీతాల, క్ష్మణుఁడై యెదురుగఁ। జని కాంచుమునీవు నేఁడు॥

వ. అని పలికిన నతండానంద భరితుండై కాచుకొని యుండె నంతహనుమంతుండు నందిగ్రామంబు జేరి.

గీ. పాదుకలయందుఁ దనరాజ్య ♦ భారమునిచి। జడలు ధరియించి శత్రుఘ్న ♦ సహితముగను। రాముఁడేమాయెనో! యింక ♦ రాడటంచు। నెంచుచున్నట్టి భరతుని ♦ గాంచిపలికె.

హను-కీర్తన,ఆదితాళము, శంకరసం.

రామునిదూతను రాజవరా! స్వామికార్య రత,సత్యధరా! క్షే

మంబున(శ్రీ), రాముఁడు లక్ష్మణ, భూమిజయుతముగ। బాలుపుగ వచ్చెను॥ రా॥ రావణుండుదన, దేవిని జెరగొన। గా వానిని దగ, ఖండించి। వేవై దేహిని, విడిపించుకసు। గిరివాదులతోఁ దావచ్చెనువిను॥ రా॥ రాముండిపుడు భ-రద్వాజాశ్రమ। భూమినిల్చినదుఁ బుత్తెంచె। భూమీవరసా। పుగనుమోక్షపుర। ధామునికెదురుగ। ద్వరగానేగుము॥ రా॥

వ. అనుపలుకులువిని భరతుండు హర్ష సముద్రంబున నోలలాడి మైమఱచి కొంతసేపుండి పిమ్మటలేచి హనుమంతుని గౌఁగలించుకొని యానందాశ్రుకణంబులచే నభిషిక్తునిజేసి యిట్లనియె.

తో. ననుఁ దేర్చితివిటు, నాప్రియాగ్రజుని, ఘనశుభవార్తను దెలిపి। మనుజుడవో! సురమాన్యుఁడవో! నా-మదినెఱుఁగను గురి నిల్పి॥ రా॥

క. వరలక్షధేనువులుశత। పురములు సకలాభరణ సు ♦ భూషిత లగు సుం। దరకన్యలఁ బదియార్వుర। గురుభక్తిని నిచ్చినాడఁ ♦ గొను నీకొఱకుఁ.

వ. అని ప్రశంసించి శత్రుఘ్నునితో నిట్లనియె.

భ-కీర్తన, ఆదితాళము, హిం, కాఫిరాగము.

పోదాముర మ్మనుజా! మనము॥ పో॥ మోదమున మోక్షగుండ। కోదండపాణికి నెదురుగ॥ బో॥ పురినిఁగ్రైసేయింపుము।రాజ। తరుణుల రావింపుము। కరిరథహయములు సాగ।వరతూర్యరవములుమ్రోగ॥బో॥ వారకామినులాడఁగ। జటుల। వందిబృందముఁగూడఁగ। నారాయణశర్మ హృద్వి। హారున కెదురుగమనము॥ బో॥

వ॥ అనిచెప్పిన శత్రుఘ్నుం డాక్షణంబున నన్ని యేర్పాటులుఁ జేసినంత సామంత పౌరజన వందిమాగధ వారకాంతాదులుఁ బరివేష్టించి కొలువ బ్రాహ్మణులాశీర్వదింప భేరీమృదంగ కాహళాది మంగళారావంబులలర రాజకామినులు పల్లకులయందు వచ్చుచుండ రామపాదుకాద్వయంబు శిరసావహించి తమ్మునితోఁగూడఁ బాదచారియై కొంతదూరంబుఁజని యప్పుడు.

తో. కాంచెనుభరతుఁడుఁ। గనులనురవిసం। కాశము విధికల్పితము। సంచితశశినిభ। మతిసుందరమును। నయిన దివ్యపుష్పకము॥ రా॥

వ. ఇట్లుగాంచి యానందభరితుండై యుండ నాంజనేయుండిట్లనియె.

హ-కీర్తన, హిం, కాపి, అటతాళము, మొర్కైన.

కనుఁగొనుభూవర! కనులలరార । యొనరవిమానము। జనుదెంచుచున్నది॥ కను॥ అందుశ్రీరాముడు। నవనిజసుమిత్రా। నందనసుగ్రీవ। నగచరులున్నారు॥ కను॥ వరమోక్షుగుండసి। వాసునిగొలుచుచు। సరగ విభీషణుఁ। డరుదెంచుచున్నాఁడు॥ కను॥

వ. అని పలుకునంతలో విమానంబు సమీపించిన రాజకాంతలు మొదలయినవారు శిబికాదులనుంచి క్రిందదిగి నిలువంబడి చేతులెత్తి చూపుచు.

తొ. అదిగో! రాముం। డదిగో! లక్ష్మణు। డదిగో! సీతాదేవి। కడువడిగన్నుల, కరువుదీరఁగాఁ-గాంచుచువారలి॥ రా॥

వ. అనిబహువిధంబుల మెలుగెత్తి పెద్దగాఁ జెప్పుకొనుచుండిరి. భరతుండును రామునిజూచి క్రిందినుండి చేతులుముకుళించి మ్రొక్కినఁ గాంచి రాముండు మహానందంబున విమానంబుఁ గ్రిందికిఁ బఱపించి.

తొ. తమ్ములఁ బౌరులఁ। దల్లులదాదులఁ, దక్కిన పరిజనములను। సమ్మదమునఁ బు-ష్పకమెక్కి-డునటు। సలిపి పరవెగ్రమ్మరను॥ రా॥

వ. బహుకాలంబునకుఁజూచిన మక్కువచే రాముండు భరతుని దనయంకతలంబునఁ గూర్చుండఁబెట్టుకొని కుశలంబడిగె. భరతుండును సీతాలక్ష్మణుల నాదరించి సుగ్రీవాంగద నల నీల జాంబవంత సుషేణ ప్రముఖవానరులఁ జిత్రంబుగా నవలోకించి కుశలంబడిగి సుగ్రీవునిఁ గాగిలించుకొని యిట్లనియె.

గీ. నీ సహాయంబుచే రావ ♦ ణాసురాది। శత్రులనుగెల్చె మాయన్న ♦ మిత్రతనయ। నలువురముసుమ్మి యన్నద ♦ మ్ములము మేము। ప్రీతినీతోడ నేర్పర ♦ మైతిమిపుడు.

వ. అని శ్లాఘించెనప్పుడు శత్రుఘ్నుండు రామలక్ష్మణసీతాదేవులకు నమస్కరించిన దీవించి రంత రాముండు.

తొ. తల్లులకును బ్రణ, మిల్లినవారలు, దనయునిలేవఁగనెత్తి। యుల్లంబునవగ। నొందిపిమ్మటను। నుబ్బిరియ-క్కనసెత్తి॥ రా॥

వ. అప్పుడు భరతుండు.

తో. తామయోధ్యకి-త్తరిఁ జేరఁగనే! ౹ త్రముల గనగఁ జేకూతే। స్వామి ! నాభవము । సఫలతజెందెను । నామనోరధముదీరె॥ రా॥

భర-కీర్తన, జంఝూటి, అటతాళము, ఆదిమారుని.

ఇఁక రాజ్యము నీవే-యేలుమురామా! యెుకటినాచేతఁగా-దోప రంధామ! ॥ఇఁక॥ పదియుడుగులు మును-పటికంబె ధనము। కొదవాయె ఖజానా। కొట్టుంగో వినుము। పాదుకలనురాజ్య। భారముంచితి నీ। పాదుకలను నీ కర్పణజేసితిని॥ ఇఁక ॥ నీపంపుఁజేయుచు - నినుగొల్చెదను। నేపట్ల మోతుకుం-డేశ్వరనేను॥ ఇఁక॥

వ. అనియిట్లు పలికిన వనచరులుమోదించి రంతలో విమానంబు నందిగ్రామంబు సమీపించెనప్పుడు రామానుమతంబున నందఱు దిగి భరతునియాశ్రమంబుఁ జేరి రప్పుడు.

తో. ధనదునిజేరఁగఁ- బనివినియెదనే । ననిపిడ్కానిపై కెగిరె । చనియెవిమానము। వినువీధినినై-శ్రవణునినగరముదారి॥ రా॥

వ. రాముండు కులగురువగు వసిష్ఠమహామునికి నమస్కరించి దీవనలంది యాయన యనుమతిచే నర్హాసనంబున-గూర్చుండె ననంత రంబు భరతుండు.

తో. తల్లినాకు ద-త్తంబుసేసెనే। దత్తముచేసితి నీకు। వల్లభుడ వుయా-వదాజ్యమునకుఁ। బాలింపుముదయవిడకు॥ రా॥

అని పాదంబులకు సాగిలిపడి వేడుకొనియె నింతలోఁగైకవచ్చి.

తో. నాతప్పిదముమ-నంబుననుంచక-నాయన్నా! దయయుంచి। నీతితోడనవ-నీతలమెల్లను । నీవేలుముసైరించి॥ రా॥

వ. అని యనేకవిధంబులఁ బ్రార్థించెనప్పుడు వసిష్ఠుండులేచి వీరియభిమత ప్రికారము సమ్మతింపుమని చెప్పిన రాముఁడు నియ్యకొనియె. నంతరామలక్ష్మణ భరతశత్రుఘ్నులకు క్షురకర్మంబులు జేయించి సుగ్రీవ విభీషణాదులు గూడి తైలంబుఁబూసి.

క. జడలూడదీసిస్నానము । గడువడిఁ జేయించి వస్త్ర ♦ గంధంబులు మేల్ । దొడవులునలంకరించిరి । పుడమీసుతకపుడుదార ♦ ముఖచెలులెల్లన్.

వ. అభ్యంగస్నానంబుఁ జేయించి సర్వమాల్యాభరణాదులచే

నలంకరించిరి. అప్పుడు గౌసల్య కొడుకునుజూచి యానందించె. శత్రుఘ్నునియనుమతిచే సుమంత్రుండు రథంబాయతబుంజేసి తెచ్చిన రాముం డారోహించి.

రగడ-సాకేతముజేరెర్ । రాముడు । సకుటుంబముగాగర్.

సౌమిత్రియుమత్రి, శత్రుఘ్నుండును । జామరములుప్రీ, వగభరతుండును, శ్వేతచ్ఛత్రము-బెలగుచుబట్టగ- గోతులమూకలు, గూడనుముట్టగ, భానుజయువరా- గ్రప్రముఖవానరులు, దానవపతియుర, ధద్విపాశ్వములు, రామునియానతి - రయమునవెక్కియు, వేమరురాగను, వెంబడిజొక్కియు, సాకేతముజేరెర్.

ఇంద్రుడు తనరథ, మెక్కియురాగను, జంద్రముఖులు ధర,జాతనువేగను, గైకసుమిత్రా, కౌసల్యాదులం, బ్రాకటతారా-ప్రముఖభామినుల, శిబికారూఢులం-జేసుకనడువంగం । బ్రిబలివాద్యములు-బరువడిమ్రోగంగ॥ సాకేతముచేరెర్ । రాముండు సకుటుంబముగాగర్.

వందిబృందకై-వారములలరగం । ముంగుభటులుస, మ్ముదమునంగొలువంగ, వారకామినులు, వరుసగనాడగ, వారకగాయక, వర్యులుబాడంగ, బౌరులుగుముల్లై- బరువడింజూడంగం, గూరిమినధర్తలు-గొబ్బునవేడగ, బురిశృంగారముం-బొసంగంగంగాంచుచు । నరుదగునాశ్చ, ర్యంబునం దేలుచు॥ సాకేతముంజేరెర్ । రాముండు। సకుటుంబముగాంగర్.

వ. ఇట్లయోధ్యజేరిన నవ్వార్తవిని రామసందర్శన కుతూహలమానసలై పౌరకాంతలు భర్మహర్మ్యాగ్రంబుల పయికెక్కి సేసలు చల్లుచు శరీరంబులు పులకాంకురములునొంద నిట్లనుచున్నారు.

పౌరు-కీర్తన, ఏకతాళము, సైరంధ్రి.

పట్టాభిరాముంజూడరే। పట్టాభిరామునకు। నింకను । బట్టాభిషేకమగును । బట్టపుదేవి జనక । పట్టియేయగునార॥ పట్టా॥ నీలాబ్దగాత్రుండగు। నితండు । నీరజనేత్రుండగు। లీలావతారుండగు । బాలించి చూడనగుం॥బట్టాభి॥ శ్రీమోక్షుగుండేనువి। నేడు। సీతాసమన్వితుని। శ్రీమిాఅగాంచితిమి । యేమిసుదినమగు ॥ పట్టాభి ॥

వ. ఇంతసురూప వంతుండగు ననంత తేజోభిరాముని రాముని గాంతాయుతంబుగ, గాంతారమునకుబంపి దురంత చింతాక్రాంతుల

జేసెగదా! కైక. యావత్తమైన దయలేక, యత్యంత కఠినాత్మురాలుగాక.

తొ. కైకననఁగ నక్కర లేదెంతటి। ఘనులైనను లోకమున। ప్రాక్కృతకర్మము, పగిదినినడుతురు। గాకయన్య మొకటగునా!॥రా॥

వ. కైక ప్రేరణలేకున్న లోకకంటకులగు కైకేసీ సుతప్రముఖానేక రాక్షసమూక లేకరణిని జెడుదురు. పాకారి ముఖ్యదివౌకసుల కేకరణిని మేలుచేకూరు నిదియవశ్యంబుగా దగినకార్యమే! సరి, యనుకొనుచుండు నంతలో.

తొ. నిజభవనమునన్నిధికిఁ జేరిమా। నితరథమవరోహించి। నిజమాతలకు ననేక దండములు। నేర్పుతోడ నర్పించి॥ రా॥ కొలువుకూటమున। కనుజనిరతోన్న। జ్వలసింహాసనమునను। గొలువుదీరతను॥ గొలుచుచుముందర। నిలిచిన భరతునకనెను॥ రా॥

రా. కీర్తన, ఆదితాళము, హంసధ్వని, సరోజాస.

మదాజ్ఞానుసారుండవై। ప్రాజ్ఞతతోనడుపుము॥ మదా॥ సంజ్ఞనునెల్లపనులు। సరగుననెరవేర్పుము॥ మదా॥ దానవభర్తకు। వానరభర్తకు। దగవేర్వేరుగను। విడుదులుజతపఱుపుము॥ మదా॥ రాజకాంతలను। రయముననంతిపు। రంబులకుబంపు! ఘనముగసురవరుగను॥ మదా॥ అభిషేకార్థము। యత్నముసలుపుము। శుభముగమోక్షపుర। విభుమదిఁదలఁపుచువడి॥ మదా॥

వ. తదాజ్ఞను శిరసావహించి భరతుండు సర్వము నెరవేర్చి యన్నకు నిట్లనియె.

క. రవితనయవిభీషణసుర। ధవయువరాజాదులకును ♦ దగవేర్వేఱుగ। నివసింపఁగఁదాపులు మ। ద్భవనంబున నేర్పఱచితిఁ ♦ బరమదయాళో.

వ. అని విన్నవించి పిమ్మట సుగ్రీవుని చేరంబోయి యిట్లనియె.

తొ. శ్రీరామునకభిషేకము చేయగ। సింధుజలముకావలెను। మారుతమునకు సమానంబుగజను। వారినిబంపగవలెను॥రా॥

వ. అని తెలిపిన సుగ్రీవుండు మంచిదని గవాక్షలీల నలాంజనేయుల చేరంబిలిచి క్రమంబున నిట్లనియె.

సంకీర్తన, త్రిశ్రజాతి, సంతతంబున.

పోయిరాదగు । వాయుజవముతోఁ ॥బోయిరా॥ తోయధులజలము। దూర్ణంబునఁగొని। తెచ్చుటకును ॥బోయి॥ ఓగవాక్షనీవు। బ్రాగబ్ధిజలమును। వేగమెకైకొని। వేగెనులోపల ॥బోయి॥ నీలదక్షిణాబ్ధి। నీరముముహూర్త। కాలమునకుఁజేర్ప। గావలెఁగావునఁ॥బో॥ ఓనలుఁడా! పశ్చి। మోదధిజలము। లానందముగఁదెచ్చి। యర్పించఁగానీవు॥బోయి॥ పావనియుత్తర। పాదోధియందున్న। పావనతీర్థము। వేవేగఁదేఁగను॥బో॥ శ్రీమోక్షుగుండ శ్రీ। రామాభిషేకార్థ। మైమీరుమోదాబ్ధి। యందోలలాడుచుఁ ॥బోయిరాదగు॥

వ. మఱియు సమస్త పుణ్యనదీతీర్థంబులు తెచ్చుటకు సుషేణ జాంబవంతుల నియమించిన వారందఱును గనక కలశంబులు ధరించి వారివారి నియామక స్థలములనుగూర్చి యరిగిరి. అనంతరంబ.

తో. భరతుఁడు నగరము। బరువడినిసలం। కరణముజేసెడు నటుల। బురమునఁజాటింపుఁడనితటుకునఁ, బురికొలిపెను తనభటుల ॥రా॥

వ. భరతాజ్ఞప్రకారము భటులు సాటించినమాత్రంబున.

సంకీర్తన, ఏకతాళము, శహానరాగము, ఎంతనివే.

పురమునలం। కరణముజే। సిరిపురుషులు జెలులుల్। శోభా।కరముగసొగసుగఁ ॥బురము॥ పరిమళఘనసారమృగమద। భరితచందనంబుఁ బరగఁగూర్చి యలికిరి ॥పురము॥ గోడలపై। మేడలపైఁ। జూడఁగ జిత్తరువుల్। వేడుకలర వ్రాసిరినానావిధముగను। గో। యీడులేని మాడువుల ధ్వజములను। బైడికలశములు। బాగుగనెత్తిరి ॥పురము॥ ముంగిళులన్, ముత్యముల। రంగవల్లులలరన్। మంగళముగభ। ర్మస్తంభమ్ముల ॥ముం॥. రంగుమీఱఁ బ। చ్చఁగూర్చిరతో। రణములుశుభమా। రంగనటుగట్టిరి॥ పురము॥ చల్లనిపందిళ్ళదగన్।మెల్లెడలన్ జెలంగన్। సల్లలితాగరు। సద్ధూపములును। జల్లని। వెల్లివిరియ మోక్షుగుండ శ్రీరఘు। వల్లభుండు రంజిల్లి మెచ్చగను ॥బురము॥

వ. ఇటువలెనారాత్రి నాలుగుయామంబులు నిద్రాహారంబులు వర్జించి సమస్తజనంబులు పురము శృంగారించుట లోనగు కార్యములయందు బ్రవర్తించి రాతెల్లవారిన వసిష్ఠుండు సనుదెంచి.

క. పట్టాభిరామమూర్తికిఁ । బట్టముగట్టంగ నేఁడు ♦ బహుశుభ లగ్నం । బట్టయినను గైసేయుఁడు । పట్టుగ రామునకు జనక ♦ పట్టికి ననినన్.

తే. అంతవసిష్ఠుని - యానతిఁదలగొని । కాంతలు బురుషులు గలిసి । వంతులు వేసి వ-సంతములాడిరి । వావివరసను దెలిసి ॥రా॥

వ. ఇట్లు శ్రీసీతారామసహితంబుగా సకల పురుషులు స్త్రీలు నుజేరి మంగళవాద్యంబులు మ్రోయుచుండఁ జెలరేగి.

సం-కీర్తన, ఏకతాళము, దారిజూ.

ఎంతో వైభవ మొదవఁ జెలగుచు। వ। సంతోత్సవము వేడ్క। స లుపదొడగిరి ॥యెంతో॥ తరుణులున్ । బురుషులున్ । స్థిరముగన్ । వరుస లున్ । సరగ దెలిసి। చల్లుకొనుచును॥ జన । మెంతో ॥ఇత రేతరంబు దరు ముచున్ । జేతో,ప్రీతిన్ । ఖ్యాతినెన్నుచున్ ।జన। బీ,రమ్ము జేయుచున్ । బేరమ్ము దీయుచున్ ।వదనమ్ములలర। సర, సమ్ముల-సిమ్ముల-నమ్మించి-చి మ్మించిచ,ల్లుచు॥ నెంతో॥ రారాదా। చల్లగారాదా।యని। చీరుచుదూర ము-బారుచును ॥జనమెం॥ మంచి-పసపు నీరుసున్నము। నిం। పెసఁగగన్, గుసుమస। ద్రిసముతో। బిసికిచల్లులాడుచున్ ॥ జన। మెం॥ వర-మోక్ష గుండరాఘవుని క।టాక్షముంటుటన్ । బ,రిక్షబట్టుచును । దీక్షతో వంతు లాడుచును ॥జన। మెంతో॥

వ. ఇట్లుకొంతదడవు పంతంబులు మెఱయ వసంతంబు శ్రీరామ చంద్ర మహాప్రభువుగారిని, జాయాయుతంబుగఁ బీఠంబులపయిఁ గూ ర్చుండఁజేసి సువాసినుల నివాళులిచ్చి రెట్లనిన.

హారతిపాట-ఉశేనిరాగము, ఆదితాళము, ఈరాజా.

సీతారామునకు। బ్రీతిగను హారతులొసగరె॥సీతా॥యాతుధాను లఁ, గోతగోయగా। భూతలంబునం। దుదయించిన॥ సీతా॥ మేలుగనుభూ। పాలులరయఁగ। నోలిశూలి। చాపమువిరచిన ॥సీతా॥ దండిగను మోక్ష, గుండపురమున। నిండువేడ్క-తో నివసించిన॥సీతా॥ శ్రీయముగనా। రా యణార్చితు। డై యనంతముగ। విలసిల్లెడు॥ సీతా॥

వ. ఇట్లుహారతులిచ్చి యామిఁదశోభనంబులు నాడిరెట్లనిన.

శోభనపా-కల్యాణిరాగము. ఆదితాళము, మనవిని.

శోభనమనియనరే। సుదతులార! ॥శోభన॥ ప్రాభవమునసీ,తా భగవతితో। శోభిలు రామునకు।సుదతులార! ॥శో॥భూతావళులను। బ్రోచుచునుండే। సీతారామునకు। సుదతు!॥శో॥భానువంశ సంభవుండయి వెలసిన। జానకీరామునకు। సుదతు॥శో॥దశకంఠునిశిర-ఖండంబుగఁగూల్చిన। దశరథరామునకు। సుదతు ॥శో॥ మోతుకుగుండమున। ముదమున వెలసిన। మోహనరామునకు । సుదతు॥ శో॥ సరగనారాయణ శర్మనుబ్రోచిన। ధరణిజ రామునకు। సుదతు॥ శోభన॥

వ. ఇట్లు శోభనంబులు పాడుచు సంపెఁగ తైలంబునఁ దలలంటి యనంతరంబున నలుగు బెట్టు విధంబెట్లన్నను.

నలుగుపాట-రూపకతాళము, దాసికా.

రామల్ నలుగులొసగిరి। వి, రాజితకరులైయా॥రామల్॥ రామునకరిభీమునకు । భూమితనయకుఁదగ। గామితములుజెలు। వా రా। నా॥ రామల్॥ మోములదరహాసములు। ప్రేమం। జిగురంపఁగ। గోమలతను పులజిగి। గలుగా,నా॥ రా॥ ఈదంపతులనుగొలువ। యీనాటికిగలిగెను। మోదంబనుచును విశదముగానా॥ రా॥ మోతుకుగుండమున వెలసి। మోహాంగనను గలసి। సాక్షిగఁ జెలువొందిన రామునకా॥ రామల్ నలుగులొసఁగిరి॥

వ. అటుపిమ్మట.

గీ. మంగళస్నానమాడించి ♦ మధుపతులిత। చికురమునుగూర్చి దడియార్చి ♦ చిక్కుదీసి । కీలుగంటులునైచియుఁ ♦ బూలుముడిచి । పరగసాంబ్రాణి నవ్యధూ ♦ పంబు వేసి.

తో. శ్రీరామునకును। సీతాదేవికిఁ। జీనాంబరములుగట్టి। హారమకుటకే, యూరకంకణా। త్యాభరణంబులు వెట్టి॥ రా॥

వగలజేలునగు। మొగముల సొగసుగ । మృగమద తిలకముదిద్ది। దగబరిమళయుత। మగుచందనమిం। పుగనెమ్మేనులనద్ది॥ రామ॥

వ. ఇట్లు శృంగారించి సకలజనులు స్నానంబులొనరించి శుచిర్భూతులయి నవీనాంబరములు ధరించిరంత.

సంకీర్తన, బేహాగ్, ఆదితాళము, నిదుర లేక.

స, భా మంటపముఁజేరెను । శ్రీ,రాముండు బట్టాభి-రాముఁడు

వేడ్క॥సభా॥వాసవనీల ప్ర-భాసములంకృత। భాసురనవ్యసో। పానరంజిత॥ సభా॥ ధర్మమయ స్తంభ। భరితమై శశికాంత । నిర్మలవేదికా। నిర్మాణ మగు॥ సభా॥ ఖ్యాతిగదనయను । జాతులు వెనువెంట । నేతేరసీతాస, మేతుండై దివ్య॥ సభా॥కరుణాకటాక్షవీ, క్షణమున బ్రజలను। నరయుచు మోకుగు। డాధిపుండపుకు॥ సభామంటపము॥

వ. ఇటునవలె సభామంటపముజేరి శ్రీరామచంద్రుండు.

క. రవివంశ జనితభూమీ । ధవవసతార్హంబు విమల ♦ తటిను జ్వాలమ్మున్ । నవరత్న వినిర్మితమును । నవ్రుసింహాసనముమీద ♦ నారో హించెన్.

వ. ఇట్లు సింహాసనా సీనుండయి.

సీ. ఒకవంక బిరుదాంక ♦ మకలంక గతింబొంక ముగనుభట్టారి కు ♦ ల్వొగడుచుండ। నొకయూరగర్పూర♦ యతహారతులుమీఱ వర సువాసినులు సి♦ వ్వాళులొసంగ। నొకమూల స్వరతాళ ♦ మొగింగాలగ తింగాల్చి గంశికాలతాంగులు ♦ గనునటింప। నొకచెంగటంగనంగ♦ నురు సంగతులెసంగ నతులగీతములుగా ♦ యకులుపాడ । జనకనందనవా మాంక ♦ వాసనుజెలంగ। భరత శత్రుఘ్న లక్ష్మణుల్ ♦ భక్తిగొలువ। భానుజాదులు సేవింప ♦ భానువంశ । తిలకుండగు రామచంద్రుండు ♦ గొలువుదీరె.

వ. ఇట్లు కొలువుదీరియున్న కాలంబున.

రగడ. రామునిదర్శింప। వచ్చిరి। రయమున సేవింప। పరమపవి త్రుడు భారద్వాజుండు గురుతపోధనుండు। గుంభసంభవుండు। మాండ వ్యుండును। మార్కండేయుండు। శాండిల్యుండును- సంయమివర్యుండు । వామదేవుడును-వాల్మీకుండును। జామదగ్నిముని-శక్తిమానియును। కల హప్రియుండును-గర్గమునీంద్రుడు। సలలితగౌతమ-సంయమిచంద్రుండు। నత్రిమౌని మొద-లగుమునివర్యులు । భ్రాతృలంగూడియ- సంధ్యాతం బులు॥ రాము ॥ నరులునువరకి-న్నరులుంజారణులు । సురలుగరుడయ- క్షులు గంధర్వులు । సాధ్యులు ఘనఖే-చరులుగుహ్యకులు। విద్యాధరు లును-విశ్వేదేవత। లష్టదిక్పతులు-నాకింపురుషులు। సప్తవసువులును-నా యప్సరసలు। మొదలుగ ముజ్జగ-ములవారెల్లను । సదమలసంతో-షం

బులుఁజెలఁగను॥ రామునిదర్శింప, వచ్చిరి। రయమున సేవింప.

వ. ఇట్లువచ్చిన ఋష్యాదుల కెదురుగానేఁగి తోడితెచ్చి సిద్ధాసనంబుల గూర్చుండఁబెట్టి పూజించి వారిసమ్మతంబున సింహాసనాసీనుడైన రామునకు వారిట్లనిరి.

ఋ-కీర్తన, సురటరాగము-ఆదితాళము, మాకులమునకీ.

శ్రీరామపట్టాభి। షేకలగ్నము సమ। కూరెను బ్రొద్దుమీరెను। యీరాజ్యభారము। నీరోజునీవుభ, రింపుము। పరిపాలింపుము॥ శ్రీ॥ నీయవతారము, చే సాధువులకుమే, లాయెను। వెతలుప్రా యెను। శ్రీయుతమోక్షపు, రీశ్వరయందరుఁ-జేరిరి। చూడఁగోరిరి.

వ. అని ప్రశంసచేయుచున్న సమయంబున.

తో. హనుమాతుఁడులో, నగుప్లవగులు జతు,రబ్ధుల జలములుగొనుచు। జనుదెంచియు రా,ముని ముందరనుంచిన వారినిదయగనుచు॥ రామా రామా రామా రామా॥ శ్రీరామా॥

వ. వారినెల్ల సన్మానించెనంత వారు రామునకు నమస్కరించి యవ్వలనిలిచి చూచుచుండి రప్పుడు వసిష్ఠ వామదేవాది ఋషులు పట్టాభిషేకం బొనర్చుటకు సంకల్పించిరి.

శ్రీ రామ పట్టాభి షేక ము.



కీర్తన, కళ్యాణిరాగము, అటతాళము.

శ్రీరామపట్టాభి। షేకమహోత్సవ। మాహూఁగసఁగనే।

తాన్నంద కరము, చారుతులసీ కుశవిరాజితమై। వరకుసుమ సద్ఘనసారమిళిత సుగంధపూరితమై। ప్రియమై। జయమై, తన। రారుసింధు జలంబుతో మన। సార నభిషేకంబొనర్చిరి॥ శ్రీరామ॥

భరతశత్రుఘ్నులు-భయపార్శ్వంబులసీత। సరిమెడమ దిక్కు-ల, త్స్మణుండు పడమటను। వరుసఁగరువలిపట్టి తూర్పునను। యువరాజ జాంబ, వంత రవిజ విభీషణులుఁ దగను గీలి। మూల। మొద। లొరసి కోణములందు నిలిచిద్ర-గుత్సవంబుగఁ గొలువలరెను॥ శ్రీరామ॥

నవరత్నమయభూష-ణములుహారంబులు-దివిజవల్లభుఁడు-దెచ్చియియ్యఁగను। వివిధవాయుద్యములు మొరయఁగను! ఖేచరులుగూడి యవిరళంబుగ। గుసుమ వర్షమును। గురియ। మెరయఁ। గోటి, రవుల కాజితులు గలకిరీటము। రమ్యముగ ధరియింప నలరెను॥ శ్రీరామ॥

వారకవసిష్ట, వాల్మీకజాబాలి। వామదేవాదులు। వైభోగముగను। సారెకునాశీర్వదింపగను। వారాంగనలు యొ। య్యారముగమోదించియాడగను। గరము, థరను, దా। భ్యారినారాయణ మనోజ్ఞ వి,హారుఁడగు శ్రీమోక్షగుండ ॥శ్రీరామ॥

తో. వామభాగమున। వైభోగంబుగ। భూమీపుత్రిక జెలఁగ। క్షేమంబుగ మణి, సింహాసనమున। శ్రీరాముండటు వెలుఁగ ॥రా॥

క. కనుఁగొనిశంకర ఫణిపతు। లనిమిషపతి నిర్జరాఘ•యతూాదులుశో। భనముగఁగరములు మోడిచిఁ। కొనియాడిరి రాము నసుర • కోటివిరాముః.

శివు-కీర్తన, రూపకతాళము, కేదార రాగము, సాటి.

•రామ! సీతా। రామ! పరం, ధామ! భక్త। కామ! జయసుందర॥ రామ॥ సోమసూర్య। వహ్ని మండలగత! నీమాయచే। భోమిాటుట, సామాన్యమె ॥రామ॥ భూతలాదిభూతకోశా। తీత! మోక్ష, గుండ సువిరాజిత! వీతరాగ! నారా, యణకవివర। చేతోకం, జాతస్థిత!ధాతస్తుత!॥ రామసీత॥

తేవారము.

నీమహామహిమఁదెలియ ♦ నేరలోకాభిరామా! భూమి భారంబు వాపి♦బ్రోచితివి రిపులజంపి। క్షేమముగ దేవతాళి♦ చిక్కులనుబాసి బాళి। వేమరుఁజరింపఁగలరు ♦ విశ్రమింపంగఁగలరు.

శేషుని-కీర్తన, ఆదితాళము, శంకరాభరణము, కరివరదాకా.

నినుఁదెలిసి పొగడతరమా! శ్రీరామా! నిను, దెలిసి॥ సులభముగాను సు, షుమ్న నాడియం । దలరుచు వెలిఁగెడు। నాత్మమయుని।నినుఁదె॥ అణువులోనణువునై। ఘనములోఘనమై। యణిమాదులకును। నందరాని ॥నినుదెలి॥ అక్షయముద నా, రాయణకవి, మోక్షగుండము న। వీక్షించెడు ॥నినుఁదెలి॥

తొ. నిరతముమమ్ముల। నిలువనీకఁగడు। వెరపించెడు రావణుని॥ బారిగొంటివిప్పే, పుణ్యంబున సుఖ, ముగనుండెదమిఁకభువిని ॥రా॥

క. తనమందరసంగీతము । మనమలరఁగఁ బాడుమనుచు ♦ మమ్మేచెడునా। దనుజేంద్రుని క్రూరాత్ముని । దునిమితివిఁకనిన్ను బాడు♦దుము శ్రీరామా!

తొ. వెనుకొనియాగహ, విస్సులుదానే! గొనుచుండునుదానవుడు। దునిసెనునీచే। దురమునఁగ్రిమ్మర। దొరికెనుమాకవి యిపుడు॥రా॥

క. కడువడి నరులుగయాదుల।నిడుఁపిండంబులనుజెంద ♦ నియ్యదుమాకుఁ। వెడరక్కసుఁడీల్గిన ని। ప్పుడుమాకవిదొరికె నీదు ♦ భూరి కరుణచేఁ.

వ. అనియిట్లు యక్షకిన్నర కింపురుష విద్యాధరాదులు వేర్వే ఱఁబొగడి రామునిచే ననుజ్ఞాతులై స్వస్థానంబులకుంజనిరంత రాముండు వేదపారగులగు బ్రాహ్మణులకు లక్షగోదానంబులు రథతురంగదానంబులుజేసి పిమ్మట వస్త్రాభరణ సువర్ణదానంబు లమితంబుగా నొనర్చి.

తొ. పొంగుచు సు,గ్రీవునకును దానవ। పుంగవునకుహారములు నంగదు నకుమణి। యంగదములుఁగపు। లందఱికిని బహుమతులు॥రా॥ సమ్ముదముననిడి। సత్కరించితన। సన్నిధిఁ గొల్చుచునున్న। యమ్మారుతిఁగని। యడుగు వరములో। యన్నా! యిచ్చెదనన్న॥ రా॥ నామదిలో నీ-నామస్మరణము। మనారతమును జేయుచును। నేమారక నేనెసగుభ క్తి

నా। కిమ్మపూర్ణమగుదయను॥ రా॥

గీ. ఎంతదాఁకనునీనామ ♦ మెంతదాఁక । నీదుస్మరణముభూమి పై ♦ నిలువఁగలదో ! యంతదాఁకను నాదేహ ♦ మవఁయందు। నిలిచి యుండఁగవరమిమ్ము ♦ కలుషహరణ.

వ. అనిన రాముండానందించి.

తో. చక్కఁగనీయు, ష్టంబు లొసంగితి । జయ్యనినిను మెచ్చితి ని । తక్కకఁగల్పాం । తమునసిన్నుధా, తనుజేసెదసమ్మతిని ॥ రామ ॥

వ. అటుమీఁద మత్పదంబునొందఁగలవు హనుమంతా! ధీమంతా ! గుణవంతా ! యని రాముండు వరంబులిచ్చినవిని సీతాదేవి తా నిట్లనియె.

తో. ఇలమీఁదనునీ-వెచటనున్న నం-దిష్టమయినభోగములు । గ లిగినుఖంతువు-గాకనీకునిఁక-గలుగవుమఱిలోపములు॥ రా॥

వ. అని యాపురాణదంపతులు తత్వంబుపదేశించి మహాశీర్వాదపూర్వకంబుగా ననుగ్రహించిన వరంబులకు హనుమంతుండు బ్రహ్మానందంబునొంది పునఃపునఃప్రణామంబు లాచరంచి.

హ-కీర్తన, కళ్యాణి, ఆదితా, సీతాధిప.

జయరమారమణ! గోవిందా! హరీ ! జయ । సమాస్త్రశోభిత। సముజ్వలాంగా ! కుమారకుమారిమనోహరా! ॥ జయ॥ అరుణసితాసిత। వరకృష్ణస్వతి । కాంచితవర్ణవి లక్షణా ! విల ॥ జయ॥ అమలమోక్ష గుండాధిప నారా । యణకవిహృదయ వి । రాజితా ॥ జయ ॥

వ. అని పొగడుచు యథేచ్ఛఁగాఁజని హిమవత్పర్వతంబున కరిగి హనుమంతుండు దపంబుజేయుచుండె సుగ్రీవుండుఁగపికోటులు గొల్వఁ గిష్కింధకరిగె. విభీషణుండు లంకకుబ్రవేశించి రాజ్యంబేలుచుండె. రాముండు దన్నాశ్రయించి కరుణాపాత్రుండై యుండుటఁగని.

తో. మంతనముననను। జింతింపుచునీ। మహినిభోగమునబ్రిబలి। యంతమందునా। యందైక్యంబై। యలరెదుపొమ్మికగదిలి॥ రా॥

వ. అని సెలవిచ్చి యనేకరత్నాభరణాదులచే సత్కరించిన గుహుండానందించి రామధ్యానంబుజేయుచు శృంగిబేరంబునకుఁ జనియె నటుపిమ్మట సాయంకాలంబయిన

ఏకాంతసేవ ప్రారంభము.

తో. అంతరామ సీ । తాంగనలకు నే । కాంతసేవసలుపఁగను। నంతరంగమున। నలరిసువాసిను। లాలోచనఁజేయుచును ॥రా॥

వ. అన్యోన్యాహూయమానలై రెట్లనిన.

చెలులకీర్తన- అటతాళము, ఒకదివ్య.

శ్రీరామునికొలువుఁ-జేయరారమ్మ! కోరికలెల్లఁ। జేకూరు గదమ్మ!॥ శ్రీ॥ భవబంధభయములు-బాయగదమ్మ! యవిరళముక్తిగ।రామలకమమ్మ ॥శ్రీ॥ నారాయణశర్మా, ధారుఁడో! యమ్మ! ధారుణిమోక్షప్రదాతగదమ్మ! ॥శ్రీ॥ మనపురాకృతములు-మంచివ్రాయమ్మ! ఘనమోక్షగుండేశుఁ। గనగలిగెనమ్మ! ॥శ్రీ॥

వ. అనిపిలుచుకొనుచు నాక్షణంబున.

క. బంగారుసరిగచీరలు। రంగుగఁబట్టంచుమేలు♦ రవికలురత్నో। త్తుంగాభరణంబులు మెఱ। యంగను ధరియించివచ్చి ♦ రంగనలెల్లన్.

వ. ఇట్లువచ్చి యత్యద్భుత జగన్మోహనదివ్యమంగళ విగ్రహుండగు శ్రీరామచంద్ర మహాప్రభువును వీక్షించి.

చె-కీర్తన, ఆదితాళము సీతితో.

అందమా। రామునిసుందరము జూడ్రజే ॥ యంద॥ కందర్పసహస్రదివ్యా। కారుడనితెలియరే ॥యంద॥ వామభాగమున వేడ్క--భూమితనయనిల్వఁగ। సామీప్యమందాశ్రితులు-సంతసమునఁగొల్వఁగ। సామిత్రిలోనైనయను-జన్ములతోఁజెల్వగ॥ నందమా॥ హారకేయూరాదిభూష-ణావళిధరించెనే । ధారుణి శ్రీమోక్షగుండ । ధాముఁడనమించెనే । నారాయణ శర్మహృదయ। సారసమున నిలిచెనే! ॥యంద॥

గీ. అనుచునధివర్ణనము జేసి ♦ యంత మీఁద
రామచంద్రుని యంతఃపు ♦ రంబునందు
స్ఫటికమయహంసతూలికా ♦ శయ్యపైకి
వేడ్కతోఁజేర్చియిల్లని ♦ వేడిరపుడు.

చె-కీర్తన, ఆదితాళము, రామమంత్ర.

పవ్వళింపుము। రామ! పవ్వ॥ జవ్వనులమరించినట్టి, పువ్వు॥పాన్పుపై॥ జ॥ వివిధకాంతుల । నలరు। విపులమేడల। కవల శుద్ధస్ఫటిక

మయ గే, హంబులోపల॥ బవ్వ ॥ ప్రీతితోడను । భూజాత తోడను। భాతిగ నారాయణహృ-త్పద్మశయ్యను॥ బవ్వ॥ బల్పసందగు। స్వయం। కల్పితంబగు। తల్పమందు మోక్షగుండ। ధామశుభమగు॥ బవ్వ॥

తో. ఆవిధముననా। త్మారాముసుషు।మ్నాంతఃపుర వరమునను, భావనమగు హృత్పద్మతల్పమునఁ। బవ్వళింపఁ జేసియును॥ రా॥

వ. తిన్నగా సీతాదేవి తావుకువెళ్ళి యిట్లనుచున్నారు.

చె-కీర్తన, అటతాళము, నమిలాం.

పతితోడనుగూడి। పవళింపుదువుగాని। పదవమ్మపడకింటికి।పతి యేదైవంబని। భక్తితోనెమ్మది। భావింపుమెప్పటికి। సీతాదేవి ! ॥పతి॥ ధారుణితాభ్యారి। నారాయణార్చితుఁ। డౌరఘునాయకుని॥ సీతాదేవి॥ పతితోడను॥

గీ. భక్తిచేతనుభరియింప ♦ బసునుగాన। భార్యయనఁబనట్టి దాం ♦ పత్యమునకు । నైకమత్యంబుతోనుండ ♦ నగునుదాని । వలన నిహపరసౌఖ్యంబు ♦ గలుగునబల.

వ. కావుననీపతికి హితంబుగ జరింపుచు సాధ్వి వనిపించుకొని యుభయకులంబులవారికిఁ గీర్తిసంపాదింపుము. బాలా! సద్గుణశీలా ! భక్తానుకూలా!

వ. అనిబోధించి సీతాదేవిని బానుపుపయిఁజేర్చి యనంతరంబ.

చె-కీర్తన, అటతాళము, కాంతుఁడు.

చల్లగను శ్రీరామునిపైఁ, జల్లరేవిరజాజులు।మల్లెమొల్లలు సంపెగలుచే। ముంతివిరులులాజలు ॥జల్లగను॥ అందముగజెలు- వ్రొందుల సదర-విందములు జెంగలువలు। బొంద్గనుదా సానసుమములు।బొగడలును గురువకములు। జల్ల॥ పారిజాతప్రసూనములుమం-దారములు సురపొన్నలుఁ। గోరినారాయణమనోజ్ఞవి- హారునిపయిఁగన్నెలు॥ జల్లగను శ్రీ-రామునిపై॥ జల్లరేవిరజాజులు॥

తో. కమ్మనితావులు ఘుమ్మనిదెసలను గ్రమ్ముసుగంధముఁదీసి। కొమ్మలుగనకపు। గురుఘుపకంబులఁ। గొనితెచ్చియు నారిఁడాసి॥రామ॥

చె-కీర్తన, ఆదితాళము, హంసధ్వని, రవికుల.

పరిమళ। కలిత గంధముబూయఁరే॥ పరిమళ॥కలిత-లలితాతులిత।

భరిత। పరిమళ॥ కలిత॥ సార-తరమగు మృగమద-సారవిరచిత ఘనక-చోర సురజోయుతఘన-సారపూరిత। పరిమళ॥కలిత॥ఖ్యాతిగా। నీతిగ।ప్రీతిగా। భాతిగా। సీతాసమేతుఁడై। చెలగిన రాముని। జేతమురంజిల! జేరియుఁ। బరిమళ॥కలిత॥ భూమి మోతుగుండంబున వేడ్క-వసించె। వేమరునారాయణశర్మను మన్నించి। కామితముల్-గడునొసగిఁ-ప్రేమనెగడు రామునకును। బరిమళ॥ కలితగంధము॥

వ. ఈవిధంబున సుగంధంబు లలంకారంబుగా నలఁది.

క. మధురంబులైన ఫలములు । మధురా పూపములుగొన్ని ♦ మఱిపళ్లెములన్। మధుకరవేణులు దెచ్చియుఁ। బృధివీసుత భర్తకొసఁగి ♦ ప్రియముదలిర్పన్.

చె-కీర్తన, కల్యాణి-రూపకతాళము, పరమ.

ఆరగింపుము। ముద, మ్మారజనక-జాత, సహితంబుగ॥నా॥ నారికేళ కదళికాఖ, ఖర్జూరదాడిమంబులున్-జం,బీరచూతద్రాక్షలున్-సు, సార పుష్పసార మిళితంబుగ॥నార॥ మేలుగన్, జిలేబిమణుగు। బూలు ఖజ్జకాయలున్। బూ-రీలునామవడలునతిర। సాలుబూదిలాడు-లతిముదమున॥నార॥ చారపప్పు నెయ్యిపంచ। దారగూర్చి యుంచిరితా। ఘ్యారి శ్రీనారాయణాఖ్య। చారు హృద్విహార! మధురంబుగ ॥నార॥

వ. ఇట్లు సమస్తమయిన ఫలహారంబులు సమర్పించి యనంతరంబు.

గీ. పరగనవరత్న మయమైన ♦ పళ్లెరమున। బగులవత్తినపోకలు బం ♦ డుటాకు। లోనరము త్తెంపుసున్నము ♦ నుంచుకొని తమ। భాంగులటు దెచ్చిరామున ♦ కిప్పగించి.

చె-కీర్తన, బ్యాండుస్వరము-ఆదితాళము.

విడెము జేయురఘువరా! కడు! వేడుకలనఘహరా!పుడమినిమారినే! ర్పనఁజుట్టియిచ్చిన। మడుపులుమునిపంట। మఱియందుకొని వేగ॥వి॥

మెచ్చుగలుగు పోకలు। రుచి। హెచ్చు పండుటాకులు। బచ్చకర్పూరసం-భరితమౌ మౌక్తిక। సచ్చూర్ణ యుతముగ। దెచ్చియుంచినాము॥ విడెము॥

రాజవంశభూషణా! నా, రాయణాకవిపోషణా! జాజికాయలును,

జాపత్రియేలకు; లోజలవంగాలు; నొనరయుంచినాము॥ విడెము॥

వ. అనంతరము పూలచెండ్లు గట్టితెచ్చి యిచ్చినఁ గొంతసేపు నేర్పులు మెఱయ సీతారాములాడి రెటులనిన.

కీర్తన, ఏకతాళము-ఈశరాసనంబుబారి-వలె.

బంతులాడిరీ పూల। బంతులాడిరీ। వింతర్-జంతర్-స్వాంతము దొంతయుర్। సంతసమలరర్। గాంతలుగనఁగర్। బంతమువెలగర్॥ బం॥

రా॥ నాతిర్-బ్రీతిర్-సీతనేసితర్। వేతును దలపుర్। జూతురు పీరల్। ఖ్యాతిగననుచు॥ బంతు॥

సీత॥ ఏమిా-స్వామిా-వేమరుర్-వ్రేయుచుర్। భామల నలపర్ సీమవిఁదలఁపర్। నిలుపుముసైపర్॥ బంతు॥

రా॥ మాటివఁగాటి-కేటికే। సాటిగర్। యాటలాడగర్। వ్రేటుకు నిలుపు। చాటుకుదొలఁగు॥ బంతు॥

సీత॥ వద్దు-వద్దు-దద్దయుర్। బెద్దయుర్।సుద్దులాడగర్। ముద్దుల గుమ్మర్। మోటకుపురవరా॥ బంతులాడిరీ॥

వ. ఇట్లన్యోన్య సరసాలాపంబులచేఁ బూబంతులాడుచున్న వారి యనురాగ భావంబులు గాంచి కాంతలు.

తొ. పదరే! కొంచెము। పనియున్నదినా। కిదిగో! వచ్చెదననుచు నదిగోవచ్చెద। నిదిగోవచ్చెద నని యొక్కొక్కరు నగుచు॥ రా॥

వ. వెలపటికిఁజని తలుపుబిగించికొని రంత రాముండేకాంత మగుటచే.

సం-కీర్తన, ఆదితాళము, వగపేటకి.

క్షితికన్యనులాలించెర్। సిగ్గెలనివివరించెర్। అతివనుగౌఁగిటనుంచెర్। యతనుని కడునదలించెర్। మించెర్-యొంచెర్। రతికేళియందు వేగఁ దేలించెర్। కాంతామణినలరించెర్। గళతెల్లనుశోధించెర్। దంతక్షతమొనరించెర్। దగబంధములనుముంచెర్। బొంచెర్-గాంచెర్। ధర। మోటకుగుండ దేవుడలయించెర్.

వ. ఇట్లు పలువిధసురతంబుల సీతారాములు దేలిసొక్కి పవ్వళించిన నాసవ్వడిఁగని యవ్వలనున్న జవ్వనులు నవ్వుకొనుచు వారిని నిద్రింపఁజేయువారై.

లాలిపాట త్రిశ్రజాతి, జంఝూటి. ఈబాలు.

శ్రీరామచంద్ర! లాలి। సీతాసమేత! లాలి। కారుణ్యసాంద్ర! లాలీ। కళ్యాణమయ! లాలీ। లాలీ। కలుషాపహార! లాలి॥ శ్రీరామ॥

సృష్టికిఁ బూర్వమున। వ్యష్టి సమష్టియైన। దృష్టప్రపంచమునకు। ద్రష్టవు నీవగుచు, నుండి। తుష్టిగనుండెదవు॥ శ్రీరామ॥

సుగుణులఁబ్రోచుటకును। విగుణులఁజెరచుటకును। తగురీతిధర్మమును। స్థాపింప ధరలోను। బుట్టెదవు ప్రతియుగమునను॥ శ్రీరామ॥

కాకుత్స్థవంశమునను। కౌసల్యగర్భమునను। సాకేతనగరమునను। జన్మించితివి యిలను, దనుజాళీకములదరఁగను॥ శ్రీరామ॥

ఆతాటకినిద్రుంచి। యధ్వరమునుగాచి। గౌతమసతినిబ్రోచి। కరకంతువిలువిఱచి। తలచి। సీతనువరియించి॥ శ్రీరామ॥

దశరథు నాజ్ఞచేత। దండకావనులదిరిగి। దిశలార్వ్యఖరదూషణ। త్రిశిరుల వధియించి। శబరి। దెసఁబూర్ణదయయుంచి॥ శ్రీరామ॥

వాలినిసంహరించి। వారధిఁదగ బంధించి। యాలంకముట్టడించి। యసురులనెదిరించి। మించి। యాలముఁగావించి॥ శ్రీరామ॥

రావణఘటకర్ణాది। రాక్షసులనుమోది। యావేళధరణితనయ। యనుజులతోఁగూడి। వెడలి। యయోధ్యఁజేరితిరి॥ శ్రీరామ॥

పట్టాభిషిక్తుఁడవై। బలువేడ్కతోడజనక। పట్టినిగూడుకొని। పవళించితివి రామ! రామ! పార్వతీసుతనామ!॥ శ్రీరామ॥

నీయందుమాయగలిగె। మాయవలనగుణము। లాయెనువానివలన। నాయెనుభూతములు। నందుఁ। యీయఖిలంబాయెఁ। శ్రీరామ॥

శక్తిత్రియమునీవే। శ్రద్ధాత్రియమునీవే। ముక్తిత్రియమునీవే। మూర్తిత్రియమునీవే। నీవే। భక్తిత్రియమునీవే॥ శ్రీరామ॥

కాలత్రియమునీవే। కర్తృత్రియమునీవే। కర్మత్రియమునీవే। కాయత్రియమునీవే। నీవే। కళత్రియమునీవే॥ శ్రీరామ॥

దీక్షత్రియమునీవే। దేవత్రియమునీవే। చక్షుత్రియమునీవే। జగత్రియమునీవే। నీవే। లక్షత్రియమునీవే॥ శ్రీరామ॥

జ్ఞానత్రియమునీవే । నాడీత్రయమునీవే । స్థానత్రయమునీవే । తాపత్రయమునీవే । నీవే । త్రైవర్ణములునీవే ॥శ్రీరామ॥

కనుగొననణువునీవే । ఘనములో ఘనమునీవే । సనకాదియోగి హృదయ। సంచారుడవునీవే। సచరా। చరరూపములునీవే ॥శ్రీరామ॥

ప్రళయావసానమందు। ప్రపంచమునియాను । ప్రభవించి వృద్ధి నొందు। ప్రళయావసరమందు। ముందు బవళించునీయందా ॥శ్రీరామ॥

లోకులు నిద్రబోవు। నాకాలమున జాగ । రూకుండవగుచునీవు। జోకొట్టుచుందువు । నీకు । జోకొట్టువారెవరు ॥శ్రీరామ॥

బంగారమొక్కటయ్యు । బహుభూషణంబులయిన భంగివీవో కడవయ్యు । బహునామ రూపములం । బరగి । ప్రబలితి విటువలెను॥ శ్రీరామ॥

బహుచిద్రభాండస్థిత! పటుదీపవతుదేహములు। బహిరంతరింద్రియములు। భాసిల్లజేయుచును। మిగుల। విహరింపుచుందువు॥శ్రీరామ॥

శ్రీరామచిద్విలాస ! శ్రీమోక్షగుండవాస ! నారాయణాఖ్య దాసా! ధారామిత్రోల్లాస! చంద్రికారమ్యదరహాస! ॥శ్రీరామచంద్ర లాలీ । సీతాసమేతలాలీ । కారుణ్యసాంద్ర లాలీ । కల్యాణమయలాలీ కలుషాపహారలాలీ.

వ. ఇట్లు లాలిపాటబాడి వారు నిద్రాముద్రితులైన పిమ్మట.

చెలు-కీర్తన, ఏకతాళం, శహానరాగం-ఎంతనినేనం.

సందడిజేయందగదిం, పొందంగంజనరమ్మా! మీమీమందిరము లకును॥సందడి॥ పొందుగనిద్రా, నందంబులరఘు, నందనసీతా, సుందరు లుండిరి॥సందడి॥ కానలస, న్మానులసాం, గత్యముసలుపుచును। దానవు లనువెను-దవిలిచంపుచును ॥కానల॥ మానుగనిద్రలు-మానియుండిరటు। గానసుప్తులై । మేనులుమఱచిరి ॥సందడి॥ మీారెల్లర - యీారేయిల్। గూరికి వేగినను। గూరిమిశోసిం, గారములలరంగ॥మీారె॥ కోరిమోక్ష పుర । శ్రీరఘువీరుని । జేరియాకొలువు । జేతురుగాకిఁక ॥సందడి॥

పార్వతీ! యిట్టి మహనీయచరిత్రం బాద్యంతంబుఁ గర్ణరసాయనంబుగా నీకొఱకు వివరించితిఁ గదా! యట్టి రామమూర్తి కృపాప్రసాదం బనుభవించి ముక్తురాలవుగమ్మా!

క. నాచేతనీకుబోధిత । మైచెలువగు మోక్షగుంశ ♦ హరిచారిత్రం । బాంచంద్రార్క-స్థాయిగ । భూచక్రమునందు నరరుఁ ♦ బూర్ణేందుముఖీ !

వ. అని బోధించినఁ బార్వతీదేవి బ్రహ్మానంద వారాశియం దోలలాడి శంకర గురుపదారవిందబులకు వందనంబు లాచరించి యనంతరం బయ్యాదిమ దంపతులనుఁగూర్చి మంగళంబు పాడె నెటులనిన.

మంగళహారతి- బేగడరాగము, అటతాళము, కమలాంబ.

నిత్యమంగళ । నిత్యానందునకు ॥ నిత్య॥ అత్యంత జగ-దాకారిణికి॥ నిత్యమంగ॥ సత్యజ్ఞానానంత । సాక్షిరూపునకు । నిత్యానపాయి-నియగుసీతకు॥ నిత్యమంగ ॥ సాక్షాన్నారాయణ । సరస హృద్గోచర । మోక్షగుండరామ । మూర్తికి సీతకు॥ నిత్యమంగ॥

వ. ఇట్లు మంగళముఁబాడి శ్రీ సీతారామ బ్రహ్మప్రతిఫలిత దివ్యాపోజ్యోతి స్వరూపంబుఁ దనహృత్కమల కర్ణికాంతరంబున సూక్ష్మంబుగాఁ గనుచు నిజానందంబునఁ దేలుచుఁ గైలాసంబున నుండె.

ఆశ్వాసాంతము.

తో. అనితాల్లూరి నా । రాయణకవి రా। మాయణమును హరికథను।ఘనముగఁ జెప్పెను గథయందిదియుద్ధ । కాండము చిలుకునుసుధను॥ రా॥

ఇది వినువారల। కిహసౌఖ్యంబులుఁ। గొదువలేకఁ జేకురును।ముదమునఁ దుదకును । ముక్తిలభించును । మోక్షగుండ హరికృపను॥ రా॥

రామా రామా యనవే- శ్రీరామాయణ కథవినవే॥ పార్వతీ॥

సీ. శ్రీకరంబుగను వా ♦ ల్మీకి విశ్వామిత్రి
ముఖమునిప్రోక్తమై ♦ పుడమినాది
కావ్యమై షట్కాండ ♦ కలితమై తనరారు
రామాయణాఖ్య పు ♦ రాణచరిత

మవని తాళ్ళూరి నా ♦ రాయణకవి హరి
కథగా రచించెను ♦ గడుముదమున
నంత శ్రీవేమూరి ♦ యజ్ఞనారాయణ
నరసింహశర్మలా ♦ నందమునను

తే. బరనగావించి ధరణిలోఁ ♦ బ్రచురపఱచి
రట్టి కవిపాఠకులకు న ♦ హర్నిశంబు
మోక్షగుండవిభుండు రా ♦ముఁడుఁ గృపను
భుక్తిముక్తులొసంగు సం ♦పూర్ణముగను.

మోక్షగుండ రామాయణము.

సంపూర్ణము.



